# ముందుమాట

ఈ ఛాందోగ్యోపనిషత్తు సామవేదానికి సంబంధించిన తలవకార బ్రాహ్మణంలోనిది. బృహదారణ్యకోపనిషత్తులాగానే రాశిలోను, వాసిలోను కూడా గొప్పది. దీనికి కూడా శ్రీ ఆదిశంకరులు ఉపాసనకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడ్డది. ఈ ఉపాసన ఔపనిషదోపాసన. ఈ ఉపాసన నిత్యజీవితాన్ని వదలి చేసిన సాములాంటిది కాదు. నిత్యజీవితంలో ఆచరణయోగ్యమైన ఉపాసన.

ఈ ఉపాసన అనే పదానికి నిర్వచనం తేలికగా అర్థమయ్యేటట్లు చెప్పుకోవాలంటే – వేదాల్లో స్తుతింపబడ్డ దేవతాస్వరూపాల్నిగాని, వాటికి సమానమైన వాటిని గాని లక్ష్యంగా ఏర్పరచుకొని ఏకాగ్రతతో ఆ గమ్యాన్ని చేరటం కోసం నిరంతరం ధ్యానం చేయటం! ఈవిధమైన ఉపాసననే ఉపనిషత్తుల్లో ప్రతిపాదించాను. సాలగ్రామంలో విష్ణువును ఆరోపించుకొని ధ్యానించినట్లుగా ఒక వస్తువు, అక్షరం, మంత్రం లేక ఒక భావంలోగాని దైవత్వాన్ని ఆరోపించుకొని తదేకచిత్తంతో ధ్యానించటం ఉపాసన. ఈ ఉపాసనలు అనేక రకాలుగా ఉండవచ్చు. ఉపనిషత్తుల్లో ఓంకారోపాసన, సామోపాసన, అన్నోపాసన, ప్రాణోపాసన, వ్యాహృత్యుపాసన, గాయత్ర్యుపాసన ఇట్లా పరశ్శతంగా చెప్పారు. వాటి ఫలితాలు చెప్పారు. ఉపాస్యదేవతతో తాదాత్మ్యం చెందిన ఉపాసకునికి ఆ ఉపాస్య దేవతకుండే శక్తులన్నీ, గుణాలన్నీ వస్తాయని చెప్పారు. అయితే ఈ ఉపాసనకు శ్రద్ధ, ఏకాగ్రత అనేవి చాలా అవసరం. అజ్ఞాన నిర్మూలనానికి, జ్ఞానోన్మీలనానికి ఈ ఉపాసనలు సహాయకారులు కాబట్టి, సాధనాలు కాబట్టి, జ్ఞానాన్నే పరమావధిగా చెప్పే ఉపనిషత్తుల్లో, వీటికి స్థానం ఇచ్చాడు. ఒక్కొక్క చోట ఉపాసనను సూచించటానికే దర్శనం, వేదం, ఉపనిషత్తులాంటి పదాలు వాడారు. ఈ ఛాందోగ్యంలో మిగతా ఉపనిషత్తుల కంటె ఉపాసన ఎక్కువ స్థానాన్ని ఆక్రమించింది.

ఉపనిషత్తుల ప్రధాన ఉద్దేశ్యం నిర్గుణ పరబహ్మను గూర్చిన వివేచన చేయటం. అయినా, ఈ ఛాందోగ్యంలో సగుణ బ్రహ్మోపాసనకు కూడా కొంత ఆధారం లభిస్తుంది – అంటే, పరిచితమైనట్టి సుగమమైన మార్గంలో నడిపిస్తూనే చివరకు పరబహ్మమనే లక్ష్యానికి తీసుకొనిపోతుంది. దీనికి కారణం ఉపాసనకున్న ప్రాధాన్యమే! సగుణ బ్రహ్మకు సంబంధించిన ఒకానొకవిధమైన మానసిక ప్రక్రియకూడా (క్రమపద్ధతి ననుసరించి మనస్సును లగ్నం చేయటం కూడా) దీనికి కారణమని కొందరంటారు. ఉదాహరణకు మూడవ అధ్యాయంలోని 14వ ఖండంలోని శాండిల్య విద్యను చూడవచ్చు.

ఉపాసనలో అనేక భేదాలు చెవుతారు. ముఖ్యంగా బ్రహ్మోపాసన, ప్రతీకోపాసన అని రెండు రకాలు. ఆనందం, అభయం, అమృతత్వం, అద్వితీయం, అవ్యాకృతం మొదలైన గుణాలను, లక్షణాలను పరమాత్మకు ఆరోపించుకొని ఉపాసన చేయటం. ఇవన్నీ నిర్గుణుడైనవాని గుణాలు కాకపోయినా వేదాలలో వర్ణింపబడ్డ పరమాత్మ లక్షణాలు కాబట్టి వాటిని తెలుసుకొని నేరుగా పరమాత్మనే ఏకాగ్రతతో ధ్యానించటం. దీనిని బ్రహ్మోపాసన అనవచ్చు. ఇక రెండవది, ఒక ప్రతీకను (చిహ్నాన్ని) ఏర్పరచుకొని దానిని బ్రహ్మగా భావించి ఉపాసించటం. మళ్ళీ ఈ ప్రతీకోపాసననే రెండురకాలుగా కనిపిస్తుంది. 1) సంపుపాసన 2) అధ్యాస ఉపాసన అని. సంపదుపాసన అంటే నిమ్న స్థాయిలోని వాటిలో ఉచ్చస్థాయిలో ఉన్నవాటిని వాటి గుణాలను ఆరోపించుకొని ఉపాసించటం. ఉదా॥ అన్నమే బ్రహ్మ, వాయువే బ్రహ్మ అనుకోవటం. అన్నం నుండే అన్నీ వుదుతున్నాయి. అన్నంలోనే పెరుగుతున్నాయి. అన్నంలోనే అన్నీ లయమౌతున్నాయి. అట్లాగే ప్రాణం మొదలైనవాటిలో పరబ్రహ్మ గుణాలను (సృష్టి స్థితి లయాలకు కారణత్వాన్ని) ఆరోపించుకొని ఉపాసించటం. అట్లాగే మనస్సును విశ్వదేవతలుగా భావించటం. మానసిక స్థితులుగా అనేకవిధాలుగా ఉండటం, అట్లాగే విశ్వదేవతలు బహు సంఖ్యాకంగా ఉండడం, ఈ బహుత్వమనేది రెంటిలో ఉన్న సామ్యం. ఈ సామ్యాన్ని ఆధారం చేసికొని ఉపాసించటం.

ఇక రెండవదైన అధ్యాసోపాసన – ఇందులో మనం ఏర్పరచుకొన్న ప్రతీకయే (చిహ్నమే) ప్రాధాన్యం వహిస్తుంది. ఆ ప్రతీకలోనే ఆయా దేవతల గుణాలన్నీ ఆరోపింపబడతాయి. ఉదా॥ మనస్సే బహ్మ, సూర్యుడే బ్రహ్మ అని. ఇదే ఆదేశం, ఇదే ఉపదేశం అని చెవుతారు.

ఈ ఉపాసనలను కొంతమంది నేల విడిచిన సాముగా, ఆకాశవిహారంగా, ఊహాసౌధ నిర్మాణంగా భావించవచ్చు. కాని ఘన అనుభవంలోని విషయాలను ఆలోచిస్తే సమాధానం దొరుకుతుంది. మనం చిన్నపిల్లవానికి చదువు నేర్పాలి. చదువు నేర్పాలంటే ముందు భాష రావాలి. భాషా రావాలంటే అక్షరాలు, ఉచ్చారణ ముందు అలవాటు కావాలి. ఇవి నేర్పటానికి మనం ఏమి చేస్తున్నాము? 'అ' అనే అక్షరం వాసి దానికెదురుగా 'అమ్మ' ఆకారంలో ఉండే బొమ్మను ముదిస్తున్నాము. 'ఆ' అనే అక్షరం, దానికెదురుగా 'ఆవు' బొమ్మ ముదిస్తున్నాము. 'ఇ' అనే అక్షరం దానికెదురుగా 'ఇల్లు' బొమ్మ ముదించి నేర్పుతున్నాము. బొమ్మను చూసి అమ్మ, ఆవు, ఇల్లు అని చెప్పిస్తున్నాము. క్రమంగా బొమ్మను మూసివేసి 'అ' అనే అక్షరం చూపినా 'అమ్మ' అని అంటాడు. అంటే, 'ఆ' అనే అక్షరాన్ని ఎక్కడ ఉన్నా గుర్తిస్తాడు. మరి ఈ ఉపాసన పక్రియ కూడా ఇంతే కదా! ఆంగ్లభాష నేర్పేవారి పద్ధతీ ఇదే కదా! (A for Ant, B for Box, C for Cat అనీ). ఇవన్నీ పూర్వం ఋషులు జ్ఞానోపదేశం కోసం ఉపయోగించిన పద్ధతులే! అంటే క్రమంగా

ఆ బొమ్మలు ఊహాపథం నుండి తిరోహితమై, అంతవరకు పరిచయంలేని అక్షరాలు మనస్సులో స్థానం ఏర్పరచుకొన్నాయి. అక్షర స్వరూపం ఉచ్చారణ రెండూ తెలుస్తున్నాయి. అట్లాగే దృష్టాంతాలు, ఉపమానాలు, రూపకాలు అనేకం గోచరిస్తున్నాయి. విషయాన్ని విపులీకరించటానికి. అంతేకాదు, కథా కథన పద్ధతులున్నాయి. ప్రయోగ విధానాలున్నాయి – (ఉప్పును నీటిలో కలిపి, చెట్టును నరికి, నదులను చూపి) ఆత్మతత్వాన్ని ప్రత్యక్ష ప్రమాణంతో బోధించారు. ఇవన్నీ ఒక ఎత్తు. వారికి అధ్యాపనంలో – శిష్యులకు బోధించటంలో ఉన్న ఆసక్తి ఒక ఎత్తు. శిష్యులు మరియొకసారి చెప్పండి అని. ఇంకా నాకు బాగా అర్థమయ్యేటట్లు చెప్పండి అని ఎన్నిసార్లు అడిగినా విసుగులేకుండా, రకరకాలుగా బోధించిన ఆ మహనీయులు కేవలం గురువులేనా? సాక్షాత్తు గురుబ్రహ్మలుకదా! ఈనాడు ఆ పదాన్ని వాడుతున్న అర్థంలో వారి విషయంలో వాడటం వారికి అపచారం చేయటం కాదా? ఈ విధంగా తెలిసిన దానినుండి తెలియనిదానికి, మూర్తం నుండి అమూర్తానికి, స్థూలం నుండి సూక్ష్మానికి, వ్యాకృతం నుండి అవ్యాకృతానికి గుణం నుండి నిర్గుణానికి, నిరపాయకరమైన మార్గంలో మనల్ని నడిపించి గమ్యాన్ని తీసుకుపోయిన ఆ ఉపనిషదుషులను ఏమని కీర్తించగలం?

అయితే, ఈ ఉపాసనలన్నీ కోరికతోను, కోరిక లేకుండానూ కూడా చేయవచ్చు. భక్తి, ఉపాసన అనేవి రెండూ ఒకేవిధంగా ఉన్నట్లు కన్పించినా భక్తికి రూపం ప్రాధాన్యం వహిస్తే, ఉపాసనకు భావం ప్రాధాన్యం వహిస్తుంది. ఉపాసనా క్షేత్రం భక్తిక్షేత్రం కంటే విశాలమైనది. భక్తిద్వైతానికి ఆధారం అనుకుంటే ఉపాసన అద్వైతానికి ఆధారం అనవచ్చు. అందుకనే ఉపాసనకు, బ్రహ్మవిద్యయే పరమావధిగా గల ఉపనిషత్తుల్లో స్థానం కల్పించారు. భక్తిలాగానే, ఉపాసన కూడా జీవన వ్యాపారాలతోపాటు సాగించవచ్చునని ఈ ఛాందోగ్యం చెవుతుంది. 'ఆత్మ అనేది హృదయంలోనే ఉంది. ఇదే బహ్మలోకం....దానిని ఉపాసించినవాడు ప్రతిరోజూ బ్రహ్మలోకానికి పోతాడు' (8–3–3)

ఈ ఉపనిషత్తు ఓంకారంతో ఆరంభమైంది. 'ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత' అని. తరువాత 'ఏషాం భూతానాం పృథివీరసః' (ఈ సమస్య స్థావర జంగమాత్మకమైన జీవులన్నింటికి పృథివియే ఆధారం)తో ప్రారంభమైన ఈ ఉపనిషద్విజ్ఞానబోధ 'శ్యామాచ్ఛబలం పపద్యే' (అత్యంత నిగూఢమైనందున కృష్ణవర్ణంలో ఉండే హృదయబ్రహ్మ నుండి, వివిధ వర్ణశోభితమైన బ్రహ్మను పొందుతాను) అనటంతో అంతమైంది. (విషయ ప్రతిపాదలో చక్కని క్రమం ఉంది. హేతువాదంతో, దృష్టాంతాలతో, ఉపమానాలతో, ప్రత్యక్షపమాణాలతో సాహిత్య వాసనను కూడా సంతరించుకొని ఈ బ్రహ్మజ్ఞాన బోధసాగింది. ఈ పద్ధతి చూస్తే ఆనందంతోబాటు ఆ మహర్షుల పతిభకు ఆశ్చర్యం కూడా కలుగుతుంది.

మనం ఈ ఉపనిషత్తుల్లో ఇంకొక గొప్పదనాన్ని గుర్తించవచ్చు. ఈ ఉపనిషదుషులెవ్వరూ కూడా ఈనాడు భగవంతులమని చెప్పుకొంటూ చలామణి అవుతున్న స్వామీజీలు, గురూజీలు లాగా అహంకారంతో లేదా అసత్యంగా తాము పరమాత్మ త్వాన్ని సంపూర్ణంగా తెలుసుకున్నామనీ, తామే భగవంతులమనీ చెప్పుకోలేదు. అంతేకాదు, మన భౌతిక విజ్ఞానం ఎంత పెరిగినా పరమాత్మను గూర్చిన ప్రత్యక్షజ్ఞానాన్ని పొందలేమనే చెప్పారు. ఎందుచేతనంటే పరబ్రహ్మమనేది భౌతిక పదార్థమూ కాదు – తజ్జన్యమైన శక్తీ కాదు. కాబట్టి అది భౌతిక జ్ఞానశక్తికి అతీతమైనది. మన అంతఃకరణం ఆ పరమాత్మవైపుకు ఉన్ముఖమైనకొద్దీ ఆ విభూతిని మనం మనలోపలే దర్శించగలుగుతాం. అంతే తప్ప ఆ తత్త్వాన్ని ఫోటో కిరణాలద్వారా, రేడియో తరంగాల ద్వారా నిరూపించాలనుకుంటే మనకంటే మూర్ఖులు ఉండరు. ప్రాణాన్నే భౌతికదృష్టికి చూపలేకపోయిన భౌతిక విజ్ఞానం పరమాత్మనే విధంగా గుర్తించగలుగుతుంది? భౌతికదృష్టికి అగోచరం కాబట్టి ఆ పరమసత్యాన్ని లేదని ఒకమాటలో కొట్టిపారేయటం నాస్తికులకు తేలిక – ఉన్నదని రుజువు చేయటం కంటె.

శివ, విష్ణు రామకృష్ణాది అర్చారూపాలను మన మతం గ్రహించినా అవన్నీ భాష నేర్పేందుకు లోగడ చెప్పినవిధంగా ప్రతీకలను ఉపయోగించినట్లే! మొదట బుద్ధిగోచరంకాని వర్ణ సమామ్నాయం గ్రహించటం అలవాటవగానే ప్రతీకలైన అమ్మ, ఆవు అనే బొమ్మలు మనోవీధినుండి తిరోహితమై పోయినట్లే ఈ అర్చనకుపయోగించే దేవతలు కూడాను. ఇంత విశాల దృష్టిని అన్యమతస్థులేవేవో చెవుతారు – ఒక గ్రుడ్డివాడు తాను చూడలేని దానిని మరొక గ్రుడ్డివానికి వర్ణించి చెప్పినట్లు! ఈ ఉపనిషదుషులు జడచేతనాలకు కూడా భేదం చూడలేదు. స్థావరాలైన చెట్టు చేమల్లో కూడా ఆ తత్త్వాన్ని దర్శించారు. ఈ కనిపించే సమస్త జగత్తుకు – సమస్త లోకాలకు కారణం ఒకటే అయినప్పుడు, అంతటా అదే ప్రకాశమానమై ఉన్నపుడు, దానినుండే అన్నీ పుట్టినపుడు ఇక ఆ కార్యాలు, పదార్థాలు చైతన్య విలసితాలైనా, జడాలైనా అన్నీ ఒకటే! సముద్రపు అలలలో ఉండే నీటికణం, నురుగులో ఉండే నీటికణం, అడుగుభాగాన చలనం లేనిచోట ఉండే నీటికణం, ఒడ్డున ఉండే నీటికణం, సమస్తము ఒకే సముద్ర కార్యమైనప్పుడు భేదానికి తావేది? వాటిలో భేదాన్ని చూడటం వ్యర్థం అని వారి అభిపాయం. వ్యావహారికంగా భేదాన్ని చూస్తున్నా తత్త్వతః భేదం లేదని గుర్తించిన విశాలహృదయులు వారు. మానవునిలోను స్థావర జంగమాది సమస్త పదార్థాల్లోను, ఒకే ఆత్మ ఉన్నదని చెప్పిన ఏకైక మతం భారతీయమతం.

మనిషికి, ఈ ప్రపంచానికి అతీతమైనది, ఇక్కడ లేనిది ఎక్కడో ఉన్నదని మన భారతీయమతం చెప్పదు. తనలోనే భగవంతుడున్నప్పుడు ఇంకాఎక్కడో వెతకం దేనికి? సమస్తము భగవత్స్వరూపమే అయినపుడు ఎక్కడికనిపోయి వెతుకుతావు? నీలో ఉన్న ఆత్మను దర్శించు. ఆ ఆత్మానుభూతిని పొందు. అదే నీ లక్ష్యం. నీవు చేరివలసిన గమ్యం! అపరోక్షానుభూతి! ఇదే ఉపనిషణ్మతం

చెప్పేది. ఈ స్థావర జంగమాదులన్నింట ఉన్నది ఒకే ఆత్మ అయినప్పుడు స్పృశ్యాస్పృశ్యతలకు, హెచ్చుతగ్గులకు, ధనిక నిర్ధనిక భేదాలకు తావేలేదు. దేశకాలాదులకు అతీతమైనదీ ఉపనిషత్మతం. ఇది విశ్వమతం. ఇంత పురాతనము, విశాలభావ సమన్వితము, పరమసత్యము, తర్కనిబద్ధము అయిన మతం ఈ విశ్వంలో మరొకటి కానరాదు.

ఈ ఛాందోగ్యంలో మనోహరమైన ఆఖ్యాయికలున్నాయి. అందులో సత్యకామ జాబాలుని కథ ఒకటి. సత్యకామునికి తన తండ్రి ఎవరో తెలియదు. అతనిని జాబాల అనే పరిచారిక పెంచింది. ఆమె అనేకమందికి పరిచర్యలు చేస్తూ ఉండే రోజుల్లో ఆ బాలుడు దొరికాడు. పెద్దవాడైన తరువాత అతనిని గురుకులవాసం చేయమంది. అతడు తన గోత్రం చెప్పమన్నాడు. తనకు తెలియదని చెప్పి, అతడు లభించిన విధం చెప్పింది. సత్యకామ జాబాలుడని పేరు పెట్టుకోమంది. అతడు తన గోత్రం చెప్పమన్నాడు. తనకు తెలియదని చెప్పి, అతడు హారిద గౌతముని వద్దకు శుశ్రూష చేయటానికి వెళ్ళాడు. అతడు సత్యకాముని గోత్రం అడిగాడు. అతడు దాపరికం లేకుండా తన వృత్తాంతం చెప్పి తల్లి పేరున సత్యకామ జాబాలుణ్ణి అన్నాడు. 'ఇంత సూటిగా, దాపరికం లేకుండా, స్పష్టంగా బాహ్మణుడు మాత్రమే చెప్పగలుగుతాడు' అని నిర్ణయించి గౌతముడతనికి ఉపనయం చేసి నాలుగువందల ఆవుల్ని మేపమని అప్పగిస్తాడు. ఈ సత్యకాముని గాథవల్ల ఆనాడు వర్ణాలు, కులాలు అనేవి గుణకర్మలవల్ల నిర్ణయింపబడేవని తెలుస్తుంది. ఈనాడైతే సత్యకాముడు హేళనకు పాత్రుడయ్యేవాడే! సత్యభాషణం, మోసం లేకపోవటం, దంభం లేకపోవటం, క్షమ ఇవన్నీ బ్రాహ్మణ లక్షణాలు. కేవలం పూర్వుల గొప్పదనం ఆధారంగా, జన్మనుబట్టి సంక్రమించిన బ్రాహ్మణత్వం కాదు. అట్లాగే ఆనాటి గురుకులవాసం, విద్యాగ్రహణ పద్ధతులు తెలుస్తాయి. ఇదేవిధంగా ఉషస్తిచాక్రాయణుని కథ కూడాను.

ఇక ఆనాటి విద్యాబోధన పద్ధతులు, మనకు సనత్కుమార నారదుల సంవాదం, శ్వేతకేతు పవహణసంవాదం, ఉద్దాలకుడు శ్వేతకేతువుకు చేసిన ఆత్మబోధ, ఇంద్ర విరోచనులు ప్రజాపతివద్ద విద్యాగ్రహణం చేయటం మొదలైన గాథలలో వ్యక్తమౌతాయి.

ఈ ఛాందోగ్యోపనిషత్తులో 8 అధ్యాయాలున్నాయి. సంగ్రహంగా ఆయా అధ్యాయాల్లో ఉన్న విషయాలు ఈ దిగువ పేర్కొనబడుతున్నాయి.

మొదటి అధ్యాయం – ఓంకారోపాసన, ప్రాణ, ఉద్గీథోపాసనలు, ఉషస్తి, చాక్రాయణుని కథ, సామావయవాల ఉపాసన.

రెండవ అధ్యాయం – పంచవిధ సామోపాసన, సప్తవిధ సామోపాసన, గాయత్రీ సామోపాసన, రథంతర, బృహత్, వైరూప, వామదేవ శక్వరి మొదలైన సామోపాసనలు.

మూడవ అధ్యాయం – మధువిజ్ఞానం, శాండిల్యవిద్య, విరాట్‌కోశోపాసన, ఆత్మయజ్ఞోపాసన మొదలైనవి.

నాల్గవ అధ్యాయం – జానశ్రుతి రైక్వుల గాథ – సత్యకాముని చరిత – అగ్నివిద్య వ్యాహృతులను గూర్చిన ఉపాసన.

అయిదవ అధ్యాయం – శ్వేతకేతు పవహణ సంవాదం – పంచాగ్ని విద్య, ఔపమన్యువు మొదలైన ఋషులు అశ్వపతి వద్ద వైశ్వానరాత్మను గూర్చి తెలుసుకొనుట.

ఆరవ అధ్యాయం – అరుణి తన కుమారుడైన శ్వేతకేతువుకు చేసిన బోధ. షోడశకలాపురుష వర్ణనం, ఆత్మతత్త్వాన్ని దృష్టాంతాలతో బోధించటం.

ఏడవ అధ్యాయం – సనత్కుమారుని వద్ద నారదుడు తత్త్వోపదేశం పొందటం, వాక్కు మొదలు ఆశ పర్యంతం ఉత్తరోత్తరా శ్రేష్ఠమైనవని, సత్యం మొదలుకొని భూమం వరకు జాతవ్య విషయాలను గూర్చిన వివరణ ఉన్నాయి.

ఎనిమిదవ అధ్యాయం – హృదయ పుండరీకంలో ఉన్న ఆత్మను గూర్చి ఇంద్ర విరోచనులు పజాపతి వద్ద ఉపదేశం పొందటం. పజాపతి ఇందునికి ఆత్మతత్త్వోపదేశం చేయటం ఉన్నాయి.

ఇక, ఈ రచనను గురించి వెనుకటి భాగాల్లో వివరించినట్లుగా పాండిత్యం కంటె ఉత్సాహమే ఊతగా ఈ ప్రయత్నానికి పూనుకున్నాను. అందుచేత విషయాన్ని అర్థం చేసుకొని దానిని వ్యక్తీకరించటంలో పొరపాట్లు జరిగి ఉండవచ్చు. విద్యార్థియైనవాడు తనకు తెలిసింది చెప్పటానికి సంకోచించకూడదు. అట్లా సంకోచిస్తే విద్యాభివృద్ధి కుంటుపడుతుంది. గురువులకు సరిచేసే అవకాశం దొరకదు. సహృదయులు, మన పురోభివృద్ధిని కాంక్షించే గురువులున్నపుడు ఇక సంకోచం ఎందుకు? కాబట్టి నా విషయం కూడా ఇంతే!

వెనుకటి భాగాలు చదివిన పాఠకులు ఎక్కువమంది సంతృప్తితో వెన్నుతట్టి ప్రోత్సహించారు. మరికొందరు సహృదయంతో కొన్ని సూచనలు కూడా చేశారు. అందులో, ఇంకా తేలికగా వివరణాత్మకంగా ఉంటే బాగుండేదని, పుస్తకానికి ముందుగా ఆత్మ, జీవాత్మ, పరమాత్మ, జగత్తు, మాయ మొదలైనవాటిని గురించి వివరిస్తే బాగుండేదని, ప్రతి శాస్త్రానికి కొన్ని పారిభాషిక పదాలు ఉంటాయి. వాటిని పూర్తిగా వదిలేస్తే ఆ శాస్త్రానికున్న గౌరవము, తగ్గటంతోపాటు విషయంలో కూడా కొంత బిగువు తగ్గిపోతుంది. సాధ్యమైనంతవరకు కష్టమైన పదాలకు అక్కడే వివరణ ఇవ్వటం జరిగింది. కొన్ని పదాలను వివరించాలంటే ఎబ్బెట్టుగా ఉంటుంది. ఉదా॥ వ్యాహృతుల్ని పరిషేచనంలో ఉపయోగిస్తారు అనే వాక్యంలో 'పరిషేచనం' అనే పదాన్ని 'భోజనం

చేసేటప్పుడు కొన్ని కులాలవాళ్ళు వడ్డించిన అన్నంమీద మంత్రాలు చదువుతూ నీళ్ళు చల్లటాన్ని పరిషేచనం అంటారు' అని వ్రాయటం కంటె ఆ పదానికి ఎవరి ద్వారానైనా తెలుసుకోవటం మంచిదిగదా! పుస్తకాలెప్పుడూ అసంపూర్ణాలే! అందుకే గురువు కావాలనటం. 'ఆహుతు'లిస్తారు అనే పదాన్ని 'మంత్రాలు చదువుతూ నిప్పులో నెయ్యిపోస్తారు' అంటే బాగుండదు గదా! ఇటువంటివి చాలాభాగం చదవగా, చదవగా అవగాహన అవుతాయి. సినిమాలు చూడటం వల్ల ఆ బాలస్త్రీ వృద్ధపర్యంతం 'డ్యూయెట్లు, డైలాగులు, హీరో, విలన్, డైరక్టరు ఇట్లా ఎన్నో సాంకేతిక పదాలు క్రొత్త మాటలు అలవాటైనవి గదా?

ఇక వేదాంతాలలో తరచుగా వచ్చే జీవుడు, ఆత్మ, జగత్తు, పరమాత్మ వంటి పదాలకు వివరణ అంటే మళ్ళీ మొత్తం వేదాంతశాస్త్రాన్ని తిరగవ్రాయటమే అవుతుంది. అందుకని శ్రీ ఆదిశంకర విరచితమైన ఆత్మానాత్మ వివేకం వంటివాటిని తర్జుమాచేసి అందించటం మంచిదని తలచాం. తరువాతి ప్రయత్నం ఆ దిశగానే సాగుతుంది.

ఈ ఛాందోగ్యోపనిషత్తు రచనలో నాకు ఉపయోగపడిన ఈ గ్రంథకర్తలకు, వాటి ప్రకాశకులకు కృతజ్ఞతలు వెల్లడిస్తున్నాను.

1. ఆనందాశ్రమం ముద్రణాలయం ద్వారా శ్రీ ఆదిశంకర భాష్యంతో పాటు ఆనందగిరి టీకతో సహా ప్రచురింపబడిన ఛాందోగ్యోపనిషత్తు.

2. శ్రీకైలాస విద్యాపకాశన్, ఋషీకేశం వారిద్వారా ప్రచురింపబడ్డ 'విద్యానందీ మితాక్షరా' అనే గ్రంథం శ్రీకైలాస పీఠాధీశ్వరులైన శ్రీస్వామి విద్యానంతగిరిజీ మహరాజ్ వారి రచన.

3. అద్వైతాశ్రమం వారిచే ప్రచురింపబడ్డ శ్రీ స్వామి గంభీరానందవారు ఆంగ్లంలో రచించిన ఛాందోగ్యోపనిషత్తు.

4. సంస్కృతి సంస్థాన్, బరేలీ (ఉ.ప.) వారు ప్రచురించిన ఛాందోగ్యోపనిషత్తు.

పాఠకులకు ఈ గ్రంథం ఏ మాత్రం నచ్చినా అది సంతోషకారణమే అవుతుంది. పెద్దల ఆశీస్సులు, సలహాలు అర్థిస్తునాను.

వినీతుడు

**రచయిత**

# ఛాందోగ్యోపనిషత్తు

## మొదటి అధ్యాయం

### శాంతి పాఠము

**హరిః, ఓం ఆప్యాయస్తు మమాంగాని వాక్ప్రాణ శ్చక్షుః శ్రోత్ర మథో బల మింద్రియాణి చ సర్వాణి. సర్వం బ్రహ్మోపనిషదం మాఽహం బ్రహ్మనిరాకుర్యా మా మా బ్రహ్మ నిరాకరోద నిరాకరణ మస్త్వ నిరాకరణం మేఽస్తు. తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయిసన్తు.**

**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఓ పరమాత్మా! నా చేతులు, కాళ్ళు మొదలైన అవయవాలన్నీ పుష్టిగా ఉండుగాక! పై కర్మేంద్రియాలతో బాటు నా వాక్కు, ప్రాణం, కండ్లు, చెవులు మొదలైన జ్ఞానేంద్రియాలు సైతం బలంతో కూడినవై యుండుగాక! ఈ సమస్త విశ్వమూ, ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన పరబ్రహ్మమే తప్ప వేరు కాదు. అటువంటి పరబ్రహ్మను నేను తిరస్కరింపను (కాదని, లేదని అనను.) అట్లాగే ఆ పరబ్రహ్మ కూడా నన్ను నిరాకరింపకుండుగాక! ఈ విధంగా నేను నిరాకరింపబడకుండునుగాక! ఉపనిషత్తులలో చెప్పబడిన శమ దమాది (బాహ్య, అంతరింద్రియ నిగ్రహం) గుణాలు, బ్రహ్మైక్య స్థితిని సాధించటంలో నిమగ్నుడనైయున్న (సాధకుడనైన) నా యందు నిలిచి యుండుగాక! ఈ మంచి గుణాలన్నీ, ఈ ధర్మాలన్నీ నాలో నెలకొని ఉండుగాక!

ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికమైన తాపాలన్నీ శాంతించుగాక!

### మొదటి ఖండం

**మం॥ ఓ మిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత, ఓమితి హ్యుద్గా యతి తస్యోప వ్యాఖ్యానం** 1

ఓంకారాన్ని (ప్రణవాన్ని) ఉద్గీథ దృష్టితో ఉపాసించాలి అని చెపుతున్నారు. ఉద్గీథము – ఓంకారము, ఈ రెంటికి అభేదాన్ని స్థాపించుకొని – ఈ రెండూ ఒకటే అని భావించుకొని ఉపాసన చేయాలి. ఒక సామగాన భాగాన్ని ఉద్గీథమంటారు. ఉద్గాత, యజ్ఞాల్లో ఈ ఉద్గీథాన్ని ఉచ్చైస్స్వరంతో గానం చేస్తాడు.

ఉద్గీథంతో సామ్యాన్ని పొందినట్టి ఓంకారాన్ని ఉపాసించాలి. అంటే ఓంకారాన్ని పరబ్రహ్మకు శబ్ద ప్రతీకగా భావించుకోవాలి. 'ఓం' అనేది ఉపాసన కోసం ఏర్పరచుకొన్న ఒక చిహ్నం – ఒక దేవతా విగ్రహం లాగా. ఉపాసన చేయటమంటే మనస్సును ఒక విషయం మీద లగ్నంచేసి

దానినే – ఆ భావాన్నే నిరంతరం ధ్యానం చేయటం. అంతేగాని, శబ్దాన్ని మాత్రమే జపించటం ఉపాసన అనిపించుకోదు. ఈ ఓంకారం, కర్మకాండల్లో – యజ్ఞయాగాదుల్లో ఒక భాగంగా, పరబ్రహ్మకు శబ్ద ప్రతీకగా ఉపయోగిస్తుంది. ఉద్గీథ శబ్దవాచ్యమైన ఈ ఓంకారం యొక్క గొప్పదనాన్ని ఉపనిషత్తే వ్యాఖ్యానిస్తోంది.

ఈ ఉపాసన ఏవిధంగా చేయాలి? దానివల్ల కలిగే గొప్పదనం ఎటువంటిది? అనే విషయాలన్నింటిని వివరించటాన్ని ఉప వ్యాఖ్యానం అంటారు. ఆ ఉపవ్యాఖ్యానం ఆరంభిస్తున్నారు.

**మం॥ ఏషాం భూతానాం పృథిశీ రసః పృథివ్యా ఆపో రసః ఆపామోషధయో రస ఓషధీనాం పురుషో రసః పురుషస్య వాగ్రసో వాచ ఋగ్రస ఋచః సామ రసః సామ్న ఉద్గీథో రసః 2**

ఈ స్థావర జంగమ ప్రాణులయొక్క జన్మకు, స్థితికి, లయానికి ఈ భూమియే స్థానం. కాబట్టి, ఈ పృథివి, జీవరాసులన్నింటికి రసం. లేదా ఆధారం. అట్లాగే ఈ పృథివికి జలము రసం. జలానికి ఓషధులు రసం. ఓషధులకు రసం పురుషుడు. పురుషునికి రసం వాక్కు. వాక్కుకు రసం ఋక్కు. ఋక్కుకు రసం సామం. సామానికి రసం ఉద్గీథం. ఇక్కడ సందర్భాన్ని బట్టి ఉద్గీథం అంటే ఓంకారమనే గ్రహించాలి. వెనుకటి మంత్రంలో ఓంకారము ఉద్గీథము ఒకటే అని చెప్పారు గదా! కాబట్టి సామానికి సారం – రసం ఓంకార మన్నమాట.

ఓషధులవల్ల, ధాన్యాదులతో గూడిన అన్నంవల్ల ఈ శరీరం కలుగుతోంది కాబట్టి అది ఓషధులకు సారమైంది. ఈ శరీరంలోని అవయవాలన్నింటిలోకి ప్రధానమైనది కాబట్టి వాక్కు అనేది శరీరానికి రసం అన్నారు.

**మం॥ స ఏష రసానాం రసతమః పరమః పరార్థ్యోఽష్టమో యదుద్గీథః 3**

వెనుకటి మంత్రంలో పృథివ్యాది భూతాలు ఒకదాని కంటె మరొకటి శ్రేష్ఠమైన 'రసం' అని చెప్పబడ్డది. ఉద్గీథమనేది వెనుక చెప్పబడిన రసాలన్నింటిలోను సారభూతమైనది. అది – ఉద్గీథం – ఓంకారం పరమాత్మకు ప్రతీక కాబట్టి ఆ ఓంకారం పరమాత్మగానే భావింపబడటానికి తగినది. పరబ్రహ్మ స్థానంలో ఉండటానికి అర్హమైంది కాబట్టి అది పరార్థ్యమైంది. ఈ ఓంకారం పృథివ్యాది రసాల్లో ఎనిమిదవది. (పృథివి, జలం, ఓషధులు, పురుషుడు, వాక్కు, ఋక్కు, సామం, ఉద్గీథం (ఓంకారం) ఇవి ఒకదానికంటే శ్రేష్ఠమని చెప్పారు.

**మం॥ కతమా కతమర్క్ కతమత్క తమ త్సామ కతమః కతమ ఉద్గీథ ఇతి విమృష్టం భవతి 4**

ఏవేవి ఋక్కులు? ఏవేవి సామాలు? ఏవేవి ఉద్గీథాలు? అనే విషయాన్ని గూర్చి వివరింపబడుతోంది. ఋగ్వేదం ఒకటే అయినప్పటికీ అందలి ఋక్ మంత్రాల రూపంలో ఉండే

వ్యక్తులు అనేకంగా ఉండటం వల్లనన్నట్లుగా బహువచన ప్రయోగం చేయబడ్డది. ఋక్కులు, సామాలు, ఉద్గీథాలు అని.

**మం॥ వాగేవ ఋక్ ప్రాణః సామోమిత్యేతదక్షర ముద్గీథః తద్వా ఏతన్మిథునం యద్వాక్చ ప్రాణశ్చర్క్ చ సామ చ. 5**

వాక్కే ఋక్కు. ప్రాణమే సామం. అట్లాగే 'ఓం' అనే అక్షరమే ఉద్గీథం. వాక్కు, ప్రాణం అనేవి క్రమంగా ఋక్, సామాలకు కారణాలు. అందుచేతనే వాక్కును ఋక్ అని, ప్రాణాన్ని సామం అని అన్నారు. ఈ విధంగా ఈ రెండూ (వాక్ప్రాణాలు, ఋక్సామాలు) జతలు (మిధునాలు). ఈ విధంగా ఋక్సామాలు గ్రహింపబడటంవల్ల ఋక్సామాలద్వారా నిర్వర్తింపబడే కర్మలన్నీ వాక్ప్రాణాల ద్వారా నిర్వర్తింపబడ్డట్లే! వాటితోబాటు సమస్త కామాలు కూడా చేరుతున్నాయి. ఓంకారాన్ని ఉద్గీథమని చెప్పటంవల్ల ఉద్గీథం సామంలో భాగమనే అనుమానాన్ని త్రోసివేసినట్లైంది.

**మం॥ త దేత న్మిథున మోమిత్యేత స్మిన్నక్షరే సంసృజ్యతే యదా వై మిథునౌ సమాగచ్ఛత ఆపయతో వై తావన్యోన్యస్య కామమ్. 6**

ఈ జంట (మిధునం) ఓం అనే అక్షరంతో కలుస్తుంది. మిధునంలోని అవయవాలు ఒకదానితో ఒకటి కలిసిపోయినప్పుడు ఒకదాని కోరికలు మరొకటి నెరవేరుస్తుంది. ఈ విధమైన గ్రామ్యధర్మం స్త్రీ పురుషుల కలయికలో చూస్తూనే ఉన్నాం. ఓంకారానికి సమస్త కోరికలు తీర్చే శక్తి ఉంది. ఈ మిధునం ఓంకారంతో కలవటం వల్ల ఓంకారానికున్నట్టి సమస్త కామాలు సిద్ధింపచేసే శక్తి ఈ జంటకు వస్తోందని భావం. అంటే ఋక్సామాలు, లేదా వాక్ప్రాణాలు ఓంకారంతో చేరినపుడు ఓంకారానికి ఉన్న శక్తి (సర్వ కామాప్తిత్వ గుణం) వాటికి వస్తోందని భావం. ఓంకారం వల్లనే ఋక్సామాలకు గొప్పదనం వస్తోంది.

**మం॥ ఆపయితా హ వై కామానాం భవతి య ఏత దేవం విద్వానక్షర ముద్గీథముపాస్తే. 7**

పైన చెప్పిన విధంగా ఓంకారాన్ని ఉపాసించినందువల్ల కలిగే ఫలం చెపుతున్నారు.

ఉపాసకుడు ఈ 'ఓం' అనే అక్షర స్వరూపంలో ఉన్న ఉద్గీథాన్ని ఉపాసిస్తే ఆ ఓంకారం ఆ ఉపాసకుని సమస్త కోరికలను నెరవేరుస్తుంది.

**మం॥ తద్వా ఏతదనుజ్ఞాక్షరం యద్ధి కించానుజానాత్యోమిత్యేవ తదాహైషో ఏవ సమృద్ధిర్యదనుజ్ఞా సమర్ధయితా హ వై కామానాం భవతి య ఏతదేవం విద్వానక్షర ముద్గీథ ముపాస్తే. 8**

ఓంకారానికి ఉన్నట్టి అనేక విధాలైన గొప్పదనాలను గూర్చి చెపుతున్నారు.

ఈ ఓంకారమనేది అనుమతి ఇవ్వటాన్ని సూచిస్తుంది. ఎవరైనా 'ఈ పని చేయవచ్చునా?' అని అడిగితే యజమాని 'ఓం' అని అనుమతి ఇస్తాడు. 'ఈ విషయం చెపుతారా' అని ఒక

పండితుని అడిగితే 'ఓం' అని అతని అంగీకారాన్ని తెలియజేస్తాడు. కాబట్టి 'ఓం' అనేది అనుజ్ఞ ఇవ్వటానికి ఉపయోగిస్తుంది. ఈ విషయాన్ని తెలుసుకొని ఓంకారాన్ని ఉపాసించే వాని కోరికల్ని ఈ ఓంకారం తప్పకుండా నెరవేరుస్తుంది.

**మం॥ తేనేయం త్రయీ విద్యా వర్తత ఓమిత్యాశ్రావయ త్యోమితి శగ్ంసత్యోమిత్యుద్గాయ త్యేతస్యైవాక్షర స్యాపచిత్యై మహిమ్నార సేన. 9**

ఈ ఓంకారంతోనే ఋక్ యజుస్సామ వేదాలలో (త్రయీ విద్యలో) చెప్పబడినట్టి – విహితమైన వైదిక కర్మలన్నీ ఆరంభింపబడతాయి. ముందుగా ఓంకారాన్ని ఉచ్చరించే అధ్వర్యుడు దేవతల నుద్దేశించిన ఆ శ్రావణకర్మను నిర్వర్తిస్తాడు. అట్లాగే ముందుగా ఓంకారాన్ని ఉచ్చరిస్తూనే హోత అనే ఋత్విక్కు శంసనం చేయిస్తాడు – దేవతలను స్తుతిస్తాడు. ఓంకారాన్ని ముందుగా ఉచ్చరిస్తూనే ఉద్గాత ఉద్గానం చేస్తాడు. వేదోక్తమైన ఈ కర్మ అంతా – సోమయాగం – ఈ ఓంకారాన్ని పూజించటం కోసమే జరుగుతోంది. అంటే, ఓంకారం పరబ్రహ్మ స్వరూపం కాబట్టి ఆ పరబ్రహ్మను పూజించటం కోసమే ఈ కర్మకాండలన్నీ జరుగుతున్నాయని భావం. అట్లాగే ఋత్విక్కులు, యజమాని మొదలైన వారి యొక్క ప్రాణరూపమైన మహిమతో, వ్రీహియవాది (ధాన్యం, బార్లీ మొ॥) అన్న రసాలతో నిష్పన్నమైన హవిస్సులతో ఈ వైదిక కర్మలు సుసంపన్నమౌతున్నాయి – ఓంకారం యొక్క మహిమవల్ల, ఓంకారం యొక్క సారంవల్ల ఈ వైదిక కర్మలు నిర్వహింపబడుతున్నాయి. యజ్ఞమనేది ప్రాణాలతోను, అన్నంతోను నిర్వహింపబడుతుంది. ప్రాణము, అన్నమూ కూడా ఓంకారమే కాబట్టి ఆ ఓంకారమే యజ్ఞం. దీని ఫలితంగానే మళ్ళీ సూర్యుని ద్వారా, వర్షం ద్వారా అన్న ప్రాణాల ఉత్పత్తి జరుగుతోంది.

**మం॥ తేనోభౌ కురుతో యశ్చైతదేవం వేద యశ్చన వేద. నానా తు విద్యా చావిద్యా చ యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్య వత్తరం భవతీతి ఖల్వేతస్యైవాక్షరస్యోప వ్యాఖ్యానం భవతి. 10**

ఈ ఓంకారమనే అక్షరాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు, తెలుసుకోనివాడూ కూడా ఆ అక్షరం ద్వారా కర్మ చేస్తూనే ఉన్నారు. కాని, తెలుసుకొని కర్మచేయటం, తెలియకుండా కర్మచేయటం ఈ రెంటి ఫలితము, విద్య, అవిద్యలవల్ల కలిగే ఫలితం భిన్నంగా ఉంటుంది. విద్యతో, శ్రద్ధతో, యోగంతో చేసినపని, అవి లేకుండా చేయబడిన కర్మ కంటె శక్తివంతమై ఉంటుంది. అందుచేత ఈ ప్రపంచమంతా ఓంకారమనే ఈ అక్షరానికి వ్యాఖ్యానమని నిశ్చయంగా చెప్పవచ్చు.

## రెండవ ఖండం

**మం॥ దేవాసురా హ వై యత్ర సం యేతిర ఉభయే ప్రాజా పత్యాస్తద్ధ దేవా ఉద్గీథ మా జహ్రురనేనైనా నభి భవిష్యామ ఇతి. 1**

ప్రాణోపాసన యొక్క శ్రేష్ఠత్వాన్ని నిరూపించటానికై ఈ దిగువ ఆఖ్యాయికను ఆరంభిస్తున్నారు.

దేవాసురులిరువురు ప్రజాపతి యొక్క సంతానమనే విషయం ప్రసిద్ధమే గదా! శాస్త్ర విహితమైన ఇంద్రియ ప్రవృత్తులను దేవతలని, విషయాసక్తమైనట్టి, తమోగుణ ప్రధానమైనట్టి ప్రవృత్తులను అసురులని భావించవచ్చు. ఈ దేవాసురులకు – మంచికి, చెడుకు – ఏదో ఒక కారణంగా ఎప్పుడూ యుద్ధమే!

అందుచేత దేవతలు ఉద్గీథం ద్వారా అసురుల్ని జయించుదామని నిశ్చయించుకొన్నారు. ఈ విధంగా నిశ్చయించుకొని దేవతలు ఉద్గీథాన్ని అనుష్ఠించారు. ఉద్గీథమంటే జ్యోతిష్టోమాది యాగాల్లో ఉద్గాత చేసే పని సామగానాన్ని చేయటం.

**మం॥ తే హ నాసిక్యం ప్రాణముద్గీథ ముపాసాంచక్రిరే తంహాసురాః పాప్మనా వివిధుస్త స్మాత్యేనోభయం జిఘ్రతి సురభి చ దుర్గంధి చ పాప్మనా హ్యేష విద్ధః. 2**

**మం॥ అథ హ వాచ ముద్గీథ ముపాసానాంచక్రిరే తాంహా సురాః పాప్మనా వివిధుస్త స్మాత్తయోభయం వదతి సత్యం చానృతం చ పాప్మనా హ్యేషా విద్ధా. 3**

**మం॥ అథ హ చక్షురుద్గీథ ముపాసాంచక్రిరే తద్ధాసురాః పాప్మసా వివిధు స్తస్మాత్తేనోభయం పశ్యతి దర్శనీయం చాదర్శనీయం చ పాప్మనా హ్యేతద్విద్ధమ్. 4**

**మం॥ అథ హ శ్రోత్ర ముద్గీథ ముపాసాంచక్రిరే తద్ధాసురాః పాప్మనా వివిధు స్తస్మాత్తేనోభయం శృణోతి శ్రవ ణీయం చా శ్రవణీయం చ పాప్మనా హ్యేతద్విద్ధమ్. 5**

**మం॥ అథ హ మన ఉద్గీథ ముపాసాంచక్రిరే తద్ధాసురాః పాప్మనా వివిధుస్తస్మాత్తేనోభయం సంకల్పయతే సంకల్పనీయం చాసంకల్పనీయం చ పాప్మనా హ్యేతద్విద్ధమ్ 6**

ముందుగా దేవతలు ఘ్రాణేంద్రియం (ముక్కు)లో ఉండే ఘ్రాణశక్తిని (వాసన చూచే శక్తిని) ఉద్గీథరూపంలో ఉపాసించారు. కాని అసురులు అధర్మము, ఆసక్తి అనే పాపంతో ఘ్రాణాన్ని వేధించారు. అందుచేత అది శక్తివిహీనమైంది. ఆ కారణంగానే నాసిక సుగంధాన్ని, దుర్గంధాన్నీ కూడా ఆఘ్రాణిస్తోంది.

తరువాత దేవతలు వాక్కును ఉద్గీథ రూపంలో ఉపాసించటం ఆరంభించారు. అసురులు ఇది తెలుసుకొని వెనుకటిలాగానే పాపంతో వాక్కును వేధించారు (బాధించారు). ఆసక్తిరూపమైన

పాపంచేత వేధింపబడటంవల్ల వాక్కుశక్తి హీనమైపోయింది. ఆ కారణంగానే ఈనాడు వాక్కుద్వారా సత్యాన్ని, అసత్యాన్ని కూడా మాట్లాడుతున్నారు.

పిమ్మట దేవతలు ఉద్గీథరూపంలో చక్షుస్సును (నేత్రాల్ని) ఉపాసించటం ప్రారంభించారు. ఇది తెలుసుకున్న అసురులు వెనుకటి విధంగానే విషయాసక్తి రూపమైన పాపంతో చక్షుస్సును వేధించారు. దానివల్ల చక్షుస్సు శక్తి విహీనమైంది. అందుచేతనే ఈనాడు కండ్లతో యోగ్యమైనవాటిని, అయోగ్యమైనవాటిని కూడా చూస్తున్నాము.

తరువాత దేవతలు ఉద్గీథ రూపంలో శ్రోత్రాన్ని ఉపాసించటం మొదలుపెట్టారు. ఇది తెలిసిన అసురులు ఆసక్తిరూపమైన పాపంతో శ్రోత్రాన్ని వేధించారు. దానివల్ల శ్రోత్రం శక్తిహీనమైంది. అందుచేతనే యోగ్యమైన మాటలతోబాటు అయోగ్యమైన వాటిని కూడా వినవలసి వస్తోంది.

పిమ్మట దేవతలు ఉద్గీథ దృష్టితో మనస్సును ఉపాసించారు. వెనుకటిలాగానే అసురులు మనస్సును కూడా పాపంతో వేధించారు. ఆ కారణంగా ఈనాడు సంకల్పానికి యోగ్యమైనవాటిని, అయోగ్యమైనవాటిని కూడా మనస్సు ఆలోచిస్తోంది.

**మం॥ అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణస్త ముద్గీథ ముపాసాంచక్రిరే తం హాసురా ఋత్వా విదధ్వం, సుర్యథాశ్మాన మాఖణమృత్వా విధ్వంసేత. 7**

**మం॥ ఏవం యథాశ్మాన మాఖణమృత్వా విధ్వంసత ఏవం హైవ స విధ్వం సతే య ఏవం విది పాపం కామయతే యశ్చైన మభిదాసతి స ఏషోఽ శ్మాఖణః 8**

**మం॥ నైవైతేన సురభి న దుర్గంధి విజానాత్యపహత పాప్మా హ్యేష తేన యదశ్నాతి యత్పిబతి తేనేతరాన్ప్రాణాన వతి ఏతము ఏవాన్తతోఽ విత్త్వోత్క్రామతి వ్యాదదా త్యేవాన్తత ఇతి. 9**

పిమ్మట దేవతలు నోటిలో ఉండే ముఖ్య ప్రాణాన్ని (ప్రాణ వాయువును) ఉద్గీథంగా భావించి ఉపాసించారు. అసురులు ముఖ్యప్రాణాన్ని కూడా పాపంతో వేధించాలని అనుకున్నారు. కాని దాని వద్దకు పోయిన అసురులు అభేద్యమైన శిలాఖండానికి తాకి చూర్ణమైపోయే మట్టిబెడ్డలాగా విధ్వస్తమైపోయారు. ముఖ్య ప్రాణాన్ని పాపవిద్ధం చేయలేకపోయారు. (చక్షుశ్శ్రోత్రాదులన్నీ ఈ ముఖ్య ప్రాణలో అంతర్భాగాలైన ప్రాణాలు). ఈ ముఖ్య ప్రాణం వల్ల అసురులు ఓడిపోయారు. (ఇదే ఆఖ్యాయిక బృహదారణ్యకం 1వ అధ్యాయంలో, 3వ బ్రాహ్మణంలో, 1 నుండి 7 మంత్రాల్లో చెప్పబడింది).

ఈ విధమైన ప్రాణోపాసనను తెలిసికొన్నట్టి ఉపాసకునియెడల ఎవడైనా పాపాన్ని తలపెడితే, లేదా అటువంటి ఉపాసకుని కొట్టి బాధించాలని తలిస్తే అటువంటివాడు దుర్భేద్యమైన పాషాణాన్ని

తాకి చూర్ణమైపోయే మట్టి బెడ్డల్లాగా నాశనమైపోతాడు – ప్రాణోపాసకుడు దుర్భేద్యమైన శిలవంటివాడు కాబట్టి.

ఈ ముఖ్య ప్రాణం ద్వారా మనం సుగంధాన్నిగాని, దుర్గంధాన్నిగాని వాసనచూడం – లేదా తెలుసుకోలేము. ఎందుచేత? ప్రాణమనేది విషయాసక్తి రూపమైన పాపం చేత విరుద్ధం కాలేదు కాబట్టి; పాపం చేత ఈ ప్రాణం పరాభూతం కాలేదు కాబట్టి! అందుచేతనే ఈ ప్రాణం ఏదైనా తినినా, త్రాగినా వాటివల్ల ఇతర ఘ్రాణాది ఇంద్రియాల్ని పోషిస్తోందే తప్ప తనకోసం కాదు. ఆ కారణంగానే, మరణకాలంలో ఈ ముఖ్య ప్రాణాన్ని పొందలేక వాక్ ఘ్రాణాది ప్రాణాలన్నీ శరీరంనుండి వెళ్ళిపోతున్నాయి. అందుచేతనే, మానవుడు మరణకాలంలో ఈ ముఖ్యప్రాణాన్ని పొందలేక నోరు తెరుస్తాడు.

**మం॥ తం హాంగిరా ఉద్గీథముపాసాంచక్ర ఏతము ఏవాంగి రసం మన్యన్తేఽఙ్గానాం యద్రసః 10**

**తేన తం హ బృహస్పతి రుద్గీథ ముపాసాంచక్ర ఏతము ఏవ బృహస్పతిం యన్యన్తే వాగ్ఘి బృహతీ తస్యా ఏష పతిః 11**

**తేన తం హాయాస్య ఉద్గీథముపాసాంచక్ర ఏతము ఏవాయాస్యం మన్యన్త ఆస్యాద్య దయతే. 12**

**తేన తం హ బకో దాల్భ్యో విదాంచకార. స హ నైమిషీయానాముద్గాతా బభూవ స హ స్మైభ్యః కామానాగాయతి. 13**

**అగాతా హ వై కామానాం భవతి య ఏతదేవం విద్వానక్షరముద్గీథ ముపాస్త ఇత్య ధ్యాత్మమ్. 14**

అంగిరుడనే ఋషి ముఖ్య ప్రాణాన్ని ఉద్గీథరూపంలో ఉపాసించాడు. ఆ కారణంచేతనే ప్రాణానికి అంగిరస సంజ్ఞ (పేరు) వచ్చింది. ఈ ప్రాణమే సమస్త అంగాలకు (అవయవాలకు) రసం కాబట్టి అంగిరసమైంది – అన్ని అవయవాలకు సారభూతమైనది.

బృహస్పతి కూడా ఈ ముఖ్యప్రాణాన్ని ఉద్గీథంగా భావించి ఉపాసించాడు. అందుచేతనే ఈ ముఖ్యప్రాణాన్ని బృహస్పతిగా భావిస్తారు. వాక్కే బృహతి. ప్రాణమే ఆ బృహతికి పతి. కాబట్టి ముఖ్య ప్రాణానికి బృహస్పతి అనే పేరు వచ్చింది.

ఆయాసుడనే ఋషి ఈ ముఖ్యప్రాణాన్ని ఉద్గీథంగా భావించి ఉపాసించాడు. అందుచేతనే ఈ ముఖ్యప్రాణాన్ని ఆయాస్యమని అంటారు. ఈ ప్రాణం నోటినుండి (ఆస్యంనుండి) వెలువడుతుంది కాబట్టి ఈ కారణంచేత కూడా ఆయాస్యమౌతోంది.

దల్భుని పుత్రుడు బకుడు కూడా వెనుక చెప్పినవారి లాగానే ఈ ముఖ్యప్రాణాన్ని ఉద్గీథంగా ఉపాసించాడు. అందుచేతనే నైమిశారణ్యంలో యజ్ఞం చేసినవారికి అతడు ఉద్గాత అయినాడు. ఈ దాల్భ్యుడు యజమానుల కోరికలు నెరవేరటం కోసం ఈ ప్రాణ విజ్ఞాన సామర్థ్యంతోనే ఆగానం చేశాడు.

ఈ విధమైన విజ్ఞానాన్ని పొందిన విద్వాంసుడు, ఉద్గీథ రూపంలో ఉండే ఓంకారాన్ని వెనుక చెప్పిన విధంగా ఉపాసించేవాడు, ఇతర ఉద్గాతల కామ్యాలను (కోరికలను) కూడా ఆగానం చేసేవాడు అవుతాడు. ఇది శరీరంలో ఉండే ముఖ్య ప్రాణానికి సంబంధించినట్టి (ఆధ్యాత్మిక) ఉపాసన. ఈ ఆధ్యాత్మిక ఉపాసన తరువాత ఆధిదైవత ఉపాసనను ప్రారంభిస్తారు.

మూడవ ఖండం

**మం॥ అథాధిదైవతం య ఏవాసౌ తపతి తముద్గీథముపాసీ తోద్యన్వా ఏ ష ప్రజాభ్య ఉద్గాయతి, ఉద్యం స్తమో భయమపహన్త్యపహన్తాహ వై భయస్య తమసో భవతి య ఏవం వేద. 1**

అధి దైవతోపాసనను గూర్చి చెపుతున్నారు. ముందుగా సూర్యుని ఉద్గీథంగా భావించి ఉపాసించే విధానం చెపుతున్నారు.

ఈ తపిస్తూన్న – మండుతూన్న సూర్యుడు ఉద్గీథమే! అనే భావంతో ఉపాసన చేయాలి. ఎందుచేతనంటే ఈ ఆదిత్యుడు ఉదయించి జీవరాశులకు కావలసిన అన్నాన్ని ఉత్పత్తి చేయటం కోసం ఉద్గానం చేస్తున్నాడు. అంతేకాదు, అతడు ఉదయించి అంధకారాన్ని, ఆ అంధకారం వల్ల కలిగే భయాన్ని కూడా పోగొడుతున్నాడు. ఈ సత్యాన్ని తెలుసుకొని, సూర్యుని ఉద్గీథ దృష్టితో ఉపాసించేవాడు జన్మ మరణాది భయాలను, ఆ భయాలకు కారణభూతమైన అజ్ఞానాన్ని దూరం చేయగలుగుతాడు.

అయితే ఆదిత్యునికి, ప్రాణానికి ఉన్న పోలికను గూర్చి ఈ దిగువ చెపుతున్నారు.

**మం॥ సమాన ఉ ఏవాయంచాసౌ చోష్ణో౽యముష్ణో౽సౌ స్వర ఇతీమ మాచక్షతే స్వర ఇతి ప్రత్యాస్వర ఇత్యముం తస్మాద్వాఏతమివ మముం చోద్గీథముపా సీత. 2**

గుణాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే ఆదిత్యుడు, ప్రాణము రెండూ ఒకటే! ఎందుచేతనంటే ప్రాణము, సూర్యుడు రెండూ వేడిగానే ఉంటాయి – ఉష్ణతా గుణం రెంటికీ సమానమే! ప్రాణాన్ని స్వరం అని అంటారు. అంటే కదలేది అని అర్థం. అట్లాగే సూర్యుని కూడా స్వరమని, ప్రత్యాస్వరమని అంటారు. అంటే, ముందుకు కదులుతూ మళ్ళీ వెనుకకు వస్తూ ఉంటాడు కాబట్టి, తత్వతః ఈ రెండూ అభిన్నమైనవే! అందుచేత ప్రాణము సూర్యరూపంలో, ఉద్గీథస్వరూపమైన

ఓంకారాన్ని ఉపాసించాలి. ప్రాణము, సూర్యుడు ఒకటే! ఉద్గీథము, ఓంకారము ఒకటే! కాబట్టి సూర్యుని ఓంకారంగా భావించి ధ్యానించాలి అని భావం.

**మం॥ అథఖలు వ్యాన మేవోద్గీథముపాసిత యద్వై ప్రాణితి స ప్రాణో యదపానితి సోఽపానః . అథ యః ప్రాణా పానయోః సంధిః సవ్యానో యో వ్యానః సావాక్ తస్మాదప్రాణన్ననపాన న్వాచ మభి వ్యాహరతి. 3**

వ్యాన రూపంలో ఉద్గీథాన్ని ఉపాసించటం చెపుతున్నారు. అంటే మరియొక విధంగా ఆధ్యాత్మోపాసనను వివరిస్తున్నారన్నమాట.

ఉద్గీథాన్ని వ్యానదృష్టితో ఉపాసించాలి. మనం నోటితోను ముక్కుతోను బయటకు వదిలే వాయువు ప్రాణం. మనం నోటి ద్వారా, ముక్కు ద్వారా లోనికి పీల్చే వాయువు అపానం. ఈ ప్రాణానికి అపానానికి (ఊపిరి పీల్చటానికి వదలటానికి) మధ్యనుండే సంధిని వ్యానం అంటారు – అంటే ఊపిరి పీల్చకుండా, వదలకుండా ఉండే స్థితిని వ్యానం అంటారు. ఈ వ్యానమే వాక్కు. ఎందుచేతనంటే మనం మాట్లాడేటప్పుడు ఊపిరి పీల్చటంగాని, వదలటంగాని ఉండదు. అంటే, వ్యాన స్థితిలో మాట్లాడుతాము. కాబట్టి వ్యానమే వాక్కు.

**మం॥ యా వాక్సఋక్ తస్మాదప్రాణన్ననపానన్నృచ మభివ్యా హరతి య ఋక్ తత్సామ తస్మాదప్రాణన్ననపాన స్సామగాయతి యత్సామ స ఉద్గీథ స్తస్మాదప్రాణన్న నపాన న్నుద్గాయతి. 4**

వాక్కు – ఋక్కు, సామం – ఉద్గీథం, వీటిలో సమానత్వానికి కారణం చెపుతున్నారు.

పైన చెప్పిన విధంగా వ్యానస్థితిలో వెలువడే వాక్కే ఋక్కు. అట్లా ప్రాణాపాన క్రియలు జరపకుండా ఉన్నస్థితిలో వెలువడే ఋక్కే సామం! అందుచేతనే పురుషుడు ప్రాణాపాన క్రియలు జరపకుండా సామాన్ని గానం చేస్తున్నాడు. ఆ విధంగా చేసే సామగానావయవ విశేషమే ఉద్గీథం. ఆ విధమైన ఉద్గీథమే ఓంకారం. అంటే ఉద్గీథం కూడా వ్యానావస్థలోనే గానం చేయబడుతుంది. కాబట్టి వాక్కు ఋక్కుల్లో, సామ ఉద్గీథాల్లో సమానత్వం కనిపిస్తోంది.

**మం॥ అతో యాన్యన్యాని వీర్యవన్తి కర్మాణి యథాగ్నే ర్మన్థ నమాజేః సరణం దృఢస్య ధనుష ఆయమన మప్రాణన్నన పానంస్తాని కరోత్యేతస్య హేతో ర్వ్యాన మేవోద్గీథ ముపాసీత. 5**

ఇంతేకాదు, అధికమైన శ్రమతో, కష్టసాధ్యమైన కర్మలు అన్నీ ఈ వ్యాన వృత్తిలోనే చేయబడుతున్నాయి. అంటే అగ్నిమంథనం. (రాపిడిద్వారా అగ్నిని రగుల్కొలపటం) కొంతదూరం పరుగెత్తటం, దృఢమైన ధనుస్సును ఎక్కుపెట్టటం వంటి కష్టమైన పనులన్నీ మానవుడు ప్రాణాపాన

క్రియలు జరపకుండా వ్యానస్థితిలోనే చేస్తున్నాడు. అందుచేత వ్యానదృష్టితో ఉద్గీథాన్ని ఉపాసించాలే తప్ప ముఖ్యప్రాణానికున్న ఇతర వృత్తిరూపాలతో (ప్రాణ, అపాన, ఉదాన, సమాన) ఉపాసించరాదు.

**మం॥ అథఖలూద్గీథాక్షరా ణ్యుపాసీతోద్గీథ ఇతి ప్రాణ ఏవో త్ప్రాణేన హ్యుత్తిష్ఠతి వాగ్గీర్వాచో హ గిర ఇత్యా చక్షతే-న్నం థమన్నే హీదం సర్వం స్థితమ్. 6**

ఉద్గీథ శబ్దంలో ఉన్న అక్షరాల్ని నిశ్చయపూర్వకంగా ఉపాసించాలి. ఉద్గీథమనే శబ్దంతో ఉత్, గీ, థ అనే మూడు అక్షరాలున్నాయి. వీటిలో 'ఉత్' అనే అక్షరాన్ని ప్రాణంగా భావించి ఉపాసించాలి. ఎందుచేతనంటే ప్రాణం ఉండటం వల్లనే ప్రాణులు పైకి లేస్తున్నాయి. 'గీ' అనే అక్షరాన్ని వాక్ దృష్టితో ఉపాసించాలి. ఎందుచేతనంటే వాక్కునే 'గిరః' అని ఉత్తములు అంటారు. అట్లాటే 'థ' అనే అక్షరాన్ని అన్న దృష్టితో ఉపాసించాలి – అన్నంలోనే సమస్తము నిలిచి ఉంది కాబట్టి.

**మం॥ ద్యౌరేవో దన్తరిక్షం గీః పృథివీ థ మాదిత్య ఏవో ద్వాయుర్గీ రగ్ని స్థం సామవేద ఏవో ద్య జుర్వేదోగీర్ ఋగ్వేదస్థం దుగ్ధేస్మై వాక్ దోహం యోవాచో దోహోఽన్నవా నన్నాదో భవతి య ఏతాన్యేవం విద్వానుద్గీథాక్షరాణ్యుపాస్త ఉద్గీథ ఇతి. 7**

ఉద్గీథమనే శబ్దంలోని అక్షరాలను ప్రాణ, లోక, దేవ, వేద దృష్టితో ఉపాసించే విధం చెబుతున్నారు.

ఉద్గీథ శబ్దంలో ఉత్, గీ, థ అనే మూడు అక్షరాలున్నాయి కదా! లోక దృష్టితో ఉత్ అనే అక్షరాన్ని ఉచ్చస్థానాన్ని దృష్టిలో ఉంచుకొని ద్యులోక దృష్టితోను, లోకాన్ని గ్రహించేది – మ్రింగేది కాబట్టి అంతరిక్షాన్ని (భూమికి ద్యులోకానికి మధ్యనున్న లోకం) 'గీ' అనే అక్షరంగానూ, ఈ భూమి ప్రతిష్ఠంగా (ఆధారంగా) ఉండటంవల్ల 'థ' అనే అక్షరాన్ని పృథివిగా భావించి ఉపాసించాలి.

అట్లాగే దేవదృష్టితో ఆదిత్యుని 'ఉత్' అనే అక్షరంగాను, వాయువును 'గీ' అనే అక్షరంగాను, అగ్నిని 'థ' అనే అక్షరంగానూ భావించి ఉపాసించాలి.

అట్లాగే వేద దృష్టితో సామవేదాన్ని 'ఉత్'గాను, యజుర్వేదాన్ని 'గీ' అనే అక్షరంగానూ, ఋగ్వేదాన్ని 'థ' అనే అక్షరంగానూ ఉపాసించాలి. ఈ విధంగా తెలుసుకొని ఉపాసించేవానికి ఋగ్వేదాదులు (వాక్కు) క్షీరమౌతాయి – ఆ క్షీరాన్ని వాక్కు యిస్తుంది. ఆ ఉపాసకుడు సమృద్ధిగా అన్నం కలవాడు. అన్నభోక్త అవుతాడు. ఇది ఉపాసనా ఫలం.

ఉపాసనా విధానం ఈ దిగువ పట్టిక చూపిస్తుంది.

| ఉపాసనా దృష్టి | ఉత్ | గీ | థ |
|---|---|---|---|
| ప్రాణదృష్టి | ప్రాణం | వాక్ | అన్నం |
| లోకదృష్టి | ద్యులోకం | అంతరిక్షం | పృథివి |
| దేవదృష్టి | ఆదిత్యుడు | వాయువు | అగ్ని |
| వేదదృష్టి | సామము | యజుస్సు | ఋక్ |

**మం॥ అథ ఖల్వాశీః సమృద్ధిరూప సరణానీత్యుపాసీత యేన సామ్నాస్తోష్య న్స్యాత్త త్సామోప ధావేత్ 8**

**యస్యా మృచి తామృచం యదార్షేయం త మృషిం యాం దేవతా మభిష్టోవ్య న్స్యాత్తాం దేవతా ముప ధావేత్. 9**

**యేన ఛ్ఛందసా స్తోష్య న్స్యాత్తచ్ఛన్ద ఉపాధావేద్యేన స్తోమేన స్తోష్యమాణః స్యాత్తం స్తోమ ముపధావేత్ 10**

**యాం దిశ మభిష్టోష్య న్స్యాత్తాం దిశముపధావేత్. 11**

**ఆత్మాన మన్తత ఉపసృత్య స్తువీత కామం ధ్యాయన్న ప్రమత్తోऽభ్యాశో హ యదస్మై సకామః సమృద్యేత యాత్కామః స్తువీ తేతి యత్కామః స్తువీతేతి. 12**

తరువాత, కామ్యాలు (కోరికలు) సమృద్ధిగా ఏ విధంగా నెరవేరుతాయో చెపుతున్నారు – సకామోపాసనను విశదీకరిస్తున్నారు.

తమ ధ్యేయాలను – కోరికలను ఈ దిగువ విధంగా ఉపాసించాలి. ఏ సామ విశేషంచేత ఉద్గాత స్తోత్రం చేయవలసి వచ్చిందో ఆ సామాన్ని దాని ఉత్పత్తి క్రమంతో సహా చింతన చేయాలి. అంటే ఆ సామం యొక్క ఛందస్సు, అధిష్ఠాన దేవత మొదలైన విషయాలను చింతన చేయాలి.

ఈ సామం ఏ ఋక్కులో ఉందో, ఆ ఋక్కు ఏ ఋషికి చెందినదై ఉన్నదో ఆ ఋషిని, ఏ దేవతను స్తుతించటానికి సంబంధించి ఉన్నదో ఆ దేవతను చింతన చేయాలి.

ఆ సామాన్ని గాయత్రి మొదలైన ఏ ఛందస్సులో స్తోత్రం చేయవలసి ఉన్నదో ఆ ఛందస్సును గూర్చి ఆలోచించాలి. అట్లాగే ఆ సామం త్రివృత్, పంచదశాది రూపమైన స్తోమాల్లో ఏ స్తోమానికి (మంత్ర సముదాయానికి) చెంది ఉన్నదో ఆ స్తోమాన్ని కూడా చింతన చేయాలి.

ఆ సామం ఏ దిక్కును స్తోత్రం చేయటానికి ఉద్దేశింపబడ్డదో ఆ దిక్కుకు సంబంధించిన దేవతతో సహా ఆ దిక్కును చింతన చేయాలి.

స్వరం మొదలైనవాటి విషయాల్లో ఏ విధమైన పొరపాటు జరగకుండా స్తుతించాలి. అట్లా చేస్తే ఏ ఫలాన్ని కోరి ఉపాసకుడు – ఉద్గాత స్తోత్రం చేస్తాడో ఆ ఉపాసకునికి ఆ ఫలం వెంటనే సమృద్ధిగా లభిస్తుంది.

## నాల్గవ ఖండం

**మం॥ ఓ మిత్యే తదక్షర ముద్గీథ ముపాసీతోమితి హ్యుద్యా యతి తస్యోప వ్యాఖ్యానమ్. 1**

**దేవా వై మృత్యో ర్బిభ్యత స్త్రయీం విద్యాం ప్రావిశంస్తే ఛన్దోభిరచ్ఛా౽ దయన్య దేభిరచ్ఛాదయం స్త ఛ్ఛందసాం ఛన్దస్త్వమ్. 2**

**తాను తత్ర మృత్యుర్యథా మత్స్యముదకే పరిపశ్యే దేవం పర్యపశ్యదృచి సామ్ని యజుషి. తేను విది త్వోర్ధ్వా ఋచః సామ్నోయజుషః స్వర మేవ ప్రావిశన్. 3**

(ఇంతవరకు ఉద్గీథంలో ఉన్న అక్షరాలను ఉపాసించటం చెప్పారు. మధ్యలో ఈ విధంగా కొంత విరామం రావటం వల్ల వేరొక విషయం చెపుతారని భ్రమపడటానికి అవకాశం ఉంది కాబట్టి మళ్ళీ ఓంకారోపాసనతో సంబంధాన్ని కలపటం కోసం మొదటి మంత్రాన్నే మళ్ళీ చెపుతున్నారు).

'ఓం' అనే అక్షరమే ఉద్గీథం. ఈ రూపంలోనే ఉద్గీథాన్ని ఉపాసించాలి. 'ఓం' అనే అక్షరాన్ని ముందుగా ఉచ్చరించే ఉద్గాత యజ్ఞంలో ఉద్గానాన్ని ఆరంభిస్తాడు. దానిని గురించిన ఉప వ్యాఖ్యానం చేయబడుతోంది.

ఒకప్పుడు మృత్యువు వలన భయంచేత భీతులైన దేవతలు త్రయీ విద్యలో (మూడు వేదాల్లో) చెప్పబడిన కర్మలయందు ప్రవిష్టులైనారు. కర్మలందు వినియోగింప బడని మంత్రాలతో జపహోమాదులు చేస్తూ దేవతలు తమను తాము ఈ మంత్రాలతో ఆచ్ఛాదించుకున్నారు. వారు ఏ ఛందస్సులతో – మంత్రాలతో తమను తాము ఆచ్ఛాదించుకున్నారో అవే ఆ ఛందాలకు (మంత్రాలకు) ఛందస్త్వం అయినది.

చేపలను పట్టే జాలరి లోతైన నీటిలో కూడా చేపలను కనిపెట్టినట్లే మృత్యువు కూడా ఋక్ యజుస్ సామ సంబంధమైన కర్మలలో సంలగ్నమై యున్న దేవతలను చూచింది. వేదాలలో చెప్పబడిన కర్మలను ఆచరించటంవల్ల పరిశుద్ధమైన అంతఃకరణతో కూడి ఉన్న దేవతలు, మృత్యువు తమను కనిపెట్టిందనే విషయం తెలుసుకొని ఋగ్యజు స్సామ సంబంధమైన కర్మలనుండి నివృత్తులై స్వరంలో ప్రవేశించారు – ఛందోబద్ధమైన మంత్రాలను వదలి కేవలం స్వరాన్ని ఆశ్రయించారు. అంటే ఓంకారాన్ని ఆశ్రయించారు. అనశ్వరత్వం, నిర్భయత్వం అనేవి ఓంకార లక్షణాలు.

**మం॥ యదా వా ఋచమాప్నోత్యోమిత్యేవాతి స్వర త్యేవం సామైవం యజు రేష ఉ స్వరో య దేతదక్షర మేతదమృత మభయం తత్ప్రవిశ్య దేవా అమృతా అభయా అభవన్. 4**

**స య ఏ తదేవం విద్వానక్షరం ప్రాణౌత్యే తదేవా క్షరం స్వరమమృత మభయం ప్రవిశతి తత్ప్రవిశ్య యదమృతా దేవా స్తదమృతోభవతి. 5**

అధ్యయనం ద్వారా సాధకుడు ఋక్కును పొందినపుడు ఆదర భావంతో 'ఓం' అనే అక్షరాన్ని ఉచ్ఛరిస్తాడు. అట్లాగే యజుస్సామాలను అధ్యయనం చేసేటప్పుడు కూడా ఓంకారంతో ఆరంభిస్తాడు. ఓం అనే ఈ అక్షరమే స్వరం. అది అమృతం – చావు లేనిది. అభయం – భయం లేనిది. అందుచేత ఈ ఓంకారంలో ప్రవిష్టులై (ఉపాసన ద్వారా) దేవతలు చావు లేనివారు, భయం లేనివారు అయినారు.

ఆ దేవతల లాగానే ఇతరులు కూడా ఓంకారాన్ని గురించిన విషయాన్ని తెలుసుకొని ఉపాసన చేస్తే వారు కూడా అమృతము, అభయ స్వరూపము అయిన ఓంకారంలో లీనమై అమరులు, అభయులు అవుతారు. ఉపాస్యదేవత అయిన ఓంకారం యొక్క గుణాలు ఉపాసకునికి సంక్రమిస్తాయి – ఎక్కువ తక్కువ లేమీ లేకుండా.

## ఐదవ ఖండం

**మం॥ అథ ఖలు య ఉద్గీథః స ప్రణవో య ప్రణవః స ఉద్గీథ ఇత్యసావా ఆదిత్య ఉద్గీథ ఏష ప్రణవ ఓమితి హ్యేష స్వరన్నేతి. 1**

ఉద్గీథాన్ని ప్రాణదృష్టితో, ఆదిత్య దృష్టితో ఉపాసించటం లోగడ చెప్పారు. ఇప్పుడు ఓంకారం, ఉద్గీథం, ఆదిత్యుల అభేదానికి సంబంధించిన ఉపాసనను గూర్చి చెపుతున్నారు.

నిజానికి ఈ ఉద్గీథమనేది ఋగ్వేదుల ప్రణవమే! అంటే, ఋగ్వేదులు ప్రణవమని అనే ఈ ఓంకారాన్నే ఛాందోగులు (సామవేదులు) ఉద్గీథమంటారు. ఈ ఆదిత్యుడుకూడా ప్రణవమే! ఉద్గీథమే! సూర్యుడు ఉద్గీథమైన ఈ ప్రణవాన్ని (ఓంకారాన్ని) ఉచ్ఛరిస్తూనే కదులుతున్నాడు. అందుచేతనే సవితృదేవత యొక్క అనుజ్ఞను పొందే ప్రాణాలు – కిరణాలు ప్రవృత్తమౌతున్నాయి – పనిచేస్తున్నాయి. అంటే, సూర్యుడు తాను నడుస్తూనే జీవులన్నింటికి తమ తమ పనులలో ప్రవృత్తం కావలసిందిగా 'ఓం' అంటూ ఆజ్ఞాపిస్తున్నాడని భావం.

**మం॥ ఏతము ఏవాహమభ్యగాసిషం తస్మాన్మమ త్వమేకోఽసీతిహ కౌషీతకిః పుత్రమువాచ రశ్మీం స్త్వం పర్యావర్త యాద్బహవో వైతే భవిష్యన్తీ త్యధిదైవతమ్. 2**

"నిజంగానే నేను ముఖ్యంగా ఈ ఆదిత్యునికి, అతని కిరణాలకు అభేదాన్ని స్థాపించుకొని

రెండూ ఒకటే అనే భావంతో ఆదిత్యుని మాత్రమే ఉపాసించాను. అందుకనే నీవు నాకు ఒకే పుత్రుడవు కలిగావు. కాబట్టి నీవు అతని రశ్మిని (కిరణాలను) ఉపాసించు. అట్లా చేస్తే నీకు అనేకమంది పుత్రులు కలుగుతారు" అని కౌషీతకి తన కుమారునితో అన్నాడు. ఇది అధిదైవతోపాసనా పద్ధతి.

**మం॥ అథాధ్యాత్మమ్ య ఏవాయ ముఖ్యః ప్రాణస్త ముద్గీథ ముపాసీతోమితి హ్యేష స్వరన్నేతి. 3**

తరువాత అధ్యాత్మ ఉపాసనను చెపుతున్నారు – శరీరంలో ఉండే ముఖ్య ప్రాణాన్ని ఉద్గీథంగా భావించి ఉపాసించటం. మన ఈ శరీరంలో ఉండే ముఖ్య ప్రాణాన్ని ఉద్గీథరూపంలో ఉపాసన చేయాలి. ఎందుచేతనంటే, వాక్కు మొదలైన ప్రవృత్తులకు ఈ ఓంకారం అనేది ఈ విధంగా అనుజ్ఞ యిస్తూ ఉంటుంది. నోటిలో ఉండే ఈ ముఖ్య ప్రాణం కూడా సూర్యుని లాగానే ఇంద్రియాలను ఓంకారంతో ఆజ్ఞాపిస్తుందని ఊహించుకోవాలి.

**మం॥ ఏతము ఏవాహమభ్యగాసిషం తస్మాన్మమ త్వమే కోஉసీతిహ కౌషీతకిః పుత్రమువాచ ప్రాణాంస్త్వం భూమానమభిగాయతా ద్బహవోవై మే భవిష్యన్తీతి. 4**

"నేను ప్రముఖంగా ఈ ఒక్క ముఖ్యప్రాణాన్ని మాత్రమే దృష్టి యందుంచుకొని ఉపాసించాను. అందుచేత నాకు నీవు ఒక్క కుమారుడివే కలిగావు. కాబట్టి నీవు బహుపుత్రుల్ని పొందటానికిగాను అనేక భేదాలతో ఉండే విశిష్టమైన ప్రాణాలను ధ్యానంలో ఉంచుకొని ఉపాసించు" అని కౌషీతకి తన కుమారునితో అన్నాడు. ఇక్కడ ముఖంలో నున్న ముఖ్యప్రాణానికి, సూర్యునిలో ఉండే ప్రాణానికి భేదం లేనట్లు చెప్పబడ్డది. సూర్యుని కిరణాలు అనేకంగా విభజింపబడ్డట్లే ముఖ్యప్రాణం కూడా బహుధావిభక్తమై ఉంది.

**మం॥ అథ ఖలు య ఉద్గీథః స ప్రణవో యః ప్రణవః స ఉద్గీథ ఇతి హోతృషద నాద్దైవాపి దురుద్గీతమను సమా హరతీత్యను సమాహరతీతి. 5**

నిశ్చయముగా ప్రణవము, ఉద్గీథము ఒకటే అని చెపుతున్నారు.

ఋగ్వేదులు ప్రణవంగా చెప్పుకొనే ఓంకారం, సామవేదులు ఉద్గీథంగా చెప్పుకొనే ఓంకారం, రెండూ ఒక్కటే! అంటే ప్రణవమన్నా, ఉద్గీథమన్నా ఒకటే! ఈ విషయాన్ని గుర్తించే హోతృసదనం నుండి (హోత అనే ఋత్విక్కు కూర్చుని శంసన కర్మ చేయటానికి తగిన స్థానం నుండి) ఉద్గాతయైనవాడు హౌత్రకర్మలో ఏదైనా దోషం జరిగినా, లోపం కలిగినా ఉద్గానాన్ని సంశోధనం చేస్తాడు. అంటే, హోత ఉచ్చరించే ఉద్గానంలోని దోషాలను సరిదిద్దుతాడు. హోత అనే ఋత్విక్కు, హోతృ సదనంలో

ఉండి ఓంకారాన్ని ఉచ్చరిస్తూ ప్రశంసిస్తూ ఆహుతులు ఇస్తాడు – ఇది శంసన కర్మ.

ఆరవ ఖండం

**మం॥ ఇయమేవర్గగ్నిః సామ తదేత దేతస్యామృచ్య ధ్యూఢం సామ తస్మా దృచ్య ధ్యూఢం సామగీయత ఇయమేవ సాగ్నిరమస్తత్సామ. 1**

**అంతరిక్ష మేవర్వాయుఃసాను తదేతదేత స్యామృచ్య ధ్యూఢం సామతస్మాదృచ్యధ్యూఢం సామ గీయతేఽ న్త రిక్షమేవ సావాయుర మస్తత్సామ. 2**

**ద్యౌరేవర్గాదిత్యః సామ తదేతదేతస్యామృచ్య ధ్యూఢం సామతస్మా దృచ్యధ్యూఢం సామగీయతే ద్యౌరేవసాదిత్యోఽ మస్తత్సామ. 3**

**నక్షత్రాణ్యేవర్చ్చంద్రమాః సామ తదేతదేత స్యామృచ్యధ్యూఢం సామ తస్మాదృచ్యధ్యూఢం సామ గీయతే నక్షత్రాణ్యేవ సా చంద్రమా అను తత్సామ. 4**

(ఈ సందర్భంలో మనం ఈ దిగువ విషయాల్ని తెలుసుకొని గుర్తు ఉంచుకోవాల్సిన అవసరం ఉంది. సామసంహిత అంతా (సామవేదం) ఋగాశ్రితమే! అంటే ఋగ్వేద మంత్రాలైన ఋక్కులను ఆశ్రయించి ఉన్నదే! వృత్తబద్ధమైన – ఛందోబద్ధమైన మంత్రం ఋక్కు. గీతిరూపమైన మంత్రం పాడటానికి అనువుగా ఉండే మంత్రం సామం. గద్యరూపంలో ఉండే మంత్రం యజస్సు. సామానికి ఋగ్వేదంతో తాద్రూప్య సంబంధం ఉంది. ఈ సామ సంహితలోని 75 మంత్రాలు తప్ప మిగతా మంత్రాలన్నీ ఋక్సంహితలోనివే అని విజ్ఞులు చెపుతున్నారు. ఋషి, ఛందో, దైవతాలు కూడా చాలాభాగం ఒకటిగానే ఉంటాయి. అంటే ఋక్ మంత్రాలు గానరూపం దాల్చి సామ సంహితలోనికి చేరి ఉంటాయని విజ్ఞులంటున్నారు. అయితే దీనిని వేరే సంహితగా ఎందుకు భావించారు? అంటే, శ్రావ్యము, మనోహరము అయిన గానస్వరం. దానిని బట్టి వచ్చిన ఉచ్చారణ భేదం, ప్రవచనభేదం, పాఠభేదం వల్ల ప్రత్యేక సంహిత అయినది. ఈ విషయం మనస్సులో ఉంచుకుంటే ముందు ముందు చెప్పబోయే ఋక్సామ సంబంధం బాగా అర్థమౌతుంది).

ఈ పృథివియే ఋక్కు. అగ్నియే పాపం. ఈ అగ్ని అనే పేరుగల సామం, పృథివి అనే పేరుగల ఋక్కులో అధిష్ఠితమై ఉంది. (ఆధారపడి నిలకడగా ఉంది) అందుచేతనే ఈనాడు కూడా సామగాయకుల ద్వారా ఋక్కులో అధిష్ఠితమై ఉన్న సామమే గానం చేయబడుతోంది. (ఋఙ్మంత్రాలే సామంగా పాడబడుతున్నాయి.) ఈ భూమియే 'సా' అనే అక్షరం. అగ్నియే 'అమ' అనే అక్షరం. ఈ రెండూ కలిసి 'సామ'మైంది. ఈ పృథివిని అగ్నిని వేరుచేయటానికి వీలులేనట్లే సామమనే అక్షరాల్ని, ఋక్సామాల్ని వేరుచేయటానికి వీలులేదు. పృథివ్యగ్నులకు, ఋక్సామాలకు

విడదీయరాని సంబంధం ఉంది. అట్లాగే సా+అమ అనే అక్షరాలను కూడా వేరుచేయటానికి వీలు లేదు.

అట్లాగే, అంతరిక్షమే ఋక్కు. వాయువు సామం. (ద్యులోక, పృథివీ లోకాల మధ్యలోకం అంతరిక్షం) ఆ వాయురూపమైన సామం, ఈ అంతరిక్ష రూపమైన ఋక్కులో అధిష్ఠితమై ఉంది. (నిలిచి ఉంది) అందుచేత ఋక్కులో అధిష్ఠితమై ఉన్న సామాన్నే గానం చేస్తారు. 'సామ'మనే రెండక్షరాలలోను 'సా' అనే అక్షరమే అంతరిక్షం. 'అమ' అనేది వాయువు. ఈ రెండూ కలిసి సామమైంది. అంతరిక్ష వాయువులు, ఋక్సామాలు, సా, అమలు విడదీయరానివి. వీటిని సమిష్టి దృష్టితోనే ఉపాసించాలి.

అదేవిధంగా ద్యులోకం, ఋక్కు, ఆదిత్యుడు, సామం. ఆదిత్యరూపంలో ఉండే సామం, ద్యులోక రూపంలో ఉండే ఋక్కులో నిలకడ పొంది ఉంది. అందుచేతనే ఋక్కులో అధిష్ఠితమై ఉండే సామాన్నే నేటికీ గానం చేస్తారు. 'సామ' అనే రెండక్షరాల్లోనూ 'సా' అనేది ద్యులోకం. 'అమ' అనేది ఆదిత్యుడు. ఈ రెండూ కలిసి సామమైంది.

అట్లాగే, నక్షత్ర లోకం ఋక్కు, చంద్రలోకం (చంద్రుడు) సామం. ఈ చంద్ర రూపమైన సామం నక్షత్ర రూపంలో ఉండే ఋక్కులో ప్రతిష్ఠితమై ఉంది. అందుకే నేటికీ ఋక్కులో నిలకడపొందిన సామాన్ని గానం చేస్తున్నారు. ఈ 'సామ' శబ్దంలో 'సా' అనే అక్షరం నక్షత్రలోకం 'అమ' అనేది చంద్రలోకం. రెండూ కలిసి సామమైంది.

**మం॥ అథ యదేతదాదిత్యస్య శుక్లం భాః సైవర్గథ యన్నీలం పరః కృష్ణం తత్సామ తదేతదేతస్యామృచ్యధ్యూఢం సామ తస్మాదృచ్యధ్యూఢంసామ గీయతే. 5**

**అథ యదేవైతదాదిత్యస్య శుక్లం భాః సైవ సాథ యన్నీలం పరః కృష్ణం తదమ తత్సామథ య ఏషో-న్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్య శ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః 6**

**తస్య యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః ఉదిత ఉదేతి హ వై సర్వేభ్యః పాప్మభ్యోయ ఏవం వేద. 7**

**తస్యర్చ్చ సామ చ గేష్ణౌ తస్మాదుద్గీథ స్తస్మాత్త్వే వోద్గాతైతస్య హి గాతా స ఏష యే చాముష్మా త్పరాంచో లోకాస్తేషాం చేష్టే దేవకామానాం చేత్యధిదైవతమ్. 8**

ఆదిత్యునిలో ఉండే శుక్ల ప్రభయే – తెల్లని కాంతియే ఋక్కు. ఆ సూర్యునిలోనినే ఉండే నీలపుకాంతియే – కృష్ణవర్ణమే సామం. ఈ నీలవర్ణరూపమైన సామం, శుక్లవర్ణ రూపమైన

ఋక్కులో ప్రతిష్ఠితమై ఉంది. ఈ నీలవర్ణం శుక్లవర్ణాన్ని ఆశ్రయించి ఉందని భావం. అందుచేతనే ఋక్కులో అధిష్ఠితమైయున్న సామాన్నే గానం చేస్తారు ఈ నాటికీ!

ఆదిత్యునిలో ఉండే శుక్లప్రభ – తెల్లని కాంతియే సా. నీలవర్ణ ప్రభయే అమ. ఈ రెండూ కలిసి సామమైంది. ఈ ఆదిత్యుని మధ్యభాగంలో స్వర్ణమయుడుగా కనిపించే పురుషుడు, స్వర్ణకాంతిమయమైన గడ్డం, మీసాలు కలిగి, స్వర్ణకాంతిమయమైన కేశాలు కలిగి ఉన్నాడు. అంతేకాదు, ఆ పురుషుని నఖశిఖపర్యంతం సమస్త అవయవాలు సువర్ణకాంతిమయమై కనిపిస్తాయి. ఆ పురుషుడు సువర్ణజ్యోతి స్వరూపుడు.

కోతి యొక్క గుదంవద్ద నుండే ఎఱ్ఱని రంగు కలిగిన పద్మం వంటి తేజోవంతమైన నేత్రాలు కలిగి ఉంటాడు. అటువంటి ఈ ఆదిత్యమండలాంతర్వర్తియైన పురుషుడే 'ఉత్' అనే పేరుగలవాడు. ఎందుచేతనంటే, అతడు సమస్త పాపాలకు, పాపకార్యాలకు అతీతుడై ఉంటాడు.

ఈ ఆదిత్యునిలో ఉండే పురుషునికి ఋక్ సామాలు రెండూ వ్రేలియొక్క కణుపులు. వెనుక చెప్పబడిన పృథివి, అగ్ని లాంటి జంటలన్నీ ఈ కణుపులుగా భావించాలి. అందుచేతనే ఆ పురుషుని ఉద్గీథమంటారు. అతనిని గూర్చి గానం చేసేవాడు ఉద్గాత అవుతాడు. ఆ 'ఉత్' అనే పురుషుని గానం చేస్తాడు. కాబట్టి ఆదిత్యునిలో ఉండే ఈ 'ఉత్' అనే దేవతయే ఈ ఆదిత్య లోకానికిపైన ఉండే లోకాల్ని శాసిస్తూ దేవతల యొక్క కోరికల మీద కూడా ఆధిపత్యం వహిస్తాడు. ఇది అధిదైవత ఉద్గీథోపాసనను గురించిన ఉపవ్యాఖ్యానం.

## ఏడవ ఖండం

**మం|| అథాధ్యాత్మం వాగేవర్గ్బ్రాణః సామ తదేతదేత స్యామృచ్యధ్యూఢం సామ తస్మాదృచ్యధ్యూఢగ్ం సామ గీయతే. వాగేవ సా ప్రాణోఽ మస్తత్సామ.** **1**

ఉద్గీథానికి సంబంధించిన అధ్యాత్మ ఉపాసనను గూర్చి వివరిస్తున్నారు.

వాక్కే ఋక్కు. ప్రాణమే సామం. ఈ విధంగా వాగ్రూపమైన ఋక్కులో ప్రాణరూపమైన సామం అధిష్ఠితమై ఉంది. అందుచేత ఋక్కులో నెలకొని ఉన్నట్టి సామాన్నే ఈనాడు కూడా గానం చేస్తారు. వాక్కే 'సా' అనే అక్షరం. ప్రాణమే 'అమ' అనే అక్షరం. ఈ విధంగా సామమనే శబ్దం (వాక్ప్రాణాల కలయిక వల్ల) నిష్పన్నమైంది.

**మం|| చక్షురేవర్గాత్మాసామతదేత దేత స్యామృచ్యధ్యూఢం సామ తస్మా దృచ్యధ్యూఢం సామగీయతే. చక్షురేవ సాత్మామస్తత్సామ.** **2**

**శ్రోత్రమేవఋుక్ మనః సామ తదేతదేతస్యామృచ్య ధ్యూఢం సామ తస్మాదృచ్యధ్యూఢం సామగీతయే. శ్రోత్రమేవ సా మనోఽ మస్తత్సామ. 3**

**అథః యదేతదక్ణః శుక్లం భాః సైవర్గథ యన్నీలం పరః కృష్ణం తత్సామ తదేత దేతస్యామృచధ్యూఢం సామ తస్మాదృచ్యధ్యూఢం సామగీయతే. అథ యదేవైతదక్ణః శుక్లం భాః సైవ సాథ యన్నీలం పరః కృష్ణం తదమస్తత్సామ. 4**

నేత్రమే ఋుక్కు. జీవాత్మయే సామం. ఈ విధంగా ఋుక్కులో సామం అధిష్ఠించి ఉంది. అందుచేతనే ఋుక్కులో అధిష్ఠించి ఉన్న సామాన్నే గానం చేస్తారు. నేత్రమే 'సా' అనే అక్షరం. జీవాత్మయే 'అమ' అనే అక్షరం. ఈ రెండూ కలసి 'సామ'మైంది.

అట్లాగే, శ్రోత్రమే ఋుక్కు. మనస్సే సామం. ఈవిధంగా శ్రోత్ర రూపంలో ఉండే ఋుక్కులో మనస్సు రూపంలో ఉండే సామం ప్రతిష్ఠితమై ఉంది. అందుచేత ఋుక్కులో అధిష్ఠించి ఉన్న సామాన్నే గానం చేస్తారు. సామ శబ్దంలోని అక్షరాల్లో 'సా' అనేది ఋుక్కు. 'అమ' అనేది సామం. ఈ రెంటి సమ్మేళనమే సామం.

ఈ నేత్రాల్లో ఉండే తెల్లని కాంతియే ఋుక్కు. నీలంగా, మిక్కిలి నల్లగా ఉండే వర్ణమే సామం. ఈ విధంగా నేత్రంలో (తెల్లని భాగంలో నల్లని భాగం ఉన్నట్లు) ఆ ఋుక్కులో సామం ప్రతిష్ఠితమై ఉంది. అందుచేత ఋుక్కులో అధిష్ఠించి ఉన్న సామాన్నే గానం చేస్తారు. నేత్రంలో ఉన్న తెల్లని కాంతియే 'సా' నీలవర్ణంతోడి గాఢమైన కృష్ణవర్ణం 'అమ'. ఈ రెండూ కలసి సామ శబ్దమైంది.

**మం।। అథ య ఏషోఽ న్తరక్షిణి పురుషో దృశ్యతే సైవర్క్ త త్సామ తదుక్థం తద్యజుస్తద్బ్రహ్మ తస్యైతస్య తదేవ రూపం యదముష్య రూపం యావముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ. 5**

**స ఏషయే చైతస్మాదర్వాంచో లోకాస్తేషాం చేష్టే మనుష్యకామానాం చేతి తద్య ఇమే వీణాయాం గాయంత్యే తం తే గాయన్తి, తస్మాత్తే ధనసనయః 6**

ఈ నేత్రాల మధ్యభాగంలో కనిపించే పురుషుడే ఋుక్కు. అతడే సామం. అతడే ఉక్థం – కారణం లేదా వాక్కు. అతడే యజస్సు. అతడే బ్రహ్మ. ఈ సూర్యమండలంలో ఉండే పురుషుని రూపం ఎట్లా ఉంటుందో ఈ నేత్రంలో ఉండే పురుషుని రూపం కూడా అట్లాగే ఉంటుంది. అతనికి ఉండే వ్రేలి కణుపులే – పక్షాలే ఇతనికీ ఉన్నాయి. అతనికి ఉన్న పేర్లే ఇతనికీ ఉన్నాయి.

ఈ నేత్రంలో ఉండే పురుషుడు – శరీరంలో ఉండే ఆత్మ. తన కంటె దిగువన ఉన్న లోకాలను, అందులో ఉండే మనుష్యుల్ని వారి కోరికలను శాసిస్తూ ఉంటాడు. అందుచేతనే

గాయకులు వీణతో పాడుతున్నారంటే ఆ ఈశ్వరుని గూర్చి గానం చేస్తున్నట్లే! అందుచేతనే వారు సంపన్నులౌతున్నారు.

**మం॥ అథయ ఏతదేవం విద్వాన్సామ గాయత్యుభౌ స గాయతిసోముఉ నైవ స ఏష యే చాముష్మాత్స రాంచో లోకాస్తాంశ్చాప్నోతి దేవకామాంశ్చ. 7**

**అథానేనైవ యే చైతస్మాదర్వాంచో లోకాస్తాం శ్చాప్నోతి మనుషకామాంశ్చ తస్మాదు హైవం విదు ద్గాతా బ్రూయాత్. 8**

**కం తే కామమాగాయానీత్యేష హ్యేవ కామాగాన స్యేష్టే య ఏవం విద్వాన్సామ గాయతి సామ గాయతి 9**

అట్లాగే, కండ్లలో ఉండే పురుషుణ్ని ఒకటిగా భావించి సామగానం చేసేవాడు ఇద్దరినీ స్తుతించేవాడే అవుతాడు. పైగా, అటువంటి ఉపాసకుడు ఆదిత్యుని ద్వారా అంతకంటె పైన ఉండే లోకాలలోని దేవతలనుభవించే భోగాలను అనుభవిస్తాడు.

అట్లాగే, చాక్షుష పురుషుని ద్వారా అతనికి దిగువన ఉన్న లోకాలలోని మానవుల కోరికలను పొందుతాడు. అందుచేతనే ఈ విషయం తెలిసిన ఉద్గాత, యజమానునితో ఈ విధంగా అనాలి. ఏమని?

'నేను నీ కోసం ఏ కోరికలు నెరవేరాలని ఆ గానం చేయను?' అని అడగాలి. ఎందుచేతనంటే ఉద్గాతకు యజమానుని (యజ్ఞకర్త) కోరికలను గూర్చిన ఆ గానం చేసే సామర్థ్యం ఉంటుంది కాబట్టి. ఈ విషయం తెలిసినవాడే సామగానం చేస్తాడు.

ఎనిమిదవ ఖండం

**మం॥ త్రయో హోద్గీథే కుశలా బభూవుః శిలకః శాలావత్య శ్చైకితాయనో దాల్భ్యః ప్రవాహణో జైవలిరితి తే హోచురుద్గీథే వై కుశలాః స్మోహన్తోద్గీథే కథాం వదామి ఇతి. 1**

**తథేతి హ సముపవివిశుః స హ ప్రవాహణో జైవలి రువాచ భగవన్తావగ్రే వదతాం బ్రాహ్మణయోర్వద తోర్వాచం శ్రోష్యామీతి. 2**

అనేక విధాలైన దృష్టాంతాలతో ఉద్గీదోపాసన యొక్క గొప్పదనాన్ని విశదీకరిస్తున్నారు. ఇప్పుడు చెప్పబోయే విషయం ఇతిహాస ప్రసిద్ధమైనది.

శలావతుని పుత్రుడైన శిలకుడు, చికితాయనుని కొడుకైన దాల్భ్యుడు, జీవలుని కుమారుడైన ప్రవాహణుడు. ఈ ముగ్గురు ఉద్గీథ విజ్ఞానంలో మంచి నేర్పరులు. వారు ముగ్గురు తమలో తాము ఈ విధంగా అనుకున్నారు – 'మనం ఉద్గీథంలో కుశలురం. కాబట్టి, అందరికీ ఇష్టమైతే

పరస్పరం ఉద్గీథ విద్యను గూర్చిన వాదోపవాదాలతో చర్చిద్దాం' అని.

ముగ్గురు మంచిదంటే మంచిది అనుకొని చర్చకు కూర్చున్నారు. అప్పుడు జీవలుని పుత్రుడైన ప్రవాహణుడు మిగిలిన ఇద్దరితో ఇట్లా అన్నాడు – 'మీ ఇరువురు బ్రాహ్మణులు కాబట్టి ముందుగా పూజనీయులైన మీ యిద్దరు చర్చించండి. బ్రాహ్మణులైన మీ వాదోపవాదాలను నేను వింటాను' అని.

**మం॥ స హ శిలకః శాలావత్యశ్చైకితాయనం దాల్భ్య మువాచ హన్తత్వా పృచ్ఛానీతి పృచ్ఛేతి హోవాచ. 3**

**కా సామ్నో గతిరితి స్వర ఇతి హోవాచ స్వరస్య కా గతిరితి ప్రాణ ఇతి హోవాచ ప్రాణస్య కా గతిరిత్య న్నమితి హోవాచాన్నస్య కా గతరిత్యాప ఇతి హోవాచ. 4**

**అపాం కా గతిరిత్యసౌ లోక ఇతి హోవాచాముష్య లోకస్య కా గతిరితి న స్వర్గం లోకమతినయేదితి హోవాచ స్వర్గం వయం లోకగ్ం సామాభిసంస్థాప యామః స్వర్గసంస్తావగ్ం హి సామేతి. 5**

**తగ్ం హ శిలకః శాలావత్యశ్చైకితాయనం దాల్భ్య మువాచాప్రతిష్ఠితం వై కిల తే దాల్భ్య సామ యస్త్వే తర్హి బ్రూయాన్మూర్ధా తే విపతిష్యతీతి మూర్ధా తే విపతేదితి. 6**

**హన్తాహమేతద్భగవతో వేదానీతి విద్ధీతి హోవాచా ముష్య లోకస్య కా గతిరిత్యయం లోక ఇతి హోవా చాస్య లోకస్య కా గతిరితి న ప్రతిష్ఠాం లోకమతినయేదితి హోవాచ ప్రతిష్ఠాం వయం లోకగ్ం సామాభినగ్ం స్థాపయామః ప్రతిష్ఠాసంస్తావగ్ం హి సామేతి. 7**

**తగ్ం హ ప్రవాహణో జైవవిరువాచాన్తవద్వై కిల తే శాలావత్య సామ యస్త్వేతర్హి బ్రూయాన్మూర్ధాతే విపతిష్యతీతి మూర్ధా తే విపతేదితి హన్తాహమేత ద్భగవతో వేదానీతి విద్ధీతి హోవాచ. 8**

తరువాత శలావతుని కుమారుడైన శిలకుడు దాల్భ్యునితో అన్నాడు. "నీవు అనుమతిస్తే ముందుగా నేను నిన్ను కొన్ని విషయాలు అడుగుతాను".

దాల్భ్యుడు – 'సరే! అడుగు!'

శిలకుడు – 'ఉద్గీథ రూపంలో ఉండే సామానికి ఆశ్రయం ఏది?'

దాల్భ్యుడు – 'స్వరమే సామానికి ఆశ్రయం'. అంటే స్వరం మీద సామం ఆధారపడి ఉంది'.

శిలకుడు – 'ఆ స్వరానికి ఆధారం ఏమిటి?'

దాల్భ్యుడు – 'స్వరానికి ప్రాణమే ఆధారం. ప్రాణం వల్లనే స్వరం పుడుతోంది'.

శిలకుడు – 'ప్రాణానికి ఆధారం ఏమిటి?'

దాల్భ్యుడు – 'ప్రాణానికి ఆధారం అన్నమే!'

శిలకుడు – 'అన్నానికి ఆధారం ఏది?'

దాల్భ్యుడు – 'అన్నానికి జలమే ఆధారం!'

శిలకుడు – 'జలానికి ఆధారం ఏమిటి?'

దాల్భ్యుడు – 'జలానికి 'ఆ లోకం" అధారం! ఎందుచేతనంటే ఆ లోకం నుండే వర్షం కురుస్తోంది.'

శిలకుడు – 'ఆ లోకానికి – స్వర్గానికి ఆధారం ఏమిటి?'

దాల్భ్యుడు – 'మనం స్వర్గాన్ని మించి మాట్లాడకూడదు. ఎందుచేతనంటే సామం స్వర్గాన్ని అతిక్రమించరాదు. సామమే స్వర్గమని స్తుతింపబడ్డది కాబట్టి. మనం సామాన్ని గురించి మాత్రమే చర్చిద్దామని అనుకున్నాం కాబట్టి!'

శిలకుడు – 'దాల్భ్యుడా! నీవు చెప్పినట్లు నిజంగానే సామం వరీయ రూపంలో – అత్యం శ్రేష్ఠమైనది – అసమాప్తగతి గలది. సామానికి ఆధారము లేదు. ఆధారం లేని సామానికి ఎవరైనా ఆధారం ఉన్నదని అంటే నిజంగానే అతని తల తెగిపడుతుంది. కాబట్టి నేను అట్లా అనను.'

దాల్భ్యుడు – 'అయితే, ఈ సామానికి ఉన్న ఆధారం నీ ద్వారానే తెలుసుకోవాలని అనుకుంటున్నాను'.

శిలకుడు – 'అట్లాగే అడిగి తెలుసుకో!'

దాల్భ్యుడు – 'అయితే ఆ లోకానికి (ద్యులోకం లేక స్వర్గలోకం) ఆధారం ఏమిటి?'

శిలకుడు – 'ఈ లోకం! ఎందుచేతనంటే, ఈ లోకమే యజ్ఞ యాగాది కర్మల ద్వారా ఆ లోకాన్ని – స్వర్గాన్ని పోషిస్తోంది.

శిలకుడు – 'మరి ఈ లోకానికి ఆధారం ఏమిటి?'

దాల్భ్యుడు – 'సమస్త ప్రాణులు ఈ లోకానికి ఆధారం, ప్రత్యక్షంగా కనిపించే ఈ లోకాన్ని సామం అతిక్రమించకూడదు. సామానికి ఈ లోకం ప్రతిష్ఠ. అందుచేత, సామాన్ని ఈ లోకంలోనే చక్కగా ప్రతిష్ఠిస్తున్నాము – సామం ప్రతిష్ఠ రూపంలోనే స్తుతింపబడుతోంది.'

అప్పుడు, ఈచర్చనంతా వింటున్న జైవలి కుమారుడైన ప్రవాహణుడు శిలకునితో అన్నాడు – 'ఓ శిలకుడా! నీ సామం నిస్సందేహంగా నశ్వరం – పరిమితమైనది. కాబట్టి ఇప్పుడెవడైనా 'నీ తల తెగిపడుతుంది' అని అంటే నిజంగానే తెగిపడి ఉండేది.

శిలకుడు – నేను ఈ విషయం నీవల్ల తెలుసుకోవాలని అనుకుంటున్నాను.

ప్రవాహణుడు – అయితే, అట్లాగే తెలుసుకో!

## తొమ్మిదవ ఖండం

**మం॥ అస్య లోకస్య కా గతిరిత్యాకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశా దేవ సము త్పద్యన్త ఆకాశం ప్రత్యస్తం యన్త్యాకాశో హ్యేవైభ్యో జ్యాయానాకాశః పరాయణమ్. 1**

**స ఏష పరోవరీయానుద్గీథః స ఏషోఽ నన్తః పరో వరీయో హాస్య భవతి పరోవరీయసోహ లోకాంజయతి య ఏతదేవం విద్వాన్ పరోవరీయాగ్ం సముద్గీథ ముపాస్తే. 2**

**తగ్ం హైతమతిధన్వాశౌనక ఉదర శాండిల్యా యోక్త్వో వాచ యావత్త ఏనం ప్రజాయాముద్గీథం వేదిష్య న్తే పరోవరీయో హైభ్యస్తావదస్మింలోకే జీవనం భవిష్యతి. 3**

**తథా ముష్మిన్‌లోకే లోక ఇతి స య ఏతదేవం విద్వానుపాస్తే పరోవరీయ ఏవ హాస్యాస్మింలోకే జీవనం భవతి తథాముష్మింలోకే లోకే లోక ఇతి లోకే లోక ఇతి. 4**

శిలకుడు ఈ విధంగా అడిగాడు – 'ఈ లోకానికి ఆశ్రయం ఏది?' అని. ప్రవాహణుడు ఇందుకు సమాధానం ఇచ్చాడు – 'సర్వాభిన్నమైన ఆకాశం ఈ లోకానికి ఆశ్రయం! అంతటా ఆవరించి ఉన్న ఆకాశం! అంటే పరబ్రహ్మమన్నమాటే. (ఈ ఉపనిషత్తులోనే అ. 8. ఖం. 14. మం. 1 లో ఆకాశమే బ్రహ్మమని చెప్పబడ్డది. అట్లాగే ఇతర ఉపనిషత్తుల్లో, బ్రహ్మసూత్రాల్లో అనంతమైన ఆకాశాన్ని పరబ్రహ్మగా చెప్పారు.) కాబట్టి ఈ లోకానికి పరబ్రహ్మ రూపమైన ఆకాశమే ఆధారం. ఎందుచేతనంటే సమస్త భూతాలు, లోకాలు, సమస్త చరాచర జీవకోటి ఆకాశరూపమైన పరబ్రహ్మ నుండే ఉద్భవించి అందులోనే నివసించి అందులోనే లీనమౌతున్నాయి. పైగా, వీటి అన్నింటికంటె, అన్ని లోకాలకంటె ఆకాశం పెద్దది. కాబట్టి ఆకాశమే వీటికి ఆశ్రయం.

అటువంటి ఈ ఉద్గీథమే – ఆకాశమే అన్నింటిలోకి శ్రేష్ఠమైనది. అందుచేతనే ఇది అనంతమైనది కూడాను. కాబట్టి ఈ ఉద్గీథాన్ని అనంతమైన దానినిగా, పరమాత్మ స్వరూపంగా భావించి ఉపాసించే విద్వాంసుని జీవితం ఉత్తరోత్తరా ఉత్కృష్టతరం (పరోవరీయం) అవుతుంది. అట్లాగే ఆ విద్వాంసుడు ఉత్తరోత్తరా బ్రహ్మాకాశ పర్యంతం ఉన్న లోకాలన్నింటిని జయిస్తాడు.

ఈ ఉద్గీథాన్ని బాగా తెలుసుకొన్న శునకుని కుమారుడైన అతిధన్వుడు తన శిష్యుడైన ఉదరశాండిల్యునితో ఈ ఉద్గీథాన్ని చక్కగా నిరూపించి చెప్పి, యింకా యిట్లా అన్నాడు – 'నీ వంశంలో పుట్టే వారిలో – సంతతిలో ఈ ఉద్గీథాన్ని బాగా తెలుసుకొన్నవారు ఉన్నంతవరకు ఈ లోకంలో వారి జీవనం (ఆ వంశజులందరి జీవనం) ఇతరుల బ్రతుకుకంటె ఉత్కృష్టంగా ఉంటుంది.

అట్లాగే పరలోకాల్లో కూడా ఉత్కృష్టతరమైన లోకాలనే పొందుతారు. ఈ విషయాన్ని – ఈ ఉద్గీథ మాహాత్మ్యాన్ని తెలుసుకొని దానిని ఉపాసించేవానికి నిజంగానే పరలోకాల్లో కూడా ఉత్కృష్టమైన లోకాలే లభిస్తాయి. ఒకదానికంటె ఇంకొక శ్రేష్ఠమైన లోకాన్ని పొందుతాడు. ఇది ఉద్గీథ స్తుతి కోసం చెప్పిన విషయం.

పదవ ఖండం

మం॥ మటచీహతేషు కురుష్వాటిక్యా సహ జాయయోషస్తిర్హ చాక్రాయణ ఇభ్యగ్రామే ప్రద్రాణక ఉవాస. 1

సహేభ్యం కుల్మాషాన్ఖాదంతం బిభిక్షే తగ్ం హోవాచ. నేతోఽన్యే విద్యన్తే యచ్చ యే మ ఇమ ఉపనిహితా ఇతి 2

ఏతేషాం మే దేహీతి హోవాచ తానస్మై ప్రదదౌ హన్తాను పానమిత్యుచ్ఛిష్టం వై మే పీతగ్ం స్యాదితి హోవాచ. 3

న స్విదేతేఽప్యుచ్ఛిష్టా ఇతి న నా ఆజీవిష్య మిమాన ఖాదన్నితి హోవాచ కామో మ ఉదపానమితి. 4

స హ ఖాది త్వాతి శేషాంజాయాయా ఆజహార సాగ్ర ఏవ సుభిక్షా బభూవ తాన్ప్రతిగృహ్య నిదధౌ. 5

స హ ప్రాతః సంజిహాన ఉవాచ యద్వతాన్నస్య లభే మహి లభేమహి ధనమాత్రాగ్ం రాజసౌ యక్ష్యతే స మా సర్వైరార్త్విజ్యై ర్వృణీతేహి. 6

తం జాయోవాచ హన్త పత ఇమ ఏవ కుల్మాషా ఇతి తాన్ఖాదిత్వామముం యజ్ఞం వితతమేయాయ. 7

తత్రోద్గాతృ నాస్తావే స్తోష్యమాణానుపోపవివేశ స హ ప్రస్తోతార మువాచ. 8

ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావ మన్వాయత్తా తాం చేద విద్వాన్ప్రస్తోష్యసి మూర్ధా తే విపతిష్య తీతి. 9

**ఏవమేవోద్గాతార ముపాచోద్గాతర్యా దేవతోద్గీథ మన్వాయత్తా తాం చేదవిద్వా నుద్గాస్యసి మూర్థా తే విపతిష్యతీతి. 10**

**ఏవమేవ ప్రతిహర్తార ముపాచ ప్రతి హర్తర్యా దేవతా ప్రతిహార మన్వాయత్తా తాం చేదవిద్వాన్ప్రతి హరి ష్యసి మూర్థాతే విపతిష్యతీతి తే హ సమారతా స్తూష్ణీ మాసాంచక్రిరే. 11**

చక్రుని కుమారుడైన ఉషస్తికి సంబంధించిన కథను చెపుతున్నారు.

పిడుగుల వర్షంవల్ల ఒకప్పుడు పంటలు వగైరాలు ఏమీ లేకుండా పోయినట్టి కురుదేశంలో, ఒక గ్రామంలో – ఆ గ్రామంలోనే ఏనుగుకు యజమాని అయిన ఒక వ్యక్తి కూడా ఉన్నాడు – చక్రుని కుమారుడైన ఉషస్తి అనే విద్వాంసుడు తన భార్యతో కూడా ఉంటున్నాడు. అతని భార్య స్తనాది స్త్రీ జనోచిత చిహ్నాలుగాని, యౌవన చిహ్నాలుగాని లేని చిన్నపిల్ల. దుర్భిక్షం వల్ల వారి స్థితి దయనీయంగా ఉంది.

ఒకనాడు ఆ గ్రామంలోని ఏనుగుకు యజమానియైన వ్యక్తి, నాసిరకానికి చెందినట్టి (ప్రశస్తమైనవి కానట్టి) మినుములు తింటున్నాడు. (కరువు వల్ల ఇతర ఆహార పదార్థాలేమీ దొరకక) ఉషస్తి అతని వద్దకు పోయి ఆహారం పెట్టమని అడిగాడు. అందుకాతడు 'నా వద్ద ఈ ఎంగిలి మినుములు (సగం తినగా మిగిలినవి) తప్ప ఇంకేమీ లేవు. ఉన్నవేమో నా ముందున్న పాత్రలోనే ఉన్నాయి. కాబట్టి నేనేమి చేయను? నీ కోరిక ఎట్లా తీర్చను?' అన్నాడు.

ఇదివిని ఉషస్తి ఈ విధంగా అన్నాడు. 'నీవద్ద మిగిలి ఉన్నట్టి ఆ మినుములే ఇవ్వు!' అని. ఆ మావటీడు అట్లాగే తన వద్ద ఉన్న మినుములు ఉషస్తికి ఇచ్చాడు. తరువాత తనవద్ద తాను త్రాగగా మిగిలి ఉన్న నీటిని కూడా ఇస్తూ 'ఈ అనుపానాన్ని కూడా స్వీకరించండి' అని అన్నాడు. అందుకు ఉషస్తి ఈ విధంగా అన్నాడు – 'నేను గనక ఈ నీటిని త్రాగితే నిజంగానే ఉచ్ఛిష్టమైన నీటిని త్రాగినవాడినౌతాను' అని.

అందుకా మావటీడు 'అయితే మీరు తినిన మినుములు ఉచ్ఛిష్టం కావా?' అని అడిగాడు. అందుకు ఉషస్తి ఇట్లా సమాధానమిచ్చాడు – 'సోదరా! నేను ఈ మినుములు తినకపోతే బ్రతకను. అందుచేత వీటిని తిని నా ప్రాణాలు నిలుపుకున్నాను. ప్రాణ రక్షణార్థం తిన్నాను. ఇక నీరు అంటావా, ఎప్పుడైనా త్రాగవచ్చు – ఇప్పుడు నీరు త్రాగకపోతే నా ప్రాణం పోదు. ప్రాణ రక్షణార్థం తినిన ఉచ్ఛిష్టం దోషావహం కాదు' అని.

ఉషస్తి ఆ మినుములు తిని, మిగిలినవాటిని వ్యక్తురాలు కాని తన భార్యకోసం తీసుకొని వచ్చాడు. అంతకు పూర్వమే అతని భార్యకు తగినంత ఆహారం లభించినందువల్ల – భర్తమీది ఆదరంతో వాటిని తీసికొని దాచి ఉంచింది.

మరునాడు ఉదయం నిద్ర లేచిన తరువాత ఉషస్తి, భార్య నుద్దేశించి యిట్లా అన్నాడు. "ఈనాడు ఆకలితో ఉన్న మనకు కాస్త ఆహారం లభిస్తే, అది తిని, కాస్త ఓపిక తెచ్చుకొని, ధనం సంపాదించవచ్చు. రాజు యజ్ఞం చేస్తున్నాడు. నాలాంటి విద్వాంసుని తప్పకుండా ఋత్విక్కుగా వరిస్తాడు".

అప్పుడాతని భార్య ఇట్లా అంది. "స్వామీ! నిన్న మీరు ఇచ్చిన మినుములు ఉన్నాయి. వీటిని తీసుకోండి" అని. ఉషస్తి ఆ మినుములు తీసుకొని తిని, రాజు చేస్తున్న యజ్ఞానికి వెళ్ళాడు.

అక్కడకు వెళ్ళి ఆస్థానంలో (ప్రస్తోతలు స్తోత్రం చేసే స్థానం) స్తోత్రం చేస్తున్న ఉద్గాతల సమీపానికి వెళ్ళి ప్రస్తోతతో ఇట్లా అన్నాడు –

(సోమయాగంలో నాలుగు రకాల ఋత్విక్కులు అవసరమౌతారు. ఒక్కొక్క రకానికి – విభాగానికి నలుగురు చొప్పున మొత్తం 16 మంది ఋత్విక్కులు కావాలి. ఉద్గాత, అధ్వర్య, హోత, బ్రహ్మ. ఈ నాలుగూ ఋత్విగ్గణాలు. ఒక్కొక్క గణంలో నలుగురు చొప్పున ఉంటారు. ఉద్గాతృ గణంలో – ఉద్గాత, ప్రస్తోత, ప్రతిహర్త, సుబ్రహ్మణ్య అని ఉంటారు. వీరి ప్రధాన కర్తవ్యం సామగానం చేయటం. ప్రస్తోత మొదటి భాగాన్ని, ఉద్గాత రెండవ భాగాన్ని, ప్రతిహర్త మూడవ భాగాన్ని, సుబ్రహ్మణ్య నాల్గవ భాగాన్ని గానం చేస్తారు. ఈ నలుగురు కలసి ఐదవ భాగం చదువుతారు. పాంచభక్తిక సామం ఈ విధంగా గానం చేస్తారు. ఇక అధ్వర్యు గణంలో అధ్వర్యుడు, ప్రతిప్రస్తాత, నేష్టా, అన్నేష్టా అని నలుగురు ఉంటారు. వీరు యజుర్మంత్రాలు చదువుతూ ఆహుతులిస్తారు. వారే ఆహుతుల్ని తయారు చేస్తారు. ఇక హోతృగణంలో హోత, మైత్రావరుణ, అచ్ఛావాక్, గ్రావస్తుత అనేవారుంటారు. వీరు ఋగ్వేద మంత్రాలు చదువుతారు. బ్రహ్మ విభాగంలో బ్రహ్మ, బ్రాహ్మణాచ్ఛంసి, అగ్నీధ్ర, పోతా అనేవారుంటారు. యజ్ఞం మొత్తాన్ని వీరు పర్యవేక్షిస్తూ, ఏవైనా పొరపాట్లు జరిగినప్పుడు ప్రాయశ్చిత్తాన్ని విధిస్తూ పొరపాట్లను సరిదిద్దుతూ ఉంటారు.)

ఉషస్తి ప్రస్తోతతో ఈ విధంగా అన్నాడు. 'ఓ ప్రస్తోతా! ప్రస్తావ భక్తికి (పాంచ భాక్తిక సామంలోని భాగం) అధిష్ఠాన దైవాన్ని తెలుసుకోకుండా నీవు ప్రస్తావాన్ని – ముందుగా చేసే స్తోత్రాన్ని – పఠిస్తే నీ తల తెగిపడుతుంది. (అంటే జ్ఞానులైనవారు, తెలిసినవారే కర్మలు చేయాలి – అజ్ఞానులకు కర్మాధికారం లేదు. జ్ఞానులున్నచోట, వారిముందు అజ్ఞానులు కర్మ చేయరాదు. జ్ఞానులు లేనప్పుడు వారి పరోక్షంలో అజ్ఞానులు సైతం కర్మలు చేయవచ్చు. జ్ఞానినైన నా ముందు తెలియకుండా, తెలిసినవారి అనుమతి లేకుండా ప్రస్తావాన్ని పఠించటం తప్పు అని భావం.)

ఉషస్తి ఇదేవిధంగా ఉద్గాతతోనూ అన్నాడు – 'ఓ ఉద్గాతా! ఉద్గీథంతో సంబంధం కలిగి ఉన్న దేవతను తెలుసుకోకుండా నీవు ఉద్గానం చేస్తే నీ తల తెగి క్రిందపడుతుంది' అని.

అట్లాగే ప్రతిహర్తతోనూ అన్నాడు – 'ఓ ప్రతిహర్తా! ప్రతి హారాన్ని ఆశ్రయించి ఉండే దేవతను తెలుసుకోకుండా ప్రతిహరణ గానం చేస్తే నీ తల తెగి పడుతుంది' అని. ఇది విని ప్రస్తోత మొదలైన వారంతా తమ తల తెగి పడిపోతుందేమోననే భయంతో తమ తమ కర్మలు మాని కూర్చున్నారు.

## పదునొకండవ ఖండం

**మం॥ అథ హైనం యజమాన ఉవాచ భగవన్తం వా అహం వివిదిషాణీత్యుషస్తి రస్మిచాక్రాయణ ఇతిహోవాచ 1**

**స హోవాచ భగవంతం వా అహమేభిః సర్వైరార్త్వి జ్యైః పర్యైషిషం భగవతో వా అహమ విత్త్యాన్యాన వృషి. 2**

**భగవాగ్ం స్త్వేవ మేస ర్వైరార్త్విజ్యైరితి తథేత్యథ తర్హ్యేత ఏవ సమతిసృష్టాఃస్తువతాం యావత్త్వేభ్యో ధనం దద్యాస్తావన్మమ దద్యా ఇతి తథేతి హ యజమాన ఉవాచ. 3**

యజమానుడైన రాజుకు, ఉషస్తికి జరిగిన సంవాదం –

తరువాత యజమానుడైన రాజు ఉషస్తితో – 'ఓ దేవా! మిమ్మల్ని గురించి తెలుసుకోవాలని అనుకుంటున్నాను' అన్నాడు. అందుకు ఉషస్తి ఇట్లా అన్నాడు – 'రాజా! నేను చక్రుని కుమారుణ్ణి. నా పేరు ఉషస్తి అని.

అది విని యజమానుడైన రాజు ఇట్లా అన్నాడు – 'స్వామీ! ఈ ఋత్విక్కర్మలన్నీ నిర్వహించేందుకు మీకోసం వెతికించాను. తాము మాకు లభించనందున ఇతరులైన వీరిని ఋత్విగ్గణంగా వరించాను. ఇప్పుడు మీరే సమస్త ఋత్విక్కర్మలను నిర్వహించే భారం వహించండి' అని.

ఇది విని ఉషస్తి – 'సరే! అట్లాగే కానీయండి. ఈ ఋత్విగ్గణమంతా సంతోషంతో నా ఆజ్ఞను పొంది స్తోత్రం చేయాలి. బాగా జ్ఞాపకం ఉంచుకోండి. ఈ ప్రస్తోత మొదలుగాగల ఋత్విక్కులందరికి ఎంత ధనం ఇస్తారో అంత ధనం (దక్షిణ) నాకు ఇవ్వాలి' అన్నాడు. అందుకు రాజు సమ్మతించాడు.

**మం॥ అథ హైనం ప్రస్తోతోపససాద ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావమన్వాయత్తా తాం చేదవిద్వాన్ప్రస్తోష్యసి మూర్థాతే విపతిష్యతీతి మా భగవానవోచత్కతమా నా దేవతేతి. 4**

తరువాత ప్రస్తోత వినమ్రభావంతో ఉషస్తి వద్దకు వచ్చి అన్నాడు – "తమరు నాతో – 'ఓ ప్రస్తోతా! ప్రస్తావాన్ని అనుగమించే దేవతను తెలుసుకోకుండా ప్రస్తావం చేస్తే నీ తల తెగిపడుతుంది' అని అన్నారు గదా! కాబట్టి ప్రస్తావ భక్తితో అనుగతమై ఉండే దేవత ఎవరో చెప్పండి" అని.

**మం॥ ప్రాణ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభి సంవిశన్తి ప్రాణమభ్యుజ్జిహతే సైషా దేవతా ప్రస్తావ మన్వాయత్తా తాం చేద విద్వాన్ప్రస్తోష్యో మూర్ధా తే వ్యపతిష్యత్తథోక్తస్య మయేతి** **5**

ఉషస్తి సమాధానమిచ్చాడు – 'ఆ దేవత ప్రాణం! ఎందుచేతనంటే, సమస్త చరాచరభూత సంఘాతమూ ప్రళయ కాలంలో ప్రాణంలోనే ప్రవేశించి, ఉండి, మళ్ళీ సృష్టి సమయంలో ప్రాణం నుండే పుడతాయి. అందుచేత ఈ ప్రస్తావంలో అనుగతమై ఉండేది ఆ ప్రాణ దేవతయే! నీవు ఈ విషయం తెలుసుకోకుండా ప్రస్తావభక్తిని గానం చేసి ఉంటే నీ తల తెగి పడి ఉండేది' అని.

**మం॥ అథ హైవముద్గాతోపససాదోద్గాతర్యా దేవతోద్గీథ మన్వాయత్తా తాం చేదవిద్వానుద్గాయస్యసి మూర్ధాతే విపతిష్యతీతి మా భగవానవో చత్కతమా సా దేవ తేతి.** **6**

తరువాత ఉద్గాత ఉషస్తి వద్దకు వెళ్ళి అడిగాడు – 'స్వామీ! తాము నాతో ఉద్గీథంలో అనుగతమై ఉండే దేవతను తెలుసుకోకుండా ఉద్గానం చేస్తే తల తెగిపడుతుందని అన్నారు గదా! మరి ఉద్గీథంలో అనుగతమై ఉండే దేవత యెవరు?' అని.

**మం॥ ఆదిత్య ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాన్యాదిత్యముచ్చైః సన్తం గాయన్తి సైషా దేవతోద్గీథ మన్వాయత్తాతాం చేదవిద్వానుద్గాయస్యో మూర్ధా తేవ్యపతిష్యత్తథోక్తస్య మయేతి.** **7**

అందుకు ఉషస్తి ఈ విధంగా సమాధానమిచ్చాడు – "ఆదిత్యుడు! ఉద్గీథంతో అనుగతమై ఉండే దేవత ఆదిత్యుడు! ఈ సమస్త చరాచర జీవజాలమంతా పైన ఉండే ఆ ఆదిత్యుని గూర్చే గానం చేస్తూ ఉంటుంది. ఆ ఆదిత్యుడే ఉద్గీథంలో ఉండే దేవత. ఈ విషయం తెలుసుకోకుండా నీవు ఉద్గీథాన్ని గానం చేసి ఉంటే నిజంగానే నీ తల తెగిపడి ఉండేది'.

**మం॥ అథ హైనం ప్రతిహర్తోపససాద ప్రతిహర్తర్యా దేవతా ప్రతిహార మన్వాయత్తా తాం చేదవిద్వాన్ప్రతి హరి ష్యసి మూర్ధాతే విపతిష్యతీతి మా భగవానవోచ త్క తమా సా దేవ తేతి.** **8**

పిమ్మట ప్రతిహర్త ఉషస్తి వద్దకు వచ్చి ఈ విధంగా అడిగాడు – 'స్వామీ! తాము నాతో ప్రతిహారంతో అనుగతమై ఉండే దేవతను తెలుసుకోకుండా ప్రతిహరణం గనక చేస్తే నీ తల తెగిపడుతుందని అన్నారు గదా! ఆ ప్రతిహారంలో అనుగతమై ఉండే దేవత ఎవరు?'

**మం॥ అన్నమితి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతా న్యన్నమేన ప్రతిహరమాణాని జీవన్తి సైషా దేవతా ప్రతిహారమన్వాయత్తా తాం చేదవిద్వాన్ప్రత్యహరిష్యో మూర్ధా తే వ్యపతిష్యత్తథోక్తస్య మయేతి తథోక్తస్య మయేతి.** **9**

ఈ విధంగా అడిగిన ప్రతిహర్తతో ఉషస్తి అన్నాడు – 'ప్రతి హారంలో అనుగతమై ఉండే దేవత అన్నం! ఎందుచేతనంటే సమస్త చరాచర ప్రాణులు అన్నాన్ని ప్రోగుచేసుకుంటూ జీవిస్తున్నాయి. కాబట్టి ఈ అన్నమే ప్రతిహారాన్ని అనుగమించే దేవత. నీవు ఈ విషయం తెలుసుకోకుండా ప్రతిహరణం చేసి ఉంటే నీ తల తెగిపడి ఉండేది.'

(సారాంశమేమంటే ప్రతి మంత్రానికి, ప్రతి కార్యానికి ఒక అధిష్ఠానదేవత ఉంటుందని, ఆ మంత్రార్థము ఆ అధిష్ఠాన దేవతను గుర్తించకుండా తెలుసుకోకుండా చేసే కర్మగాని, ఉపాసన గాని ఫలించదని పైగా ఒక్కొక్కప్పుడు ఆ ఉపాసన విరుద్ధఫలాన్ని కూడా కల్పిస్తుందని భావం. అంతేకాక ఋత్విక్కులను నియమించేటప్పుడు సర్వశక్తి సంపన్నులు విద్వాంసులు అయినవారిని నియమించుకోవాలి. ప్రస్తావానికి ప్రాణము, ఉద్గీథానికి ఆదిత్యుడు, ప్రతిహారానికి అన్నము అధిష్ఠాన దేవతలని తెలిసింది).

**పంద్రెండవ ఖండం**

(ప్రతిహారానికి అన్నం అధిష్ఠానదేవత అని చెప్పారు. ఇక అన్నప్రాప్తి కోసం కుక్కల ద్వారా దర్శింపబడ్డ ఉద్గీథాన్ని ఆరంభిస్తున్నారు. వెనుకటి ఖండంలో పిడుగుల వర్షంవల్ల ఏర్పడ్డ దయనీయమైన కరువు పరిస్థితిని వివరించారు గదా! అటువంటి పరిస్థితులు ఏర్పడకుండా ఉండటం కోసం, అన్నం లభించటం కోసం ఈ ఉద్గీథం ఆరంభిస్తున్నారు).

**మం॥ అథాతః శౌవ ఉద్గీథ స్తద్ధ బకో దాల్భ్యో గ్లావో వా మైత్రేయః స్వాధ్యాయ ముద్వ్రాజ. 1**
**తస్మై శ్వా శ్వేతః ప్రాదుర్బభూవ తమన్యే శ్వాన ఉపసమేత్యోచు రన్నంనో భగవా నాగాయత్వశనా మాయ వా ఇతి. 2**
**తాన్హోవాచేహైవ మా ప్రాతరుపసమీయాతేతి తద్ధ బకో దాల్భ్యో గ్లావో వా మైత్రేయః ప్రతిపాలయాం చకార. 3**
**తే హ యథై వేదం బహిష్పవమానేన స్తోష్యమాణాః సంరబ్ధాః సర్పన్తీత్యేవమాస సృపుస్తే హ సముపవిశ్య హిం చక్రుః 4**

పూర్వకాలంలో దల్భపుత్రుడైన బకుడు లేదా మిత్రాకుమారుడైన గ్లావుడు (బకుడు, గ్లావుడు ఇద్దరు ఒకటే! బకునికే ఉన్న రెండు పేర్లు. రెండు గోత్రాలకు కర్త అయినందున రెండు పేర్లు వచ్చి ఉంటాయి. జనక, దత్తత పేర్లు లాగా) స్వాధ్యాయం కోసం – వేదపఠన నిమిత్తం – ఏకాంత ప్రదేశంలో ఉన్న ఒక జలాశయం వద్దకు వెళ్ళాడు.

అతని స్వాధ్యాయానికి సంతుష్టి చెందిన ఒక దేవత లేక ఋషి తెల్లని కుక్క ఆకారాన్ని దాల్చి ప్రత్యక్షమైంది. ఆ కుక్క వద్దకు కొన్ని యితర కుక్కలు వచ్చి యిట్లా అన్నాయి – 'ఓ స్వామీ! మీరు మా కోసం అన్నాన్ని ఆగానం చేయండి. నిజంగానే మేము ఆకలిగా ఉన్నాం' అని.

అప్పుడా చిన్న కుక్కలతో తెల్లని కుక్క ఇట్లా అన్నది – 'రేపు ఉదయం మీరు నేను ఉన్నట్టి ఈ ప్రదేశానికే రండి' అని. అవి అట్లాగే వచ్చాయి. అవి వచ్చేటప్పటికి (బకుడు లేదా గ్లావుడు) అనే ఋషి రూపంలో ఆ కుక్కల కోసం ప్రతీక్షిస్తున్నాడు – తెల్లని కుక్కగా ప్రత్యక్షమైన ఋషి.

ఆ ఇతర కుక్కలు ఆ ఋషి వద్దకు వచ్చి యజ్ఞకర్మలో బహిష్పవమానస్తోత్రంతో స్తవనం చేసే (స్తుతించే) ఉద్గాతలలాగానే కుక్కలు ఒకదాని తోక ఒకటి నోటితో పట్టుకొని తిరిగినాయి. తరువాత అక్కడ కూర్చుని హింకారం చేశాయి.

(యాగంలో ఉద్గాతలు – అధ్వర్యుడు మొదలుకొని యజమాని వరకు – ఋత్విక్కులంతా ముందున్న వాని ఉత్తరీయాన్ని వెనుకనున్నవాడు పట్టుకొని ఈ బహిష్పవమాన స్తోత్రాన్ని చదువుతారు. ఈ స్తోత్ర మంత్రాలు సోమలత నుండి సోమాన్ని తీసేటప్పుడు – యాగం చివరి రోజున చదువుతారు. హింకారమనేది ఒక స్తోభాక్షరం. పాంచభక్తిక సామంలో మొదటిది. దీనిని గురించిన వివరాలు ముందు వస్తాయి).

**మం॥ ఓ3 మదా3 మోం3 పిబా3 మోం3 దేవో వరుణః ప్రజాపతిః సవితా2 న్నమిహా2, హారదన్న పతేఽన్న మిహా2 హరా2 హరో3 మితి.** **5**

(మూలంలో ఉన్న 2,3 అంకెలు అచట ఉచ్చారణలో తీసికోవలసిన దీర్ఘప్లుతాలను సూచిస్తాయి.)

ఓం మేము తింటున్నాం. ఓం మేము త్రాగుతున్నాం. ఓం దేవతలు – వరుణుడు, ప్రజాపతి, సూర్యుడు మాకోసం అన్నాన్ని యిక్కడకు తెత్తురుగాక. ఓ అన్నపతీ! (అన్ని విధాలైన అన్నాలకు జనకుడు కాబట్టి అన్నపతి; అన్నివిధాలైన అన్నాలకు ప్రభువు కాబట్టి సూర్యుడు అన్నపతి; సూర్యుడు లేకపోతే వరుణుడు వర్షాన్ని యివ్వలేడు. ప్రజాపతి జీవరాశుల్ని పోషించలేడు) ఓ సూర్యుడా! మాకోసం అన్నాన్ని యిక్కడకు తీసికొనిరా! అన్నాన్ని తీసికొని రా! (అన్నాన్ని తీసికొని రమ్మని రెండుసార్లు అనటంలో వాటి తీవ్రకాంక్ష ఆదుర్దా వ్యక్తమౌతాయి).

## పదమూడవ ఖండం

**మం॥ అయం వావ లోకో హాఉకారో వాయుర్హా ఇకార శ్చంద్రమా అథకారః ఆత్మేహకారోఽగ్నిరీకారః** **1**

**ఆదిత్య ఊకారో నిహవ ఏకారో విశ్వేదేవా ఔహోయిఽకారః ప్రజాపతిర్హింకారః ప్రాణః స్వరోఽన్నం యా వాగ్విరాట్.** **2**

**అనిరుక్తస్త్రయోదశః స్తోభః సంచరో హుంకారః** **3**

**దుగ్ధేస్మై వాగ్దోహం యోవాచో దోహోऽన్నవాన న్నాదో భవతి య ఏతామేవగ్ం సామ్నా ముపని షదం వేదోపనిషదం వేదేది. 4**

ఈ ఖండంలో సామానికి అవయవాలైన స్తోభాక్షరాలను ఉపాసించటం చెపుతున్నారు.

ఈ లోకమే రథన్తర సామంలో ప్రసిద్ధమైనట్టి 'హాఉ' కారస్తోభం. వాయువు 'హాఇ' కారం. చంద్రుడు 'అథ' కారం. ఆత్మ 'ఇహ' కారం. అగ్ని 'ఈ' కారం.

(ఋక్ మంత్రాలే సామానికి ఉపయోగిస్తాయని లోగడ తెలుసుకున్నాం – యజ్ఞయాగాది క్రతువుల్లోను, కర్మకాండల్లోనూను. అయినప్పటికి కొన్ని అక్షరాలు హై, హౌ లాంటివి, అర్థం లేకపోయినా సామగానాన్ని పూరించటానికి ఇవి ఉపయోగిస్తాయి. వీటినే స్తోభాక్షరాలంటారు. అయితే ఈ స్తోభాక్షరాలు మనం కోరిన కోరికలు సిద్ధించాలంటే చాలా అవసరం. రథంతరసామాన్ని పృథివితో సమానంగా శ్రుతిలో పేర్కొన్నట్లు భాష్యంలో ఉంది. ఈ మంత్రంలో రథంతర సామాన్ని గానం చేయటానికి 'హౌఉ' అనే స్తోభాక్షరాన్ని చెప్పారు. కాబట్టి 'హౌఉ' అనే స్తోభాన్ని భూమిగా భావించి ఉపాసించాలి. వాయువుగా చెప్పబడిన 'హాఇ' కారం వామదేవసామంలో ప్రసిద్ధమైంది. వాయువును హైకారంగా భావించి ఉపాసించాలి. అట్లాగే 'అథ' కారాన్ని చంద్రునిగా భావించి ఉపాసించాలి – ఈ భూమికి అన్నం ఆధారం. అన్నానికి కారకుడు చంద్రుడు కాబట్టి, ఆత్మను 'ఇహ' కారంగా అగ్నిని 'ఈ' కారంగా భావించి ఉపాసించాలి. ఈ కారస్తోభ కలిగిన సామ మంత్రాలన్నీ అగ్నిని స్తుతించేవే!)

ఆదిత్యుడు ఊ కారం. నివహం (ఆహ్వానం) 'ఏ' కారం. విశ్వే దేవతలు 'ఔహోఇ' కారం. ప్రజాపతి హింకారం. ప్రాణము స్వరం. (స్వరం కూడా ఒక స్తోభమే, అన్నం 'యా' కారం. విరాట్ వాక్కు (ఈ వాక్‌స్తోభం అనేది విరాజసామంలో వస్తుంది – విరాట్ స్తుతి నిమిత్తం).

అవ్యక్తమైనందువల్ల, నిరూపించటానికి వీలులేనందువల్లను, కార్యరూపంలో మాత్రం సంచరించేటటువంటి పదమూడవ స్తోభం హుఙ్కారం. ఈ సృష్టికి అవ్యాకృతం కారణమైనట్లే ఈ హుఙ్కారస్తోభం కూడా అవ్యాకృతమైనదే!

ఈ విధమైన సామానిక అవయవ రూపంగా ఉండే స్తోభాక్షరాలకు సంబంధించిన ఉపనిషత్తును తెలుసుకొన్నవానికి వాగ్దేవత. ఆ వాక్కుకు ఫలమైన దుగ్ధాన్ని ఇస్తుంది. (ఈ అధ్యాయంలో ఖండం 3లో 7వ మంత్రం చూడండి) అటువంటివాడు అన్నవంతుడు, అన్నభక్షకుడు అవుతాడు. ఇది ఫలశ్రుతి.

ఇంతవరకు చెప్పుకొన్న స్తోభాక్షర ప్రతీకలు, తదధిష్ఠానాలు, ఈ విధంగా ఉన్నాయి.

| స్తోభాక్షరాలు | అధిష్ఠానాలు |
|---|---|
| 1. హా ఉకారం | ఈ లోకం |
| 2. హా ఇకారం | వాయువు |
| 3. అథకారం | చంద్రుడు |
| 4. ఇహకారం | ఆత్మ |
| 5. ఈకారం | అగ్ని |
| 6. ఊకారం | ఆదిత్యుడు |
| 7. ఏకారం | వివహం (ఆహ్వానం) |
| 8. ఔహో ఇకారం | విశ్వేదేవతలు |
| 9. హింకారం | ప్రజాపతి |
| 10. స్వరం | ప్రాణం |
| 11. యా | అన్నం |
| 12. వాక్ | విరాట్ |
| 13. హుఙ్కారం | అవ్యాకృతం |

# రెండవ అధ్యాయం

## మొదటి ఖండం

**మం॥ ఓం సమస్తస్య ఖలు సామ్న ఉపాసనగ్ం సాధు యత్ఖలు సాధు తత్సామే త్యాచక్షతే యదసాధు తద సామేతి 1**

**తదుతాప్యాహుః సామ్నైనముపాగాదితి సాధునైన ముపాగాదిత్యేవ తదా హురసామ్నైన ముపాగాదిత్యసాధు నైన ముపాగాది త్యేవ తదాహుః 2**

**అథోతాప్యాహుః సామ నో బతేతి యత్సాధు భవతి సాధు బతేత్యేవ తదాహురసామ నో బతేతి యద సాధుభవత్య సాధు బతేత్యేవ తదాహుః 3**

**స య ఏత దేవం విద్వాన్సాధు సామేత్యుపాస్తేஉ భ్యాశో హ య దేవగ్ం సాధవో ధర్మా ఆ చ గచ్ఛేయురుప చ న మేయుః 4**

సమస్త అవయవములతో గూడిన సామాన్ని సాధు దృష్టితో (ఉత్తమము, శ్లాఘనీయము, శుభము అనే దృష్టితో) ఉపాసించటాన్ని చెపుతున్నారు.

ఓంకారంతో ఆరంభిస్తున్నారు – ఓంకారోపాసన బహుళమైన ఫలితాన్ని ఇస్తుంది కాబట్టి. పాంచభక్తిక, సాప్తభక్తికంతో కూడిన సంపూర్ణమైన సామోపాసన ఉత్తమమైనది (సాధువు). ఏది సాధువో (ఉత్తమమో, శ్లాఘనీయమో) అదే సామము. ఏది అసాధువో అది సామం కాదు. మొత్తం సామాన్ని అంతను గ్రహించాలి. అంతేగాని అందలి భాగాల్ని కాదు. ఈ విషయాన్నే సామవిదులైనవారు చెపుతున్నారు.

ఈ విషయాన్నే విపులీకరించాలంటే, 'ఫలానావాడు రాజు మొదలైనవారి వద్దకు సామరూపంతో వెళ్ళాడు' అని అన్నప్పుడు సామరూపము అంటే ఉత్తమమైన రూపం అనే అర్థం వస్తుంది. సాధుభావంతో మంచి భావంతో వెళ్ళాడనే అర్థం వస్తుంది. ఇందుకు భిన్నంగా 'ఫలానావాడు అసామ రూపంతో వెళ్ళాడు' అని అన్నప్పుడు అశుభకరమైన రూపంతో వెళ్ళాడు అని అన్నప్పుడు అశుభకరమైన రూపంతో, చెడ్డరూపంతో వెళ్ళాడు అనే అర్థం వస్తుంది.

అట్లాగే, 'మాకు సామం కలిగింది' అంటే, 'మాకు శుభం కలిగింది' అనే అర్థం లేదా 'మేలు కలిగింది' అనే అర్థం వస్తుంది. అట్లాగే 'మాకు అసామం కలిగింది' అంటే 'అనర్థం కలిగింది' అని, లేదా 'కీడు కలిగింది' అని అర్థం. కాబట్టి సామం అనేది సాధు శబ్దానికి సమానార్థకమైనది.

ఈ విషయానికి ఈ విధంగా అంటే, సామం అంటే సాధువు అని తెలుసుకొని ఉపాసన చేసేవాని వద్దకు శాస్త్రసమ్మతమైన సాధుధర్మం (ఉత్తమ ధర్మం) శీఘ్రంగా వస్తుంది – మంచి ధర్మాలు అతనికి లభిస్తాయి. అతని ముందు ఆ సద్గుణాలన్నీ సతమౌతాయి – అవి అతనికి అనుభవించటానికి వీలైనవి అవుతాయి.

## రెండవ ఖండం

**మం॥ లేకేషు పంచవిధగ్ం సామోపాసీత పృథివీ హింకారః అగ్నిః ప్ర స్తావోఽ న్తరిక్షముద్గీథ ఆదిత్యః ప్రతిహారో ద్యౌర్నిధనమిత్యూర్ధ్వేషు. 1**

**అథావృత్తేషు ద్యౌర్హింకార ఆదిత్యః ప్రస్తావోఽ న్తరిక్షఽ ముద్గీథోఽ గ్నిః ప్రతిహారః పృథివీ నిధనమ్. 2**

**కల్పన్తేహాస్మై లోకా ఊర్ధ్వశ్చావృత్తాశ్చ య ఏత దేవం విద్వాంల్లోకేషు పంచవిధం సామోపాస్తే. 3**

లోకదృష్టితో అయిదు విధాలైన సామాల్ని ఉపాసించాలి. ఈ భూమి హింకారం. అగ్ని ప్రస్తావం. అంతరిక్షం ఉద్గీథం. ఆదిత్యలోకం ప్రతిహారం. ద్యులోకం నిధనం. ఈ విధంగా అయిదు విధాలైన సామాల్ని అయిదు లోకాలుగా భావించి ఉపాసించాలి. వీటిలో ఉన్న సామ్యం – పోలికను వివరిస్తున్నారు – హింకారం పృథివి; ఈ రెండూ మొదటి వవటం వీటిలోని సామ్యం – పోలికను వివరిస్తున్నారు – హింకారం పృథివి; ఈ రెండూ మొదటి వవటం వీటిలోని సామ్యం. అగ్నిలోనే అన్ని కర్మలు నిర్వహింపబడటం (ప్రస్తూయంతే) ప్రస్తావానికి పేరులో వున్న సామ్యం. గగనం (అంతరిక్షం) లోను, ఉద్గీథంలోను గకార సామ్యం. ఆదిత్యుడు – ప్రతిహారంలో సూర్యుడు ప్రతివానికి యెదురుగా ఉన్నట్లు కనపడటం సామ్యం. ద్యులోకం (స్వర్గం) నిధనం – ఇక్కడ నుండి చనిపోయి స్వర్గంలో (నిధీయన్తే) స్థిరపడటం అనేది సామ్యం. ఇదంతా ఊర్ధ్వ లోకదృష్టి. క్రిందినుండి పైకి.

అథోలోకాలతోడి సారూప్యంతో సామోపాసనను చెపుతున్నారు. ఇపుడు పై నుండి క్రింది లోకాలకు. ద్యులోకం హింకారం. ఆదిత్యలోకం ప్రస్తావం. అంతరిక్షలోకం ఉద్గీథం. అగ్ని ప్రతిహారం. పృథివి నిధనం. ఇందులో చెప్పినది జీవులు పై నుండి క్రిందికి దిగివచ్చే క్రమం.

ఈ విధమైన ఉపాసనను తెలుసుకొన్నవాడు, లోకాల్లో అయిదు విధాలైన సామాలను ఆరోపించుకొని ఉపాసన చేస్తాడు. అతనికి ఊర్ధ్వ ముఖంగానూ, అధోముఖంగా ఉన్న లోకాలన్నీ భోగ్యరూపాలవుతాయి – అనుభవించటానికి తగినవిగా అవుతాయి.

## మూడవ ఖండం

**మం॥ వృష్టౌ పంచవిధగ్ం సామోపాసీత పురోవాతో హిం కారో మేఘో జాయతే స ప్రస్తావో వర్షతి స ఉద్గీథో విద్యోతతే స్తనయతి స ప్రతిహారః ఉద్గృహ్ణాతి తన్ని ధనం.** 1

**వర్షతి హాస్మై వర్షయతి హ య ఏత దేవం విద్వా న్వృష్టౌ పంచవిధగ్ం సామోపాస్తే** 2

ఈ పంచవిధ సామాన్ని వృష్టి (వాన)లో ఆరోపించుకొని ఉపాసించటాన్ని వివరిస్తున్నారు.

సృష్టికి పూర్వం వీచే గాలిని హింకారంగా భావించవచ్చు. మేఘం ఉత్పన్నమవటమే ప్రస్తావం. మేఘం వర్షించటమనేది శ్రేష్ఠత్వం కారణంగా ఉద్గీథం. ఉరుములు, మెరుపులు ధ్వనిచేయటం ఇవన్నీ ప్రతిహారంగా భావించవచ్చు.

మేఘం నీటిని మనం గ్రహించటమనేది – అంటే నీరు వినియోగింపబడటమనేది నిధనం. ఈ విధంగా తెలుసుకున్నవాడు వృష్టితో పంచవిధ సామాలను భావించి ఉపాసిస్తాడు. అతనికి వృష్టి లభిస్తుంది. తాను స్వయంగా వాన కురిపించుకోగలడు.

నాల్గవ ఖండం

**మం॥ సర్వాస్వప్సు పంచవిధగ్ం సామోపాసీత మేఘో యత్సంప్లవతే స హింకారో యద్వర్షతి స ప్రస్తావో యాః ప్రాచ్యః స్యన్దన్తే స ఉద్గీథో యాః ప్రతీచ్యః స ప్రతిహారః సముద్రో నిధనం.** 1

**న హాప్సు ప్రైత్యప్సుమాన్భవతి య ఏతదేవం విద్వా న్సర్వాస్వప్సు పంచ విధగ్ం సామోపాస్తే.** 2

అన్ని విధాలైన జలాలలోను పంచవిధ సామాన్ని ఆరోపించుకొని ఉపాసించాలి. మేఘం ఘనీభవించటమనేది హింకారం. అది (మేఘం) వర్షించటమే ప్రస్తావం. నదులుగా పూర్వదిక్కుకు ప్రవహించటమే ఉద్గీథం. నదులు కొన్ని పడమటి దిక్కుకు ప్రవహించటమనేది ప్రతిహారం. ఈ నదులలోని ఇంకా ఇతరమైన నీరంతా సముద్రంలో లయమౌతాయి కాబట్టి సముద్రం నిధనం.

ఇది తెలిసినవాడు అన్ని రకాలైన జలాల్లోను పంచవిధ సామాన్ని ఉపాసిస్తాడు. అతడు కోరుకుంటే తప్ప నీటిలో చనిపోవటమనేది ఉండదు. అతడు సమృద్ధిగా జలంతో కూడినవాడౌతాడు – నీటికి కరువు ఉండదు.

## ఐదవ ఖండం

**మం॥ ఋతుషు పంచవిధగ్ం సామోపాసీత వసంతో హింకారోఽ గ్రీష్మః ప్రస్తావో వర్షా ఉద్గీథః శరత్ప్రతి హారో హేమన్తో నిధనం.**

1

కల్పన్తే హాస్మా ఋతవ ఋతుమాన్భవతి య ఏతదేవం విద్వానృతుషు పంచవిధగ్ం సామోపాస్తే. 2

ఋతువులలో పంచవిధ సామాన్ని ఉపాసించాలి. వసంతర్తువు హింకారం – మొదటిది కాబట్టి. గ్రీష్మర్తువు ప్రస్తావం. (వర్షాకాలానికి అన్న సంగ్రహం కోసం ప్రస్తావం చేస్తారు కాబట్టి) ప్రాధాన్యం కారణంగా (అన్నోత్పత్తికి ప్రాణి జీవనానికి ఆధారం కాబట్టి) వర్షర్తువు ఉద్గీథం. శరదృతువు ప్రతిహారం (రోగులను, చనిపోయినవారిని తీసికొనిపోతారు) హేమన్త ఋతువు నిధనం – జీవులు గాలిలేని చోటును ఆశ్రయిస్తారు కాబట్టి. (మామూలుగా మనం ఆరు ఋతువులను చెప్పుకుంటాం. కాని హేమంత శిశిర ఋతువులను శ్రుతులలో చాలాచోట్ల ఒకటిగానే పరిగణించారు. ఋతువులను 5 గానే భావించారు. ప్రశ్నోపనిషత్తు – 1 – (11)

ఈ విధంగా తెలుసుకొని ఋతువులలో పంచవిధసానాన్ని ఉపాసించేవానికి ఋతువులు తమకు అనురూపమైన భోగాల్ని ఇస్తాయి – ఉపాసకుడు ఆయా ఋతువులలో లభించే భోగాలను అనుభవిస్తాడు.

ఆరవ ఖండం

మం॥ పశుషు పంచవిధగ్ం సామోపాసీతాజా హింకారోఽ వయః ప్రస్తావో గావ ఉద్గీథో శ్వాః ప్రతిహారః పురుషో నిధనమ్.

1

భవన్తి హాస్య పశవః పశుమాన్భవతి య ఏతదేవం విద్వాన్పశుషు పంచవిధగ్ం సామోపాస్తే. 2

పశువుల్లో అయిదు విధాలైన సామాల్ని ఉపాసించాలి. మేకలు హింకారం. గొఱ్ఱెలు ప్రస్తావం. సర్వశ్రేష్ఠమైన ఆవులు ఉద్గీథం. భారవహనం చేస్తాయి కాబట్టి గుఱ్ఱాలు ప్రతిహారం. వీటి అన్నింటికి ఆశ్రయమైనవాడు మానవుడు నిధనం.

ఈ విషయం తెలిసినవాడు పశువుల్లో పంచవిధసామాన్ని ఉపాసిస్తాడు. అట్లా ఉపాసించిన వానికి పశుసంపద లభిస్తుంది. పశువులవల్ల కలిగే భోగం, వాటితోపాటు దానాది గుణాలు కలవాడు అవుతాడు.

## ఏడవ ఖండం

**మం॥ ప్రాణేషు పంచవిధగ్ం పరోవరీయః సామోపాసీత ప్రాణో హింకారో వాక్ప్రస్తావశ్చక్షురుద్గీథః శ్రోత్రం ప్రతిహారో మనో నిధనం పరోవరీయాగ్ం సి వా ఏతాని. 1**

**పరోవరీయో హాస్య భవతి పరోవరాయసో హ లోకాం జయతి య ఏతదేవం విద్వాన్ ప్రాణేషు పంచవిధగ్ం పరోవరీయః సామోపాస్త ఇతి తు పంచవిధస్య. 2**

ప్రాణాల్లో పంచవిధ సామాన్ని ఆరోపించి ఉపాసించటం చెపుతున్నారు. ప్రాణాల్లో అయిదు విధాలైన పరోవరీయ – ఉత్తరోత్తర ఒక దానికంటె ఒకటి శ్రేష్ఠమైన గుణాలు కలిగినట్టి – ప్రాణ దృష్టితో కూడిన సామాన్ని ఉపాసించాలి. ఈ ప్రాణాల్లో (ఇంద్రియాల్లో) ఘ్రాణేంద్రియం హింకారం. దానికంటె శ్రేష్ఠమైన వాక్కు ప్రస్తావం – వాక్కుతోనే అన్నింటి ప్రస్తావము చేయబడుతుంది. చక్షుస్సు ఉద్గీథం. వాక్కుకంటె కండ్లు అధికమైన విషయాల్ని ప్రకాశింపచేస్తుంది కాబట్టి శ్రేష్ఠతరము. శ్రోత్రం ప్రతిహారం. అన్నివైపుల నుండి వచ్చే శబ్దాల్ని గ్రహిస్తుంది. నేత్రం ఒకే దిక్కును ప్రకాశింప చేస్తుంది. కాబట్టి నేత్రంకంటె శ్రోత్రం శ్రేష్ఠతరము. మనస్సు నిధనం. ఇంద్రియాలవల్ల లభించే విషయాలన్నీ మనస్సులో చేరతాయి కాబట్టి ఈ విధంగా యివి ఉత్తరోత్తరా శ్రేష్ఠమైనవి – పరోవరీయాలు.

## పాంచ భక్తిక సామోపాసన పట్టిక

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉపాసనా దృష్టి | హింకారం | ప్రస్తావం | ఉద్గీథం | ప్రతిహారం | నిధనం |
| లోకాలు ఊర్ధ్వదృష్టి | పృథివి | అగ్ని | అంతరిక్షం | ఆదిత్య | ద్యులోకం |
| లోకాలు నిమ్న దృష్టి | ద్యులోకం | ఆదిత్య | అంతరిక్షం | అగ్ని | పృథివి |
| వృష్టి | సృష్టికి పూర్వవాయువు | మేఘోత్పత్తి | వర్షించటం | మెరపులు | జలగ్రహణం |
| జలం | మేఘం ఘనీభవించటం | వర్షించటం | నదులు తూర్పు దిక్కుకు ప్రవహించటం | నదులు పశ్చిమ దిక్కుకు ప్రవహించటం | సముద్ర గమనం |
| ఋతువులు | వసంతం | గ్రీష్మం | వర్షర్తువు | శరత్తు | హేమంతం |
| పశు | మేకలు | గొఱ్ఱెలు | ఆవులు | గుఱ్ఱాలు | పురుషుడు |
| ప్రాణాలు (ఇంద్రియాలు) | ఘ్రాణం | వాక్కు | చక్షుస్సు | శ్రోత్రం | మనస్సు |

ఈ విధంగా ప్రాణదృష్టితో పరోవరీయ సామాన్ని తెలుసుకొని ఉపాసన చేసేవాని జీవనం నిజంగానే ఉత్తరోత్తర ఉత్కృష్టతరమైనది అవుతుంది. అతడు పరోవరీయ లోకాల్ని – ఒకదానికంటె ఒకటి ఉత్కృష్టమైన లోకాల్ని జయిస్తాడు. ఈ విధంగా పాంచభక్తిక సామోపాసనను వివరించారు.

## ఎనిమిదవ ఖండం

**మం॥ అథ సప్త విధస్య వాచి సప్త విధగ్ం సామోపాసీత యత్కించ వాచో హుమితి స హింకారో యత్ప్రేతి స ప్రస్తావో యదేతి స ఆదిః** 1

**యదుదితి స ఉద్గీథో యత్ప్రతీతి స ప్రతిహారో యదు పేతి స ఉపద్రవో యన్నీతి తన్నిధనమ్** 2

**దుగ్ధేఽ స్మై వాగ్దోహం యో వాచో దోహోఽ న్నవా నన్నాదో భవతి య ఏతదేవం విద్వాన్వాచి సప్త విధగ్ం సామోపాస్తే** 3

తరువాత సప్తవిధ సామాన్ని ఉపాసించటం చెపుతున్నారు – హింకారం, ప్రస్తావం, ఆది, ఉద్గీథం, ప్రతిహారం, ఉపద్రవం, నిధనం ఇవి సప్తసామాలు. ఈ సప్తవిధ సామాన్ని వాక్ దృష్టితో ఉపాసించాలి. అంటే ఈ సప్తవిధ సామమే వాక్కు అని భావించుకోవాలి.

వాక్కులో ఉండే "హుం" కారమే సప్తవిధ సామంలోని "హిం"కారం. ఈ రెంటిలోను హకారం సమానంగా ఉంది. వాక్కులో ఉన్నట్టి "ప్ర" అనే శబ్దస్వరూపమే సామంలోని ప్రస్తావం. ఈ రెంటిలోను "ప్ర" అనేది సమానం. వాక్కులో ఉండే "ఆ" అనే శబ్ద స్వరూపమే సామంలోని ఆది (ఓంకారం).

వాక్కులో ఉండే "ఉత్" అనే శబ్దస్వరూపమే "ఉద్గీథం" వాక్కులోని "ప్రతి" అనే శబ్దస్వరూపమే ప్రతిహారం. వాక్కులో ఉండే "ఉప" అనే శబ్దస్వరూపమే ఉపద్రవం. వాక్కులోని "ని" అనే శబ్దస్వరూపమే "నిధనం". వీటిలో ఉండే శబ్దసామ్యం తెలుస్తూనే ఉంది.

ఈ విషయాన్ని తెలుసుకున్నవాడు ఎవడైతే ఈ సప్తవిధ సామాన్ని ఉపాసిస్తాడో వాక్కు తనలోనున్న సారభూతమైన దానిని (దుగ్ధాన్ని) అతనికి యిస్తుంది. అతడు సంపన్నుడు మంచి భోక్త అవుతాడు.

## తొమ్మిదవ ఖండం

**మం॥ అథ ఖల్వము మాదిత్యగ్ం సప్తవిథగ్ం సామోపాసీత సర్వదా సమ స్తేన సామ మాం ప్రతి మాం ప్రతీతి సర్వేణ సమస్తేన సామ. 1**

**తస్మిన్నిమాని సర్వాణి భూతాన్యన్వాయత్తానీతి విద్యా త్తస్య యత్పురో దయాత్స హింకార స్తదస్య పశవోఽన్వాయత్తాస్తస్మాత్తే హిం కుర్వన్తి హింకార భాజినో హ్యేతస్య సామ్నః 2**

ఆదిత్యదృష్టితో సప్తవిధ సామాన్ని తప్పకుండా ఉపాసించాలి. వృద్ధిక్షయాలు ఉండవు కాబట్టి ఆదిత్యుడు ఎల్లప్పుడు సమంగా ఉంటాడు. అట్లా సమంగా ఉండటమే సామం. నాకు కనిపించి, నాకు ఏ విధమైన బుద్ధిని కలిగిస్తాడో అట్లాగే అందరికి కనిపించి, అందరికి సమానమైన బుద్ధిని కలిగిస్తాడు. కాబట్టి ప్రాణులన్నీ తమ తమ ఎదుట ఆదిత్యుని ఒకేవిధంగా చూస్తూనే ఉంటాయి – అంటే, ఆదిత్యుడు అందరికి సమానంగానే భాసిస్తాడు. కాబట్టి ఈ సమానత్వం సామానికి కారణం.

ఆదిత్యునిలోనే సమస్త భూతాలు అనుగతమై – సంబంధించి ఉన్నాయని గ్రహించు. ఆ ఆదిత్యుడు ఉదయించటానికి పూర్వం ఉండే ధర్మస్వరూపమే. 'హిం'కారం. సూర్యుని ఈ 'హిం' కారాన్నే పశుగణ మంతా అనుగమిస్తుంది. అందుచేతనే పశువులన్నీ సూర్యోదయానికి పూర్వం 'హిం' కారం చేస్తాయి. అందుచేత ఈ పశువులన్నీ ఆదిత్య నామకమైన సామాన్ని సేవిస్తున్నట్లుగా భావించాలి.

**మం॥ అథయత్ప్రథమోదితే స ప్రస్తావస్తదస్య మనుష్యా అన్వాయత్తాస్తస్మాత్తే ప్రస్తుతికామాః ప్రశంసా కామాః ప్రస్తావభాజినో హ్యేతస్య సామ్నః 3**

**అథ యత్సంగవ వేలాయాగ్ం స ఆదిస్తదస్య వయాం స్యన్వాయత్తాని తస్మాత్తాన్యన్తరిక్షే నారమ్బణాన్యా దాయాత్మానం పరిపతన్త్యాది భాజీని హ్యేతస్య సామ్నః 4**

సూర్యుడు ప్రప్రథమంగా ఉదయించే సమయంలో ఏ రూపం ఉంటుందో అది ప్రస్తావం. మానవులంతా ఈ రూపాన్ని అనుగమిస్తారు. అందుచేతనే ప్రస్తుతి (ప్రత్యక్షస్తుతి) ప్రశంస (పరోక్షస్తుతి)ని కోరుతూ ఉంటారు. ఎందుచేతనంటే, మానవులే సామంలోని ఈ ప్రస్తావాన్ని భజిస్తారు కాబట్టి వారు ప్రత్యక్ష పరోక్షస్తుతిని కోరుతూ ఉంటారు.

తరువాత సూర్యుడు తన కిరణాలను వ్యాప్తిచేయ నారంభించే సమయం (సంగవవేళ – సూర్యోదయానికి మూడు ముహూర్తాల తరువాత. ఆవుల వద్దకు దూడలను వదలి వాటిని కలిపే సమయం అనవచ్చు)లో ఉండే ఆదిత్యరూపమే 'ఆది', అంటే ఓంకారం. ఆదిత్యుని ఈ రూపాన్ని

పక్షిసంతతి అనుగమిస్తూ ఉంటుంది. అవి సామంలోని ఈ రూపాన్ని సేవిస్తాయి కాబట్టి అవి ఏ ఆధారం లేకుండానే ఆకాశంలో తమ స్వీయశక్తితో (సూర్యునిలాగా) సంచరిస్తాయి.

**మం॥ అథ యత్సంప్రతి మధ్యందినే స ఉద్గీథస్తదస్య దేవా అన్వాయత్తాస్తస్మాత్తే సత్తమాః ప్రాజాపత్యానా ముద్గీథభాజినో హ్యేతస్య సామ్నః 5**

**అథ యదూర్ధ్వం మధ్యందినా త్ప్రాగపరాహ్ణాత్స ప్రతి హార స్తదస్య గర్భా అన్వాయత్తాస్తస్మాత్తే ప్రతిహృతా నావపద్యన్తే ప్రతిహారభాజినో హ్యేతస్య సామ్నః 6**

మధ్యాహ్న సమయంలో ఆదిత్యుని యొక్క మండుతూ ఉండే స్వరూపమే ఉద్గీథం. ఈ ఉద్గీథాన్ని దేవతలు అనుగమిస్తారు. అందుచేతనే వారు – దేవతలు, ప్రజాపతి సంతానంలో విశిష్టములైనారు – వారు ఈ సామానికి సంబంధించిన ఉద్గీథ భక్తిభాజనులు కాబట్టి.

మధ్యాహ్నం తరువాత, అపరాహ్ణానికి ముందు ఆదిత్యుని యొక్క మండుతూ ఉండే రూపమే ప్రతిహారం. ఈ రూపాన్ని అనుగమించేవి గర్భంలో ఉండే పిండాలు – భ్రూణాలు. అందుచేతనే – సూర్యునియెడల గల ప్రతిహార రూపమైన భక్తివల్లనే అవి పైకి ఆకర్షింపబడి క్రింద పడిపోకుండా నిలిచి ఉంటాయి. గర్భాలన్నీ కూడా ఈ సామంలోని ప్రతిహార భక్తి భాజనాలు.

**మం॥ అథ యదూర్ధ్వ మపరాహ్ణాత్ప్రాగస్తమయాత్స ఉపద్ర వస్తదస్యారణ్యా అన్వాయత్తాస్తస్మాత్తే పురుషం దృష్ట్వా కక్షం శ్వభ్రమిత్యుపద్రవన్తి ఉపద్రవభాసినో హ్యేతస్య సామ్నః 7**

**అథయత్ప్రథమాస్తమితే తన్నిధనం తదస్య పితరోఽన్వాయత్తాస్తస్మా త్తాని దధతి నిధనభాజినో హ్యేతస్య సామ్న ఏవం ఖల్వముమాదిత్యగ్ం సప్తవిధగ్ం సామోపాస్తే. 8**

అపరాహ్ణం తరువాత సూర్యాస్తమయానికి ముందు ఉండే ఆదిత్య స్వరూపం ఉపద్రవమనే సామభేదం అని గ్రహించాలి. అడవి జంతువులన్నీ ఈ రూపాన్ని అనుగమిస్తాయి. అందుచేతనే అవి మానవుల్ని చూచి భయపడతాయి – గుహల్లోకి పారిపోయి దాగుతాయి. ఇవన్నీ ఉపద్రవమనే సామభక్తి భాజనాలు కాబట్టి!

సూర్యాస్తమయానికి పూర్వం ఉండే ఆదిత్య స్వరూపం నిధనమనే సామభేదం పితృదేవతలు ఈ రూపాన్ని అనుగమిస్తారు. అందుచేతనే శ్రాద్ధకాలంలో పితృ పితామహప్రపితామహాది రూపాల్ని దర్భలమీద ఉంచుతారు. పితృదేవతలంతా ఈ నిధన భక్తిభాజనులు కాబట్టి. ఈ విధమైన ఆదిత్యరూపంతో సప్తవిధసామాన్ని ఉపాసించేవాడు ఆదిత్య రూపాన్నే పొందుతాడు.

## పదవ ఖండం

**మం॥ అథ ఖల్వాత్మసమ్మితమతిమృత్యు సప్తవిధం సామోపా సీత హింకార ఇతి త్ర్యక్షరం ప్రస్తావ ఇతి త్ర్యక్షరం తత్సమమ్. 1**

**ఆదిరితి ద్వ్యక్షరం ప్రతిహార ఇతి చతురక్షరం తత ఇహైకం తత్సమం 2**

**ఉద్గీథ ఇతి త్ర్యక్షర ముపద్రవ ఇతి చతురక్షరం త్రిభి స్త్రిభిః సమం భవత్యక్షర మతిశిష్యతే త్ర్యక్షరం తత్సమం 3**

సమానమైన అక్షరాలు కలిగి, మృత్యువును కూడా అతిక్రమించినట్టి సప్తవిధ సామాన్ని ఉపాసించటాన్ని గురించి చెప్పాలి. సూర్యుడే మృత్యువు. ఎందుచేత? దివారాత్రాలతో – కాలంతో ప్రపంచాన్ని కొలుస్తున్నాడు కాబట్టి: ఆయువును తగ్గిస్తున్నాడు కాబట్టి! అటువంటి మృత్యువును ఈ సామంతో అతిక్రమించాలి. అదే చెపుతున్నారు – 'హింకారం'లో మూడు అక్షరాలున్నాయి. ప్రస్తావంలో కూడా మూడక్షరాలున్నాయి కాబట్టి ఈ రెంటిలోను సామం – సమానత్వం ఉంది.

'ఆది' అనే మాటలో రెండక్షరాలున్నాయి. (సప్తవిధసామంలో సంఖ్యాపూర్తి కోసం ఓంకారాన్ని 'ఆది'గా చెప్పారు. 'ఓం'లో 'అఉమ' కారాలు మూడున్నాయి.) 'ప్రతిహారం' అనేది నాలుగు అక్షరాల పేరు. దీనిలో నుండి ఒక అక్షరం తీసి 'ఆది' తో కలిపితే రెండూ మూడేసి అక్షరాల పేర్లు అవుతాయి. సమానాక్షరాలు కలవి అవుతాయి.

'ఉద్గీథ' మనేదానిలో మూడు అక్షరాలున్నాయి. 'ఉపద్రవ' అనే దాంట్లో నాలుగు అక్షరాలున్నాయి. ఈ రెండూ మూడేసి అక్షరాలు కలవిగా చూస్తే ఒక అక్షరం ఎక్కువ ఉంది. ఈ అసమానతను పరిహరించటం కోసం అది ఒకటే అయినా అది 'అక్షరం' కాబట్టి ఈ 'అక్షరం' అనే దానికి మూడక్షరాలున్నాయి. రెండూ సమానమే అనుకోవాలి.

**మం॥ నిధ నమితి త్ర్యక్షరం తత్సమమేవ భవతి తాని హ వా ఏతాని ద్వా వింశతిరక్ష రాణి. 4**

**ఏకవింశత్యాదిత్యమాప్నో త్యేకవింశో వాఇతోఽసా వాదిత్యో ద్వావింశేన పరమాదిత్యాజ్జయతి తన్నాకం తద్విశోకమ్. 5**

**ఆప్నోతి హాదిత్యస్య జయం పరో హాస్యాదిత్యజయో జ్జయో భవతి య ఏతదేవం విద్వానాత్మసమ్మితమతి మృత్యు సప్తవిధగ్ం సామోపాస్తే సామోపాస్తే. 6**

'నిధనం' అనేది మూడు అక్షరాలు కల పేరు. కాబట్టి పైవాటితో సమానమే! ఈ విధంగా మూడేసి అక్షరాల సామ్యం వల్ల వాటిలో సామత్వం ఉంది. అక్షరాల లెక్కింపునుబట్టి ఈ సప్తవిధ భక్తులలోను 22 అక్షరాలున్నాయి.

వీటిలో 21 అక్షరాల ద్వారా సాధకుడు ఆదిత్యలోకమనే మృత్యువును పొందుతాడు. 12 నెలలు + 5 ఋతువులు + 13 లోకాలు + 1 ఆదిత్య లోకం. మొత్తం = 21. ఈ లోకం నుండి లెక్కిస్తే సూర్యుడు ఇరవై ఒకటవవాడు. ఇరవై రెండవ అక్షరంతో సూర్యలోకంకంటె ఉన్నతమైన లోకాన్ని జయించగలుగుతాడు. అదే ఆనందం! అదే దుఃఖం, శోకం లేనట్టి లోకం. (మొత్తం 22 అక్షరాలలోను 21 అక్షరాలు పోను ఒక అక్షరం ఉంది. ఈ 'అక్షరం' ఒకటే అయినా ఇది నాశనం లేనిది. దీనిలో కూడా మూడు అక్షరాలున్నాయి. ఒక అక్షరమే మూడు అక్షరాలయింది. ఎక్కువ ఉన్న ఆ అక్షరం 22 వది అయిన సూర్యలోకాన్ని మించిన ఆనంద లోకం).

సాధకుడు ఈ విధంగా 21 అక్షరాల ద్వారా ఆదిత్య లోకాన్ని, ఇరవై రెండవ అక్షరం ద్వారా అంతకంటె ఉత్కృష్టమైన లోకాన్ని జయిస్తాడు. ఈ విషయం తెలుసుకున్న సాధకుడు ఆత్మలాగానే అక్షరము, మృత్యువునకు అతీతము అయిన సప్తవిధ సామాన్ని ఉపాసిస్తాడు. (ద్విరుక్తి ఈ సప్తవిధ సామ పరిచ్ఛేదం అంతమైనదని సూచించటానికి.)

పదునొకండవ ఖండం

**మం॥ మనో హింకారో వాక్ప్రస్తావశ్చక్షురుద్గీథః శ్రోత్రం ప్రతిహారః ప్రాణో నిధనమేతద్గాయత్రం ప్రాణేషు ప్రోతమ్. 1**

**స య ఏవమేతద్గాయత్రం ప్రాణేషు ప్రోతం వేద ప్రాణీ భవతి సర్వమాయురేతిజ్యోగ్జీవతి మహాన్ప్రజయాపశుభిర్భవతి మహాన్కీర్త్యా మహామనాః స్యాత్తద్వ్రతమ్. 2**

గాయత్రసామాన్ని వివరిస్తున్నారు –

సమస్త ఇంద్రియాలకు మొదటిదైనందున మనస్సు హింకారం. దాని తరువాతిదైన వాక్కు ప్రస్తావం. చక్షుస్సు ఉద్గీథం. శ్రోత్రం ప్రతిహారం. ప్రాణం నిధనం – సుషుప్తిలో పైన చెప్పిన ఇంద్రియాలన్నీ ప్రాణంలో లయమైపోతాయి కాబట్టి అది నిధనం. ఈ గాయత్ర సంజ్ఞ కల సామానికి ప్రాణమే ప్రతిష్ఠ (ఆధారం). గాయత్రిని ప్రాణంగా స్తుతించారు.

ఈ గాయత్ర సంజ్ఞ కలిగిన సామాన్ని ప్రాణంతో ప్రతిష్ఠితమై ఉన్నట్లు తెలుసుకున్నవాడు, వికలంకాని ఇంద్రియాలు కలవాడౌతాడు. పూర్ణాయుర్దాయం – వంద సంవత్సరాలు అనుభవిస్తాడు. ఉజ్జ్వలమైన జీవనాన్ని గడుపుతాడు. సంతాన పశుసంపదలు కలిగి గొప్పవాడౌతాడు. కీర్తితో సైతం మహనీయుడౌతాడు. ఉదారమైన మనస్సు కలవాడు కావాలన్నదే అతని వ్రతం.

## పండ్రెండవ ఖండం

**మం॥ అభిమన్థతి స హింకారోధూమో జాయతే సప్రస్తావో జ్వలతి స ఉద్గీథోఽ జ్గారా భవన్తి స ప్రతిహార ఉపశా మ్యతి తన్నిధనగ్ం సగ్ం శామ్యతి తన్నిధనమేతద్ర థన్తర మగ్నౌ ప్రోతమ్. 1**

**స య ఏవమేతద్రథన్తరమగ్నౌ ప్రోతం వేద బ్రహ్మ వర్చస్యన్నాదో భవతి సర్వమాయు రేతి జ్యోగ్జీవతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యాన ప్రత్య జ్ఙగ్ని మాచామేన్న నిష్ఠీవేత్తద్వ్రతమ్. 2**

రథంతర సామాన్ని చెపుతున్నారు.

అన్నిటికంటె ముందు జరిగే పని కాబట్టి అగ్నిని రగుల్కొలపటానికై అధిమంథనం – రాపిడి పుట్టించటం – అనేది హింకారం. పొగరావటం అనేది ప్రస్తావం. అగ్ని ప్రజ్వలించటమే ఉద్గీథం. నిప్పుకణాలు – బొగ్గులు – రావటం ప్రతిహారం – బొగ్గులని తీసివేస్తారు – ప్రతిహరణం చేస్తారు కాబట్టి. అగ్ని శాంతించటాన్ని నిధనం. పూర్తిగా ఆరిపోవటం కూడా నిధనమే! ఈ రథంతర సామం పూర్తిగా అగ్నిలో ప్రతిష్ఠితమై ఉంది. ఎందుచేతనంటే అగ్నిమంథనంలో అగ్నిని రగుల్కొల్పేటప్పుడు దానిని గానం చేస్తారు కాబట్టి.

ఈ విధంగా రథంతర సామం అగ్నిలో వ్యాప్తమై ఉన్నట్లు తెలుసుకున్నవాడు, బ్రహ్మతేజస్సు కలవాడై, అన్నభోక్తయై, పూర్ణాయుర్దాయున్ని అనుభవిస్తాడు. సంతానంతో, పశువులతో సంపన్నుడౌతాడు. అగ్నికి ఎదురుగా ముఖం పెట్టి ఏమీ తినరాదు – ఉమ్మి వేయరాదు. ఇది పాటించాల్సిన వ్రతం.

## పదమూడవ ఖండం

**మం॥ ఉప మంత్రయతే స హింకారో జ్ఞపయతే స ప్రస్తావః స్త్రియా సహ శేతే స ఉద్గీథః ప్రతి స్త్రీం సహ శేతే స ప్రతిహారః కాలం గచ్ఛతి తన్నిధనం పారం గచ్ఛతి తన్నిధన మేతద్వామ దేవ్యం మిథునే ప్రోతం. 1**

**స య ఏవమేతద్వామ దేవ్యం మిథునే ప్రోతం వేద మిథునీభవతి మిథునాన్మిథునాత్ప్రజాయతే సర్వమాయు రేతి జ్యోగ్జీవతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహా న్కీర్త్యా న కాంచన పరిహరేత్తద్వ్రతమ్.**

ఈ చెప్పబోయేది వామ దేవ సామాన్ని గురించి. అగ్నిమంథనం చేసేటప్పుడు ఉపయోగించే ఉత్తరాధర స్థానాల్లో ఉండే అరణులుగా స్త్రీ పురుషుల్ని ఊహిస్తున్నారు. పురుషుడు స్త్రీకి చేసే సంకేతమే హింకారం. వస్త్రాభూషణాలతో స్త్రీని సంతోషపెట్టడం ప్రస్తావం. ఏకశయ్యాగతులు

కావటం ఉద్గీథం. స్త్రీకి అభిముఖుడు అవటం ప్రతిహారం. మైథునక్రియ ద్వారా కోరికను తీర్చుకోవటం నిధనం. ఈ వామదేవసామం దంపతులలో అనుస్యూతమై ఉంది. ఎందుచేతనంటే ఈ వామదేవ్యోత్పత్తి వాయువు, జలం వీటి కలయికగా చెప్పబడ్డది కాబట్టి!

ఈ వామదేవ్య సామం దంపతులందు ప్రతిష్ఠితమై ఉన్నట్లు గ్రహించే ఉపాసకుడు ఎన్నడూ విధురుడుకాడు. (భార్యలేనివాడు కాదు) అమోఘరేతస్కుడౌతాడు. పూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు. ఉజ్జ్వలమైన జీవనాన్ని గడుపుతాడు. సంతానం, పశుసంపదలతో, కీర్తితో గొప్పవాడౌతాడు. సమాగమం కోరివచ్చిన స్త్రీని తిరస్కరించ కుండటం అనేది వ్రతం.

## పదునాల్గవ ఖండం

**మం॥ ఉద్యన్హింకార ఉదితః ప్రస్తావో మధ్యన్దిన ఉద్గీథోఽ పరాహ్ణః ప్రతిహారోఽ స్తం యన్నిధన మేతద్బృహదాదిత్యే ప్రోతమ్. 1**

**స య ఏవమేత ద్బృహదాదిత్యే ప్రోతం వేద తేజ స్వ్యన్నాదో భవతి సర్వమాయురేతిజ్యోగ్జీవతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యా తపన్తం న నిన్దేద్వ్రతమ్. 2**

ఉదయిస్తున్న సూర్యుడు హింకారం – అతని దర్శనం ముందుగా అవుతోంది కాబట్టి. కర్మలకు సంబంధించిన ప్రస్తవనానికి హేతువు కాబట్టి ఉదయించిన సూర్యుడు ప్రస్తావం. మధ్యాహ్నకాల మందలి సూర్యుడు ఉత్కృష్టుడవటంవల్ల ఉద్గీథం. పశువులు మొదలైనవాటిని, వాటి వాటి స్థానానికి తీసికొని పోవటంవల్ల అపరాహ్ణకాలపు సూర్యుడు ప్రతిహారం. అస్తమించే సూర్యుడు నిధనం – అందరిని రాత్రియందు తమ తమ ఇండ్లలో ఉంచుతాడు కాబట్టి. ఈ బృహత్సామం సూర్యునియందు ప్రతిష్ఠితమై ఉంది.

ఈ బృహత్సామం యొక్క ఫలితం వెనుకటి మంత్రంలో చెప్పబడ్డదే! సూర్యుని ఎన్నడూ నిందించరాదనేది ఈ బృహత్సామోపాసకుని వ్రతం.

## పదునైదవ ఖండం

**మం॥ అభ్రాణి సంప్లవన్తే స హింకారో మేఘో జాయతే స ప్రస్తావో వర్షతి స ఉద్గీథో విద్యోతతేస్తనయతి స ప్రతిహార ఉద్గృహ్ణాతి తన్నిధనమేతద్వై రూపం పర్జన్యే ప్రోతమ్. 1**

**స య ఏవమేతద్వైరూపం పర్జన్యే ప్రోతం వేద విరూ పాంశ్చ సురూ పాంశ్చ పశూనవరున్ధే సర్వమాయురేతి జ్యోగ్జీవతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యా వర్షన్తం న నిన్దయేత్తద్వ్రతమ్. 2**

మేఘంలో వైరూప సామోపాసనను చెపుతున్నారు–సూర్యోపాసన తరువాత, ఆ సూర్యుడు కారణంగా గల మేఘాన్ని ఉపాసించటం చెపుతున్నారు. నీటిని వర్షించటానికి పూర్వం తెల్లని మేఘాలన్నీ ఒకచోటికి చేరటం అనేది హింకారం. మేఘంగా ఘనీభవించటం ప్రస్తావం. జలాన్ని వర్షించటం ఉద్గీథం. మెరుపుఉలు మెరవటం, ఉరమటం అనేది ప్రతిహారం. వర్షం తగ్గిపోవటం నిధనం.

ఈ వైరూప సామోపాసనా ఫలం వెనుక చెప్పినదే! మేఘాన్ని నిందించకుండా ఉండటం అనేది వ్రతం. వివిధ రూపాలుగా, వర్ణాలుగా కనిపించటంవల్ల మేఘాన్ని వైరూపంగా చెప్పారు.

పదునారవ ఖండం

**మం॥ వసంతో హింకారో గ్రీష్మః ప్రస్తావో వర్షా ఉద్గీథః శరత్ప్రతిహారో హేమన్తోనిధనమేత ద్వైరాజ మృతుషు ప్రోతం. 1**

**స య ఏవమేతద్వైరాజమ్ ఋతుషు ప్రోతంవేద విరా జతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన సర్వమాయు రేతి జ్యోగ్జీవతిమహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్య ర్తూన్ననిందే త్తద్వ్రతమ్. 2**

వైరాజసామాన్ని చెపుతున్నారు. ఋతువులు పర్జన్యాధీనమై ఉంటాయి. కాబట్టి మేఘాల తరువాత ఋతువులను గూర్చి చెపుతున్నారు. ఋతువులు తమ తమ ధర్మాలతో ప్రకృతిని విరాజిల్ల చేస్తాయి – కాబట్టి వైరాజసామం.

ఋతువులలో మొదటిది కాబట్టి వసంతం హింకారం. గ్రీష్మర్తువు ప్రస్తావం. వర్షర్తువు ఉద్గీథం. శరదృతువు ప్రతిహారం. హేమంతర్తువు నిధనం. ఈ వైరాజసామం ఋతువులలో ఆధారం పొంది ఉంది.

ఉపాసనాఫలం వెనుక చెప్పిన విధంగానే గ్రహించాలి. ఋతువులను నిందించకుండా ఉండటమనేది పాటించాల్సిన వ్రతం.

## పదునేడవ ఖండం

**మం॥ పృథివీ హింకారో–న్తరిక్షం ప్రస్తావో ద్యౌరుద్గీథో దిశః ప్రతిహారః సముద్రో నిధనమేతాః శక్వర్యో లోకేషు ప్రోతాః 1**

**స య ఏవమేతాః శక్వర్యో లోకేషు ప్రోతా వేద లోకీ భవతి సర్వాయురేతి జ్యోగ్జీ వతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యా లోకాన్న నిందేత్తద్వ్రతమ్. 2**

శక్వరీ సామోసనాన్ని వివరిస్తున్నారు.

ఈ పృథివి హింకారం. అంతరిక్ష ప్రస్తావం, ద్యులోకం ఉద్గీథం. దిక్కులు ప్రతిహారం. సముద్రం నిధనం. ఈ శక్వరీ సామం లోకాల్లో వ్యాప్తమై ఉంది.

ఈ ఉపాసనా ఫలం వెనుకటి విధంగానే గ్రహించాలి. లోకాల్ని నిందించరాదు అనేది వ్రతం.

## పదునెనిమిదవ ఖండం

**మం॥ అజా హింకారోऽవయః ప్రస్తావో గావ ఉద్గీథోऽశ్వాః ప్రతిహారః పురుషో నిధనమేతా దేవత్యః పశుషు ప్రోతాః 1**

**స య ఏవమేతా రేవత్యః పశుషు ప్రోతా వేద పశు మాన్భవతి సర్వమాయురేతి జ్యోగ్జీవతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యా పశూన్న నిన్దేత్తద్వ్రతమ్. 2**

పశువులు రేవతీ సామోపాసనను చెపుతున్నారు.

మేకలు హింకారం. గొఱ్ఱెలు ప్రస్తావం. ఆవులు ఉద్గీథం. గుఱ్ఱాలు ప్రతిహారం. పురుషులు నిధనం. ఈ రేవతీ సామం పశువులలో వ్యాప్తమై ఉంది.

ఉపాసనా ఫలం వెనుక చెప్పినదే! పశువుల్ని నిందించకూడదనేది వ్రతం.

## పందొమ్మిదవ ఖండం

**మం॥ లోమ హింకార త్వక్ప్రస్తావో మాంసముద్గీథోऽస్తి ప్రతిహారో మజ్జా నిధన మేతద్యజ్ఞాయజ్ఞీయమం గేషు ప్రోతమ్. 1**

**స య ఏవమేతద్యజ్ఞాయజ్ఞీ యమం గేషు ప్రోతం వేదాంగీ భవతి నాంగేన నిహూర్ఛతి సర్వమాయు రేతి జ్యోగ్జీవతి మహాన్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యా సంవత్సరం మజ్ఞో నాశ్నీయా త్తద్వ్రతం మజ్ఞోనాశ్నీ యాదితి వా. 2**

**యజ్ఞా యజ్ఞీయ సామోపాసన.**

లోమాలు (వెండ్రుకలు) హింకారం. త్వచ (చర్మం) ప్రస్తావం. మాంసం ఉద్గీథం. అస్థులు (ఎముకలు) ప్రతిహారం. మజ్జ (మూలుగ) నిధనం. ఈ యజ్ఞాయజ్ఞీయ సామం దేహావయవాల్లో వ్యాప్తమై ఉంది.

ఈ విషయం తెలుసుకున్నవాడు, అన్ని అంగాలు పూర్ణంగా కలవాడౌతాడు. అంగవికలుడు కాడు. కుంటి, గ్రుడ్డి, మీసాలు, గడ్డాలు లేనివాడు కాడు. మిగతా ఫలం లెనుక చెప్పిన విధమే! మాంసాన్ని, చేపలను ఒక సంవత్సరం పాటు, లేదా ఎల్లకాలం తినకుండా ఉండటం వ్రతం.

## ఇరువదవ ఖండం

మం॥ అగ్నిహింకారో వాయుః ప్రస్తావ ఆదిత్య ఉద్గీథో నక్షత్రాణి ప్రతిహారశ్చంద్రమా నిధన మేతద్రాజనం దేవ తాసు ప్రోతం. 1

స య ఏవమేతద్రాజనం దేవతాసు ప్రోతం వేదైతా సామేవ దేవతా నాగ్ంం సలోకతాం సార్ష్టిం తాం సాయుజ్యం గచ్ఛతి సర్వమాయు రేతి జ్యోగ్జీవతి మహా న్ప్రజయా పశుభిర్భవతి మహాన్కీర్త్యా బ్రాహ్మణాన్న నిందేత్తద్వ్రతం. 2

అన్నిటికంటె మొదటిదైనందున అగ్ని హింకారం. వాయువు ప్రస్తావం. ఆదిత్యుడు ఉద్గీథం. నక్షత్రాలు ప్రతిహారం. చంద్రుడు నిధనం. చంద్రునిలోనే కర్మపరాయణుల నిధనం జరుగుతోంది కాబట్టి – కర్మ పరాయణులకు చంద్రలోకప్రాప్తి అని చెప్పారు గదా! ఈ రాజన్ సామము దేవతలలో ప్రతిష్ఠితమై ఉంది.

దీనిని తెలుసుకొన్నవాడు దేవతలతో సాలోక్యాన్ని, వారితో సమానమైన ఐశ్వర్య రూపమైన వర్చస్సును, సాయుజ్యాన్ని పొందుతాడు. మిగతా ఫలం వెనుకటి విధంగానే బ్రాహ్మణులను నిందించరాదనేది వ్రతం. బ్రాహ్మణులు ప్రత్యక్షదేవతలు కాబట్టి.

## ఇరవై ఒకటవ ఖండం

మం॥ త్రయీ విద్యా హింకార స్త్రయ ఇమే లోకాః స ప్రస్తావోఽ గ్ని ర్వాయు రాదిత్యః స ఉద్గీథో నక్షత్రాణి వయాగ్ంసి మరీచయః స ప్రతిహారః సర్పా గంధర్వాః పితర స్తన్నిధనమేతత్సామ సర్వస్మిన్ప్రోతం 1

స య ఏవమేతత్సామసర్వస్మిన్ప్రోతం వేద సర్వగ్ంహ భవతి. 2

త దేష శ్లోకో యాని పంచధా త్రీణి త్రీణి తేభ్యో న జ్యాయః పరమన్యదస్తి. 3

యస్తద్వేద స వేద సర్వగ్ం సర్వా దిశో బలిమస్మై హరన్తి సర్వమస్మీత్యుపాసీత తద్వ్రతం తద్వ్రతమ్. 4

అన్నింటిలోను సామాన్ని ఉపాసించటం చెపుతున్నారు.

అన్ని కర్మలకు మూలం కాబట్టి (ప్రారంభం కాబట్టి) త్రయీవిద్య – మూడు వేదాలు హింకారం. వీటికి కార్యమైనందున – వీటినుండి పుట్టినందున మూడు లోకాలు ప్రస్తావం. (మూడు వేదాలను తెలుసుకొని చేసే కర్మలవల్ల ప్రాప్తించే మూడు లోకాలు – పృథివి, అంతరిక్షం, ద్యులోకం) అగ్ని, వాయువు, ఆదిత్యుడు. ఉత్కృష్టతవలన ఈ మూడూ ఉద్గీథం. (అగ్నినుండి

ఋగ్వేదం. వాయువు నుండి యజుర్వేదం, ఆదిత్యుని నుండి సామవేదం పుట్టినాయి.) నక్షత్రాలు, పక్షులు, కిరణాలు ఇవి ప్రతిహారం – (అంతటా చుట్టూ వ్యాపించి ఉండటంవల్ల). విషమున్న సర్పాలు, గంధర్వులు, పితృగణం ఇవి నిధనం. (ధకార సామ్యంవల్ల విషధర, గంధర్వ, నిధనలలో) ఈ సామోపాసనకు పేరు ఏదీలేదు. కాబట్టి అన్నిటిలోను ప్రతిష్ఠితమై ఉంది.

ఈ సామం అన్నింటిలోను వ్యాప్తమై ఉన్నదని తెలుసుకొన్నవాడు సర్వస్వరూపుడౌతాడు.

ఈ మంత్రాన్ని గురించి యీ విధంగా చెపుతున్నారు. ఐదు విధాలుగా (పాంచభాక్తికాలు) మూడేసి మూడేసి చెప్పారు గదా! ఈ అయిదు త్రికాలకు మించి ఏదీ లేదు. అన్నీ వీటిలో అంతర్భావం చెందుతాయి. కాబట్టి సర్వ విషయిక సామం అనవచ్చు.

ఇది తెలుసుకున్నవాడు సర్వజ్ఞుడౌతాడు. అన్ని దిక్కులలోని పురుషులు కానుకలు తెచ్చియిస్తారు. ఈ సమస్తమూ నేనే అనే దృష్టితో ఈ ఉపాసన చేయాలి. ఇదే నియమం.

(మూడు వేదాలు, మూడు లోకాలు, ముగ్గురు దేవతలు, నక్షత్ర ఖగ కిరణాలు, సర్ప గంధర్వ పితరులు ఇవన్నీ త్రికాలు.)

## ఇరవై రెండవ ఖండం

**మం॥ వినర్ది సామ్నో వృణో పశవ్యమిత్యగ్నే రుద్గీథోఽ నిరుక్తః ప్రజాపతేర్నిరుక్తః సోమస్య మృదు శ్లక్ష్ణం వాయోః శ్ల క్ష్ణం బలవదింద్రస్య క్రౌంచం బృహస్పతే రపధ్వాంతం వరుణస్య తాన్సర్వానేవోపసేవేత వారుణం త్వేవ వర్జయేత్. 1**

**అమృతత్వం దేవేభ్య ఆగాయా నీత్యాగా యేత్స్వథాం పితృభ్య ఆశాం మనుష్యేభ్యస్తృణోదకం పశుభ్యః స్వర్గం లోకం యజమానాయాన్నమాత్మన ఆగాయా నీత్యేతాని మనసా ధ్యాయన్న ప్రమత్తః స్తునీత. 2**

**సర్వే స్వరా ఇంద్రస్యాత్మనః సర్వ ఊష్మణః ప్రజా సతేరాత్మనః సర్వే స్పర్శా మృత్యోరాత్మాన స్తం యది స్వ రేషూపాలభేతేంద్రం శరణం ప్రపన్నో-భూవం స త్వా ప్రతి వక్ష్యతీత్యేనం బ్రూయత్. 3**

**అథ యద్యేన మూష్మసూపాలభేత ప్రజాపతిం శరణం ప్రపన్నోఽ భూవం సత్వా ప్రతి పేక్ష్యతీత్యేనం బ్రూయాదథ యద్యేనగ్ం స్పర్శేషూపాల భేత మృత్యుం శరణం ప్రపన్నోభూవం సత్వా ప్రతి ధక్ష్యతీ త్యేనం బ్రూయాత్. 4**

**సర్వే స్వరా ఘోషవన్తో బలవన్తో వక్తవ్యా ఇంద్రే బలం దదానీతి సర్వఊష్మాణోఽ గ్రస్తా అనిరస్తా వివృతా వ్యక్తవ్యాః ప్రజాపతేరాత్మానం పరిదదానీతి సర్వే స్పర్శా లేశేనానభినిహితా**

**వక్తవ్యా మృత్యో రాత్మానం పరిహరాణీతి.** **5**

వినర్ది గుణంతో కూడిన సామోపాసనను వివరిస్తున్నారు.

వృషభం యొక్క రంకెతో సమానంగా బిగ్గరగా ఉండే వినర్ది సంజ్ఞకల సామాన్ని కొందరు వరిస్తున్నారు. అది పశువులకు హితకరమైనది. అగ్నే దేవతా సంబంధమైన ఉద్గీథం కలది. ప్రజాపతికి సంబంధించిన లేదా ప్రజాపతి అధి దేవతగా గల ఉద్గీథసామం. వర్ణింప నలవికాని అస్పష్ట స్వరంలో ఉంటుంది – ప్రజాపతిని కూడా వర్ణించటం కష్టమే! సోమదేవతా (చంద్రదేవత) సంబంధమైన ఉద్గీథ సామం స్పష్టంగా ఉంటుంది. వాయు దేవతాత్మకమైన ఉద్గీథ సామం స్పష్టంగా ఉంటుంది. వాయుదేవతాత్మకమైన ఉద్గీథసామం మృదువుగా, మధురంగా, సరళమైన ఉచ్ఛారణతో కూడి ఉంటుంది. ఇంద్రదేవతా సంబంధమైన ఉద్గీథసామం మధురంగా ఎక్కువ ప్రయత్నంతో కూడిన ఉచ్ఛారణ కలదై, బలంగా ఉంటుంది. బృహస్పతి దేవతాత్మకమైన ఉద్గీథ సామం క్రౌంచపక్షి కూతలాగాను, వరుణదేవతాత్మకమైన ఉద్గీథసామం పగిలిన శంఖం లేక కంచుపాత్ర స్వరం కలదిగా ఉంటుంది. వీటిలో వరుణ సంబంధమైన గానాన్ని మాత్రం పరిత్యజించాలి.

స్తుతించే సమయంలో ఏ విధమైన ధ్యానం చేయాలో చెపుతున్నారు.

"నేను దేవతల కోసం అమృతత్వాన్ని ఆగానం చేస్తాను! అని అనుకుంటూ ఆగానం చేయాలి. పితరుల కోసం స్వధాకారాన్ని ఆగానం చేస్తాను. (పితృబలి ఇచ్చేటప్పుడు స్వధాకారాన్ని ఉపయోగిస్తారు – దేవతలకు 'స్వాహా' లాగా) మానవుల కోసం ఆశను – కోరిన వస్తువును – ఆగానం చేస్తాను – పశువులకోసం తృణోదకాల్ని ఆగానం చేస్తాను. యజమాని కోసం స్వర్గాన్ని, నాకోసం అన్నాన్ని ఆగానం చేస్తాను". ఈ విధంగా మనస్సులో ధ్యానిస్తూ స్వరాలు, (అచ్చులు) ఊష్మాక్షరాలు (శషసహ) వ్యంజనాలు (క మొదలైన హల్లులు) ఉచ్చరించటంలో తప్పు లేకుండా స్తుతించాలి.

స్వరాదులకు (అచ్చులు మొదలైనవానికి ఉన్నట్టి దేవతారూపాలను వివరిస్తున్నారు. అకారాది అచ్చులన్నీ (స్వరాలు) ఇంద్రునియొక్క (ప్రాణం ఆత్మలు–అంటే అవయవాల వంటివి. ఊష్మాక్షరాలన్నీ (శషసహ) ప్రజాపతి యొక్క అవయవాలు, స్పర్శాక్షరాలన్నీ (కకారాదులు) మృత్యువుయొక్క అవయవాలు. ఈ విషయం తెలుసుకున్నట్టి ఉద్గాతను ఏవైనా స్వరాదులు ఉచ్చరించటంలో తప్పుగా ఉచ్చరించావని ఎవరైనా విమర్శిస్తే, అందుకా ఉద్గాత – "నేను ఇంద్రుని శరణుజొచ్చినవాడిని (స్వరాలు ఇంద్రుని అవయవాలు కాబట్టి) ఆ ఇంద్రుడే నీకు తగిన సమాధానం ఇస్తాడు అని అనాలి.

ఉద్గాత ఊష్మవర్ణాల్ని ఉచ్చరించటంలో తప్పుగా ఉచ్చరిస్తే ఆ తప్పును ఎవడైనా ఎత్తిచూపి విమర్శిస్తే అప్పుడా ఉద్గాత ఇట్లా అనాలి – "నేను ప్రజాపతి శరణు జొచ్చినవాడను. ఆ ప్రజాపతే (ఊష్మాక్షరాలు ప్రజాపతి అవయవాలు కాబట్టి) నిన్ను అతడు నలిపివేస్తాడు" అనాలి. అట్లాగే ఎవడైనా స్పర్శాక్షరాల ఉచ్చారణలో (క మొదలుగా గల హల్లుల ఉచ్చారణలో) దోషాన్ని చూపి దెప్పితే అతనితో "నేను మృత్యుదేవత శరణుజొచ్చినవాడిని. అతడే నిన్ను భస్మం చేస్తాడు" అనాలి.

అక్షరాల్ని ఉచ్చరించే సమయంలో గుర్తు ఉంచుకోవలసిన విషయాలు –

అన్ని అచ్చులు ఘోషయుక్తంగా (ప్రతిధ్వనించేటట్లుగా) బలంగా ఉచ్చరించాలి. అందుచేత వాటిని ఉచ్చరించేటప్పుడు 'నేను ఇంద్రునిలో నా బలాన్ని ఆధానం చేస్తున్నాను – ధారపోస్తున్నాను' అని భావించాలి – ఉచ్చరించాలి. అట్లాగే ఊష్మాక్షరాలను ఉచ్చరించేటప్పుడు మ్రింగివేసినట్లుగా కాకుండా, ఊదివేసినట్లుగా కాకుండా ప్రయత్నబలంతో 'నేను నన్ను ప్రజాపతికి సమర్పించుకుంటున్నాను' అని భావిస్తూ ఉచ్చరించాలి. స్పర్శాక్షరాలను నిదానంగా, ఒకదానితో ఒకటి కలిపివేయకుండా "నేను మృత్యువు నుండి తప్పించుకుంటున్నాను" అని భావిస్తూ ఉచ్చరించాలి.

## ఇరవై మూడవ ఖండం

**మం॥ త్రయో ధర్మస్కంధా యజ్ఞోఽధ్యయనం దానమితి ప్రథమ స్తప ఏవ ద్వితీయో బ్రహ్మచర్యాచార్య కులవాసీ తృతీయోఽత్యన్తమాత్మ నమాచార్యకులేఽవ సాద యన్సర్వ ఏతే పుణ్యలోకా భవన్తి బ్రహ్మసం స్థోఽమృతత్వమేతి. 1**

**ప్రజాపతి ర్లోకా నభ్యతప త్తేభ్యోఽభిత ప్తేభ్యస్త్రయీ విద్యా సంప్రాస్రవత్తా మభ్యతపత్తస్యా అభితప్తాయా ఏతాన్యక్షరాణి సంప్రాస్రవన్త భూర్భువః స్వరితి. 2**

**తాన్య భ్యతపత్తేభ్యోఽభిత ప్తేభ్య ఓంకారః సంప్రాస్ర వత్తద్యథా శంకునా సర్వాణి పర్వాణి సంతృణ్ణాన్యేవ మోంకారేణ సర్వా వాక్సం తృణ్ణోంకార ఏ వేదగ్ం సర్వమోంకార ఏ వేదం సర్వం. 3**

ధర్మానికున్న మూడు కణుపులు – (భాగాలను) వర్ణిస్తున్నారు. ధర్మానికి మూడు స్కంధాలున్నాయి. అగ్ని హోత్రాదులతో గూడిన యజ్ఞం చేయటం, ఋగ్వేదాదులను అభ్యాసరూపంగా అధ్యయనం చెయ్యటం, యజ్ఞవేదిక ఆవల యథాశక్తి దానం చేయటం. (ఇష్టాపూర్త కర్మలన్నమాట) ఇవన్నీ గృహస్థులాచరించవలసిన ధర్మాలు. ఇది మొదటి స్కంధం. ఇక రెండవది కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతాచరణ రూపమైన తపస్సు. ఇది కేవలం పరివ్రాజకులవంటి వారికి, వానప్రస్థులు అనుష్ఠించవలసినది. ఇక మూడవ స్కంధం – గురుకులంలో ఉంటూ, నియమాలను

పాటిస్తూ, తమ శరీరాన్ని మిక్కిలి కృశింపచేస్తూ, వేదాధ్యయనం చేస్తూ ఉంటారు. ఇది బ్రహ్మచర్యవ్రతం. (బ్రహ్మచర్యంలో గురుకులవాసం చేస్తూ వేదాలు నేర్చుకుంటారు. గృహస్థాశ్రమంలో నేర్చుకొన్న వేదాలను అభ్యాసరూపంలో పఠిస్తూ ఉంటారు.) ఇవన్నీ కూడా పుణ్యలోకాలు ఇచ్చేవే! ఇక మిగిలియున్న నాల్గవవాడు, జ్ఞాని అయిన పరివ్రాజకుడు మాత్రం చక్కగా బ్రహ్మమందు స్థితుడై అమృతత్వాన్ని – మోక్షాన్ని పొందుతాడు.

త్రయీవిద్య, వ్యాహృతులు వీటి ఆవిర్భావాన్ని వివరిస్తున్నారు. ప్రజాపతి లోకాలను గూర్చి ధ్యానరూపమైన తపస్సు చేశాడు. ఆ విధంగా అతని తపస్సుచేత అభితప్తమైన మూడు లోకాలు వాటి సారభూతమైనట్టి త్రయీ విద్య (ఋగ్యజుస్సామాలనే మూడు వేదాలు) ను ప్రసాదించినాయి. ఆ అభితప్తమైన త్రయీ విద్యనుండి భూః భువః సువః అనే మూడు వ్యాహృతులు ఋగ్వేదం పృథివినుండి, యజుర్వేదం అంతరిక్షంనుండి, సామవేదం ద్యులోకం నుండి ఉద్భవించినట్లే ఋగ్వేదం నుండి భూః అనే వ్యాహృతి యజుర్వేదం నుండి భువః అనే వ్యాహృతి. సామవేదం నుండి సువః అనే వ్యాహృతి రూపమైన అక్షరాలు ఉద్భవించాయి.

తరువాత ప్రజాపతి భూః భువః సువః అనే వ్యాహృతుల్ని గూర్చి ధ్యానం చేశాడు. ఆ విధంగా ధ్యానించబడ్డ వ్యాహృతులనుండి (అక్షరాలు) ఓంకారం ప్రాదుర్భవించింది. ఆకులన్నీ వాటి మధ్యలో ఉండే ఈనెల ద్వారా కలపబడినట్లు పరమాత్మ స్వరూపమైన ఓంకారం ద్వారా సమస్తమైన వాక్కు వ్యాప్తమై కలుపబడి ఉంది. ఇదంతా ఓంకారమే! (ఓంకారంలో కూడా అ,ఉ,మ అనే అక్షరాలున్నాయి. అకారమనే అచ్చుభాషలో (వాక్కులో) అంతటా వ్యాప్తమై ఉన్నందున, ఓంకారం కూడా వాక్కు అంతటా వ్యాప్తమై ఉన్నట్లే!)

## ఇరువది నాల్గవ ఖండం

**మం॥ బ్రహ్మవాదినో వదన్తి యద్వసూనాం ప్రాతఃసవనం రుద్రాణాం మాధ్యం దినం సవనమాదిత్యానాం చ విశ్వేషాం చ దేవానాం తృతీయ సవనం. 1**

**క్వ తర్హి యజమానస్య లోక ఇతి స య స్తం న విద్యాత్కథం కుర్యాదథ విద్వాన్కు ర్యాత్. 2**

సవనాలకు (దినంలోని భాగాలకు) అధిష్ఠాన దేవతలను గురించి చెపుతున్నారు. బ్రహ్మవేత్తలైనవారు, దినంలో మొదటి భాగం (ప్రాతః సవనం) వసుదేవులదని, మధ్యాహ్న సవనం (రెండవభాగం) రుద్రులదని, సాయంసవనం (మూడవభాగం) ఆదిత్యులు, విశ్వదేవతలకు సంబంధించినదని అంటారు. ఈ అధిష్టాన దేవతల ద్వారానే భూలోక, భువర్లోక, సువర్లోకాలపైన యజమానుడు (యజ్ఞకర్త) విజయాన్ని పొందుతాడని – అంటే ఈ లోకాల్ని జయిస్తాడని అంటారు.

అయితే, యజమానునికి ఏ లోకాలు లభిస్తాయి? అతడు దేనికోసం యజ్ఞం చేశాడో ఆ లోకం ఎక్కడ ఉంది? అంటే, తన లోకం ఎక్కడ ఉందో ఆ విషయం యజమానికి తెలియదు. అటువంటి అజ్ఞాని, యజ్ఞం ఎట్లా చేయగలుగుతాడు? కాబట్టి, ముందు చెప్పబోయే సామాదులను (సామాది ఉపాయాలను) చక్కగా తెలుసుకొని యజ్ఞకర్మలు చేయాలి.

**మం॥ పురా ప్రాతరనువాకస్యోపాకరణాజ్జఘనేన గార్హ పత్య స్యోదఙ్ముఖ ఉపవిశ్య స వాసవగ్ం సామాభిగాయతి. 3**

**లో 3 క ద్వారమపావా 3 ర్ణూ 3 పశ్యేమ త్వా వయగ్ం రా 333333 హు3మ్ ఆ 33 జ్యా3యో3ఆ32111 ఇతి. 4**

**అథ జుహోతి నమోఽ గ్నయే పృథివీక్షితే లోకక్షితే లోకం మే యజమానాయల విన్దైష వై యజమానస్య లోక ఏతాస్మి. 5**

**అత్ర యజమానః పరస్తాదాయుషః స్వాహాపజహి పరిఘమిత్యుక్త్వోత్తిష్ఠతి తస్మై వసవః ప్రాతః సవనగ్ం సంప్రయచ్ఛన్తి. 6**

ప్రాతఃకాలంలో చదవటానికి తగిన అనువాకం శస్త్రమనే పేరుగల స్తుతిపాఠం. ఇదే ప్రాతరనువాకం. ఈ ప్రాతరనువాకం చదవటానికి ముందుగా యజమాని గార్హపత్యాగ్నికి వెనుకవైపున ఉత్తరాభిముఖంగా కూర్చుండి, వసుదేవతా స్తుతిసంబంధమైన సామాన్ని గానం చేయాలి. (శస్త్రమనేది ఒక శ్లోకం లాంటిది. అది ఏ మంత్రానికి భాగంకాదు. గేయానికి వీలుపడని ఒక ఋక్ మంత్రం. వల్లించటానికే ఉపయోగిస్తుంది. యజమాని (గృహపతి) ఇంట్లో ఉండే గార్హపత్యాగ్ని).

ఓ అగ్నిదేవా! ఈ పృథివీలోక ప్రాప్తికోసం దీని ద్వారాన్ని తెరు. ఆ విధంగా తెరిస్తే మేము ఆ ద్వారం గుండా రాజ్యప్రాప్తికోసం నీ దర్శనం చేయగలుగుతాం. అంటే, ఈ భూమిమీద అనుభవించటానికి వీలయ్యే భోగాలను పొందగలుగుతాం. (మంత్రంలో 'హుమ్' అనేది స్తోభాక్షరం. అంకెలన్నీ ఆలాపనకు తీసికోవలసిన కాలాన్ని తెలియచేస్తాయి.)

తరువాత యజమాని ఈ మంత్రం చదివి హవనం చేస్తాడు – హోమం చేస్తాడు.

'పృథివీ లోకంలో ఉండే అగ్నిహోత్రునికి నమస్కారం చేస్తున్నాను. ఈ పృథివీలోకంలో ఉండే యజమానినైన నాకు పుణ్యలోక ప్రాప్తి కలిగించు'.

"ఇది నిజానికి యజమానుని లోకం! నా ఆయుర్దాయం పరిసమాప్తి చెందిన తరువాత పుణ్యలోకాల్ని పొందుదునుగాక! స్వాహా" అనే మంత్రార్థంగల మంత్రం చదివి హోమం చేయాలి. "నీవు ఈ లోకపు ద్వారానికి ఉన్న గడియను తీసివెయ్యి! అంటూ లేచి నిలబడతాడు. తరువాత ఈ

హోమానికి ఫలంగా వసువులు (వసుదేవతలు) ఆ యజమానికి ప్రాతస్సవన లోకాలు (వసులోకాలు) ప్రదానం చేస్తారు.

**పురా మధ్యందినస్య సవనస్యోపాకరణాజ్జఘనే నాగ్నీ ధ్రీయస్యోదఙ్ముఖ ఉపవిశ్య స రౌద్రం సామాభి గాయతి.** **7**

**లో3 కద్వారమపావా 3 ర్ణూ 33 పశ్యేమ త్వావయం వైరా 33333 హు3 మ్ ఆ 33 జ్యా 3 యో 3 ఆ 32111 ఇతి.** **8**

**అథ జుహోతి నమో వాయవేఽన్తరిక్షక్షితే లోకక్షితే లోకం మే యజమానాయ విన్దైష వై యజమానస్య లోక ఏతాస్మి.** **9**

**అత్ర యజమానః పరస్తాదాయుషః స్వాహాపజహి పరిఘమిత్యు క్త్వోత్తిష్ఠతి తస్మై రుద్రా మాధ్యందినం సవనం సంప్రయచ్ఛన్తి.** **10**

మధ్యాహ్న సవనంలో రౌద్ర సామగానం చేయాలి అని.

మధ్యాహ్న సవనం ఆరంభించటానికి పూర్వం యజమాని దక్షిణాగ్ని (ఆగ్నీధ్ర్యాగ్ని) వెనుకభాగంలో ఉత్తరాభిముఖంగా కూర్చుండి వైరాజ్య పదప్రాప్తి కోసం రుద్రదేవతా సంబంధమైన సామం గానం చేయాలి.

మంత్రార్థం – ఓ వాయూ! నీవు అంతరిక్ష లోకద్వారాన్ని తెరిస్తే ఆ ద్వారంగుండా వైరాజ్య పదాన్ని పొందటానికై నీ దర్శనం చేసుకుంటాను. (విరాట్పురుషుని పొందటమే వైరాజ్యపదప్రాప్తి అని కొందరు అంటారు.)

తరువాత యజమాని ఈ మంత్రంతో హోమం చేస్తాడు – మంత్రార్థం 'అంతరిక్షంలో ఉండే వసుదేవునికి నమస్కారము. యజమానినైన నాకు నీవుండే అంతరిక్షలోకం ప్రాప్తించేటట్లు చెయ్యి. నిశ్చయంగా ఆ లోకం యజమాని కోసమే! నేను దానిని పొందుతాను.

తరువాత యజమాని ఈ అర్థం వచ్చే మంత్రం చదివి హోమం చేస్తాడు. ఆ మంత్రార్థం – 'నేను చనిపోయిన తరువాత అంతరిక్ష లోకాన్ని పొందుతాను. స్వాహా!' 'అంతరిక్ష లోక ద్వారాలకున్న గడియలు తీసివెయ్యి' అంటూ లేస్తాడు. అప్పుడు రుద్రగణం ఆ యజమానికి మధ్యాహ్న సవనానికి చెందిన లోకాలను ప్రసాదిస్తారు.

**మం॥ పురా తృతీయసవనస్యోపాకరణాజ్జఘ నేనాహవనీయ స్యోద–ఙ్ముఖ ఉపవిశ్య స ఆదిత్యం స వైశ్వదేవం సామాభిగాయతి. లో 3 కద్వారమపావా 3 ర్ణూ 33 పశ్యేమ త్వా వయం స్వారా 33333 హు 3మ్ ఆ 33 జ్యా 3 యో 3 ఆ 32111 ఇతి.** **12**

**ఆదిత్య మథ వైశ్వదేవం లో 3 క ద్వార మపావా 3 ర్ణూ 33 పశ్యేమ త్వా వయం సా(మ్రా**
**33333 హు3మ్ ఆ 33 జ్యా 3 యో 3 ఆ 32111 ఇతి.** **13**

**అథ జుహోతి నమ ఆదిత్యేభ్యశ్చ విశ్వేభ్యశ్చ దేవేభ్యో దివిక్షిద్భ్యో లోకాక్షిద్భ్యో లోకం మే యజమానాయ విన్దత.** **14**

**ఏష వై యజమానస్య లోక ఏతాస్మృ(త యజమానః పరస్తాదాయుషః స్వాహాపహత పరిఘ మిత్యుక్త్వో త్తిష్ఠతి.** **15**

**తస్మా ఆదిత్యాశ్చ విశ్వే చ దేవా స్తృతీయసవనం సం(ప్రయచ్ఛన్త్యేష హ వై యజ్ఞస్య మా(త్రాం వేద య ఏవం వేద య ఏవం వేద.** **16**

తృతీయ సవనం (ప్రారంభించటానికి పూర్వం యజమాని ఆహవనీయాగ్నికి వెనుకభాగాన ఉత్తరాభిముఖుడై కూర్చుండి స్వరాజ్యము, సా(మ్రాజ్యము పొందటం కోసం వరుసగా ఆదిత్య విశ్వదేవతా సంబంధమైన గానం చేస్తాడు.

మం(త్రార్థం – 'ఓ దేవా! నీవు ఆ లోకానికున్న ద్వారాన్ని తెరు. ఆ విధంగా తెరిస్తే మేము స్వరాజ్య (ప్రాప్తి కోసం ఆ లోకంలో ఉన్న నిన్ను పొందగలుగుతాం' ఇది ఆదిత్య సామం.

'ఓ దేవా! ఆ లోక ద్వారాలకున్న గడియలను తొలగించు. ఆ విధంగా తొలగిస్తే సా(మ్రాజ్య (ప్రాప్తికోసం ఆ లోకంలో ఉన్న నిన్ను దర్శించగలుగుతాం' ఇది విశ్వేదేవసామం.

తరువాత యజమాని ఈ మం(త్రం చదివి అహుతులిస్తాడు. మం(త్రార్థం – 'స్వర్గంలో ఉండే (ద్యులోకవాసులైన) ఆదిత్యునికి, విశ్వేదేవునికి నమస్కారం. యజమానినైన నాకు పుణ్యలోకాలు ఇవ్వండి'.

'నిశ్చయంగా ఇది యజమానుని లోకం. నేను దానిని పొందవలసిన వాడిని. ఇక్కడ నా ఆయుర్దాయం పూర్తికాగానే నేను స్వర్గాన్ని పొందుతాను. స్వాహా!' అని హోమం చేయాలి. 'ఈ లోక ద్వారాల గడియలు తొలగించు' అంటూ లేవాలి.

ఈ విధంగా చేసే యజమానికి ఆదిత్యులు, విశ్వేదేవతలు తృతీయ సవనాన్ని (దాని ఫలాన్ని) (ప్రసాదిస్తారు. ఇది తెలుసుకొన్నవాడు నిశ్చయంగా వెనుక చెప్పిన యజ్ఞం యొక్క యదార్థ స్వరూపాన్ని తెలుసుకొన్నవాడౌతాడు.

# మూడవ అధ్యాయం

## మొదటి ఖండం

**మం॥ ఓం అసౌ వా ఆదిత్యో దేవమధు తస్య ద్యౌరేవ తిరశ్చీనవంశోఽన్తరి క్షమపూపో మరీచయః పుత్రాః 1**

ఆదిత్యుని యందు మధువును (తేనె) ఆరోపించి ఆ విధంగా ఆదిత్యుని ఉపాసించటం చెపుతున్నారు.

ఓం. ఆ దూరంగా మనకు కనిపిస్తున్న ఆదిత్యుడే – దేవతలను తృప్తి పరచేవాడు అవటంవల్ల – ఆ దేవతలకు మధువు వంటివాడు. ద్యులోకం – స్వర్గలోకమే అడ్డంగా – వంకరగా ఉండే వాసం వంటిది – అంటే, తేనెపట్టు పట్టేందుకు వీలైన కఱ్ఱ వంటిది. అంతరిక్షం తేనెపట్టులాగా వ్రేలాడుతోంది. ఆదిత్యుని నుండి వచ్చే కిరణాలు తేనెతుట్టెలో ఉండే తేనెటీగల పిల్లలు.

**మం॥ తస్య యే ప్రాంచో రశ్మయస్తా ఏవాస్య ప్రాచ్యో మధునాడ్యః ఋచ ఏవ మధుకృత ఋగ్వేద ఏవ పుష్పం తా అమృతా ఆపస్తా వా ఏతా ఋచః. 2**

**ఏత మృగ్వేద మభ్యతపం స్తస్యాభిత ప్తస్య యశస్తేజ ఇంద్రియం వీర్యమన్నాద్యగ్ం రసోఽజాయత. 3**

**తద్వ్యక్షరత్తదాదిత్యమభితోఽశ్రయత్తద్వా ఏతద్య దేత దాదిత్యస్య రోహితం రూపమ్. 4**

ఆ ఆదిత్య స్వరూపమైన మధువుకు తూర్పుదిక్కున ఉండే కిరణాలే అంతరిక్షరూపమైన తేనెతుట్టెలోని గదులు. ఋక్కులు తేనెటీగలు. ఋగ్వేదమే పుష్పం. తేనెటీగల్లాగా ఋక్కులే కర్మలనే పూలలోంచి అమృతమనే మధువును తయారు చేస్తున్నాయి. అగ్నిలో ప్రక్షిప్తమై ఉండే సోమరసం అనే అమృతమే జలం. అగ్నిలో హోమం చేయబడే సోమం, నెయ్యి, పాలు మొదలైనవి వేడెక్కి ఆవిరియై జలరూపం దాల్చి అమృతంగా ఆ కిరణాలలో నిక్షిప్తమై ఉంది. హోమం చేసినప్పుడు ఋగ్వేద మంత్రాలు తేనెటీగలు తేనెను గ్రహించినట్లుగా ఈ అమృతాన్ని గ్రహిస్తాయి. అమృతమంటే హోమం చేయటంవల్ల కలిగిన కనిపించని ఫలితం. అదే దశలవారీగా అమృతత్వానికి – మోక్షానికి కారణమౌతుంది.

ఋక్కులనే తేనెటీగలే ఈ ఋగ్వేదమనే పుష్పాన్ని అభితప్తం చేశాయి. ఆ విధంగా వేడి చేయబడిన ఋగ్వేదం నుండి యాగాది రూపమైన కర్మలవల్ల ఖ్యాతి, శరీర సంబంధమైన దీప్తి, శక్తివంతమైన ఇంద్రియాలు, బలము, అన్నాద్యరూపమైన రసం ఉత్పన్నమైనాయి.

ఆ విధంగా యశస్సు మొదలుకొని అన్నాద్యపర్యంతం (తినటానికి వీలైన ఆహారం వరకు) రసరూపంగా పోయి, అది ఆదిత్యుని పూర్వ భాగంతో (తూర్పువైపున) ఆశ్రయం పొందింది. ఈ ఉదయించే సూర్యుని ఎఱ్ఱని రూపం నిజంగా ఆ రసమే!

రెండవ ఖండం

**మం॥ అథ యోఽస్య దక్షిణా రశ్మయస్తా ఏవాస్య దక్షిణా మధునాడ్యో యజూ గ్ంష్యేవ మధుకృతో యజుర్వేద ఏవ పుష్పం తా అమృతా ఆపః** **1**

**తాని వా ఏతాని యజూగ్ంష్యేతం యజుర్వేదమభ్య తపగ్ం స్తస్యాభి తప్తస్య యశస్తేజ ఇంద్రియం వీర్య మన్నాద్యం రసోఽజాయత.** **2**

**తద్వ్యక్షర త్తదాదిత్యమభితోఽశ్రయత్తద్వా ఏతద్య దేతదాదిత్యస్య శుక్లగ్ం రూపమ్.** **3**

ఆదిత్యుని యొక్క దక్షిణ దిక్కు ఉండే కిరణాలలో మధునాడ్య దృష్టిని వివరిస్తున్నారు. దక్షిణదిక్కులో ఉన్నట్టి కిరణాలే ఈ ఆదిత్యరూపమైన మధువు యొక్క దక్షిణ దిక్కులో ఉన్న తేనెతుట్టెలోని గదులు. యజుర్వేదంలో చెప్పబడినట్టి యజుర్వేద మంత్రాల ద్వారా నిర్వర్తింపబడే కర్మలందు ప్రయుక్తమయ్యే యజుస్సులే – యజుర్మంత్రాలే తేనెటీగలు. యజుర్వేద విహితమైన కర్మయే పుష్పం. అగ్నిలో ఉంచబడిన – హోమం చేయబడిన సోమం, నెయ్యి, పాలు మొదలైనవే అమృత జలం.

ఈ యజుర్మంత్రాలు యజుర్వేదాన్ని లేదా యజుర్వేద విహితమైన కర్మలను అభితప్తం చేశాయి–వేడి కలిగించాయి. అభితప్తమైన యజుర్వేదం నుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియాలు, బలము, భోజ్యరూపమైన అన్నము (అన్నరసము) ఉత్పన్నమైనాయి.

ఆ రసం మెల్లగా కదలిపోయి ఆదిత్యుని దక్షిణ భాగాన్ని ఆశ్రయించింది. ఆదిత్యునిలో కనిపించే శుక్లరూపం (తెల్లని రూపం) నిశ్చయంగా ఈ రసమే!

## మూడవ ఖండం

**మం॥ అథయేఽస్య ప్రత్యంచో రశ్మయస్తా ఏవాస్య ప్రతీచ్యో మధునాడ్యః సామాన్యేవ మధుకృతః సామవేద ఏవ పుష్పం తా అమృతా ఆపః.** **1**

**తాని వా ఏతాని సామాన్యేతగ్ం సామవేద మభ్యత పగ్ంఽస్తస్యాభితప్తస్య యశస్తేజ ఇంద్రియం వీర్య మన్నాద్యం రసోఽజాయత.** **2**

**తద్వ్యక్షర త్తదాదిత్య మభితోఽశ్రయత్తద్వా ఏతద్య దేతదాదిత్యస్య కృష్ణం రూపమ్.** **3**

ఆదిత్యుని పశ్చిమ దిక్కున ఉండే కిరణాల్లో మధునాధ్యదృష్టి.

ఆదిత్యుని పశ్చిమ దిక్కున ఉండే కిరణాలే సూర్యుడనే మధువు యొక్క పడమటి దిక్కున ఉండే తేనెతుట్టెలోని గదులు. సామవేద మంత్రాలే తేనెటీగలు. సామవేదమే లేదా సామవేదోక్తమైన కర్మలే పుష్పాలు. సోమాది రూపమైన అమృతమే జలం.

ఈ సామవేద మంత్రాలే (తేనెటీగలు). ఈ సామవేద విహితమైన కర్మలనే పుష్పాలను అభితప్తం చేశాయి, ఆ విధంగా అభితప్తమైన సామవేదం నుండి యశస్సు, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యం, భుజించటానికి వీలైన అన్నం రూపమైన రసం ఉత్పన్నమైనాయి.

ఆ రసమే మెల్లగా కదలిపోయి ఆదిత్యుని పశ్చిమ భాగాన్ని ఆశ్రయించింది. ఆదిత్యునిలో ఉండే నల్లని తేజస్సు ఇదే!

## నాల్గవ ఖండం

**మం॥ అథ యేఽస్యోదంచో రశ్మయస్తా ఏవాస్యోదీచ్యో మధునాడ్యోఽథర్వాంగి రస ఏవ మధుకృత ఇతిహాస పురాణం పుష్పం తాఅమృతా ఆపః. 1**

**తే వా ఏతేఽథర్వాంగిరస ఏతదితిహాస పురాణమభ్య తపంస్తస్యభి తప్తస్య యశస్తేజ ఇంద్రియం వీర్య మన్నాద్యం రసోఽజాయత. 2**

**తద్వ్యక్షరత్తదాదిత్య మభితోఽశ్రయత్తద్వా ఏతద్య దేతదాదిత్యస్యపరం కృష్ణం రూపమ్. 3**

ఆదిత్యుని ఉత్తర దిగ్వర్తియైన కిరణాల్లో మధునాధ్య దృష్టి – ఆదిత్యుని ఉత్తర దిక్కున ఉండే కిరణాలే ఆదిత్యుని మధునాడులు – తేనె తుట్టెలోని గదులు. అథర్వాంగిరస మంత్రాలే తేనెటీగలు (అథర్వుడు, అంగిరులనే మహర్షులు దర్శించిన మంత్రాలు) ఇతిహాసాలు, పురాణాలు, పుష్పాలు. ఎందుచేతనంటే ఆశ్వమేధయాగంలోని పారిప్లవరాత్రులందు ఈ ఇతిహాస పురాణాదులు ఉపయోగపడతాయి. అనేక దినాలపాటు సాగే అశ్వమేధంలో యజమానికి అలసట లేకుండా ఉండేందుకు ఇతిహాస పురాణాలకు సంబంధించిన కథలు విధిగా ఋత్విక్కులచేత చెప్పబడతాయి కాబట్టి. వెనుక చెప్పిన సోమాది రూపమైనదే అమృతజలం.

ఈ అథర్వణవేదం, ఈ ఇతిహాస పురాణాలనే పూలను అభితప్తం చేసింది. ఆ విధంగా అభితప్తమైన పూలనుండి యశము, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యము, అన్నాద్యరూపమైన రసం పుట్టినాయి.

ఈ రసమే మెల్లగా పోయి ఆదిత్యుని ఉత్తరభాగాన చేరింది – ఆశ్రయించింది. ఆదిత్యుని మిక్కిలి నల్లనైన రూపమే ఈ రసం.

## అయిదవ ఖండం

**మం॥ అథః యేఽస్యోర్ధ్వా రశ్మయస్తా ఏవాస్యోర్ధ్వా మధు నాడ్యో గుహ్యా ఏవాదేశా మధుకృతో బ్రహ్మైన పుష్పం తా అమృతా ఆపః. 1**

**తే వా ఏతే గుహ్యా ఆ దేశా ఏతద్బ్రహ్మ భ్యతపం స్త స్యాభిత ప్తస్య యశస్తేజ ఇంద్రియం వీర్యమన్నాద్యం రసోఽజాయత. 2**

**తద్వ్యక్షర త్తదాదిత్య మభితోఽశ్రయత్తద్వా ఏతద్య దేతదాదితస్యమధ్యే క్షోభత ఇవ. 3**

**తేవా ఏతే రసావాం రసా వేదా హి రసాస్తేషామేతే రసాస్తాని వా ఏతాన్య మృతా నా మమృతాని వేదా హ్యమృతాస్తేషా మేతాన్యమృతాని. 4**

ఆదిత్యుని ఊర్ధ్వదిగ్వర్తియైన కిరణాల్లో మధునాడ్యాది దృష్టి – ఆదిత్యుని యొక్క పైకి వ్యాపించే కిరణాలే ఊర్ధ్వదిక్కులో వున్న తేనె తుట్టెలోని గదులు. అత్యంత రహస్యమైన ఆదేశాలే తేనెటీగలు – అంటే లోకద్వారాలు తెరువ వలసిందిగా చేసే ప్రార్థనలే తేనెటీగలు. ప్రణవం – ఓంకారమనే బ్రహ్మయే పుష్పం. సోమరసాది రూపమైన అమృతమే జలం.

ఆ రహస్యమైన ఆదేశాలనే తేనెటీగలు ఓంకారమనే పుష్పాన్ని అభితప్తం చేశాయి. ఆ విధంగా అభితప్తమైన పుష్పం నుండి (ప్రణవం నుండి) యశము, తేజస్సు, ఇంద్రియాలు, వీర్యం, భోజ్యాన్న రూపమైన రసం పుట్టాయి.

ఆ రసం వెళ్ళి ఆదిత్యుని పైభాగాన్ని ఆశ్రయించింది. ఆదిత్యుని మధ్యలో చలిస్తూన్నట్లు కనిపించే ఆ భాగమే మధువు.

వెనుక చెప్పినట్లు లోహితాది రూపాలే రసాలకు రసం. లోకాలకు సారభూతమైనందున వేదాలే రసాలు. ఈ వర్ణాలు రసానికి రసంలాటివి. అవే అమృతానికి అమృతంలాంటివి. నిత్యాలు కాబట్టి వేదాలే అమృతాలు. లోహితాది రూపాలు వాటికంటె కూడా అమృతాలు – నాశనం లేనివి.

## ఆరవ ఖండం

**మం॥ తద్యత్ప్రథమ మమృతం తద్వసవ ఉపజీవ న్త్యగ్నినా ముఖేన న వై దేవా అశ్నన్తి న పిబన్త్యేత దేవామృతం దృష్ట్వా తృప్యన్తి. 1**

**త ఏతదేవ రూపమభి సంవిశన్త్యేత స్మాద్రూపా ద్యుదన్తి. 2**

**స య ఏతదేవమమృతం వేద వసూనామేవైకో భూత్వాగ్నినైవ**

**ముఖేనైత దేవామృతం దృష్ట్వా తృప్యతి స ఏతదేవ రూపమభి సంవిశ్యతే తస్మా ద్రూపాదుదేతి. 3**

**స యావదాదిత్యః పురస్తాదుదేతా పశ్చాద స్తమేతా వసూనామేవ తావదాధిపత్యం స్వారాజ్య పర్యేతా. 4**

వీటిలో లోహితవర్ణం గల మొదటి అమృతాన్ని అగ్నిదేవుని ద్వారా వసువులు అనుభవిస్తారు. నిజానికి దేవతలు తినేది ఏమీ ఉండదు – త్రాగేది ఉండదు. వారు ఆదిత్యుని తూర్పుభాగంలో ఉండే ఎఱ్ఱని వర్ణంగల అమృతాన్ని చూస్తూ – అన్ని ఇంద్రియాలతోనూ అనుభవిస్తూ తృప్తి పడతారు. వసుదేవతాగణం ఈ అమృతరూపాన్ని చూచి తృప్తులై ఉంటారు. ఏ విధమైన ఆసక్తినీ చూపరు. అంటే దేనినైనా సరే తమ ఇంద్రియాలన్నింటితో అనుభవించి తృప్తులౌతారు – మనం దీనిని అనుభవించాల్సిన సమయం రాలేదు. అటువంటి సమయం వచ్చినప్పుడు మళ్ళీ అమృతం యొక్క ఈ రూపంతోనే ఉత్సాహాన్ని పొందవచ్చు అని భావిస్తారు. ఆసక్తి ఉన్నప్పుడే అనుభవానికి అవకాశం ఉంటుంది. ఆసక్తి చూపటం లేదు కాబట్టి అనుభవించరు అని భావం. (లోక వ్యవహారంలో కూడా భోజ్యవస్తువును ఆకలి లేనప్పుడు, తిందామనే ఆసక్తి లేనప్పుడు దానిని చూచి తృప్తిపడతాము – అవసరమైనప్పుడు తినటానికి ఉన్నదికదా అని. దేవతల విషయంలో కూడా అంతే! వాళ్ళకు ఆకలి దప్పులు లేవు కాబట్టి తినటం త్రాగటం ఉండదు అని. కళ్ళతో చూచి, ముక్కుతో వాసన చూచి, చేతులతో పట్టుకొని ఇట్లా ఇంద్రియాలతో అనుభవించి తృప్తి పడతారు అని భావం).

పైన చెప్పిన అమృతానికి సంబంధించిన విషయం తెలిసినవాడు వసువులలో ముఖ్యుడై అగ్నిముఖం ద్వారానే ఈ అమృతాన్ని చూచి తృప్తుడౌతాడు. వెనుక చెప్పినట్లుగా దాని రూపాన్ని చూచే ఉదాసీనుడౌతాడు – ఆసక్తి చూపడు. మళ్ళీ అవసరం వచ్చినపుడు ఈ రూపాన్ని చూచే ఉత్సాహాన్ని పొందుతాడు.

సూర్యుడు తూర్పున ఉదయించి, పశ్చిమాన అస్తమించినంతకాలం వసువులకు భోగకాలమే! అనుభవించేకాలమే! అంటే, అంతకాలముగా ఆ విద్వాంసుడు వసువుల ఆధిపత్యాన్ని, స్వారాజ్యాన్ని పొందుతాడు.

## ఏడవ ఖండం

**మం॥ అథ యద్ద్వితీయమమృతం తద్రుద్రా ఉపజీవ న్తీంద్రేణ ముఖేన న వై దేవా అశ్నన్తి న పిబన్త్యేత దేవామృతం దృష్ట్వా తృప్యన్తి. 1**

**త ఏతదేవ రూపమభిసంవిశన్త్యే తస్మాద్రూపాదుద్యన్తి. 2**

**స య ఏతదేవ మమృతం వేద రుద్రాణామేవైకో భూత్వేంద్రేణైవ ముఖేనైతదేవామృతం**

**దృష్ట్వా తృప్యతి స ఏతదేవ రూపమభిసంవిశత్యే తస్మాద్రూపా దుదేతి. 3**

**స యావదాదిత్యః పురస్తాదుదేతా పశ్చాదస్తమేతా ద్విస్తావద్దక్షిణత ఉదేతోత్తరతోఽ స్తమేతా రుద్రాణా మేవ తావదాధిపత్యం స్వారాజ్యంఽ పర్యేతా. 4**

రుద్రులయొక్క ఉపజీవన స్వరూపమైన ద్వితీయామృతోపాసన – ఈ రెండవ అమృతం. ఇంద్రుడు ప్రధానుడుగా రుద్రగణంచేత అనుభవింప బడుతుంది. దేవగణం నిజానికి తినటం త్రాగటం అనేది ఉండదు. ఆ అమృతాన్ని చూచే తృప్తి చెందుతారు.

అనుభవించే సమయం కానందువల్ల, ఆ దేవతలు ఆ అమృతాన్ని చూచి నిర్లిప్తులుగా ఉంటారు – తినాలనే ఆసక్తి చూపరు. భోగసమయం ఆసన్నమైనప్పుడు ప్రయత్నశీలురు అవుతారు.

ఈ అమృతాన్ని గురించి ఈ విధంగా తెలుసుకున్నవాడు రుద్రులలో ప్రముఖుడై ఆ అమృతాన్ని చూచి ఉదాసీనుడై మళ్ళీ దానిని చూచే ఉద్యమశీలుడౌతాడు.

సూర్యుడు తూర్పున ఉదయించి పశ్చిమాన అస్తమించటానికి పట్టే కాలానికి రెట్టింపు కాలం దక్షిణాన ఉదయించి ఉత్తరాన అస్తమించటానికి పడుతుంది. ఇంతకాలం ఆ విద్వాంసునికి రుద్రులవంటి ఆధిపత్యం స్వారాజ్యం లభిస్తుంది.

ఎనిమిదవ ఖండం

**మం॥ అథ యత్తృతీయ మమృతం తదాదిత్యా ఉపజీవన్తి వరుణేన ముఖేన న వై దేవా అశ్నన్తి న పిబన్త్యేత దేవామృతం దృష్ట్వా తృప్యన్తి. 1**

**త ఏతదేవ రూపమభిసంవిశ న్త్యేతస్మాద్రూపాదుద్యన్తి. 2**

**స య ఏతదేవ మమృతం వేదాదిత్యానామేవైకో భూత్వా వరుణేనైవ ముఖేనైతదేవామృతం దృష్ట్వా తృప్యతి స ఏతదేవ రూపమభి సంవిశత్యే తస్మాద్రూపా దుదేతి. 3**

**స యావదాదిత్యో దక్షిణత ఉదేతోత్తరతోఽ స్తమేతా ద్విస్తావ త్పశ్చాదుచేతా పురస్తాద స్తమేతా దిత్యానా మేవ తావదాధిపత్యం స్వారాజ్యం పర్యేతా. 4**

ఈ మూడవదైన అమృతాన్ని ఆశ్రయించి వరుణుడు ప్రధానుడుగా ఆదిత్యగణం జీవిస్తుంది. దేవతలు భుజించటం, త్రాగటం ఉండదు. ఈ అమృతాన్ని అన్ని యింద్రియాలతోను అనుభవించి తృప్తిపడతారు.

వెనుక చెప్పినట్లుగా వారు (ఆదిత్యులు) దాని ఆకారాన్ని చూచే తృప్తి పడతారు. సమయం వచ్చినపుడు అనుభవించటానికి మళ్ళీ ప్రయత్నశీలురు అవుతారు.

ఈ అమృతాన్ని గురించి తెలుసుకున్నవాడు, ఆదిత్యులలో ముఖ్యుడై వరుణుని ప్రధానిగా చేసుకొని దానిని (అమృతాన్ని) చూచే తృప్తుడౌతాడు. ఆ రూపాన్ని చూచి నిర్లిప్తుడై మళ్ళీ ఆసక్తితో ఉత్సాహితుడౌతాడు.

సూర్యుడు తూర్పున ఉదయించి పశ్చిమాన అస్తమించటానికి పట్టే కాలానికి రెట్టింపు కాలం పశ్చిమాన ఉదయించి తూర్పున అస్తమించటానికి పడుతుంది. అంతకాలమూ అతడు ఆదిత్యుల ఆధిపత్యాన్ని, స్వారాజ్యాన్ని పొందుతాడు.

తొమ్మిదవ ఖండం

**మం॥ అథ యచ్చతుర్థమమృతం తన్మరుత ఉపజీవన్తి సోమేన ముఖేన న వై దేవా అశ్నన్తి న పిబన్త్యే తదేవా మృతం దృష్ట్వా తృప్యన్తి.** 1

**త ఏత దేవ రూపమభిసంవిశన్త్యేతస్మాద్రూపాదుద్యన్తి.** 2

**స య ఏతదేవ మమృతం వేద మరుతామేవైకో భూత్వా సోమేనైవ ముఖేనైత దేవామృతం దృష్ట్వా తుష్యతిస ఏతదేవ రూపమభిసంవిశ త్యేతస్మా ద్రూపాదుదేతి.** 3

**స యావదాదిత్యః పశ్చాదుదేతా పురస్తాదస్త మేతా ద్విస్తావదుత్తరత ఉదేతాదక్షిణతోఽ స్తమేతామరుతా మేవ తావదాధిపత్యం స్వారాజ్యం, పర్యేతా.** 4

ఇక నాల్గవదైన అమృతం, సోముడు ప్రధానుడుగా మరుద్గణం దానిని (అమృతాన్ని) అనుభవిస్తుంది. అయితే దేవతలు – మరుత్తులు భుజించటం, త్రాగటం అనేది ఉండదు. వారు కేవలం దీనిని – అమృతాన్ని చూచి తృప్తులౌతారు.

ఈ అమృతాన్ని చూచినంత మాత్రం చేతనే ఉదాసీనులై, మళ్ళీ దీనివల్లనే ప్రయత్నశీలురౌతారు.

ఈ అమృతాన్ని ఉపాసించేవారు మరుత్తులలో ప్రముఖులై సోమ దేవత యొక్క నాయకత్వంలో ఈ అమృతాన్ని చూచింనంతనే తృప్తులౌతారు. అనుభవించాల్సిన అగత్యం లేనందున ఉదాసీనులై మళ్ళీ దానిన చూచే ఉద్యమశీలురు అవుతారు.

ఆదిత్యుడు పశ్చిమాన ఉదయించి తూర్పున అస్తమించటానికి ఎంతకాలం పడుతుందో దానికి రెట్టింపుకాలం ఉత్తరాన ఉదయించి దక్షిణాన అస్తమించటానికి పడుతుంది. అంతకాలమూ ఆ ఉపాసకుడు మరుద్గణాల అధిపత్యాన్ని, స్వారాజ్యాన్ని పొందుతాడు.

## పదవ ఖండం

మం॥ అథ యత్పంచమమమృతం తత్సాధ్యా ఉపజీవన్తి బ్రహ్మణా ముఖేన న వై దేవా అశ్నన్తి న పిబంత్యే తదేవామృతం దృష్ట్వా తృప్యన్తి. 1

త ఏత దేవ రూపమభిసంవిశ న్త్యేతస్మాద్రూపాదుద్యన్తి. 2

స య తేదేవమమృతం వేద సాధ్యానామేవైకో భూత్వా బ్రహ్మణైవ ముఖేనైత దేవామృతం దృష్ట్వా తృప్యతి స ఏతదేవ రూపసంవిశత్యే తస్మా ద్రూపా దుదేతి. 3

స యావదాదిత్య ఉత్తరత ఉదేతా దక్షిణతోఽ స్తమేతా ద్విస్తావదూర్ధ్వ ఉదే తార్వాఙ్గస్తమేతా సాధ్యానామేవ తావదాధిపత్యగ్ం స్వారాజ్యం పర్యేతా. 4

ఇక ఐదవదైన అమృతం. ఇది సాధ్యులచేత బ్రహ్మ వారికి అధినేత కాగా (వారిచేత) అనుభవింపబడుతోంది. ఈ దేవతలు (సాధ్యులు) దానిని నిజంగా తినకపోయినా త్రాగకపోయినా దానిని చూచి తృప్తులౌతూంటారు.

దానిని చూచినంత మాత్రం చేతనే విముఖులౌతారు – మళ్ళీ దానిని చూచే ఉత్సాహితులౌతారు.

ఈ అమృతాన్ని ఈ విధంగా తెలుసుకున్నవాడు సాధ్యులలో ఒకడై, ఆ అమృతాన్ని చూచినంతనే బ్రహ్మ అధినాయకుడు గాగల సాధ్యుల లాగానే తృప్తుడౌతాడు. మళ్ళీ దానివల్లనే ఉత్సాహాన్ని పొందుతాడు. సూర్యుడు ఉత్తరాన ఉదయించి, దక్షిణాన అస్తమించటానికి ఎంతకాలం పడుతుందో, అంతకు రెట్టింపుకాలం ఊర్ధ్వ దిక్కున ఉదయించి అధోదిశయందు అస్తమించటానికి పడుతుంది. అంతకాలం ఉపాసకుడు సాధ్యుల ఆధిపత్యాన్ని, స్వారాజ్యాన్ని పొందుతాడు.

పైన చెప్పిన మంత్రాన్ని బట్టి చూస్తే సూర్యుడు పశ్చిమాన, ఉత్తరాన, ఊర్ధ్వదిక్కున ఉదయించి వాటి వ్యతిరేక దిశలో అస్తమించటం, ఆ విధంగా ఉదయాస్తమయాలకు పట్టేకాలం అంతకు పూర్వం దానికంటె రెట్టింపు కాలం పడుతుందని చెప్పారు.

పురాణాల్లో చెప్పేవిధంగా అయితే ఇది సరిపోదు. పౌరాణికుల అభిప్రాయం ప్రకారం నాల్గు దిక్కులలోను – ప్రాంతాల్లోను ఉదయాస్తమయాలకు పట్టేకాలం ఒకటే అని, నాలుగు దిక్కులు ఇంద్ర, యమ, వరుణ, సోముల ఆధిపత్యంలో ఉన్నట్లు, వీరినే దిక్పాలురని చెపుతారు. అంతేకాక, మానస సరోవరానికి ఉత్తరంగా ఉండే మేరువు పర్వతం చుట్టూ కక్ష్యచుట్టూ తిరగటానికి పట్టేకాలము, మిగతా నాలుగు దిక్కులకు పట్టేకాలము ఒకటే అని అంటారు.

ఈ అసంబద్ధతను తొలగించటానికి ద్రవిడాచార్యుడు చెప్పిన అభిప్రాయం ఈ విధంగా ఉంది. ఇంద్రుని ఆధిపత్యం గల స్వర్గ ప్రాంతం కంటె ఇతర ప్రాంతాలు వరుసగా ఒకదాని కొకటి రెట్టింపు దూరంలో ఉన్నాయి. సూర్యుడు ఉదయించటం అంటే, ఆ ప్రాంతంలో నివసించే వారి దృష్టికి కనిపించటం, అస్తమించటం అంటే వారి దృష్టినుండి మాయమవటం. యదార్థానికి సూర్యుడు ఉదయించటం అస్తమించటం అనేది ఏమీ లేదు. ఒక ప్రాంతంలో ప్రజలు లేకపోతే ఆ ప్రాంతానికి ఉదయాస్తమయాలు అనేవి ఉండవు గదా! సూర్యుడు తన కక్ష్యలో వస్తున్నా పోతున్నా చూచేవారు లేకపోతే ఉదయం లేదు. అస్తమయమూ లేదు. కాబట్టి యముని (దక్షిణ) ప్రాంతం. ఇంద్రుని (తూర్పు) స్వర్గానికి రెట్టింపు కాలం దూరంలో వుంది. కాబట్టి యముని ప్రాంతంలో ఉండే జీవులకు సూర్యుడు దక్షిణాన ఉదయించి ఉత్తరాన అస్తమిస్తున్నట్లు కనిపిస్తుంది. మిగతా దిక్కులలోని ప్రాంతాలను కూడా ఇట్లాగే గ్రహించాలి.

మేరువు పర్వతం అన్ని ప్రాంతాలతోను సంబంధం కలిగి ఉత్తరాన ఉంటుంది. సూర్యుడు స్వర్గంలో సరిగా నడినెత్తిమీదకు వచ్చినపుడు యముని ప్రాంతంలో ఉదయిస్తున్నట్లు కనిపిస్తుంది. సూర్యుడు యముని ప్రాంతంలో నడినెత్తిమీదకు వచ్చినపుడు వరుణుని ప్రాంతంలో ఉదయిస్తూన్నట్లు కనిపిస్తుంది. అట్లాగే సూర్యుడు తిరిగే కక్ష్య ఒకటే కాబట్టి ఇతర ప్రాంతాల విషయంలోనూ గ్రహించాలి. ఇక ఇలావర్తంలో ఉండేవారికి చుట్టూ ఉన్న మేరువు పర్వతంవల్ల సూర్యకిరణాలు మూసివేయబడి ఉంటాయి. కాబట్టి సూర్యుడు పైన ఉదయించి క్రింద అస్తమిస్తున్నట్లు కనిపిస్తుంది. సూర్యకిరణాలు పర్వతశిఖరాల పైభాగం నుండి ప్రవేశిస్తాయి కాబట్టి పైన ఉదయిస్తున్నట్లు కనిపించటానికి కారణం. ఇక అనుభవించటానికి పట్టే కాలాన్ని బట్టి ఋక్ మంత్రాలు వగైరాలనుండి పుట్టిన అమృతాన్ని అనుభవించటానికి ఒకరికంటె ఒకరికి రెట్టింపు శక్తి ఉంటుందని గ్రహించాలి.

పదునొకండవ ఖండం.

**మం॥అథ తత ఊర్ధ్వ ఉదేత్య నైవోదేతా నాస్తమేతైకల ఏవ మధ్యే స్థాతా త దేష శ్లోకః 1**

**న వై తత్ర న నిమ్లోచ నోదియాయ కదాచన దేవాస్తేనాహం సత్యేన మా విరాధిషి బ్రహ్మణా ఇతి. 2**

**న హ వా అస్మా ఉదేతి న నిమ్లోచతి సకృద్దివా హైవాస్మై భవతి య ఏతామేవం బ్రహ్మోపనిషదం వేద. 3**

ఈ విధంగా ఉదయిస్తూ అస్తమిస్తూ, ఈ ఉదయాస్తమయాల ద్వారా జీవులకు అవి చేసిన కర్మకు ఫలాన్ని ప్రసాదిస్తూ వారు వారు అనుభవించాల్సిన కర్మఫలాలు క్షయమైన తరువాత, ఆయా ప్రాణులన్నింటిని తనలోనే లీనం చేసుకొని ఊర్ధ్వగతుడైనపుడు ఇక సూర్యుడు ఉదయించటము,

అస్తమించటము ఉండదు. ఎందుచేత? ఇక సూర్యుడు అతడు ఒకటే అయినందున నిరవయవుడై తనయందే తాను స్థితుడై ఉంటాడు కాబట్టి దానిని గురించే ఈ శ్లోకం చెప్పబడ్డది.

జ్ఞానవంతులైనవారు పైన చెప్పిన విధంగా వసురుద్రాదులలాగా ఆయా అమృతాలను అనుభవించి, సూర్యునితో అభేదాన్ని పొంది – సూర్యునితోనే తాదాత్మ్యం చెందుతారు. ఇక అప్పుడుండేది సూర్యుడొక్కడే! ఈ విధమైన తాదాత్మ్యస్థితిలో ఉన్నవానిని అడిగారు – ఏమని? "నీవు బ్రహ్మలోకం నుండి వచ్చావు గదా! సూర్యుడు అక్కడ కూడి తిరుగుతూ, రాత్రింబవళ్ళను కలిగిస్తున్నాడా?" అని. అందుకు అతడు (అయోగి) సమాధానం ఇస్తున్నాడు.

నేను ఏ బ్రహ్మలోకం నుండి వచ్చానో అక్కడ నిజంగా సూర్యుడు ఉదయించటమూ లేదు, అస్తమించటమూలేదు. ఓ దేవతలారా! ఈ సత్యాన్ని చెప్పినందుకు బ్రహ్మ నన్ను తనకు వ్యతిరేకినిగా తలచకుందుగాక! బ్రహ్మప్రాప్తి నాకు కలుగుగాక! అని.

పైన చెప్పిన బ్రహ్మవేత్త విషయంలో సూర్యుడు ఉదయించటమూ లేదు అస్తమించటమూ లేదు. ఈ విషయం తెలుసుకున్నవానికి ఎల్లప్పుడూ పగలే!

**మం॥ తద్ధైతద్బ్రహ్మా ప్రజాపతయ ఉవాచ ప్రజాపతిర్మన వే మనుః ప్రజాభ్యస్తద్ధైత దుద్దాలకాయారుణయే జ్యేష్ఠాయ పుత్రాయ పితా బ్రహ్మ ప్రోవాచ. 4**

**ఇదం వావ తజ్జ్యేష్ఠాయ పుత్రాయ పితా బ్రహ్మ ప్రబ్రూయాప ప్రణాయ్యాయ వాన్తేవాసినే. 5**

**నాన్యస్మైకస్మై చన యద్యప్యస్మా ఇమామాద్భిః పరి గృహీతం ధనస్య పూర్ణాం దద్యాదేత దేవ తతో భూయ ఇత్యేత దేవ, తతోభూయ ఇతి. 6**

ఈ విద్యకు సంప్రదాయ పరంపరను చెపుతున్నారు –

హిరణ్యగర్భుడు ప్రజాపతికి, వెనుక చెప్పిన మధువిద్యను చెప్పాడు. తరువాత ప్రజాపతి ఈ విద్యను మనువుకు చెప్పాడు. మనువు ఇక్ష్వాకుడాదిగా తన సంతతికి చెప్పాడు. అరుణుని జ్యేష్ఠ పుత్రుడైన ఉద్దాలకునికి అతని తండ్రి ఈ బ్రహ్మవిజ్ఞానాన్ని చెప్పాడు.

అందుచేత, విద్వాంసులైనవారు ఈ బ్రహ్మవిద్యను తమ జ్యేష్ఠపుత్రునికిగాని, యోగ్యుడైన శిష్యునికిగాని బోధించాలి.

ఇతరులకు దానిని బోధించరాదు – శ్రుతి, దానిని జ్యేష్ఠపుత్రునికి, మంచి శిష్యునికి మాత్రమే బోధించాలని అంటోంది కాబట్టి! దీనిని (ఈ విద్యను) బోధించిన ఆచార్యునికి సముద్రంచేత చుట్టబడినట్టి, ధన ధాన్య సంపన్నమైన ఈ భూమండలమంతా గురు దక్షిణ క్రింద ఇచ్చినా ఈ

విద్యను ఉపదేశించిన ఋణం తీరదు. ఆ భూదానం కంటె, ఈ మధు విద్యాదానం చాలారెట్లు ఫలాన్ని యిచ్చేది కాబట్టి. ఇది ఎక్కువ ఫలాన్ని ఇచ్చేది కాబట్టి!

పంద్రెండవ ఖండం

**మం॥ గాయత్రీ వా ఇదగ్ం సర్వం భూతం యదిదం కించ వాగ్వై గాయత్రీ వాగ్వా ఇదగ్ం సర్వం భూతం గాయతి చ త్రాయతే చ. 1**

**యా వైసా గాయత్రీయం వావ సా యేయం పృథి వ్యస్యాం హీదం సర్వం భూతం ప్రతిష్ఠిత మేతామేవ నాతిశీయతే. 2**

**యా వై సా పృథివీయం వావ సా యదిదమస్మిన్పురుషే శరీరమస్మిన్హీమే ప్రాణాః ప్రతిష్ఠితా ఏతమేవ నాతి శీయన్తే. 3**

**యద్వై తత్పురుషే శరీరమిదం వావ తద్యదితమస్మి న్నంతః పురుషే హృదయ మస్మిన్హీ మే ప్రాణాః ప్రతిష్ఠితా ఏతదేవ నాతిశీయం తే. 4**

**సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ త దేతదృ చాభ్య నుక్తమ్. 5**

(బ్రహ్మను గూర్చిన జ్ఞానం అన్నిటికంటె గొప్ప ఫలితాన్ని ఇచ్చేది కాబట్టి ఈ బ్రహ్మజ్ఞానాన్ని గూర్చే ఇంకా ఇతర విధాలుగా కూడా విశదీకరిస్తున్నారు. ఈ దృష్టితోనే గాయత్రి ద్వారా బ్రహ్మోపాసనను చెపుతున్నారు. 'నేతి, నేతి' అనే మహా వాక్యం ద్వారా తెలుసుకోదగినట్టి పరబ్రహ్మకుండే లక్షణాలన్నీ ఈ గాయత్రికి ఉన్నాయి కాబట్టి గాయత్రి ద్వారా బ్రహ్మోపాసనను చెబుతున్నారు. అనేక ఛందస్సులున్నా గాయత్రి ఛందస్సు మాత్రమే బ్రహ్మజ్ఞానానికి ద్వారం వంటిదని, ఆ గాయత్రియే సోమరసాన్ని తీసికొనివచ్చి దేవతలకిచ్చినదని, గాయత్రీ ప్రాశస్త్యానికి కారణం! ఈ గాయత్రి ఛందస్సును గూర్చిన కథ యిట్లా ఉంది – ఒకానొకప్పుడు దేవతలు, గాయత్రి త్రిష్టుప్ జగతి ఛందస్సులను సోమాన్ని తెచ్చి తమకు ఇవ్వటానికి నియోగించారు. త్రిష్టుప్ జగతి ఛందస్సులు గమ్యాన్ని చేరలేక తిరిగి వచ్చాయి. తిరిగివస్తూ అవి తమలోని అక్షరాల్ని కొన్నింటిని (అలసట కారణంగా) వదలివేశాయి. గాయత్రి మాత్రం సోమం వద్దకు వెళ్ళి దానిని రక్షించేవారిని ఓడించి సోమాన్ని దేవతలకు తెచ్చియిచ్చింది. అంతేకాక, తిరిగి వచ్చేటప్పుడు జగతి ఛందస్సు వదలిన ఒక అక్షరాన్ని, త్రిష్టుప్ వదలిన మూడు అక్షరాల్ని తనలోనికి తీసుకొంది.) అకారణంగా అన్నింటిని మించినదైంది. పైగా గాయత్రి మూడు సవనాలలోను (ప్రాతః, మధ్యాహ్న, సాయం సవనాలు) వ్యాప్తమై ఉంది. గాయత్రి అనేది బ్రాహ్మణునికి అత్యంతా వశ్యకమైనందున కూడా దాని గౌరవం ఇనుమడించింది. తల్లివంటిదైన గాయత్రిని ఉపేక్షించి

ఎవడూ దేనినీ పొందలేడు – బ్రహ్మను కూడా పొందలేడని చెప్పనక్కరలేదు. అందుచేతనే గాయత్రి ద్వారా బ్రహ్మోపాసనను చెపుతున్నారు.)

(గాయత్రీ ఛందస్సులో 24 అక్షరాలు. ఒక్కొక్క పాదానికి 6 అక్షరాల చొప్పున 4 పాదాలు. ఇతర ఛందస్సులలో ఇంకా ఎక్కువ అక్షరాలుంటాయి. పెద్ద సంఖ్యలన్నీ చిన్న అంకెలతోనే తయారౌతాయి కాబట్టి గాయత్రిలోని పాదంలో ఉండే అక్షరాలు ఇతర ఛందోపాదాలన్నింటిలోను అంతర్భూతమై ఉంటాయి. కాబట్టి గాయత్రి అన్నిటికంటె శ్రేష్ఠమైనదని భావం).

స్థావర జంగమాత్మకమైన ఈ ప్రాణి సమూహమంతా గాయత్రియే! వాక్కే గాయత్రి! గాయత్రియే ఈ సమస్త ప్రాణులూను. వాగ్రూపమైన గాయత్రియే అందరి పేర్లను ఉచ్చరిస్తోంది – వాక్కే గాయత్రి కాబట్టి అందరి పేర్లలోను ఉన్నది గాయత్రి అని భావం. కాబట్టి ఈ ప్రాణిజాతమంతా గాయత్రీ స్వరూపమే! ఇది ఆవు. ఇది గుఱ్ఱం అనే వస్తు నిర్దేశం, నామ నిర్దేశం వాక్కువల్లే జరుగుతోంది. అట్లాగే గాయత్రి భయాదులనుండి సమస్త భూతాలను రక్షిస్తోంది –

'నీకేమీ భయంలేదు. నీవు భయపడవద్దు. భయపడాల్సిందేమీ లేదు' ఈ విధమైన వాక్కుల ద్వారానే భయంనుండి కాపాడుతోంది. అందుచేతనే 'గాయత్రి' అనే శబ్దానికి 'ప్రాణులను గురించి పాడుతోందని, ప్రాణులను రక్షిస్తోంది' అని అర్థం చెప్పుకుంటాము. యదార్థానికి వాక్కుకు గాయత్రికి భేదం లేదు. 'గాయత్రి' అనే పేరు 'గానము, త్రాణము' అనే మాటల నుండి పుట్టింది. అందుకే పై అర్థం చెప్పుకుంటాము.

పైన చెప్పిన లక్షణాలు కలిగిన గాయత్రి ఈ పృథివి తప్ప వేరేదీ కాదు. ఎందుచేతనంటే చరాచరాలన్నీ ఈ భూమిలోనే ఉన్నాయి. భూమిని అవి ఎన్నడూ అతిక్రమించలేవు. అందుచేతనే ఈ చరాచర జీవ సమూహాన్నంతటినీ గానంచేస్తూ, త్రాణం చేస్తూ (పాడుతూ, కాపాడుతూ) ఉండే గాయత్రియే ఈ భూమి. ఈ రెంటికీ భేదం లేదు.

ఈ పృథివీ రూపమైన గాయత్రి, ఈ శరీరంలో ఉండే పంచ భూతాలు, ఇంద్రియాల సమూహము ఒకటే! అంటే ఈ శరీరాల్లో భూతాలనే పేర్లతో (పృథివ్యాది, త్వక్చక్షురాది) ఈ ప్రాణులు ఉన్నాయి. ఈ జీవ సంఘాతాన్ని ప్రాణాలు అతిక్రమించలేవు – వాటిని ఆశ్రయించే ఉంటాయి.

పురుషుని ఈ శరీర రూపమైన గాయత్రి, పురుషుని హృదయ కమలంలో ఉండే పురుషుడు ఒకటే! ఈ పురుషునిలోనే – గాయత్రిలోనే ప్రాణాలు ప్రతిష్ఠితమై ఉన్నాయి – ప్రాణాలు ఈ పురుషుణ్ణి అతిక్రమించలేవు.

ఈ నాల్గు చరణాలు (పాదాలు) కల గాయత్రికి ఒక్కొక్క పాదానికి ఆరేసి అక్షరాలున్నాయి. ఈ గాయత్రి అనే పేరుతో ఉండే బ్రహ్మను గూర్చి ఋక్కులలో కూడా చెప్పబడ్డది. ఈ విషయమే దిగువ మంత్రంలో వివరింపబడుతోంది.

**మం॥ తావానస్య మహిమా తతో జ్యాయాగ్ంశ్చ పూరుషః పాదోస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ఇతి. 6**

కార్యబ్రహ్మ, శుద్ధబ్రహ్మల స్వభావం చెపుతున్నారు. ఇంతవరకు మనం గాయత్రి అనే పేరుతో ఉండే బ్రహ్మను గూర్చి, ఆ బ్రహ్మయొక్క మహిమను గూర్చి చెప్పుకొన్నాము. ఇదంతా కార్యబ్రహ్మయొక్క విభూతి. శుద్ధబ్రహ్మయొక్క మహత్వం ఇంతకంటె గొప్పది. ఈ పంచభూతాలతో కూడినట్టి భౌతిక జగత్తులో ఉండే ఈ స్థావర జంగమాత్మకమైన ప్రాణి జాతమంతా ఈ శుద్ధబ్రహ్మ (పురుషుని) యొక్క ఒక పాదం మాత్రమే! సంపూర్ణమైనట్టి గాయత్రీ రూపక పురుషుని మూడు పాదాలు ద్యులోకంలోని స్వయంప్రకాశస్వరూపుడు, అమృతుడు అయిన ఆ పరమాత్మలోనే ఉన్నాయి.

**మం॥ యద్వై తద్బ్రహ్మేతీదం వావ తద్యోయం బహిర్ధా పురుషాదాకాశో యో వై స బహిర్ధా పురుషాదా కాశః 7**

**అయం వావ స యోఽ యమన్తః పురుష ఆకాశో యో వై సోఽ న్తః పురుష ఆకాశః 8**

**అయం వావ స యోఽ యమన్తర్హృదయ ఆకాశస్తదేతత్పూర్ణమప్రవర్తి పూర్ణామప్రవర్తినీగ్ం శ్రియం లభతే య ఏవం వేద. 9**

భూతాలలోను, దేహంలోను, హృదయంలోను ఉన్నది ఒకే పరిపూర్ణమైన ఆకాశమనే విషయం చెపుతున్నారు.

ఈ గాయత్రి ద్వారా ప్రతిపాదింపబడినట్టి, మూడు పాదములు కలిగినట్టి అమృత స్వరూపమైన బ్రహ్మము ఇదే! అంటే, ఈ పురుషునికి బయట ఉన్నట్టి, అందరికి కనిపించే ప్రసిద్ధమైన ఆకాశమే!

ఆ పురుషునికి బయట ఉన్న ఆకాశము, ఆ పురుషుని లోపల ఉన్నట్టి ఆకాశమూ ఒకటే!

అట్లాగే, హృదయంలోపల ఉన్న ఆకాశము, ఆ హృదయంలోని ఆకాశం లోపల ఉండే ఆత్మ–అది పూర్ణము, అవినాశి అయినట్టిది. ఈ విధమైనట్టి పూర్ణము, అమృతము అయిన బ్రహ్మాన్ని తెలుసుకున్నవాడు ఎల్లప్పుడూ నిండుగా ఉండేటటువంటి, ఎన్నడూ నాశనం కానట్టి విభూతిని పొందుతాడు. బ్రతికి ఉండగానే బ్రహ్మస్వరూపాన్ని పొందుతాడు.

## పదమూడవ ఖండం

**మం॥ తస్య హ వా ఏతస్య హృదయస్య పంచదేవసుషయః సయోఽ స్యప్రాజ్ సుషిః స ప్రాణస్తచ్చక్షుః స ఆదిత్యస్త దేతత్తేజోఽ న్నాద్య మిత్యుపాసీత తేజస్వ్య న్నాదో భవతి య ఏవం వేద. 1**

మనం పైన చెప్పుకొనిన హృదయంలోపల స్వర్గలోక ప్రాప్తికి ద్వారాలవంటివైన అయిదు ఛిద్రాలు (ద్వారాలు) ఉన్నాయి. ఆత్మ నివసించే చోటునే స్వర్గమన్నారు (అంటే హృదయం). ఈ స్వర్గలోకమే భవనానికి తూర్పుదిక్కున ఒక ద్వారం ఉంది. అదే ప్రాణం. అదే చక్షుస్సు. అదే ఆదిత్యుడు. అదే తేజస్సు. అదే అన్నాద్యము – అన్నభోక్త – ఈ విధంగా స్వర్గానికి ద్వారంగా ఉండే – ఆత్మకు ద్వారభూతమైన ప్రాణాన్ని ఉపాసించాలి. ఈ రూపంలో ప్రాణాన్ని ఉపాసించేవాడు ఆదిత్యరూపంలో, అన్నాద్యరూపంలో సవిత్రు తేజాన్ని పొంది తేజస్వంతుడు భోక్త అవుతాడు.

**మం॥ అథ యోఽ స్య దక్షిణః సుషిః స వ్యాన స్తశ్శోత్రగ్ం స చంద్రమాస్తదేతచ్ఛ్రీశ్చ యశశ్చేత్యుపాసీత శ్రీమానస్యశస్వీ భవతి య ఏవం వేద 2**

ఈ హృదయానికి దక్షిణ దిక్కున ఉండే ద్వారంలో ఉండేది 'వ్యానం' అనే వాయువు. ఈ వ్యాన వాయువే శ్రోత్రం. అదే చంద్రుడు, అదే శ్రీ, అదే యశస్సు... ఈ విధంగా ప్రసిద్ధమైన రెండు గుణాలతో (శ్రీ, యశస్సు) కూడిన వ్యానాన్ని ఉపాసించేవాడు బ్రహ్మతేజస్సును, సంపదను, కీర్తిని పొందుతాడు.

**మం॥ అథ యోఽ స్య ప్రత్యఙ్ సుషిః సోఽ పానః సా వాక్సోఽ గ్నిస్తదేత ద్బ్రహ్మవర్చస మన్నాద్య మిత్యు పాసీత బ్రహ్మవర్చస్యన్నాదో భవతి య ఏవం వేద. 3**

ఈ హృదయానికి పశ్చిమ దిక్కున ద్వారం వద్ద ఉండేది అపానము. అదే అగ్ని. అదే స్వాధ్యాయంవల్ల, సదాచారం వల్ల లభించే బ్రహ్మ వర్చస్సు. అదే అన్నాద్యము. ఈ విధంగా అపానాన్ని ఉపాసించేవాడు బ్రహ్మతేజస్సు కలవాడు, అన్నభోక్త అవుతాడు.

**మం॥ అథయోఽ స్యోదఙ్సుషిః స సమానస్త న్మనఃస పర్జన్యస్తదేతత్కీర్తిశ్చ వ్యుష్టి శ్చేత్యుపాసీత కీర్తిమాన్ వ్యుష్టిమాన్ భవతి య ఏవం వేద. 4**

ఈ హృదయానికి (స్వర్గానికి) ఉత్తరదిక్కున ఉండే ద్వారంవద్ద ఉండే వాయువు సమానం అనేది. ఈ సమానమే మనస్సు. అదే మేఘము. అదే కీర్తి. అదే శరీరకాంతి. ఈ విధమైన కీర్తి, కాంతి అనే రెండు విశేష గుణాలు కలిగిన సమాన వాయువును బ్రహ్మగా భావించి ఉపాసించేవాడు కీర్తిమంతుడు, శరీరకాంతి కలవాడు అవుతాడు.

**మం॥ అథయోఽ స్యోర్ధ్వః సుషిః ఉదానః సవాయుః స ఆకాశస్తదేతదోజశ్చ మహశ్చేత్యుపాసీతౌజస్వీ మహ స్వాన్భవతి య ఏవం వేద. 5**

ఈ హృదయానికి ఊర్ధ్వంగా ఉండే ద్వారం వద్ద ఉండేది ఉదానం అనే వాయువు. ఈ ఉదానమే ఆకాశం. అదే తేజస్సు (బలం) అదే మహత్వానికి కారణమైన మహస్ (గొప్పదనం) ఈ విధంగా ఉదానమనే వాయు పరబ్రహ్మను ఓజస్సుగా మహస్సుగా భావించి ఉపాసించేవాడు బలవంతుడు, తేజోవంతుడు అవుతాడు.

**మం॥ తే వా ఏతే పంచ బ్రహ్మపురుషాః స్వర్గస్య లోకస్య ద్వారపాః స య ఏతానేవం పంచ బ్రహ్మపురుషా స్స్వర్గస్య లోకస్య ద్వారపాన్వేదాస్య కులే వీరో జాయే ప్రతిపద్యతే స్వర్గం లోకం య ఏతానేవం పంచ బ్రహ్మపురుషాన్స్వర్గస్య లోకస్య ద్వారపాన్వేద. 6**

ఈ విధంగా అయిదుగురు బ్రహ్మపురుషులు. బ్రహ్మకు సంబంధించిన ఈ అయిదుగురు హృదయమనే స్వర్గంలో ద్వారపాలకులు. ఈ అయిదుగురు బ్రహ్మపురుషులను ద్వారపాలకులుగా భావించి ఉపాసించే వారి కులంలో వీరపురుషులు జన్మిస్తారు. (రాజభవనంలోపల ఉండే రాజు యొక్క దర్శనం కోసం ద్వారపాలకుల్ని ప్రసన్నులను చేసుకున్నట్లే బ్రహ్మ సాక్షాత్కారానికి ఈ బ్రహ్మ పురుషుల్ని ఉపాసించటం అవసరమని భావం). ఈ అయిదుగురిని బ్రహ్మకు ద్వారపాలకులుగా ఉపాసించేవాడు స్వర్గలోకాన్ని పొందుతాడు. (ఈ అయిదుగురు పురుషులు అయిదు వాయువులు. ఈ అయిదు వాయువులకు ప్రతీకలిట్లా ఉంటాయి. చక్షుస్సు = ప్రాణం, శ్రోత్రం = వ్యానం, వాక్ = అపానం, మనస్సు = సమానం, ఆకాశం = ఉదానం).

**మం॥ అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వ నుత్తమేషూత్తమేషు లోకేష్విదం వాన తద్యదిదమస్మిన్నంతః పురుషే జ్యోతిః 7**

ఈ ద్యులోకానికి స్వర్గానికి దూరంగా, నిత్యము ప్రకాశిస్తూ ఉండే ఆ పరమజ్యోతి, ఈ విశ్వానికంతకుపైన సర్వోత్తమోత్తమ లోకాల్లో భాసమానమై ఉండే ఆ పరంజ్యోతీ, ఈ పురుషునిలో ఉండే జ్యోతీ నిజానికి ఒకటే! అదే, ఇది! అంటే, చక్షురాది ఇంద్రియాలద్వారా బయటకు వస్తూ ఉండే జ్యోతి, ఈ విశ్వానికంతకు పరమజ్యోతిగా ప్రకాశించే ఆ జ్యోతీ రెండూ ఒకటే!

**మం॥ తస్యైషా దృష్టిర్య త్రైత దస్మిన్ఛరీరే సంస్పర్శేనోష్ణి మానం విజానాతి తస్యైషా శ్రుతిర్యత్రైత త్కర్ణావపి గృహ్య నినదమివ నదథురివాగ్నేరివ జ్వలత ఉపశ్రుణోతి తదేతద్దృష్టం చ శ్రుతం చేత్యుపాసీత చక్షుష్యః శ్రుతో భవతి య ఏవం వేద య ఏవం వేద. 8**

ఈ హృదయంలో ఉండే పురుషుణ్ణి దర్శించటానికి ఉపాయం ఇదే – మానవుడు ఈ శరీరం మీద చేతిని ఉంచినపుడు స్పర్శద్వారా వేడిని (అగ్నిని) అనుభవిస్తున్నాడు. చెవులలో వ్రేళ్ళుపెట్టి శ్రవణాలను మూసివేసినప్పుడు రథ ఘోషలాగా, ఎద్దుయొక్క రంకెలాగా, జ్వలిస్తున్న అగ్నియొక్క శబ్దంలాగా ఒక విధమైన ధ్వనిని వింటున్నాము. స్పర్శద్వారా ఆ పురుషుని అనుభవించినట్లే

శబ్దం ద్వారా ఆ పురుషుని దర్శిస్తున్నామన్నమాట. ఇట్లా అతడు జ్యోతిర్లింగడుగా, శ్రుతి లింగంగా (చిహ్నంగా) ఉండటంవల్ల జ్యోతిదృష్టుడు, శ్రుతిలింగడు అవుతున్నాడు. ఈ విధంగా ఆ పరమ జ్యోతిని తెలుసుకొని ఉపాసించేవాడు దర్శనీయుడు, విఖ్యాతుడు అవుతాడు.

## పదునాల్గవ ఖండం

**మం॥ సర్వం ఖలిదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత అథఖలు క్రతుమయః పురుషో యథాక్ర తురస్మింల్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి స క్రతుం కుర్వీత. 1**

శాండిల్య విద్యాంతర్గతమైనట్టి సర్వ దృష్టితో బ్రహ్మోపాసనను వివరిస్తున్నారు.

ప్రత్యక్షాది ప్రమాణాలకు ఈ ప్రపంచం విషయమై ఉంది. అట్లాగే ఈ ప్రపంచమంతా నామరూపాత్మకం. అటువంటి ఈ ప్రపంచమంతా–సమిష్టిగా–నిజానికి బ్రహ్మ స్వరూపమే! ఈ ప్రపంచమంతా ఆ బ్రహ్మనుండి అగ్ని జలన్నాది క్రమంలో ఉత్పన్నమై చివరకు దానికి విపరీతమైన పద్ధతిలో ఆ బ్రహ్మలోనే లీనమౌతుంది. అంటే సృష్టి, స్థితి, లయ అనే మూడు స్థితులలో కూడా ఈ ప్రపంచం బ్రహ్మమే! – ఆ బ్రహ్మం లేనిదే ప్రపంచాన్ని తెలుసుకోలేము కాబట్టి! స్థితి సమయంలో మాత్రం ఆ బ్రహ్మలోనే చేష్టతో కూడి ఉన్నట్లు కనిపిస్తుంది. కాబట్టి ఉపాసకుడు రాగద్వేషాదులు లేనివాడై, విజితేంద్రియుడై ఉపాసన చేయాలి – ఆ పురుషుడు నిశ్చయంగా, నిశ్చయాత్మకుడు కాబట్టి ఉపాసకుడు నిశ్చయాత్మక బుద్ధితోనే ఉపాసించాలి. ఈ లోకంలో నిశ్చయాత్మకుడుగా ఉన్నట్లే, ఈ దేహం చనిపోయిన తరువాత కూడా నిశ్చయాత్మకుడుగానే ఉండాలి. శాస్త్ర ప్రామాణ్యంగా నిశ్చయానురూపమైన ఫలం లభిస్తుందని చెప్పబడ్డది కాబట్టి ఉపాసకుడు నిశ్చయాత్మక బుద్ధితోనే ఉండాలి – మన నమ్మకానికి, మన నిశ్చయాత్మక బుద్ధికి, శ్రద్ధకు తగిన ఫలమే లభిస్తుంది కాబట్టి.

**మం॥ మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వ కర్మా సర్వ కామః సర్వ గంధః సర్వ రసః సర్వమిద మభ్యాత్తో ఉ వాక్య నాదరః. 2**

అతడు మనోమయుడుగా కనిపిస్తాడు – విషయాలలో ప్రవృత్త మవటానికి హేతు భూతమైన మనస్సు కారణంగా ఆ పరబ్రహ్మ మనోమయుడు. అట్లాగే ప్రాణశరీరాలు (సూక్ష్మ, స్థూల) కలవాడు, చైతన్యస్వరూపుడు, సత్యసంకల్పుడు. అతడు ఆకాశాత్మ. అంటే ఆకాశానికుండే సర్వవ్యాపకత్వము, సూక్ష్మత్వము, రూపం లేకపోవటం అనే ఆకాశ లక్షణాలున్నందున ఆకాశాత్మ. సర్వ కర్మ – సమస్త కర్మలు స్వరూపంగా కలవాడు. అట్లాగే సర్వకాముడు–సమస్తమైన సత్కామనలు కలవాడు. సుఖప్రదమైన సమస్త గంధములు కలవాడు, సమస్త కర్మలు స్వరూపంగా కలవాడు. అట్లాగే సర్వకాముడు – సమస్తమైన సత్కామనలు కలవాడు. సుఖప్రదమైన సమస్త గంధములు

కలవాడు. సమస్త రసములు కలవాడు. జగత్తునంతటిని అన్నివైపుల నుండి వ్యాపించి ఉండేవాడు. వాణీరహితుడు, ఆప్తకాముడైనందున కామనారహితుడు – కోరికలు లేనివాడు.

**మం॥ ఏష మ ఆత్మాన్తర్హృదయేఽ ణీ యాన్వ్రీ హేర్వా యవాద్వా షర్షపాద్వా శ్యామాకాద్వా శ్యామాక తండులాద్వైష మ ఆత్మాన్తర్హృదయే జ్యాయా న్పృథివ్యా జ్యాయన న్తరిక్షాజ్జాయాన్దివో జ్యాయా నేభ్యో లోకేభ్యః. 3**

**సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిద మభ్యాత్తోఽ వాక్య నాదర ఏష మ ఆత్మాన్తర్హృదయ ఏతద్బ్రహ్మైతమితః ప్రేత్యాభిసంభవితా స్మీతి యస్య స్యాదద్ధాన విచికిత్సాస్తీతి హ స్మాహశాండిల్యః శాండిల్యః 4**

ఆత్మ అనేది సూక్ష్మాతి సూక్ష్మమైనది. అట్లాగే మహత్తరమైనదాని కంటె మహత్తరమైనది అనే విషయాన్ని విపులీకరిస్తున్నారు. ఈ విషయం చాలా ఉపనిషత్తులలోను, భగవద్గీతలోనూ కూడా చెప్పబడినది.

ఈ హృదయ కమలంలోపల ఉన్నట్టి నా ఆత్మ వరిగింజకంటె – యవధాన్యం – బార్లీగింజకంటె, ఆవగింజకంటె, శ్యామకమనే ధాన్యపు గింజకంటె, ఆ శ్యామక ధాన్యంలోపలి బియ్యపు గింజకంటె కూడా సూక్ష్మమైంది. నా ఈ హృదయ కమలంలో ఉన్న ఆత్మ, ఈ భూమికంటె, ద్యులోకం కంటె, స్వర్గలోకం కంటె, ఈ సమస్త లోకాలకంటె (విశ్వంకంటె) పెద్దది.

ఈ హృదయ కమలంలో ఉండే బ్రహ్మము (ఆత్మ) పరబ్రహ్మము ఒకటే అనే విషయాన్ని వివరిస్తున్నారు.

ఈ నా హృదయంలో ఉండే ఆత్మయే సమస్త కర్మలను నిర్వర్తిస్తుంది. ఈ ఆత్మయే సమస్తమైన మంచి కోరికల్నీ కలిగి ఉంటుంది. ఈ ఆత్మయే సమస్త సుగంధాలను, సమస్తమైన రసాలను కలిగి ఉండి సమస్త ప్రపంచాన్ని అన్నివైపుల నుండి వ్యాపించి ఉంటుంది. ఈ ఆత్మను మాటలతో చెప్పలేము. దానికి ఏ విధమైన కోరికలు ఉండవు (ఆప్తకామం కాబట్టి). ఈ విధంగా ఉండే నా హృదయంలోని ఆత్మయే పరబ్రహ్మము. (రెండవ మంత్రంలో విశ్వాత్మకు చెప్పిన లక్షణాలన్నీ ఈ వ్యష్టి ఆత్మకు చెప్పారు కాబట్టి) రెంటికీ భేదం లేదు. “ఈ శరీరం నుండి వేరైనప్పుడు, మరణించి కూడా నేను (జీవాత్మ) ఆ పరబ్రహ్మనే పొందుతాను” అనే ఈ నిశ్చయబుద్ధి కలవాడు నిజంగానే ఆ విధంగా అవుతాడు – బ్రహ్మను పొందుతాడు. మరణించి కూడా తప్పకుండా ఆ పరబ్రహ్మనే పొందుతాడు. ఈ విధంగా శాండిల్యుడనే ఋషి చెప్పాడు. అందుచేతనే దీనిని ‘శాండిల్య విద్య’ అన్నారు.

## పదునైదవ ఖండం

లోగడ 13వ ఖండంలో వీరుడైన పుత్రుని జననాన్ని గురించి చెప్పారు. తండ్రికి పుణ్యలోక ప్రాప్తి కలిగించటానికి వీరుడైన పుత్రుడే కాజాలడని, విద్వాంసుడు (జ్ఞానవంతుడు) అయిన పుత్రునివల్ల తండ్రికి పుణ్యలోకాలు కలిగే అవకాశం ఉందని శ్రుతులు చెపుతున్నాయి (బృహదారణ్యకం 1-5-17). ఈ ఖండంలో తండ్రికి పుణ్యలోకాలు కలిగించటానికి పుత్రుడు ఏ విధంగా దీర్ఘజీవి కాగలుగుతాడో ఆ విధమైన ఉపాసనను గూర్చి చెపుతున్నారు.

**మం॥ అంత రిక్షోదరః కోశో భూమిబుధ్నో న జీర్యతి. దిశో హ్యస్య స్రక్తయో ద్యౌరస్యోత్తరం బిలమ్. స ఏష కోశో వసుధాన స్తస్మిన్విశ్వమి దం శ్రితమ్. 1**

అంతరిక్షమే ఉదరంగా (లోపలి భాగంగా) కలిగినట్టి, ఈ కోశానికి (ధనాగారం, పెట్టె) పృథివియే మూలం (అడుగు భాగం). అనేక విధాలైన మంచి గుణాలకు (ధర్మం, సత్యం, మొ॥) నిలయంగా ఉండేది కాబట్టి ధనం దాచే పెట్టెతో పోలిక చెప్పారు. త్రైలోక్య స్వరూపం కలిగి ఉండటంవల్ల (ముల్లోకాలతో తయారవటం వల్ల) అది నశించేది కాదు - యుగయుగాలుగా ఉంటుంది. దిక్కులే ఈ ధనాగారానికి మూలలు - కోణాలు. ద్యులోకమనేది ఈ పెట్టెకు పైనున్న బిలం - ద్వారం. ఈ కోశం కర్మఫలస్వరూపమైన ధనానికి నేలమాళిగలాంటిది - ఆధాన స్థానం. అందులోనే ఈ ప్రపంచమంతా ఉంది. ప్రజలు చేసే కర్మలకు లభించే ఫలితాలే ఈ కోశంలో నిండుగా ఉండే సంపద.

**మం॥ తస్య ప్రాచీ దిగ్జుహూర్నామ సహమానాం నామ దక్షిణా రాజ్ఞీ నామ ప్రతీచీ సుభూతా నామోదీచీ తాసాం వయుర్వత్సః స య ఏతమేవం వాయుం దిశాం వత్సం వేద న పుత్రరోదగ్ం రోదితి సోఽహ మేత మేవం వాయుం దిశాం వత్సం వేద మా పుత్ర రోదగ్ం రుదమ్. 2**

ఆ కోశానికి తూర్పు దిక్కుకు జుహూ అని పేరు. కర్మిష్ఠులైన వారు తూర్పు దిక్కుకు తిరిగి హోమాదికాలు నిర్వర్తిస్తారు కాబట్టి జుహూ అని పేరు వచ్చింది. దక్షిణ దిక్కుకు సహమానమని పేరు. దక్షిణ దిక్కున యమలోకం ఉంటుంది. ఆ యమలోకంలో జీవులు తమ కర్మఫలాన్ని సహిస్తూ ఉంటారు (అనుభవిస్తూ) కాబట్టి ఆ విధంగా అన్నారు. పశ్చిమ దిక్కుకు రాజ్ఞి అని పేరు. ఈ దిక్కుకు అధిపతి (రాజ్ఞా) వరుణుడు కాబట్టి. సాయంకాలపు ఎఱ్ఱదనంతో కూడి ఉన్నందున కూడా ఈ దిక్కుకు రాజ్ఞ అని పేరు. ఉత్తర దిక్కుకు సుభూతమనే పేరు ఉంది.

ఆ ఉత్తర దిక్కున ఐశ్వర్య సంపన్నమైన దేవతలతో (కుబేరాదులు) కూడి ఉన్నందున ఆ పేరు వచ్చింది. దిక్కులందు ఉత్పన్నమైన కారణంగా, ఆయా దిక్కులలో పుట్టి వీస్తూ ఉన్నందున;

వాయువుకు 'వత్స'మని పేరు. ఈ విధంగా వెనుక చెప్పిన గణాదులతో కూడిన దిక్కులందు పుట్టిన వాయువును వత్సరూపంలో ఉపాసించేవానికి పుత్రశోకం ఉండదు. "నేను ఆ దిక్కుల నుండి పుట్టివచ్చే వాయువును కాబట్టి, ఆ వత్సరూపంలో ఉండే వాయువును ఎరుగుదును కాబట్టి పుత్ర మరణ నిమిత్తమైన దుఃఖం నాకు కలుగకుండుగాక!

**మం॥ అరిష్టం కోశం ప్రపద్యేఽ మునా మునా ప్రాణం ప్రపద్యే–మునా మునా మునా భూః ప్రపద్యే–మునా మునా మునా భువః ప్రపద్యే –మునా మునా మునా స్వః ప్రపద్యే–మునా మునా మునా.** **3**

పుత్రునికి దీర్ఘాయుర్దాయం లభించటం కోసం నేను వెనుక చెప్పిన ఫలానా ఫలానా ఫలానా ('ఫలానా' అని అన్న మూడు చోట్ల, ప్రతిసారీ కుమారుని పేరు చెప్పాలి). వానితో సహా నాశరహితమైన ఆ కోశాన్ని శరణు పొందుతున్నాను. ఫలానా ఫలానా ఫలానా వానితో సహా ప్రాణాల శరణు పొందుతున్నాను. ఫలానా ఫలానా ఫలానా వానితో సహా భూలోకాన్ని శరణు పొందుతున్నాను. నేను ఫలానా ఫలానా ఫలానా వానితో సహా భువర్లోకాన్ని శరణు పొందుతున్నాను. నేను ఫలానా ఫలానా ఫలానా వానితో సహా సువర్లోకాన్ని శరణు పొందుతున్నాను.

**మం॥ స యదవోచం ప్రాణం ప్రపద్య ఇతి ప్రాణో వా ఇదగ్ం సర్వం భూతం యదిదం కించ తమేవ తత్ప్రాపత్సి.** **4**

**అథ యదవోచం భూః ప్రపద ఇతి పృథివీం ప్రపద్యేఽ న్తరిక్షం ప్రపద్యే దివం ప్రపద్య ఇత్యేవ తదవోచమ్.** **5**

**అథ యదవోచం భువః ప్రపద్య ఇత్యగ్నిం ప్రపద్యే వాయుం ప్రపద్య ఆదిత్యం ప్రపద్య ఇత్యేవ తద వోచమ్** **6**

**అథ యదవోచగ్ం స్వః ప్రపద్య ఇత్యృగ్వేదం ప్రపద్యే యజుర్వేదం ప్రపద్యే సామవేదం ప్రపద్య ఇత్యేవ తదవోచం తదవోచం.** **7**

'నేను ప్రాణం యొక్క శరణు పొందుతున్నాను' అని పైన అన్నాం గదా! ఆ ప్రాణం ఏది? ఈ సంపూర్ణ భూత సముదాయంలో ఉన్నట్టి సమిష్టి ప్రాణం. అటువంటి ఆ విరాట్ప్రాణంలో శరణు పొందుతున్నాను – ఆశ్రయం పొందుతున్నాను అని భావం. ఇక్కడ ప్రాణం అనే శబ్దాన్ని వివరించటం కోపం – వ్యష్టి ప్రాణం కాదని చెప్పటం కోసం ఇది చెప్పారు. అట్లాగే దిగువ మంత్రాల్లో పృథివ్యాదులను వివరిస్తున్నారు.

'నేను ఈ పృథివి యొక్క శరణు పొందుతున్నాను. అంతరిక్షం యొక్క శరణు పొందుతున్నాను. ద్యులోకం యొక్క శరణు పొందుతున్నాను' అని అన్నాను. అట్లాగే 'నేను భువర్లోకం యొక్క శరణు

పొందుతున్నాను' అని అన్నాను. అంటే భూః భువః సువః అనే లోకాల శరణు పొందటమంటే అగ్ని యొక్క శరణు పొందుతున్నానని, వాయువు యొక్క శరణు పొందుతున్నానని, ఆదిత్యుని యొక్క శరణు పొందుతున్నానని అన్నట్లే! అంటే భూమి అగ్నిని, అంతరిక్షం వాయువుని, ద్యులోకం ఆదిత్యుని సూచిస్తాయని భావం.

అట్లాగే 'నేను సువర్లోకం యొక్క శరణు పొందుతున్నాను' అంటే ఋగ్వేదం యొక్క శరణు పొందుతున్నానని, యజుర్వేదం యొక్క శరణు పొందుతున్నానని, సామవేదం యొక్క శరణు పొందుతున్నానని అన్నట్లే! (అంటే భూమి, అగ్ని ఋగ్వేదం) (అంతరిక్షం – వాయువు – యజుర్వేదం) (ద్యులోకం – ఆదిత్యుడు – సామవేదం) ఈ మూడేసిగా – త్రికాలుగా ఉన్న వాటిలో భేదం లేదని భావం). పిమ్మట పైన చెప్పినట్టి నాశరహితమైన కోశాన్ని దిక్కులలో ఉండే వత్సం (వాయువు)తో సహా చక్కగా ధ్యానం చేసి పైన చెప్పిన మంత్రాల్ని జపించాలి.

## పదునారవ ఖండం

కుమారుని యొక్క దీర్ఘాయుర్దాయం కోసం జపించాల్సిన మంత్రాలను చెప్పారు. తరువాత తండ్రి యొక్క ఆయుర్దాయం కోసం ఉపాసించాల్సిన విధం, జపించాల్సిన మంత్రం చెపుతున్నారు.

**మం॥ పురుషో వావ యజ్ఞ స్తస్య యాని చతుర్వింశతివర్షాణి తత్ప్రాతః సవనం చతుర్వింశత్యక్షరా గాయత్రీ గాయత్రం ప్రాతః సవనం తదస్య వసవో౽న్వాయత్తాః ప్రాణా వావ వసవ ఏతే హీదం సర్వం వాసయన్తి.** **1**

నిజానికి పురుషుడే యజ్ఞం. అంటే అతని శరీరేంద్రియాలు, ఆయుర్దాయం, ప్రాణం మొత్తం ఈ పురుష స్వరూపం మొత్తాన్ని యజ్ఞంగా భావించారు. ఎందుచేతనో వివరిస్తున్నారు – ఆ పురుషుని ఆయుర్దాయంలోని మొదటి 24 సంవత్సరాలు ఈ పురుష యజ్ఞంలోని ప్రాత్సవనం. ఎందుచేతనంటే, గాయత్రి ఛందస్సులో ఉండే అక్షరాల సంఖ్య 24. ప్రాతః సవనం కూడా గాయత్రి ఛందస్సు కలదే! కాబట్టి ప్రాతఃసవన రూపంలో గడిచే 24 సంవత్సరాల ఆయుర్దాయంతో కూడి ఉన్నందున పురుషుడు యజ్ఞస్వరూపుడే! ఈ పురుష యజ్ఞంలోని ప్రాతః సవనానికి సంబంధించిన దేవతలు వసువులు. వాగాది ఇంద్రియాలు, ప్రాణం మొదలైన వాయువులు ఈ వసువులే! ఎందుచేతనంటే వీటివల్లనే మానవులు మొదలైన ప్రాణులన్నీ నిర్మింపబడ్డాయి. (తరువాత చెప్పబోయే రెండు సవనాలకు త్రిష్టుప్, జగతి ఛందోలక్షణాల సామ్యంతో పురుషుని జీవితంలోని భాగాలను వివరిస్తున్నారు.)

**మం॥ తం చేదేతస్మిన్వయసి కించిదుపతపేత్స బ్రూయా త్ప్రాణా వసవ ఇదం మే ప్రాతః సవనం**

**మాధ్యందినం సవన మనుసన్తను తేతి మాహం ప్రాణానాం వసూనాం మధ్యే యజ్ఞోఽ విలోప్సీయేత్యుద్ధై తత ఏత్యగదో హ భవతి.** **2**

పురుష యజ్ఞంలో ప్రాతః సవనంగా చెప్పబడ్డ 24 సంవత్సరాల కాలంలో ఏదైనా వ్యాధిగాని, కష్టాలుగాని వస్తే ఈ యజ్ఞం నిర్వర్తించే పురుషుడు తన్ను తాను యజ్ఞంగా భావించుకొని ఈ విధంగా అనాలి.... "ఓ ప్రాణ స్వరూపులైన వసువులారా! నా యీ ప్రాతఃసవనానికి సంబంధించిన ఆయుర్దాయాన్ని మధ్యందిన సవనానికి సంబంధించిన ఆయువుతో జత చేయండి (ప్రాతః సవనంతో – 24 సంవత్సరాలతో ఆయుర్దాయం ఆగిపోకుండా తరువాతి భాగంతో కలపండి అని భావం) యజ్ఞస్వరూపుడనైన నేను ప్రాతః సవనానికి అధిష్టాన దేవతలైనట్టి, ప్రాణస్వరూపులైనట్టి వసువుల నుండి వేరై నశింపకుందునుగాక! (ఈ విధంగా జపించి ధ్యానించటం ద్వారా కష్టాలనుండి, రోగాలనుండి విముక్తుడై సుఖిస్తాడు.)

**మం॥ అథ యాని చతుశ్చత్వారింశద్వ త్సరాణి తన్మాధ్య న్దినం సవనం చతుశ్చత్వారింశదక్షరా త్రిష్టుప్ త్రైష్టుభం మాధ్యందినం సవనం తదస్య రుద్రా అన్వాయత్తాః ప్రాణా వావ రుద్రా ఏతే హీదం సర్వం రోదయన్తి.** **3**

పురుషుని ఆయుర్దాయంలో 44 సంవత్సరాలు మాధ్యందిన సవనం (అంటే, 24 నుండి 68 సం॥ వరకు) త్రిష్టుప్ ఛందస్సు 44 అక్షరాలు కలది. ఈ మాధ్యందిన సవనం త్రిష్టుప్ ఛందస్సుతో సంబంధించి ఉంటుంది. ఈ మాధ్యందిన సవనం రుద్రులకు సంబంధించినది. ఈ ప్రాణాలే రుద్రులు. ఈ ప్రాణస్వరూపులైన రుద్రులే ప్రాణుల్ని ఏడిపిస్తూ ఉంటారు.

**మం॥ తం చేదేతస్మిన్వయసి కించదుపతపేత్స బ్రూయా త్ప్రాణా రుద్రా ఇదం మే మాధ్యందినం సవనం తృతీయసవనమనుసంతను తేతి మాహం ప్రాణానాం రుద్రాణాం మధ్యే యజ్ఞోఽ విలోప్సీ యేత్యుద్దైవ తత ఏత్యగదో హ భవతి.** **4**

ఈ యజ్ఞకర్తను – పురుష యజ్ఞరూపుడైన యజమానిని – ఈ 44 సంవత్సరాలలో ఏవైనా రోగాలు పీడిస్తే అతడీ విధంగా అనాలి – 'ఓ ప్రాణ స్వరూపులైన రుద్రులారా! ఈ నా మధ్యాహ్నకాలపు సవనాన్ని మూడవదైన సాయంసవనంతో జతచేయండి. యజ్ఞస్వరూపుడనైన నేను ప్రాణస్వరూపులైన రుద్రగణం నుండి వేరు కాకుండా ఉందునుగాక!" అని ఇట్లా అనుకోవటంతోనే వ్యాధులనుండి, కష్టాల నుండి విముక్తుడౌతాడు.

**మం॥ అథ యాన్యష్టాచత్వారింశద్వార్షాణి తత్తృతీయసవన మష్టాచత్వారింశ దక్షరా జగతీ జాగతం తృతీయ సవనం తదస్యాదిత్యా అన్వాయత్తాః ప్రాణా వా వాదిత్యా ఏతే హీదం సర్వమాదదతే.** **5**

**తం చేదేతస్మిన్వయసి కించిదుపతపేత్స బ్రూయాత్ ప్రాణా ఆదిత్యా ఇదం మే తృతీయసవన మాయురను సన్తను తేతి మాహం ప్రాణానా మాదిత్యానాం మధ్యే యజ్ఞో విలోప్సీయేత్యుద్ధైవ తత ఏత్యగదో హైవ భవతి** **6**

తరువాత, ఇక పురుషుని ఆయుర్దాయంలో మిగిలి ఉన్న 48 సంవత్సరాలు, (మొత్త ఆయుర్దాయం 116 సంవత్సరాలు) ఆ పురుష యజ్ఞంలోని మూడవ సవనం. ఈ మూడవ సవనం జగతీ ఛందస్సుకు సంబంధించినదై ఉంటుంది. ఈ తృతీయ సవనం పూర్తిగా ఆదిత్యులతో సంబంధం కలది. ఈ ప్రాణాలే ఆదిత్యులు. ఎందుచేతనంటే, ఈ ప్రాణాలనే ఆదిత్యులే శబ్దం మొదలైన ఇంద్రియ విషయాలను ఆదనాం చేస్తారు (గ్రహిస్తారు కాబట్టి ఆదిత్యులు అయినారు.

ఈ 48 సంవత్సరాల కాలంలో యజ్ఞకర్తను – ఈ పురుష యజ్ఞోపాసకునికి ఏవైనా రోగాలుగాని, దుఃఖాలుగాని కలిగితే అతడీవిధంగా అనాలి – 'ఓ ప్రాణస్వరూపులైన ఆదిత్యులారా! నా యీ తృతీయ సవనాన్ని – ఈ ఆయుర్దాయాన్ని పూర్తి చేయండి – 116 సంవత్సరాల ఆయువును పూర్తికానీయండి. యజ్ఞస్వరూపుడనైన నేను, ప్రాణస్వరూపులైన ఆదిత్యుల నుండి మధ్యలో వేరు కాకుందునుగాక!' అని ఈ విధంగా అనుకోవటం వల్ల అతని రోగాలు, దుఃఖాలు నశిస్తాయి – వాటినుండి ముక్తుడౌతాడు.

**మం॥ ఏతద్ధ స్మ వై తద్విద్వానాహ మహిదాస ఐతరేయః స కిం మ ఏతదుపతపసి యో– హమనేన న ప్రేష్యా మీతి స హ షోడశం వర్షశత మజీవత్ప్ర హ షోడశం వర్షశతం జీవతి య ఏవం వేద.** **7**

ఈ విధమైనట్టి, ప్రసిద్ధమైనట్టి యజ్ఞదర్శనాన్ని తెలుసుకొన్న ఇతరుని పుత్రుడైన మహిదాసుడు అన్నాడు – 'ఓ వ్యాధుల్లారా! (రోగాలు) మీరు నన్నీ విధంగా ఎందుకు బాధిస్తారు? మీరు ఎంత బాధించినా యజ్ఞస్వరూపుడనైన నేను చావను. మీ శ్రమంతా వ్యర్థం' అని ఈ విధంగా నిశ్చయించుకొనిన మహిదాసుడు 116 సంవత్సరాలు జీవించాడు. ఎవరైనా సరే, ఈ విధంగా ఉపాసన చేస్తే వారు కూడా 116 సంవత్సరాలు జీవిస్తారు.

## పదునేడవ ఖండం

**మం॥ స యదశిశిషతి యత్పిపాసతి యన్న రమతే తా అస్య దీక్షా.** **1**
**అథ యదశ్నాతి యత్పిబతి యద్రమతే తదుపసదై రేతి.** **2**
**అథ యద్ధసతి యజ్జక్షతి యన్మైథునం చరతి స్తుత శస్త్రై రేవ తదేతి.** **3**
**అథ యత్తపో దానమార్జవమహింసా సత్యవచన మితి తా అస్య దక్షిణాః** **4**
**తస్మాదాహుః సోష్యత్యసోష్టేతి పునరుత్పాదన మేవాస్య తన్మరణమే వావభృథః.** **5**

అక్షయఫల ప్రదమైనట్టి ఆత్మ యజ్ఞోపాసనను గూర్చి చెబుతున్నారు. పురుషుడు భోజనం చేయాలని అనుకుంటాడు. నీరు త్రాగాలని అనుకుంటాడు. అట్లాగే కోరిన వస్తువు లభించనందున సంతోషంగా ఉండడు – విచారాన్ని పొందుతాడు. ఇవన్నీ కొంత దుఃఖాన్ని కలిగించేవే! ఈ దుఃఖమనేది యజ్ఞదీక్షకు ముందు కూడా ఉంటుంది. తీవ్రమైన అసంతృప్తి కోరికవల్లనే గదా యజ్ఞదీక్షకు ఉపక్రమించేది! కాబట్టి దుఃఖమనే సాదృశ్యం కారణంగా ఈ లౌకికపురుషుని దీక్ష కూడా యజ్ఞదీక్షలాంటిదే! (వెనుకటి ఖండంలో చెప్పిన యజ్ఞసదృశుడైన పురుషునికి సంబంధించినట్లే ఈ ఖండంలోని విషయం కూడా ఆరంభమౌతోందని గ్రహించాలి. పారలౌకికమైన తీవ్రకాంక్ష, ఐహికమైన అసంతృప్తి యజ్ఞదీక్షకు కారణం. అట్లాగే లౌకిక దృష్టిలో అన్నపానాదుల కాంక్ష, ఉన్నదానిలో అసంతృప్తి ఇవే లౌకిక దీక్షకు కారణాలు. కాబట్టి జీవితమనేది యజ్ఞం వంటిది).

ఆ పైన చెప్పిన పురుషుడే భుజిస్తున్నాడు. మంచినీరు త్రాగుతున్నాడు. కోరిక తీరనందున సంతోషిస్తున్నాడు – ఇవన్నీ యజ్ఞంలోని 'ఉపసద' సాదృశ్యాన్ని పొందుతున్నాయి. అంటే, యజ్ఞదీక్షలో కేవలం పాలు త్రాగి ఉండటమనే 'పయోవ్రతం' ఉంది. పాలు త్రాగినందువల్ల కలిగే తృప్తి 'ఉపసదం'. ఈ ఉపసదమనేది ఒక ఇష్టి – రోజుకు రెండుసార్లు తక్కువ కాకుండా మంచి నేతితో హోమం చేస్తారు. దీక్ష వహించిన నాటినుండి సోమయాగం ప్రారంభించేవరకు మూడు రోజులపాటు ఈ ఇష్టి చేస్తారు. మొదటి రెండు రోజులు, రోజుకు రెండుసార్లు పాలు మాత్రం త్రాగుతారు – క్రమేణా పాల పరిమాణం తగ్గిస్తూ మూడవనాడు హోతశేషాన్ని త్రాగి ఉంటాడు. దీనితోపాటు ఇంకా కొన్ని వైదిక విధులు పాటించాలి. ఈ విధంగా పాలు త్రాగటం వల్ల ఉపసదంలో కలిగే తృప్తిని లౌకికంగా భోజన పానీయాదులవల్ల కలిగే తృప్తితో పోల్చారు.

అతడు నవ్వుతున్నాడు, తింటున్నాడు, మైథునక్రియ నాచరిస్తున్నాడు. ఇవన్నీ స్తుతాలు, శస్త్రాలు అవుతున్నాయి. ఎందుచేతనంటే లౌకికమైన భోజనపానీయాలు, యాజ్ఞికమైన స్తుత, శస్త్రాలు, రెండూ కూడా శబ్దంతో కూడినవే! వీటిలో శబ్దమే సామ్యం. (శస్త్రమనేది ఒక మంత్ర భాగం కాదు. అది స్వరంలేని ఋక్కు. కేవలం పఠనానికి మాత్రమే ఉపయోగిస్తుంది).

తపస్సు, దానం, నిష్కపటత్వం, అహింస, సత్యభాషణము ఇవన్నీ దక్షిణలు. యజ్ఞంలో దక్షిణల లాగానే లౌకికంగా ఈ గుణాలన్నీ ధర్మాన్ని పోషిస్తాయి. కాబట్టి వీటికి, యజ్ఞంలో ఇచ్చే దక్షిణలకు పోలిక ఉంది.

ఈ సామ్యాలన్నిటితోపాటు, ఆ పురుషుని ప్రసవించబోయే గర్భిణి స్త్రీని గురించి మాట్లాడుతూ 'స్రోష్యతి' అంటారు – అంటే, ఇక ప్రసవిస్తుంది అని అర్థం. అట్లాగే శిశు జననం అయిన తరువాత 'అసోష్ట' అంటారు – ఆమె ప్రసవించింది అని అర్థం – అంటే, కృతార్థతను పొందింది. ఆ మరల

జననమనేదే మళ్ళీ యజ్ఞారంభం లాంటిది. పురుషుని మరణమే అవభృథస్నానం (యజ్ఞం పూర్తి అయిన తరువాత చేసే స్నానం) (ఇక్కడ 'సోష్యతి' 'అసోష్టా' అనే రెండు క్రియలలోను అర్థసామ్యాన్ని చూపించారు. ప్రసవం విషయం పైన చెప్పారు. ఇక యాజ్ఞికంగా ఫలానావాడు సోమరసాన్ని పిండుతాడు (సోష్యతి) సోమ రసాన్ని పిండాడు (అసోష్టా) కాబట్టి పిండుట, ప్రసవించుట అనే అర్థాలలోని సాదృశ్యాన్ని చూపారు).

**మం॥ తద్ధైత ద్ఘోర అంగిరసః కృష్ణాయ దేవకీపుత్రాయోక్త్వో వాచాపిపాస ఏవ స బభూవ సోఽన్తవేలాయామేత త్త్రయం ప్రతిపద్యే తాక్షిత మస్య చ్యుతమసి ప్రాణసగ్ంసితమసీతి తత్రైతే ద్వే ఋచౌ భవతః** **6**

**ఆదిత్ప్రత్నస్య రేతసః జ్యోతిః పశ్యన్తి వాసరం పరో యదిధ్యతే దివి.** **7**

**ఉద్వయం తమస స్పరి జ్యోతిః పశ్యన్త ఉత్తరం స్వః పశ్యన్త ఉత్తరం దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతి రుత్తమమితి జ్యోతిఽరుత్తమ మితి.** **8**

అంగిరస గోత్రంలో పుట్టిన ఘోరమహర్షి, దేవకీ పుత్రుడైనట్టి కృష్ణునికి ఈ విద్యను ఉపదేశించాడు. దాని ప్రభావం వల్లనే కృష్ణుడు ఇతర విద్యల విషయంలో తృష్ణా విహీనుడైనాడు – ఈ విద్య నేర్చుకోవటంవల్ల ఇతర విద్యలమీద కోరిక లేకపోయింది. ఈ విద్యను ఉపదేశిస్తూ ఘోరమహర్షి కృష్ణునితో అన్నాడు – "మానవుడు అంత్యకాలంలో ఈ మూడు మంత్రాలు జపించాలి. 1) నీవు అక్షయుడవు (అక్షితమసి) 2) నీవు నాశనం లేనివాడవు (అచ్యుతమసి) 3) నీవు అత్యంత సూక్ష్మమైన ప్రాణానివి (ప్రాణసంశితమసి) అని. ఈ మూడూ యజుర్మంత్రాలు. వీటికి సంబంధించిన రెండు ఋక్కులు ఉన్నాయి. అవి యివి.

ఈ రెండు మంత్రాలను (ఋక్కులను) ఈ విధంగా చెప్పుకోవాలి. (1) విషయ వాసనలనుండి మరలింపబడిన మనస్సుగలవారు, విశుద్ధ హృదయులు, బ్రహ్మచారులు నైన బ్రహ్మవేత్తలు, ఆ పరబ్రహ్మలోనున్న పరమ దేదీప్యమానమైన తేజస్సు అన్నివైపుల వ్యాపించి ఉన్నట్లుగా దర్శిస్తున్నారు. ఆ బ్రహ్మవేత్తలు సర్వత్ర ఆ పురాతనమైన తేజస్సునే చూస్తున్నారు.

2) వారు అజ్ఞానాంధకారానికి ఆవల ఉన్నట్టి ఉత్కృష్టమైన జ్యోతిని చూస్తూ – ఆత్మీయమైన సర్వోత్తమ జ్యోతిని దర్శిస్తూ ఈ విధంగా అనుకుంటారు – "మేము సమస్త దేవతలలోను ప్రకాశించే, సర్వోత్తమ జ్యోతిస్వరూపుడైన సూర్యుణ్ణి పొందాము. సర్వోత్తమజ్యోతి స్వరూపుడైన సూర్యుణ్ణి పొందాము" అని. ఇది మంత్రార్థం. 'జ్యోతిరుత్తమం' అని రెండుసార్లు చెప్పటం పురుషయజ్ఞ కల్పన పూర్తి అయినట్లు సూచన కోసం!

## పదునెనిమిదవ ఖండం

ఈ ఖండంలో మనస్సు మొదలైన వానిలో ఆధ్యాత్మదృష్టితోను, అధిదైవ దృష్టితోను బ్రహ్మోపాసనను విధిస్తున్నారు -

**మం॥ మనో బ్రహ్మేత్యుపాసీతే త్యధ్యాత్మమథాధిదైవత మాకాశో బ్రహ్మేత్యు భయమాదిష్టం భవత్యధ్యాత్మం చాధి దైవతం చ. 1**

'మనస్సే బ్రహ్మ' అని ఉపాసించాలి. ఇది ఆత్మ విషయక దర్శనం. తరువాత దేవతా సంబంధమైన (అధిదేవత) దర్శనం - 'ఆకాశమే బ్రహ్మ' అని ఉపాసించాలి. ఈ విధంగా ఆధ్యాత్మ దృష్టితో మనస్సును అధిదైవత దృష్టితో ఆకాశాన్ని బ్రహ్మనుగా భావించి ఉపాసించాలి అని చెప్పారు. మనస్సుతో బ్రహ్మను తెలుసుకుంటాడు. ఆకాశము మనస్సు ఈ రెండూ కూడా సూక్ష్మమైనవే! సర్వవ్యాపకమైనవే! అంతులేనివే! కాబట్టి బ్రహ్మనుగా భావించటానికి రెండూ అర్హమైనవే!

**మం॥ తదేతచ్చతుష్పాద్బ్రహ్మ వాక్పాదః ప్రాణః పాదశ్చక్షుః పాదః శ్రోత్రం పాద ఇత్యధ్యాత్మ మథాధి దైవత మగ్నిః పాదో వాయుః పాద ఆదిత్యః పాదో దిశః పాద ఇత్యుభయ మేవాదిష్టం భవత్యధ్యాత్మం చైవాధిదైవతం చ. 2**

ఈ మనస్సు అనే బ్రహ్మకు నాల్గు పాదాలు. వాక్కు ఒక పాదం, ప్రాణం ఒక పాదం, నేత్రం ఒక పాదం, శ్రోత్రం ఒక పాదం. ఇది ఆధ్యాత్మక దృష్టితో చెప్పబడిన విషయం. ఇక అధి దైవదృష్టితో చూస్తే అగ్ని ఒక పాదం, వాయువు ఒక పాదం, ఆదిత్యుడు ఒక పాదం, దిక్కులు ఒక పాదం. ఈ విధంగా ఆధ్యాత్మ అధిదైవత దృష్టితో నాల్గు పాదాలుగల బ్రహ్మను గూర్చి వివరించారు. ఈ రెండు విధాలను కలిపి కూడా ఉపాసించవచ్చు. (మనస్సు ఆకాశం ఒకటే! ఈ మనో ఆకాశ బ్రహ్మకు వాగగ్నులు ఒక పాదం, ప్రాణవాయువులు ఒక పాదం, నేత్రాదిత్యులు ఒక పాదం, దిక్ శ్రోత్రాలు ఒకపాదం) ఈ విషయాన్నే వివరిస్తున్నారు. ॥3

**మం॥ వాగేవ బ్రహ్మణశ్చతుర్థః పాదః సోఽగ్నినా జ్యోతిషా భాతి చ తపతి చ భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద. 3**

**ప్రాణ ఏవ బ్రహ్మణశ్చతుర్థః పాదః స వాయునా జ్యోతిషా భాతి చ తపతి చ భాతి చ తపతి చ భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద. 4**

**చక్షురేవ బ్రహ్మణశ్చతుర్థః పాదః స ఆదిత్యేన జ్యోతిషా భాతి చ తపతి చ భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద. 5**

**శ్రోత్రమేవ బ్రహ్మణశ్చతుర్థః పాదః స దిగ్భిర్జ్యోతిషా భాతి చ తపతి చ భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద య ఏవం వేద. 6**

వాక్కే మనస్సు అనే బ్రహ్మకు చతుర్థపాదం (లేక నాల్గవ భాగం). అది (వాక్కు) అగ్ని అనే జ్యోతితో ప్రదీప్తమై ఉష్ణాన్ని కూడా కలిగిస్తుంది. ఈ విధంగా వాగగ్నుల సంయుక్త రూపాన్ని తెలుసుకొని ఉపాసించేవాడు కీర్తితో, బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తాడు – ఉష్ణాన్ని వెలువరిస్తాడు, తపిస్తాడు. ఆవుకు నాల్గుపాదాలు పొట్టతో కూడిన శరీరానికి కలిసి ఉన్నట్లే ఆకాశమనే బ్రహ్మకు ఈ నాల్గుపాదాలుగా కల్పన. అగ్ని మొదలైనవి ఆకాశానికి నాలుగు పాదాలు. వాక్కు మొదలైనవి మనస్సుకు నాలుగు పాదాలు. అగ్ని మొదలైన వాటినన్నింటిని భరించేది ఆకాశం. వాక్కు మొదలైనవాటిని భరించేది మనస్సు. నాల్గు పాదాలలో దేనికదే నాల్గవది అవుతుంది కాబట్టి చతుర్థపాదం అన్నారు.

ప్రాణమనేది (ఘ్రాణం) మనస్సు అనే బ్రహ్మకు చతుర్థపాదం. అది వాయురూపమైన జ్యోతితో గంధాన్ని (వాసనను) గ్రహించటానికి వ్యక్తమౌతూ ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ విధంగా ఉపాసించేవాడు యశస్సుతో, బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తూ ఉంటాడు – ఉష్ణాన్ని వెలువరిస్తూ ఉంటాడు.

మనస్సు అనే బ్రహ్మకు చక్షుస్సు చతుర్థపాదం. అది (చక్షుస్సు) ఆదిత్యుడనే జ్యోతివలన రూపాన్ని గ్రహించటానికి ప్రకాశిస్తూ ఉత్సాహితమౌతూ ఉంటుంది – సూర్యకాంతివల్ల రూపాన్ని గ్రహిస్తూ వెలుగుతూ ఉత్సాహాన్ని పొందుతూ ఉంటుంది. ఈ విషయం తెలుసుకొని ఉపాసించేవాడు యశస్సుతో, బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటాడు. కాంతిని వెలువరిస్తాడు.

శ్రోత్రమనేది మనస్సు అనే బ్రహ్మకు చతుర్థపాదం. దిక్కులనే తేజస్సుతో శబ్దాన్ని గ్రహించటానికి ప్రకాశిస్తూ, ఉత్సాహితమౌతూ ఉంటాయి – దిక్కుల నుండి వచ్చే శక్తితో శబ్దాన్ని గ్రహించటానికి సర్వదా సిద్ధంగా ఉంటాయి. ఈ విధంగా ఉపాసించేవాడు కీర్తితో, బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తూ తేజస్సును వెలువరిస్తూ తపిస్తూ ఉంటాడు.

పందొమ్మిదవ ఖండం

**మం॥ ఆదిత్యో బ్రహ్మేత్యాదేశ స్తస్యోప వ్యాఖ్యానమస దేవేదమగ్ర ఆసీత్ తత్సదాసీత్త త్సముభవత్తదాండం నిరవర్తత తత్సంవత్సరస్య మాత్రా మశయత తన్నిర భిద్యతే అండకపాలే రజతం చ సువర్ణం చా భవతాం** 1

ఆదిత్యుని వెనుకటి ఖండంలో బ్రహ్మకు చతుర్థపాదంగా చెప్పారు. ఆ ఆదిత్యుణ్ణే సంపూర్ణ బ్రహ్మగా భావించి ఉపాసించాలని చెపుతున్నారు.

'ఆదిత్యుడు బ్రహ్మ' అనే ఆదేశాన్ని వ్యాఖ్యానిస్తున్నారు–ఆదిత్యుని ప్రశంసకోసం. ఈ ప్రపంచం మొట్టమొదట అసత్తుగా ఉంది – అంటే, ఈ విధమైన నామరూపాత్మకంగా లేదు అని భావం –

అంతే కాని అసలేమీ శూన్యం అనుకోరాదు. ఎందుచేతనంటే, అసలేమీ లేకపోవటంలో నించి ఉండటమనేది పుట్టదు. అటువంటి నామరూపాత్మకంగా లేని అసత్తు కార్యాభిముఖమైంది – అంకురించే బీజంలాగా, క్రమంగా స్థూలరూపాన్ని పొందుతూ నీటితో కూడి అండంగా తయారైంది. అంటే, నీటితో సహా పంచభూతాలతో కలసి అండంగా రూపొందింది. ఈ విధమైన అండాకారంలో ఒక సంవత్సరం వరకు పడి ఉంది. తరువాత పక్షి గ్రుడ్డులాగనే పగిలి రెండు భాగాలైంది. ఆ విధంగా పగిలిన రెండు ముక్కలు ఒకటి వెండి, ఒకటి బంగారంగా రూపొందాయి.

**మం॥ తద్య ద్రజతం సేయం పృథివీ యత్సువర్ణం సా ద్యౌర్య జ్జరాయు తే పర్వతా యదుల్బం సమేఘో నీహారో యా ధయనయస్తా నద్యో యద్వాస్తేయ ముదకం స సముద్రః 2**

ఈ విధంగా పగిలి వెండి భాగంగా కనిపించే సగమూ (ఈ పృథివిగా కనిపించే సగమూ) అడుగు భాగం, స్వర్ణమయంగా కనిపించే సగమూ పైన ఉండే ద్యులోకం. ఆ గ్రుడ్డును కప్పి ఉన్నట్టి, స్థూలంగా ఉండే పొర, (పెంకు) పర్వత సమూహాలుగా, సూక్ష్మంగా ఉండే పొర, మేఘాలతో కూడిన మంచుపొరగా అయింది. ఆ విధంగా గర్భంలో ఉన్నట్టి శరీరంలో రక్తం ప్రవహించే నాడులే నదులుగా అయినాయి. ఆ గర్భస్థ శరీరంలోని మూత్రాశయంలో ఉండే జలమే సముద్రమైంది.

**మం॥ అథ యత్తదజాయత సోఽసావాదిత్యస్తం జాయ మానం ఘోషా ఉలూలవోఽ నూద తిష్ఠన్సర్వాణి చ భూతాని సర్వే చ కామాస్త స్మాత్తస్యోదయం ప్రతి ప్రత్యాయనం ప్రతి ఘోషా ఉలూలవోఽనూత్తి ష్ఠన్తి సర్వాణి చ భూతాని సర్వే చ కామాః. 3**

ఆ గర్భంలో నుండి పుట్టినవాడే ఈ ఆదిత్యుడు. ఆదిత్యుడు పుట్టటం తోడనే సుదూరంగా వ్యాపించే శబ్దాలు పుట్టినాయి. దానితోపాటే సమస్త స్థావర జంగమ జీవులు, వాటికి కావలసిన అన్న వస్త్రాది విషయాలు, వాటి అనుభవాలు పుట్టినాయి. ఈనాటికి సూర్యుడు ఉదయించడం వల్ల అస్తమించటం వల్ల సమస్త భూతాలు, భోగవిషయాలు ఘోష శబ్దంతో పుడుతున్నాయి.

**మం॥ స య ఏతమేవం విద్వానాదిత్యం బ్రహ్మేత్యుపాస్తేఽభ్యాశో హ య దేవం సాధనో ఘోషా ఆ చ గచ్ఛేయు రుప చ నిమ్రేడేరన్ని మ్రేడేరన్. 4**

ఈ విధమైన మహిమతో కూడిన ఆదిత్యుని తెలుసుకొని, ఆతనిని బ్రహ్మగా భావించి ఉపాసించేవాడు, ఆ విధమైన ఉపాసన వల్ల తాను ఆదిత్యుడే అవుతాడు. ఆ ఉపాసకుని అందమైన సంతోష సూచకమైన శబ్దాలు శీఘ్రంగా చేరతాయి – అతనికి సుఖాన్ని యిస్తాయి.

# నాల్గవ అధ్యాయం

## మొదటి ఖండం

మం॥ ఓం జ్ఞానశ్రుతిర్హ పౌత్రాయణః శ్రద్ధాదేయో బహు దాయీ బహుపాక్య ఆస స హ సర్వత ఆవసథాన్మాప యాంచక్రే సర్వత ఏవ మేన్నమత్స్యాన్తీతి. 1

అథహ హంసా నిశాయామతి పేతుస్తద్ధైవం హంసోహంసమభ్యువాద హో హోఽయి భల్లాక్ష భల్లాక్ష జానశ్రుతేః పౌత్రాయనన్య సమం దివా జ్యోతిరాతతం తన్మా ప్రసాంక్షీ స్తత్త్వా మా ప్రధాక్షీరితి. 2

తము హ పరః ప్రత్యువాచ కమ్వర ఏనమేతత్సన్తం సయుగ్వానమివ రైక్వ మాత్థేతి యో ను కథం సయుగ్వా రైక్వ ఇతి. 3

యథా కృతాయ విజితాయాధరేయాః సంయన్త్యేవ మేనం సర్వం తదభి సమైతి యత్కించ ప్రజాః సాధు కుర్వంతి యస్తద్వేద యత్స వేద సమయైతదుక్త ఇతి. 4

రాజు అయిన జానశ్రుతి రైక్వుల కథ చెపుతున్నారు.

పూర్వకాలంలో జనశ్రుత కులంలో పుట్టినవాడు, జానశ్రుతుని కుమారునికి మనుమడు ఉండేవాడు. అతడు శ్రద్ధాభక్తులతో దానం చేసేవాడు. భోజనం కోసం వచ్చిన వారిని ఆదరించి, వారికోసం మిక్కుటంగా భోజనాదులు తయారు చేయించేవాడు. ఈ జనశ్రుతి అనే రాజు తాను పెట్టిన అన్నమే ప్రజలు భుజించాలనే కోరికతో చాలాచోట్ల సత్రాలు నిర్మించాడు.

అట్లా ఉండగా ఒకసారి, ఆ రాత్రిపూట హంసలు ఎగిరిపోయినాయి. అంటే, అతని అన్నదానం వల్ల సంతుష్టి చెందిన దేవతలు హంస రూపాలు దాల్చి రాజుకు కనిపించినాయి – ఆకాశంలో! ఆ హంసల్లో ఒక హంస ఎగురుతున్న మరొక హంసతో అంది – "ఓ భల్లాక్షుడా! (హ్రస్వదృష్టి కలవాడా! లేక – బల్లెము వంటి తీక్ష్ణ దృష్టి కలవాడు అనే అర్థాలున్నాయి.) జానశ్రుతుని మనుమడు చేసిన అన్నదాన ప్రభావం వల్ల కలిగిన తేజస్సు, ద్యులోక కాంతిలాగా అంతటా వ్యాపించింది. నీవు ఆ తేజస్సును తాకవద్దు. తాకితే ఆ తేజస్సు వల్ల నీవు భస్మం అయిపోవటానికి అవకాశం ఉంది" అని. (ముందున్న) హంస తానే బ్రహ్మజ్ఞానిననే అహంకారంతో ఉపదేశాలు చేస్తూ ఉండి ఉండవచ్చు. అతని మాటలు నచ్చని వెనుకనున్న హంస ఆ ముందున్నవానిని హ్రస్వదృష్టి కలవానినిగా సంబోధించి ఉండవచ్చు).

ఈ మాటలు విన్న ముందు పోతూవున్న హంస అంది – "నీవు ఏ రాజు యొక్క గొప్పతనాన్ని గురించి ఇంత గొప్పగా పొగుడుతున్నావో ఆతడు, బండివాడైన రైక్వునితో సమానుడౌతాడా?"

అని. అంటే ఈ రాజు ఆ రైక్వునికి సాటిరాడని భావం. ఈ మాటలు విన్న హంస 'నీవు బండివాడని అంటున్న ఆ రైక్వుడెవరు?' అని అడిగింది. అప్పుడా రైక్వుడెవరో, ఆతని కథ ఏమిటో భల్లాక్షుడనే హంస చెపుతోంది.

లోకంలో పాచికలాడేటప్పుడు 'కృత' మనే పేరుగల పాచిక మిగిలిన కృత, ద్వాపర, కలి అనే పేర్లుగల పాచికలను తన ఆధీనంలోకి తీసుకున్నట్లే, ప్రజలు చేసే ఏ సత్కార్యమైనా సరే కృతమనే పాచికలాంటి వాడైన రైక్వునికి చెందుతాయి. రైక్వునికి తెలిసిన విషయం ఎవనికి తెలిసినా అతడు కూడా రైక్వునిలాంటివాడే అవుతాడు – కృతమనే పాచిక ఎవనికి లభిస్తే అతనికి మిగతా మూడు పాచికలవారు లోబడినట్లు. (పాచికలు వరుసగా 1,2,3,4 సంఖ్యలచే గుర్తింపబడి ఉంటాయి. వాటికి వరుసగా కలి, ద్వాపర, త్రేతా, కృత అని యుగాల సంజ్ఞలు పెట్టారు. పాచిక లాడేటప్పుడు కృతమనే పాచిక లభించినవాడు మిగతావారిని ముగ్గురిని ఓడించి పందెం గెలిచినట్లు).

**మం॥ తదు హ జానశ్రుతిః పౌత్రాయణ ఉపశుశ్రావ స హ సంజిహాన ఏవ క్షత్తారమువాచాంగారే హ సయుగ్వాన మివ రైక్వమాత్థేతి యో ను కథం సయుగ్వా రైక్వ ఇతి. 5**

**యథా కృతాయ విజితాయాథరేయాః సంయన్త్యేవ మేనం సర్వం తదభిసమైతి యత్కించ ప్రజాః సాధు కుర్వన్తి యస్తద్వేద యత్సవేద స మయైతదుక్త ఇతి. 6**

**స హ క్షత్తాన్విష్య నావిదమితి ప్రత్యేయాయ తం హోవాచ యత్రారే బ్రాహ్మణస్యాన్వేషణా తదేన మర్చ్ఛతి. 7**

**సోఽధస్తాచ్ఛకటస్య పామానం కషమాణ ముపోప వివేశ తం హాభ్యువాద త్వం ను భగవః సయుగ్వా రైక్వ ఇత్యహం హ్యరా 3 ఇతి హ ప్రతిజజ్ఞే స హ క్షత్తావిదమితి ప్రత్యేయాయ. 8**

రాజభవనం పైభాగాన కూర్చుండి ఉన్న జానశ్రుతి మనుమడు హంసలు అనుకొన్న ఈ మాటలు (రైక్వుణ్ణి ప్రశంసించటం, తద్వారా తనను కించపరచిన మాటలు) విన్నాడు. హంస అన్నమాటలే తలచుకొంటూ మరునాడు ఉదయం నిద్ర లేవటంతోడనే సేవకుని (సారథిని) పిలిచి అన్నాడు – 'ఒరే! నీవు నన్ను బండివాడైన రైక్వునితో సమానుడవని అన్నావు గదా!' అని. ఈ మాటలు విన్న సారథి 'రాజు రైక్వుని గురించి తెలుసుకోవాలని అనుకుంటున్నాడు కాబోలు' అని అనుకొని, మీరు చెప్పే ఆ బండివాడైన రైక్వుడు ఎటువంటివాడు? ఎట్లా వుంటాడు?" అని అడిగాడు.

ఆ సారథి రైక్వుని కోసం వెదకి వెదకి 'అతని జాడ తెలుసుకోలేకపోయాను గదా' అని అనుకుంటూ తిరిగి వచ్చాడు. రాజు అతనిని గాంచి 'అరే! బ్రహ్మవేత్తలైన వారిని వెదకే నిర్జన

స్థానాల్లో రైక్వుని వెదకటానికి వెళ్ళు. అటువంటి చోటికి పోయి అడుగు!' అన్నాడు.

రాజు చెప్పిన మాటల్ని గుర్తుపెట్టుకొని నిర్జన ప్రదేశాల్లోను, గ్రామాల్లోను వెదకుతూ పోయి, ఒకచోట బండి క్రింద దురదతో గోక్కుంటూ కూర్చున్న వానిని చూచి, వినయంతో సమీపించి నమస్కరించి అడిగాడు – 'స్వామీ! బండి కలిగి ఉన్నట్టి రైక్వుడనే వ్యక్తి మీరేనా?' అని. అందుకా వ్యక్తి – 'అవును, నేనే రైక్వుణ్ణి' అన్నాడు. రైక్వుని కనిపెట్టగలిగాననే సంతోషంతో అతడు రాజు వద్దకు వెళ్ళాడు.

రెండవ ఖండం

**మం॥ తదు హ జానశ్రుతిః పౌత్రాయణః షట్ శతాని గవాం నిష్కమశ్వతరీరథం తదాదాయ ప్రతి చక్రమే తం హాభ్యువాద. 1**

**రైక్వేమాని షట్ శతాని గవామయం నిష్కోఽ యమశ్వతరీ రథో–నుమ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతాముపాస్స ఇతి. 2**

**తము హ పరః ప్రత్యువాచాహ హారేత్వా శూద్ర తవైవ సహ గోభిరస్త్వితి తదు హ పునరేవ జాన శ్రుతిః పౌత్రాయణః సహస్రం గవాం నిష్కమశ్వతరీ రథం దుహితరం తదాదాయ ప్రతిచక్రమే. 3**

**తం హాభ్యువాద రైక్వేదం సహస్రం గవామయం నిష్కోఽ యమశ్వతరీరథ ఇయం జాయాయం గ్రామో యస్మిన్నాస్సేఽ న్వేవ మా భగవః శాధీతి. 4**

**తస్యా హ ముఖముపోద్గృహ్ణన్ను వాచాజహారేమాః శూద్రానేనైవ ముఖేనాలాపయిష్యథా ఇతి తే హైతేరైక్వ పర్ణా నామ మహావృషేషు యత్రాస్మా ఉవాస తస్మై హోవాచ. 5**

అప్పుడు రాజైన జానశ్రుతుని మనుమడు సారథి చెప్పిన విషయాలు తెలుసుకొని ఆరువందల ఆవులు, ఒక కంఠహారం, రెండు ఆడగుఱ్ఱాలు పూన్చిన రథం తీసికొని రైక్వుని వద్దకు వెళ్ళాడు. నమస్కరించి ఈ విధంగా అన్నాడు –

"ఓ స్వామీ! నేను తమకోసం ఆరువందల ఆవులను, ఒక కంఠహారాన్ని, రెండు ఆడగుఱ్ఱాలు పూన్చిన రథాన్ని తీసికొని వచ్చాను. ఈ సంపదను స్వీకరించండి. దేవా! మీరు ఉపాసన చేసే దేవతను గూర్చిన ఉపదేశం నాకు చేయండి!" అని.

ఇది విని రాజుతో రైక్వుడు అన్నాడు – "ఓ శూద్రా! ఆవులతో సహా ఈ హారాన్ని, రథాన్ని నీవే ఉంచుకో!" అని ( నా అవసరానికి ఇవి చాలవు అని భావం). అపుడు రాజు మళ్ళీ ఒక వేయి ఆవుల్ని, ఒక హారాన్ని, ఆడగుఱ్ఱాలు పూన్చిన రథాన్ని ఆ ఋషి అభీష్టానికి అనుగుణమైనట్టి

భార్యగా ఉపయోగించేందుకు తన కుమార్తెలలో ఒక కన్యను తీసుకొని రైక్వుని వద్దకు వచ్చాడు. (శూద్ర శబ్దం శుచ, ద్రావతి అనే రెండు శబ్దాలతో ఏర్పడినది. రాజు 'ద్రావతి' అంటే దుఃఖంలో మునిగి ఉన్నాడు. హంస మాటలు విని లేదా సారథి మాటలు విని, దుఃఖంతో రైక్వుని వద్దకు వెళ్ళాలని 'ఆతురత పడుతున్నాడు' అని అర్థం చెప్పవచ్చును).

రాజు రైక్వునితో అన్నాడు – 'స్వామీ! ఈ హారాన్ని, రథాన్ని, గోవుల్ని, మీకు భార్యగా ఉపయోగపడే ఈ కన్యను, మీరు నివసిస్తున్న ఈ గ్రామాన్నీ స్వీకరించండి. నాకు ఆ విద్యను ఉపదేశించండి' అని ప్రార్థించాడు.

అప్పుడు రైక్వుడు విద్యాగ్రహణానికి ముఖ్యద్వారాలుగా, లేక విద్యాగ్రహణ ముఖాలుగా వాటిని గ్రహించి, తృప్తిచెంది రాజుతో అన్నాడు – 'ఓ శూద్రా! నీవు ఆవులు మొదలైన వాటిని తెచ్చావు. బాగానే ఉంది. ఈ విద్యాగ్రహణద్వారాలైన వీటితోనే నన్ను మాట్లాడేటట్లు చేస్తున్నావు. (బ్రహ్మచారి, సంపద ఇచ్చినవాడు, తెలివిగలవాడు, వేద ధర్మాలు ఆచరించినవాడు, తనకు – గురువుకు ఇష్టుడైనవాడు, విద్యకు బదులుగా విద్యను ఇచ్చేవాడు – ఈ ఆరు విద్యాగ్రహణ ద్వారాలు. అంటే విద్యోపదేశానికి అర్హులు. వీటిలో సంపద ఇవ్వటం వల్ల రాజు విద్యాగ్రహణానికర్హుడైనాడు) ఇవన్నీ (నీవు ఇచ్చినవన్నీ) మహావృష దేశంలో రైక్వుడు ఉండే రైక్వపర్ణమనే పేరుగల గ్రామంలో చేరి ఉన్నాయి. (అంటే, నీవు యిచ్చినవి స్వీకరించాను. నీవు యిచ్చిన గ్రామానికి రైక్వపర్ణమని పేరు ప్రసిద్ధమవుతుందని భావం) ఈ విధంగా దానం స్వీకరించి రైక్వుడు రాజుకు ఉపదేశం చేశాడు.

మూడవ ఖండం

**మం॥ వాయుర్వావ సమ్వర్గో యదా వా అగ్నిరుద్వాయతి వాయుమేవాప్యేతి యదా సూర్యో-స్తమేతి వాయు వేవాప్యేతి యదా చంద్రో-స్తమేతి వాయుమేవా ప్యేతి. 1**

**యదావ ఉచ్ఛుష్యన్తి వాయుమేవాపియన్తి వాయుర్హ్యేవైతాన్సర్వాన్సంవృఙ్క్త ఇత్యధిదైవతం. 2**

**అథాధ్యాత్మమ్ ప్రాణో వావ సమ్వర్గః స యదా స్వపితి ప్రాణమేవ వాగప్యేతి ప్రాణం చక్షుః ప్రాణం శ్రోత్రం ప్రాణం మనః ప్రాణో హ్యేవైతాన్సర్వాన్సంవృంక్త ఇతి. 3**

**తౌ వా ఏతౌ ద్వౌ సమ్వర్గౌ వాయురేవ దేవేషు ప్రాణః ప్రాణేషు. 4**

సవర్గ విద్యోపదేశం – సంవర్గము అంటే లీనం చేసుకొనేది. ఈ బాహ్యవాయువు సంవర్గం – అంటే, లీనం చేసుకొనేది. ఎందుచేతనంటే, అగ్ని ఆరిపోవటాన్ని మనం చూస్తున్నాం. అగ్ని ఆరిపోయింది అంటే అది వాయువులో లీనమైపోయిందన్నమాట. అట్లాగే సూర్యుడు

అస్తమిస్తున్నాడు–చంద్రుడు అస్తమిస్తున్నాడు. అంటే సూర్యచంద్రులు వాయువులో లీనమౌతున్నారన్నమాట. సూర్యచంద్రులు వాయువుచేతనే గతిశీలురై అస్తమిస్తున్నారని అర్థం. అందుచేతనే ఈ రెండు వాయువులో లీనమౌతున్నాయని అన్నారు.

జలం ఎండిపోతోంది లేక ఆవిరి అయిపోతోంది. అంటే, వాయువులో లీన మౌతోందన్న మాట. ఈ వాయువే అగ్ని మొదలైన ఈ మహాతత్త్వాల నన్నింటిని తనలోకి లీనం చేసుకుంటోంది. కాబట్టి వాయువుకున్నట్టి ఈ సవర్గ గుణాన్ని దృష్టిలో ఉంచుకొని వాయువును ఉపాసించాలి. ఇంతవరకు ఇదంతా అగ్ని మొదలైన దేవతలలోని సంవర్గ దృష్టితో చెప్పబడ్డ విషయం – కాబట్టి అధిదైవ దృష్టి.

ఇక శరీర విషయంలో – ఆధ్యాత్మ దృష్టితో సంవర్గాన్ని గురించి చెపుతున్నారు. ముఖ్యప్రాణమే సంవర్గం. ఎందుచేతనంటే, పురుషుడు నిద్రపోయేటప్పుడు వాగింద్రియం ప్రాణంలో లీనమౌతుంది. అట్లాగే చక్షుస్సు, శ్రోత్రం, మనస్సు కూడా ప్రాణంలోనే లీనమౌతాయి. అంటే ప్రాణమే వాగాది ఇంద్రియాలన్నింటిని తనలోనికి తీసుకుంటోంది.

సంవర్జన గుణం కలిగి ఉండటంవల్ల ఈ రెండే వాయువు ప్రాణం సంవర్గాలు. దేవతలలో వాయువు, ఇంద్రియాలలో ప్రాణం సంవర్గాలు.

**మం॥ అథ హ శౌనకం చ కాపేయమభిప్రతారిణం చ కాక్షసేనిం పరివిష్య మాణౌ బ్రహ్మచారీ బిభిక్షే తస్మా ఉ హ న దదతుః. 5**

**స హోవాచ మహాత్మన శ్చతురో దే ఏకః కః స జగార భువనస్య గోపాస్తం కాపేయ నాభిపశ్యన్తి మార్త్యా అభిప్రతారిన్బహుధా వసన్తం యస్మైవా ఏతదన్నం తస్మా ఏతన్న దత్తమితి. 6**

**తదు హ శౌనకః కాపేయః ప్రతిమన్వానః ప్రత్యేయా యాత్మా దేవానాం జనితా ప్రజానాం హిరణ్యదంష్ట్రో బభసోఽ న సూరిర్మహో న్తమస్య మహిమానమాహురన ద్యమానో యదనన్నమత్తీతివైవయం బ్రహ్మచారిఽ న్నేద ముపాస్మహే దత్తాస్మై భిక్షామితి. 7**

**తస్మా ఉ హ దదుస్తే వా ఏతే పంచాన్యే పంచాన్యే దశసన్తస్తత్కృతం తస్మాత్సర్వాసు దిక్ష్వ న్న మేవ దశ కృతం సైషా విరాడన్నాదీ తయేదం సర్వం దృష్టం సర్వమస్యేదం దృష్టం భవత్యన్నాదో భవతి య ఏవం వేద య ఏవం వేద. 8**

పూర్వం కపిగోత్రంలో పుట్టిన శునకుని కుమారుడైన శౌనకుడు, కక్షసేనుని పుత్రుడైన అభిప్రతారితోపాటు భోజనానికి కూర్చున్నారు. వడ్డన జరుగుతున్న సమయంలో ఒక బ్రహ్మవేత్త అయిన బ్రహ్మచారి వచ్చి భిక్ష అడిగాడు. అతడు నిజంగా బ్రహ్మజ్ఞాని కాడని, బ్రహ్మవేత్తననే అహంకారంతో కూడినవాడని తలచి వారు భిక్ష ఇవ్వలేదు.

అప్పుడా బ్రహ్మచారి ఇట్లా అన్నాడు – "భూమి మొదలుగా గల సమస్త లోకాలకు రక్షకుడైనట్టి, ఏకైక దేవతయైన ప్రజాపతి నలుగురు మహాత్ముల్ని మ్రింగేశాడు. (వాయువు, అగ్ని మొదలైన వాటిని (ప్రాణం, వాక్కు మొదలైనవాటిని) ఓ కాపేయుడా! శౌనకుడా! ఓ అభి ప్రతారీ! మానవుడు, అధ్యాత్మ, అధిదైవ, అధిభూత భేదాలతో అనేక విధాలుగా నివసిస్తూ, అజ్ఞానంవల్ల ఆ మహాదేవుని గమనించలేరు. అందుచేతనే ఏ దేవత భుజించటం కోసం అన్నాన్ని వండుతున్నారో ఆ దేవతకే – ఆ ప్రజాపతికే మీరు అన్నం పెట్టలేదు. అన్నం ప్రాణం కోసం వండబడుతోంది. అటువంటి ప్రాణానికి మీరు అన్నం యివ్వలేదు".

కపిగోత్రోద్భవుడైన శౌనకుడు ఆ బ్రహ్మచారి అన్న మాటలను బాగా మననం చేశాడు. అతని వద్దకు పోయి ఇలా అన్నాడు – "దేవతలకు ఆత్మ అయినవాడూ, చరాచర జీవ సమూహానికి కర్త అయినవాడూ, నాశరహితుడు, భక్షణశీలుడు, మేధావి, మహామహిమాన్వితుడుగా అతని గొప్పతనాన్ని చెప్పావు. అతడు ఇతరుల చేత భక్షింపబడడు – అంటే, అతడు అగ్ని మొదలైన దేవతలకు అన్నం కాదు – అతడే వాటిని అన్నింటిని భక్షిస్తాడు. అటువంటి వానిని మర్త్యులు తెలుసుకోలేరని అన్నావు. ఓ బ్రహ్మచారీ! మేము అతనినే ఉపాసిస్తున్నాము". ఇట్లా అని, సేవకులతో ఆ బ్రహ్మచారికి భిక్ష ఇవ్వవలసినదిగా ఆజ్ఞాపించాడు.

అప్పుడు వారు అతనికి భిక్ష ఇచ్చారు. ఈ అయిదు (అగ్ని మొదలైనవి) ఒక సమూహం. ఆ అయిదు (వాక్కు మొదలైనవి) ఒక సమూహం. ఈ రెండూ వేరు వేరు. వాయువు, అగ్ని, సూర్యచంద్రులు, నీరు, వీరు వేరు. ప్రాణం, వాక్కు, చక్షుస్సు, శ్రోత్రం, మనస్సు ఇవి వేరు. అవి అయిదు ఇవి అయిదు కలిసి మొత్తం పది. ఇవి పది సంఖ్య అయినందున పాచికలలోని కృతం వంటిది. మిగతా సంఖ్యలు దీనిలోకి లోబడినవి – దీనికంటే చిన్నవే! అన్ని దిశల యందు అగ్ని మొదలైన వాటిలో ఒక్కొక్కదానిని, వాక్కు మొదలైన వాటిలో ఒక్కొక్కదానిని వదలివేస్తూ రాగా ఇవన్నీ అన్నమే! పది సంఖ్య మాత్రం కృతం. అదే విరాట్! అదే సమస్తాన్ని భక్షించేది. ఆ విరాట్ ద్వారానే ఇదంతా చూడబడుతోంది. ఈ విషయం తెలుసుకొనిన విద్వాంసునికి ఈ సమస్త ప్రపంచము లభిస్తుంది. అన్నభక్షణం చేసేవాడౌతాడు.

(వాయువు మొదలైనవి 5. ప్రాణం మొదలైనవి 5. మొత్తం పది. వీటిలో వాయువు మిగతా నాలుగింటిని భక్షిస్తుంది. అట్లాగే ప్రాణం మిగతా నాలుగింటినీ భక్షిస్తుంది. అంటే తనలో లీనం చేసుకొంటుంది. అన్నములు+భక్షకులు కలిపితే పది. ఈ పదింటి సామ్యం వల్ల అధికృతమైంది. ఇంకొక విధంగా చూచినా పది సంఖ్యే వస్తుంది. అగ్ని, సూర్య, చంద్ర, జలం = 4. సూర్య చంద్ర జలం = 3. చంద్ర, జలం = 2. జలం = 1. మొత్తం 4+3+2+1 = 10. వాయువు కృతం.

ప్రాణం కృతం. ఈ రెంటి కలయిక = 10 విరాట్ కృతం. అట్లాగే విరాట్ ఛందస్సుకు పది అక్షరాలు).

## నాల్గవ ఖండం

**మం॥ సత్యకామో హ జాబాలో జబాలాం మాతర మామంత్రయాంచక్రే బ్రహ్మచర్యం భవతి వివత్స్యామి కింగోత్రో న్వహమస్మీతి. 1**

**సా హైనమువాచ నామమేతద్వేద తాత యద్గో త్రస్త్వమసి బహ్వహం చరన్తీ పరిచారిణీ యౌవనే త్వామలభే సాహతేతన్న వేద యద్గోత్రస్త్వమసి జబాలాతు నామాహమస్మి సత్యకామో నామత్వమసి స సత్యకామ ఏవ జాబాలో బ్రువీథా ఇతి. 2**

**స హ హారిద్రుమతం గౌతమమేత్యోవాచ బ్రహ్మ చర్యం భగవతి వత్స్యామ్యుపేయాం భగవన్తమితి. 3**

**తగ్ంహోవాచ కింగోత్రో ను సోమ్యాసీతి స హోవాచ నాహమేతద్వేద భో యద్గోత్రోఽ హమస్మ్య పృచ్ఛం మాతరం సా మా ప్రత్యబ్రవీద్బహం చరన్తీ పరి చారిణే యౌవనే త్వామలభేఽ సాహమేతన్న వేద యద్గోత్రస్త్వ మసి జబాలా తు నామాహమస్మి సత్య కామో నామ త్వమసీతి సోఽ హం సత్యకామో జాబాలోఽ స్మి భో ఇతి. 4**

**తగ్ం హోవాచ నైతద్బ్రాహ్మణో వివక్తుమర్హతి సమిధం సోమ్యా హరోపత్వానేష్యే న సత్యాదగా ఇతి తముపనీయ కృశానామబలానాం చతుః శతా గా నిరాకృత్యోవాచేమాః సోమ్యాను సంవ్రజేతి తా అభిప్రస్థాపయన్ను వాచ నాసహసేణావర్తేయేతి స హ వర్షగణం ప్రోవాస తా యదా సహస్రం సమ్పేదుః 5**

ఒకానొకప్పుడు సత్యకాముడనేవాడు తన తల్లియైన జాబాలను ఈ విధంగా అడిగాడు – “అమ్మా! నేను స్వాధ్యాయ గ్రహణం నిమిత్తం (వేదం చదవటం కోసం) బ్రహ్మచర్యాన్ని పాలిస్తూ గురుకులంలో ఉండాలి అని అనుకుంటున్నాను కాబట్టి నేను ఏ గోత్రానికి – ఏ వంశానికి చెందినవాడినో చెప్పు” అని.

అందుకు జాబాల, సత్యకామునితో అంది – ‘నాయనా! నీవు ఏ గోత్రానికి చెందినవాడవో నాకు తెలియదు. తరుణావస్థలో నేను భర్త యింటియందు అభ్యాగతులకు పరిచర్యలు చేస్తూ ఉన్న సమయంలో నీవు నాకు లభించావు. (అప్పటికే నీ తండ్రి గతించటం వల్ల నీవు అనాథవు). నాపేరు జాబాల గదా! నీ పేరు సత్యకాముడు! అందుచేత నీ గురువుగారు అడిగితే నీవు ‘నేను సత్యకామ జాబాలను (జాబాల సత్యకాముణ్ణి) అని చెప్పు’.

అంతట సత్యకాముడు హారిద్రుమత గౌతమునివద్దకు వెళ్ళి అన్నాడు – 'స్వామీ! నేను పూజనీయులైన తమ వద్ద బ్రహ్మచర్యాశ్రమంలో ఉంటాను. తమ వద్దకు శిష్యభావంతో వచ్చాను' అని.

అప్పుడు గౌతముడు, సత్యకాముణ్ణి అడిగాడు – "ఓ ప్రియదర్శనుడా! నీవు ఏ గోత్రానికి చెందినవాడివి;" అని. సత్యకాముడీ విధంగా అన్నాడు – 'నేను ఏ గోత్రం వాడినో నాకు తెలియదు. నేను నా తల్లిని అడిగాను. స్వామీ! ఆమె ఈ విధంగా అన్నది – నేను తరుణావస్థలో నా భర్త ఇంట కార్యభారంలో నిమగ్నురాలనై అతిథిసేవలందు వ్యగ్రురాలనై ఉండగా నీవు నాకు దొరికావు. కాబట్టి నీవు ఏ గోత్రానికి చెందినవాడవో తెలియదు. నేను జాబాలను. నీవు సత్యకాముడవు అన్నది. కాబట్టి ఓ గురుదేవా! నేను జాబాల సత్యకాముణ్ణి! అని.

అప్పుడు గౌతముడు ఈ విధంగా అన్నాడు – 'ఈ విధంగా సూటిగా, స్పష్టంగా, సరళంగా బ్రాహ్మణుడు కానివాడు చెప్పలేడు. బ్రాహ్మణజాతికి సహజమైన స్పష్టత (ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడటం) నిష్కపటత్వం నీయందు ఉన్నాయి. కాబట్టి నాయనా! హోమసంస్కారం నిమిత్తం సమిధలు తీసికొనిరా! నేను నీకు బ్రాహ్మణోచితమైన ఉపనయనం చేస్తాను – నీవు సత్యాన్ని వదలిపెట్టలేదు – సత్యకాముడవు కాబట్టి" ఈ విధంగా అని, అతనికి ఉపనయనం చేసి, బాగా చిక్కిపోయి బలహీనంగా ఉన్న నాలుగు వందల ఆవుల్ని మందనుండి వేరుచేసి అతనికి ఒప్పగించి – 'నాయనా! నీవు ఈ నాలుగు వందల ఆవుల్ని వెంటనుండి చక్కగా మేపు' అన్నాడు. సత్యకాముడు ఆ ఆవుల్ని తోలుకొనిపోతూ 'ఈ ఆవుల సంఖ్య వేయి అయ్యేవరకు నేను తిరిగిరాను' అన్నాడు. అట్లాగే సత్యకాముడు ఆవుల్ని అడవుల్లో మేపుతూ వాటి సంఖ్య వేయి అయ్యేదాకా చాలా సంవత్సరాలు అడవిలోనే ఉన్నాడు.

## అయిదవ ఖండం

**మం॥ అథ హైనమృషభోఽభ్యువాద సత్యకామ 3 ఇతి భగవ ఇతి హ ప్రతిశు శ్రావ ప్రాప్తాః సోమ్య సహస్రః స్మః ప్రాపయ న ఆచార్యకులం. 1**
**బ్రహ్మణశ్చ తే పాదం బ్రవాణీతి బ్రవీతు యే భగవా నితి తస్మై హోవాచ ప్రాచీ దిక్కలా ప్రతీచీ దిక్కలా దక్షిణా దిక్కలోదీచీ దిక్కలైష వై సోమ్య చతుష్కలః పాదో బ్రహ్మణః ప్రకాశవాన్నామ. 2**
**స య ఏతమేవం విద్వాంశ్చతుష్కలం పాదం బ్రహ్మణః ప్రకాశవాని త్యుపాస్తే ప్రకాశవానస్మింల్లోకే భవతి ప్రకాశవతో హ లోకాంజయతి య ఏతమేవం విద్వాంశ్చతుష్కలం పాదం బ్రహ్మణః ప్రకాశవానిత్యుపాస్తే. 3**

సత్యకామునికి బ్రహ్మ యొక్క ప్రథమ పాదాన్ని గూర్చి ఆంబోతు ఉపదేశించటం.

సత్యకాముడు శ్రద్ధాభక్తులతో గురువు యొక్క ఆదేశాన్ని అనుసరించి గోసేవా వ్రతం చేస్తూ ఉండగా దిక్కులతో కూడిన వాయుదేవుడు అతని యెడల ప్రసన్నుడై ఆవుల మందలోనున్న ఆబోతుని ఆవహించి సత్యకాముని 'ఓ సత్యకాముడా!' అని పిలిచాడు.

సత్యకాముడు – 'దేవా! ఏమిటి?' అని పలికాడు.

ఆబోతు ఈ విధంగా అంది – 'ఓ ప్రియదర్శనుడా! సత్యకాముడా! మేము (గో సంతతి) వేయి అయినాము. అందుచేత మమ్మల్ని గురుకులానికి చేర్చు' అని. 'నీకు పరబ్రహ్మ యొక్క ఒక పాదాన్ని గురించి చెప్పమంటావా?' అని అడిగింది ఆబోతు.

"చిత్తం! నాకు తప్పకుండా ఉపదేశించండి" అన్నాడు సత్యకాముడు. అప్పుడు ఆబోతు ఈ విధంగా అంది – "పూర్వ దిక్కుల, పశ్చిమ దిక్కుల, దక్షిణ దిక్కుల, ఉత్తర దిక్కుల అని నాలుగు కళలు. ఇవి బ్రహ్మకు ఒక పాదం. నాయనా! బ్రహ్మయొక్క ఈ పాదానికి 'ప్రకాశవాన్' అని పేరు. ఈ ప్రకాశవాన్ అనే పేరుగల బ్రహ్మ యొక్క ఒక పాదము నాలుగు భాగాలుగా ఉంటుంది. (కల = భాగం) తూర్పు భాగం, పశ్చిమ భాగం, దక్షిణ భాగం, ఉత్తర భాగం. ప్రకాశవాన్ అంటే బాహ్యంగా వ్యక్తమయ్యేది అని అర్థం. ఇట్లాగే బ్రహ్మకున్న మిగతా మూడు పాదాలు కూడా నాలుగేసి భాగాలుగా ఉంటాయి.

బ్రహ్మ యొక్క నాలుగు భాగాలతో కూడిన ఈ ప్రకాశవాన్ అనే పాదాన్ని ఈ వ్యాకృతరూపంలో ఉపాసిస్తే అతడు లోకంలో ప్రసిద్ధినిపొంది, చనిపోయినప్పుడు కూడా జ్యోతిర్లోకాలకు, తేజోవంతమైన ఉత్తమ లోకాలకు పోతాడు.

## ఆరవ ఖండం

**మం॥ అగ్నిష్టే పాదం వక్తేతి స హ శ్వోభూతే గా అభి ప్రస్థాపయాంచకార తా యత్రాభి సాయం బభూవు స్త త్రాగ్ని ముపసమాధాయ గా ఉపరుధ్య సమిధమా ధాయ పశ్చాదగ్నేః ప్రాఙ్పోపనివేశ. 1**

**తమగ్ని రభ్యువాద సత్యకామ 3 ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ. 2**

**బ్రహ్మణః సోమ్య తే పాదం బ్రవాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచ పృథివీ కలాన్తరిక్షం కలాద్యౌః కలా సముద్రః కలైష వై సోమ్య చతు ష్కలః పాదో బ్రహ్మణోఽ నన్త నన్తవాన్నామ. 3**

**స య ఏత మే వం విద్వాంశ్చ తుష్కలం పాదం బ్రహ్మణోஉ నన్తనిత్యుపాస్తేஉ వానస్మింల్లోకే భవత్యనన్త వతో హ లోకాన్ జయతి య ఏత మేవం విద్వాంశ్చ తుష్కలం పాదం బ్రహ్మణోஉ నన్తవానిత్యుపాస్తే 4**

అగ్నిదేవుడు సత్యకామునికి బ్రహ్మయొక్క ద్వితీయ పాదాన్ని ఉపదేశించటం – 'నీకు రెండవ పాదాన్ని అగ్నిదేవుడు ఉపదేశిస్తాడు' అని చెప్పి ఆబోతు మౌనం వహించింది. మరునాడు సత్యకాముడు నిత్యకృత్యాలు తీర్చుకొని ఆవుల్ని గురుకులం వైపుకు తోలుకొనిపోవటం ప్రారంభించాడు. సాయంకాలమైంది. గోవులన్నింటిని ఒకచోటికి చేర్చి అక్కడే సమిధలు పేర్చి అగ్న్యాధానం చేసి ఆబోతు చెప్పిన మాటలనే ధ్యానిస్తూ అగ్నిహోత్రానికి పడమటి దిక్కున తూర్పు వైపుకు మొగంపెట్టి కూర్చున్నాడు.

అప్పుడు అగ్నిహోత్రుడీ విధంగా పిలిచాడు – 'ఓ సత్యకాముడా!'

"చిత్తం! దేవా! అనుగ్రహించండి" అన్నాడు సత్యకాముడు.

"ఓ ప్రియదర్శనుడా! నేను నీకు బ్రహ్మయొక్క ఒక పాదాన్ని గురించి చెప్పమంటావా?"

"చిత్తం! తప్పకుండా అనుగ్రహించండి".

అప్పుడు అగ్నిహోత్రుడీ విధంగా చెప్పాడు – "పృథివీకల, అంతరిక్ష కల, ద్యులోక కల, సముద్ర కల అని బ్రహ్మకు ఒక పాదానికున్న నాలుగు భాగాలు. ఈ నాలుగు పాదాలు కల పాదం 'అనంతవాన్' అనే పేరు కలది. అంటే ఈ నాలుగు అనంతమైనవి – అంతులేనివి".

ఈ అనంతత్వ గుణం కల బ్రహ్మ యొక్క నాలుగు భాగాలు కల పాదాన్ని తెలుసుకొని ఉపాసించేవాడు అనంతగుణ సంపన్నుడౌతాడు.

## ఏడవ ఖండం

**మం॥ హంసస్తే పాదం వక్తేతి స హ శ్వోభూతే గా అభి ప్రస్థాపయాంచకార తాయత్రాభి సాయం బభూవుస్త త్రాగ్ని ముపసమాధాయ గా ఉపరుధ్య సమిధమా ధాయ పశ్చాదగ్నేః ప్రాఙ్పోపవివేశ. 1**

**తం హంస ఉపనిపత్యాభ్యువాద సత్యకామ 3 ఇతి భగవ ఇతి హ ప్రతిశుశ్రావ. 2**

**బ్రహ్మణః సోమ్య తే పాదం బ్రవాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచాగ్నిః కలా సూర్యః కలా చంద్రః కలా విద్యుత్కలైష వై సోమ్య చతుష్కలః పాదో బ్రహ్మణో జ్యోతిష్మాన్నామ. 3**

**స య ఏతమేవం విద్వాంశ్చతుష్కలం పాదంబ్రహ్మణో జ్యోతిష్మానిత్యుపాస్తే జ్యోతిష్మా నస్మింల్లోకే భవతి జ్యోతిష్మతో హ లోకాన్జయతి య ఏతమేవం విద్వాం శ్చతుష్కలం పాదం బ్రహ్మణో జ్యోతిష్మా నిత్యు పాస్తే. 4**

అగ్నిహోత్రుడు సత్యకామునితో – 'నీకు మూడవ పాదాన్ని గురించి సూర్యుడు (హంస) (తెల్లగా ఉండటం, ఆకాశంలో చరించటం ఇద్దరికీ సామ్యం) ఉపదేశిస్తాడు' అని చెప్పాడు. మరునాడు సత్యకాముడు ఆవులను గురుకులంవైపుకు తోలుకుపోతున్నాడు. సాయంకాలమైంది. ఆవులను ఒకచోట నిలిపి అగ్నిహోత్రం చేసి సమిధల్ని ఆధానం చేసి అగ్నికి పశ్చిమ దిక్కున తూర్పు దిశాభిముఖుడై అగ్ని చెప్పిన విషయాన్ని ధ్యానిస్తూ కూర్చున్నాడు.

అప్పుడు హంస (సూర్యుడు) సత్యకాముని ఉద్దేశించి – 'ఓ ప్రియదర్శనుడా! నీకు బ్రహ్మ యొక్క మూడవ పాదాన్ని ఉపదేశించనా?' అని అన్నది. అందుకు సత్యకాముడు 'తప్పకుండా ఉపదేశించండి' అన్నాడు.

హంస సత్యకామునితో ఇట్లా అంది – "బ్రహ్మ యొక్క మూడవ పాదం అగ్ని కల, సూర్య కల, చంద్ర కల, విద్యుత్ కల అని నాలుగు భాగాలు కలదిగా ఉంది. నాయనా! బ్రహ్మ యొక్క ఈ నాలుగు కలలతో కూడిన పాదాన్ని జ్యోతిష్మాన్ అనే పేరుతో వ్యవహరిస్తారు".

ఈ విషయం తెలిసిన విద్వాంసుడు జ్యోతిష్మాన్ రూపంలో బ్రహ్మోపాసన చేస్తే ఈ లోకంలో తేజోవంతుడై, తేజోవంతమైన లోకాలకు పోతాడు. ఈ విషయం తెలిసినవాడు జ్యోతిష్మాన్ రూపంలో బ్రహ్మ యొక్క ఈ చతుష్కల పాదాన్ని ఉపాసిస్తాడు.

## ఎనిమిదవ ఖండం

**మం॥ మద్గుష్టే పాదం వక్తేతి స హ శ్వోభూతే గా అభి ప్రస్తాపయాఞ్చకార తా యత్రాభి సాయం బభూవు స్తత్రాగ్ని ముపసమాధాయ గా ఉపరుధ్య సమిధమా ధాయ పశ్చాదగ్నేః ప్రాఙ్పోపవివేశ. 1**

**తం మద్గురుపనిపత్యాభ్యువాద సత్యకామ 3 ఇతి భగవ ఇతి హ ప్రతి శుశ్రావ. 2**

**బ్రహ్మణః సోమ్య తే పాదం బ్రవాణీతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచ ప్రాణః కలా చక్షుః కలా శ్రోత్రం కలా మనః కలైష వై సోమ్య చతు ష్కలః పాదో బ్రహ్మణ ఆయతనవా న్నామ 3**

**స య ఏతమేవం విద్వాంశ్చతుష్కలం పాదం బ్రహ్మణ ఆయతనవానిత్యుపాస్త ఆయతన వానస్మిం ల్లోకే భవత్యాయతననతో హ లోకాన్జయతి య ఏత మేవం విద్వాంశ్చతుష్కలం పాదం బ్రహ్మణ ఆయ తనవానిత్యు పాస్తే. 4**

'నీకు మిగిలి ఉన్న నాల్గవ పాదాన్ని మద్గు అనే జలచరమైన పక్షి బోధిస్తుంది అని చెప్పి హంస వెళ్ళిపోయింది. మరునాడు సత్యకాముడు ఆవుల్ని గురుకులంవైపుకు తోలుకొనిపోతూ ఉండగా సాయంకాలమైంది. అప్పుడు గోవులన్నింటిని నిలిపి అక్కడే అగ్నిని స్థాపించి, సమిధలతో హోమం చేసి అగ్నికి పశ్చిమ దిశ యందు తాను పూర్వాభిముఖుడై కూర్చున్నాడు.

అప్పుడు మద్గు పక్షి అతని వద్దకు వచ్చి సత్యకాముణ్ణి పిలిచింది. సత్యకాముడు బదులు పలికాడు.

అప్పుడా పక్షి సత్యకామునితో – 'ఓ ప్రియదర్శనుడా! నీకు బ్రహ్మ యొక్క చతుర్థ పాదాన్ని ఉపదేశించనా?' అని అడిగింది.

అందుకు సత్యకాముడు – 'స్వామీ! తప్పకుండా ఉపదేశించండి' అన్నాడు.

అప్పుడా పక్షి అంది – "బ్రహ్మ యొక్క చతుర్థపాదం ప్రాణకల, చక్షుఃకల, శ్రోత్రకల, మనఃకల అనే నాలుగు భాగాలు కలది. బ్రహ్మ యొక్క ఈ చతుష్కల పాదాన్ని 'ఆయతనవాన్' అని అంటారు. అంటే ఆశ్రయం కలది అని.

ఇది తెలుసుకొని బ్రహ్మ యొక్క ఈ 'ఆయతనవాన్' అనే పేరుగల చతుర్థ పాదాన్ని ఉపాసించేవాడు ఈ లోకంలో మంచి ఆశ్రయం పొంది, చనిపోయిన పిమ్మట అవకాశం గల లోకాలను, ఆశ్రయం కల లోకాలను జయిస్తాడు. ఇది తెలిసినవాడు ఆయతన గణంతో గూడిన బ్రహ్మ యొక్క చతుష్కల పాదాన్ని ఉపాసిస్తాడు. సారాంశం ఇట్లా ఉంది –

| **ఉపదేశకుడు** | **పాదాలు** | **కలలు (భాగాలు)** |
|---|---|---|
| ఆబోతు (వాయువు) | ప్రకాశమాన్ | పూర్వ, పశ్చిమ, దక్షిణ, ఉత్తర దిక్కులు |
| అగ్ని | అనంతవాన్ | పృథివి, అంతరిక్ష, ద్యులోక సముద్ర కలలు |
| హంస (ఆదిత్యుడు) | జ్యోతిష్మాన్ | అగ్ని, సూర్య, చంద్ర, విద్యుత్ కలలు |
| మద్గు (ప్రాణం) | ఆయతనవాన్ | ప్రాణ, చక్షుస్, శ్రోత్ర, మనః కలలు |

## తొమ్మిదవ ఖండం

మం॥ ప్రాప హాచార్యకులం తమాచార్యోఽభ్యువాద సత్యకామ 3 ఇతి భగవ ఇతి హ ప్రతి శుశ్రావ. 1

బ్రహ్మ విదివ వై సోమ్య భాసి కో ను త్వానుశశాసే త్యన్యే మనుష్యేభ్య ఇతి హ ప్రతిజజ్ఞే భగవాంస్త్వేవ మే కామే బ్రూయాత్. 2

శ్రుతం హ్యేవ మే భగవద్దృ శేభ్య ఆచార్యాద్ధైవ విద్యావిదితా సాధిష్ఠం ప్రాపతీతి తస్మై హైతదేవో వాచాత్ర హ న కించన వీయాయేతి వీయాయేతి. 3

ఈ విధంగా సత్యకాముడు బ్రహ్మవేత్తయై గురుకులంలో ప్రవేశించాడు. సత్యకాముని చూచి గురువు ఇట్లా అన్నాడు – 'ఓ సత్యకాముడా! ప్రియ దర్శనుడా! నీవు బ్రహ్మవేత్తలాగా కనిపిస్తున్నావు. నీకు ఎవరు ఉపదేశమిచ్చారు?'

సత్యకాముడీ విధంగా సమాధానమిచ్చాడు – 'స్వామీ! మానవులు కాకుండా దేవతలు నాకు ఉపదేశమిచ్చారు. ఇక భగవత్స్వరూపులైన తామే నాకు ఉపదేశమివ్వాలని నా కోరిక'.

నేను తమలాంటి తపస్సంపన్నులైన ఋషులవల్ల విన్నాను – గురువుద్వారా తెలుసుకున్న విద్యయే మిక్కిలి మంచిదని, మిక్కిలి ఫలప్రదమైనదని. కాబట్టి నాకు ఉపదేశం చేయండి'. ఈ విధంగా అనిన శిష్యుని మాటలు విని ఆచార్యుడు సత్యకామునికి దేవతల ద్వారా ఉపదేశింపబడిన విషయాన్నే ఏ విధమైన లోటూ లేకుండా ఉపదేశించాడు. ఈ విధంగా సత్యకాముని విద్య పూర్తి అయినది.

## పదవ ఖండం

మం॥ ఉపకోసలో హ వై కామలాయనః సత్యకామే జాబాలే బ్రహ్మచర్యమువాస తస్య హ ద్వాదశ వర్షాణగ్నీన్పరిచచార స హ స్మాన్యాన న్తేవాసినః సమావర్తయం స్తం హ స్మైవ న సమావర్తయతి. 1

తం జాయోవాచ తప్తో బ్రహ్మచారీ కుశలమగ్నీన్పరిచ చారీన్మాత్వాగ్నయః పరిప్రవోచన్ప్ర బ్రూహ్యస్మా ఇతి తస్మై హోప్రోచ్యైవ ప్రవాసాంచక్రే. 2

స హ వ్యాధినానశితుం దధ్రే తమాచార్య జాయో వాచ బ్రహ్మచారిన్నశాన కిం ను నాశ్నాసీతి స హోవాచ బహవ ఇమేఽస్మిన్పురుషే కామానానా త్యయా వ్యాధిభిః ప్రతిపూర్ణోఽస్మినాశిష్యామీతి. 3

**అథ హాగ్నయః సమూదిరే తప్తో బ్రహ్మచారీ కుశలం నః పర్యచారీద్ధన్తాస్మై ప్రబ్రవామేతి తస్మై హోచుః ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మేతి.** **4**

**స హోవాచ విజానామ్యహం యాత్ప్రాణో బ్రహ్మకం చతుఖం చ న విజానామీతి తే హోచుర్యద్వావ కం త దేవ ఖం యదేవ ఖం తదేవ కమితి ప్రాణం చ హాస్మై తదాకాశం చోచుః.** **5**

అగ్నిదేవుడు ఉపకోసలునికి బ్రహ్మవిద్యను ఉపదేశించటం.

కమలుని పుత్రుడు ఉపకోసలుడనే పేరుగలవాడు సత్యకాముని వద్ద బ్రహ్మచర్యంతో శుశ్రూష చేస్తూ ఉంటున్నాడు. అతడు అట్లా పన్రెండు సంవత్సరాల పాటు గురువుగారి యింట అగ్నిహోత్రాలకు పరిచర్యలు చేశాడు. గురువైన సత్యకాముడు ఇతర బ్రహ్మచారులకు స్వాధ్యాయం పూర్తిచేసి సమావర్తనం కూడా పూర్తిచేశాడు. కాని, ఉపకోసలునికి మాత్రం సమావర్తనం నిర్వర్తించలేదు. (సమావర్తనమంటే బ్రహ్మచర్యదీక్ష పూర్తి అయినట్లు ధృవీకరించటం).

ఒకనాడు గురుపత్ని తన భర్తతో అంది – 'ఈ బ్రహ్మచారి (ఉపకోసలుడు) బాగా తపస్సు చేశాడు. అగ్నులకు బాగా పరిచర్య చేశాడు. మీరు అతనికి తగిన ఉపదేశం చేయండి. అట్లా చేయకపోతే అగ్నులకు కోపం రావచ్చు (తమకు సేవచేసిన వానికి అన్యాయం జరిగిందని) అని'. కాని గురువుగారు భార్య మాటలు వినిపించుకోకుండానే బయటకు వెళ్ళిపోయారు.

ఉపకోసలుడు మనస్సులో చాలా దుఃఖించి చివరకు అనశనవ్రతం నిరాహార దీక్ష పూనటానికి నిశ్చయించుకొని అగ్నిశాలలో మౌనంగా కూర్చున్నాడు. అప్పుడాతనితో గురుపత్ని ఇట్లా అంది – 'ఓ బ్రహ్మచారీ! భోజనం చెయ్యి! భోజనం చేయకుండా ఎందుకు కూర్చున్నావు?' అని. అందుకాతడు 'అమ్మా! ఈ కృతార్థుడు కానివానికి వివిధ దిక్కులకు తీసికొనిపోయే కోరికలు చాలా ఉన్నాయి. నేను ఈ విధమైన వ్యాధిచేత పీడితుణ్ణి. (రోగపీడితులు భోజనం చేయరు) కాబట్టి నేను భోజనం చేయను' అని అన్నాడు.

అప్పుడాతని చేత సేవలందుకుంటూ, అతని యెడల ప్రసన్నులై యున్న మూడు అగ్నులు (గార్హపత్య, దక్షిణాగ్ని, ఆహవనీయము) అతని మీద దయ తలచి, 'ఈతడు మనకు బాగా సేవ చేశాడు. కాబట్టి శ్రద్ధాళువైన ఈ బ్రహ్మచారికి బ్రహ్మవిద్యను ఉపదేశిద్దాం' అని నిశ్చయించుకొని ఆ అగ్నులు బ్రహ్మచారితో అన్నాయి – "ప్రాణం బ్రహ్మ, 'క' బ్రహ్మ, 'ఖ' అనేది బ్రహ్మ" అని.

ఈ ఉపదేశాన్ని విని బ్రహ్మచారి ఇట్లా అన్నాడు – "ప్రాణం బ్రహ్మ అనే విషయం నాకూ తెలుసు. ఎందుచేతనంటే ప్రాణం ఉన్నంత వరకే జీవనం. అది లేకపోతే మృత్యువే! కాబట్టి ప్రాణాన్ని బ్రహ్మ అనటం సమంజసమే! కాని 'క', 'ఖ' వీటి విషయం నాకు తెలియదు" అని.

అప్పుడా అగ్నులు ఇట్లా అన్నాయి – 'క' అనేదే 'ఖ'. అట్లాగే 'ఖ' అనేదే 'క'. ఈ రెండూ ఒకటే! 'క' అంటే సుఖం, ఆనందం. 'ఖ' అంటే ఆకాశం. ఆ ఆనందం అనేది ఆకాశరూపం అవటం వల్ల (ఖ) అది నిత్యము, వ్యాపకము అయినది.

ఈ విధంగా అగ్నులు ఆ బ్రహ్మచారికి ప్రాణము. దానికి ఆశ్రయమైన ఆకాశాన్ని గూర్చి ఉపదేశించాయి. (ఆకాశమనేది హృదయంలోని ఆకాశం – ప్రాణంతో కూడినట్టి హృదయాకాశం. (బ్రహ్మ) అది ఆనంద స్వరూపం కలిగినట్టిది. క = ఆనందం, ఖ = హృదయాకాశం ఈ రెండూ ఒకటే!)

## పదునొకండవ ఖండం

**మం॥ అథ హైనం గార్హపత్యోఽనుశశాస పృథివ్యగ్ని అన్న మాదిత్య ఇతి య ఏష ఆదిత్యే పురుషో దృశ్యతే సోఽహ మస్మి స ఏవాహమస్మీతి. 1**

**స య ఏతమేవం విద్వానుపాస్తేఽపహతే పాపకృత్యాం లోకీ భవతి సర్వ మాయురేతి జ్యోగ్జీవతి నాస్యావర పురుషాః క్షీయన్త ఉప వయం తం భుంజామోఽస్మింశ్చ లోకేఽముష్మింశ్చ య ఏత మేవం విద్వా నుపాస్తే 2**

ఆ మూడు అగ్నుల్లో మొదటిదైన గార్హపత్యాగ్ని ఆ బ్రహ్మచారికి (ఉపకోసలునికి) ఈ విధంగా ఉపదేశం చేసింది – "పృథివి, అగ్ని, అన్నము, ఆదిత్యుడు ఇవి నాలుగు నా శరీరాలు. ఆదిత్యునిలో కనిపించే పురుషుణ్ణి నేనే! నేనే!"

"ఈ విధంగా తెలుసుకొని ఉపాసన చేసేవాని పాపకర్మలన్నీ నశించి అతడు అగ్నిలోకాన్ని పొందుతాడు. అతని సంతాన పరంపర క్షీణం కాదు. మేము (అగ్ని రూపులమైన పై నలుగురము) అతనిని ఈ లోకంలోను, పరలోకంలోనూ కూడా కాపాడుతాము. ఇది తెలుసుకొని ఉపాసించేవాడు పై ఫలితాన్ని పొందుతాడు".

(పృథివి, అన్నం ఈ రెండూ అనుభవింపబడేవి కాబట్టి రెంటికి సంబంధం ఉంది. అట్లాగే అగ్ని, ఆదిత్యుడు ఈ ఇరువురు భోక్తలుగా, అన్నాన్ని పుట్టించేవారుగా సంబంధం ఉంది).

## పండ్రెండవ ఖండం

**మం॥ అథ హైనమన్వాహార్యపచనోఽనుశశాసాపో దిశో నక్షత్రాణి చంద్రమా ఇతి య ఏష చంద్రమసి పురుషో దృశ్యతే సోఽహమస్మి స ఏవాహమస్మీతి. 1**

**స య ఏతమేవం విద్వానుపాస్తేఽపహతే పాపకృత్యాం లోకీ భవతి సర్వ మాయురేతి జ్యోగ్జీవతి నాస్యావర పురుషాః క్షీయన్త ఉప వయం తం భుంజామోఽస్మింశ్చ లోకేఽముష్మింశ్చ య ఏతమేవం విద్వా నుపాస్తే 2**

అన్వాహార్య పచనాగ్ని చేసిన ఉపదేశం.

తరువాత ఉపకోసలునికి దక్షిణాగ్ని (అన్వాహార్య పచనాగ్ని) ఈ విధంగా ఉపదేశం చేసింది. 'జలము, దిక్కులు, నక్షత్రాలు, చంద్రుడు ఈ నాలుగు నా శరీరమే! అంటే, నన్ను నేనే నాల్గుగా విభజించుకొని అన్వాహార్య పచనాగ్ని రూపంలో కనిపిస్తున్నాను. చంద్రునిలో కనిపించే పురుషుణ్ణి నేనే!'

'ఈ విధంగా తెలుసుకొని నాలుగుగా విభజింపబడ్డ అగ్నిని ఉపాసించేవారి పాపాలన్నీ నశిస్తాయి. లోకవంతుడౌతాడు - అగ్ని లోకాల్లో నివసిస్తాడు. పూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు. విశుద్ధమైన జీవనం గడుపుతాడు. అతని తరువాతి సంతతి క్షీణించదు. మేము (అగ్నులు) అతనిని ఈ లోకంలోను, పరలోకంలోనూ కూడా కాపాడుతాము'.

అన్వాహార్య పచనాగ్నికి (దక్షిణాగ్నికి) చంద్రునికి దక్షిణ దిక్కుతో సంబంధం ఉంది. నీటికి నక్షత్రాలకు ఉన్న సంబంధం వెనుక చెప్పినట్లుగా భోజ్యంగా (అన్నంగా) ఉండటమే! నక్షత్రాలు చంద్రునికి అన్నం అని ప్రసిద్ధం (భూమి గార్హపత్యాగ్ని అన్నమైనట్లు) నీరు దక్షిణాగ్నికి భోజ్యం (అన్నం) నీరే అన్నాన్ని ఉత్పాదిస్తుంది కాబట్టి!

## పదమూడవ ఖండం

**మం॥ అథ హైన మాహవనీయోఽనుశశాస ప్రాణ ఆకాశౌ ద్యౌర్విద్యుదితి య ఏష విద్యుతి పురుషో దృశ్యతే సోఽహమస్మి స ఏవాహమస్మీతి. 1**

**స య ఏతమేవం విద్వానుపాస్తేఽపహతే పాపకృత్యాం లోకీ భవతి సర్వ మాయురేతి జ్యోగ్జీవతి నాస్యావర పురుషాః క్షీయన్త ఉపవయం తంభుజామో-స్మింశ్చ లోకే-ముష్మింశ్చ య ఏతమేవం విద్వా నుపాస్తే. 2**

తరువాత బ్రహ్మచారియైన ఉపకోసలునికి ఆహవనీయాగ్ని ఈ విధంగా ఉపదేశించింది - "ప్రాణం, ఆకాశం, ద్యులోకం, విద్యుత్తు ఈ నాలుగు నా శరీరం. విద్యుత్తులో కనిపించే పురుషుణ్ణి నేనే!"

ఈ విధంగా నాలుగుగా విభక్తమైయున్న అగ్నిని ఉపాసించేవాడు పాపాలను పోగొట్టుకోగలుగుతాడు. అగ్ని లోకాలలో నివసిస్తాడు. పూర్ణాయుర్దాయాన్ని పొందుతాడు. విశుద్ధ జీవనుడు అవుతాడు. అతని సంతతి క్షీణించదు. ఈ లోకంలోను, పరలోకంలో కూడా ఆ ఉపాసకుణ్ణి మేము (అగ్నులు) కాపాడుతాము'. విద్యుత్తు ఆహవనీయాగ్ని ఈ రెంటికి ద్యులోకంతోను ఆకాశంతోను సంబంధం ఉంది - భోజ్య వస్తువులుగా, విద్యుత్తుకు ద్యులోకం, ఆహవనీయాగ్నికి ఆకాశం వాసస్థానాలు.

## పదునాల్గవ ఖండం

మం॥ తే హోచురుపకోసలైషా సోమ్య తేఽస్మద్విద్యాత్మ విద్యాచాచార్యస్తు తే గతిం వక్తే త్యాజగామ హాస్యా చార్యస్తమాచార్యోఽ భ్యువాదో ప కోసల 3 ఇతి. 1

భగవ ఇతి హ ప్రతిశుశ్రావ బ్రహ్మవిద ఇవ సోమ్య తే ముఖం భాతి కో ను త్వానుశశాసేతి కోను మాను శిష్యాద్భో ఇతీహాపేవ నిహనుత ఇమే నూనమీదృశా అన్యాదృశా ఇతీహాగ్నీ నభ్యూదే కిం ను సోమ్య కిల తేఽవోచన్నితి. 2

ఇద మితి హ ప్రతిజజ్ఞే లోకాన్వావ కిల సోమ్య తేఽవో చన్నహం తు తే తద్వక్ష్యామి యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్త ఏవ మేవం విది, పాపం కర్మనశ్లిష్యత ఇతి బ్రవీతు మే భగవానితి తస్మై హోవాచ. 3

మూడు అగ్నులు ఒక్కసారిగా ఇట్లా అన్నాయి – 'ఓ ప్రియదర్శనుడా! ఉపకోసలుడా! మేము నీకు మాకు సంబంధించిన (అగ్నులకు సంబంధించిన (విద్యను, బ్రహ్మవిద్యనూ కూడా (ప్రాణం బ్రహ్మ, కంబ్రహ్మ, ఖం బ్రహ్మ అని) చెప్పాము. ఇక ఈ విద్య వల్ల ఫలం ఎట్లా పొందాలో ఆ విషయం నీకు నీ గురువుగారు చెపుతారు" అని. తరువాత కొన్నాళ్ళకు అతని గురువుగారు వచ్చి అన్నారు – 'ఓ ప్రియదర్శనుడా! ఉపకోసలుడా!'

"చిత్తం! స్వామీ! ఆజ్ఞాపించండి!" అన్నాడు ఉపకోసలుడు. గురువుగారు అన్నారు – "నాయనా! నీ ముఖాకృతి చూస్తే బ్రహ్మజ్ఞాని లాగా కనిపిస్తున్నావు. నీకు ఎవరు ఉపదేశించారు"?

అందుకు బ్రహ్మచారి ఇట్లా అన్నాడు – "తాము కాకుండా నాకు ఇంకెవరు ఉపదేశం చేస్తారు?" అంటూ అగ్నులు ఉపదేశించిన విషయం దాచటానికి ప్రయత్నించినట్లుగా అని, (గురువుకు అగ్నికి భేదాన్ని చూడనట్లుగా అని) తరువాత అగ్నులవైపు చూపించి అన్నాడు – "నా పరిచర్యలకు సంతుష్టులైన అగ్నులు ఉపదేశం చేశాయి. ఎందుచేతనంటే, ఈ అగ్నులు పూర్వం వేరొక విధంగా ఉండేవి. ఇప్పుడు వణుకుతున్నట్లుగా ఉన్నాయి" అంటూ అగ్నులు ఉపదేశించిన విధం చెప్పాడు. అప్పుడు గురువుగారు అడిగారు – "నాయనా! అగ్నులు ఏమని ఉపదేశించాయి?" అని.

ఉపకోసలుడు తనకు అగ్నులు ఏ విధంగా ఉపదేశించినదీ చెప్పాడు. అది విని గురువుగారు అన్నారు – 'నాయనా! ఆ అగ్నులు నీకు కేవలం లోకాలను గురించి మాత్రమే చెప్పినాయి. నేను నీకు ఇప్పుడు, దేనిని తెలుసుకున్నందువల్ల మానవునికి పాపకర్మల ఫలం అంటదో – తామరాకు మీది నీటిబొట్టు తామరాకును అంటనట్లుగా దేనివల్ల పాపం అంటదో ఆ విషయం చెపుతాను".

"స్వామీ! తప్పకుండా నాకు ఆ విషయం ఉపదేశించండి" అన్నాడు ఉపకోసలుడు. అప్పుడు గురువుగారు చెపుతున్నారు.

## పదునైదవ ఖండం

మం॥ య ఏషోఽక్షిణి పురుషో దృశ్యత ఏష ఆత్మేతి హో వాచైతదమృత మభయ మేతద్బ్రహ్మేతి తద్య ద్యప్యస్మిన్సర్పిర్వోదకం వా సించతి వర్త్మని ఏవ గచ్ఛతి. 1

ఏతం సంయద్వాను ఇత్యాచక్షత ఏతం హి సర్వాణి వామాన్యభి సంయన్తి సర్వాణ్యేనం వామాన్యభిసం యన్తి య ఏవం వేద. 2

ఏష ఉ ఏవ వామనీ రేష హి సర్వాణి వామాని నయతి సర్వాణి వామాని నయతి య యేవం వేద 3

ఏష ఉ ఏవ భామనీ రేష హి సర్వేషు లోకేషు భాతి సర్వేషు లోకేషు భాతి య ఏవం వేద. 4

అథ యదు చైనా స్మిఞ్ఛవ్యం కుర్వన్తి యది చ నార్చిష మేవాభి సంభవన్త్యర్చిషోఽహరహ్న

ఆపూర్యమాణ పక్షమాపూర్యమాణ పక్షాద్యాన్షడుదఙ్ఞేతి మాసాంస్తాన్మా సేభ్యః సంవత్సరం సంవత్సరా దాదిత్యమాదిత్యాచ్చంద్ర మసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః స ఏనాన్బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథ ఏ తేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తన్తే నావర్తన్తే. 5

నేత్రస్థుడైన పురుషుణ్ణి ఉపాసించటం చెపుతున్నారు.

"ఇంద్రియ నిగ్రహం కలిగినట్టి, సమాహిత చిత్తుడైనట్టి, వివేకవంతులు ఈ నేత్రంలో ఉండే – దృష్టికి ద్రష్టమైన పురుషుణ్ణి చూడగలుగుతారు. అతడే ఆత్మ. ఆ ఆత్మ అనేది అభయము (భయము లేనిది) అమృతము (చావు లేనిది) అదే బ్రహ్మ. ఆ పురుషునికి స్థానమైనట్టి నేత్రంలో నెయ్యిగాని, నీరుగాని పోస్తే అది నేత్రానికి అంటకుండా తామరాకుమీద పడ్డ నీటిబొట్టులాగా అటూ ఇటూ కనురెప్పలలోకి జారిపోతుంది. ఆ పురుషుడు ఉండే స్థానానికే ఇంత మహాత్మ్యం ఉంటే ఆ స్థానంలో ఉండే పురుషుని నిస్సంగత్వం యొక్క (దేనినీ అంటుకోని గుణాన్ని) గొప్పతనాన్ని ఏమని చెప్పగలం?

ఈ పురుషునికి 'సంయద్వామ' అనే పేరు ఉంది – అన్ని ఆకర్షణీయమైన వస్తువులకు లక్ష్యం అని అంటే ఆకర్షణీయమైన సంభజనీయమైన – మంచి పదార్థాలన్నీ అన్ని వైపులనుండి వచ్చి ఇతనిని చేరతాయి. ఈ విధంగా తెలుసుకొనినవాడే భామని–

భూమని అంటే సమస్త పుణ్యకర్మల ఫలితాన్ని పొందుతాడు. ఇది తెలిసినవాడే సమస్త పుణ్యకర్మల యొక్క పుణ్యఫలాన్ని ఇతడే పొందుతాడని ఎవడు తెలుసుకుంటాడో అతడే భామని – ఎందుచేతనంటే అతడే ఆదిత్యుడే. చంద్రుడు అగ్ని స్వరూపాల్లో లోకంలో ప్రకాశిస్తూ ఉంటాడు – భాసమానుడై ఉంటాడు. ఈ విధంగా తెలుసుకొన్నవాడు కూడా అన్ని లోకాల్లోను భాసమానుడౌతాడు".

ఇప్పుడు బ్రహ్మజ్ఞాని పొందే స్థితిని చెపుతున్నారు. "బ్రహ్మవేత్త అయిన వానికి అంత్యక్రియలు (చనిపోయిన వాని కొరకు చేసే కర్మలు) చేసినా చేయకపోయినా అతడు తేజోమార్గాన్నే పొందుతాడు. అర్చిరభిమాన దేవత నుండి (అర్చి = కాంతి, తేజస్సు) పగటికి అభిమానదేవతను, పగటికి అభిమానదేవత నుండి, శుక్ల పక్షానికి అభిమాన దేవతను, శుక్లపక్షాభిమాన దేవతనుండి ఆరుమాసాల ఉత్తరాయణాభిమాన దేవతను, ఉత్తరాయణాభిమాన దేవతనుండి సంవత్సరాభిమాన దేవతను, సంవత్సరాభిమాన దేవత నుండి వరుసగా ఆదిత్యుని, చంద్రుని, విద్యుత్తును పొందుతాడు. ఈ విద్యుల్లోకాన్ని చేరినట్టి ఉపాసకుణ్ణి బ్రహ్మలోకం నుండి దివ్యులు వచ్చి సత్యలోకంలో ఉన్న బ్రహ్మవద్దకు తీసుకొనిపోతారు. ఇదే దేవమార్గం. ఇదే బ్రహ్మమార్గం. ఈ మార్గంగుండా వెళ్ళిన ఉపాసకుడు మళ్ళీ మానవలోకానికి రాడు. హిరణ్యగర్భలోకం లేదా సత్యలోకం పొందుతాడు.

(ఉత్తమలోక ప్రాప్తికి అంత్యక్రియల కంటె జ్ఞానమే ఉత్కృష్టమైనదని చెప్పారు. ఈ విధమైన విజ్ఞానవంతునికి అంత్యక్రియలు చేయనక్కరలేదని కాదు. విజ్ఞానవంతులు కానివారి విషయంలో మాత్రం వారు చేసిన విహిత కర్మల భోగానికి అంత్యకర్మలు లేకపోవటం ఆటంకంగా ఉంటుందని గ్రహించాలి. అయితే, జ్ఞానవంతుల విషయంలో మాత్రం అంత్యక్రియలాచరించినా ఆచరించక పోయినా అతనికి జ్ఞానఫలాన్ని అనుభవించటానికి అభ్యంతరం ఉండదని భావం. ఆనందమయుడైన ఆకాశబ్రహ్మను, నేత్రస్థుడైన పురుషునిగా ఉపాసించేవానికి, ఆదిత్య, చంద్ర, అగ్ని లోకాల్లో భాసమానుడై ఉండేవానికి ఈ అంత్యక్రియలు చేసినా చేయకపోయినా ఒకటే అని భావం).

## పదునారవ ఖండం

**మం॥ ఏష హ వై యజ్ఞో యోఽయం పవత ఏష హ యన్నిదం సర్వం పునాతి యదేష యన్నిదం సర్వం పునాతి తస్మాదేష ఏవ యజ్ఞస్తస్యమనశ్చ వాక్చ వర్తనీ. 1**

**తయోరన్యతరాం మనసా సంస్కరోతి బ్రహ్మా వాచా హోతాధ్వర్యురుద్గా తాన్యతరాం స యత్రోపాకృతే ప్రాతరనువాకే పురా పరిధానీయయా బ్రహ్మా వ్యవ వదతి. 2**

**అన్యతరామేవ వర్తనీం సంస్కరోతి హీయతేఽ న్యతరా స యథైక ఉ ప్రాద్వ్రజన్రథో వై కేన చక్రేణ వర్తమానో రిష్యత్యేవ మస్య యజ్ఞోరిష్యతి యజ్ఞం రిష్యన్తం యజ మానో–ను రిష్యతి స ఇష్ట్వా పాపీయాన్భవతి. 3**

**అథ యత్రోపాకృతే ప్రాతరనువాకే న పురా పరిధానీ యాయా బ్రహ్మా వ్యవవదుత్యుభే ఏవ వర్తనీ సంస్కు ర్వన్తి న హీయతే-న్యతరా. 4**

**స యథోభయ పాద్వ్రజన్రథో వోభాభ్యాం చక్రాభ్యాం వర్తమానః ప్రతి తిష్ఠత్యేవమస్య యజ్ఞః ప్రతితిష్ఠతి యజ్ఞం ప్రతితిష్ఠన్తం యజమానో-ను ప్రతితిష్ఠతి స ఇష్ట్వా శ్రేయాన్భవతి. 5**

యజ్ఞోపాసనను గూర్చి వివరిస్తున్నారు.

ఈ వాయురూపంలో వీచేది నిస్సందేహంగా యజ్ఞమే! నిజంగానే ఇది (వాయువు) సమస్త జగత్తును పవిత్రం చేస్తోంది. అది ఈ విధంగా వీస్తూనే ప్రపంచాన్నంతా పవిత్రం చేస్తోంది; కాబట్టి నిజంగా యజ్ఞమే! యజ్ఞంలో మంత్రాల్ని ఉచ్చరించటంలో ప్రవృత్తమయ్యేవాణి (వాక్కు), యదార్థమైన వస్తుజ్ఞానంలో ప్రవృత్తమయ్యే మనస్సు, ఈ రెండూ మార్గాలు. (వాయువు ఆధారంగా, వాయువును ఉద్దేశించి హోమం చేసే ఒక యజ్ఞం ఉన్నట్లు వేదాల్లో ఉంది – 'స్వాహావాతేథాః' (తైత్తిరీయ సంహిత) యజ్ఞానికి ప్రాణచోదకమైనట్టి వాక్కు, మనస్సులు ప్రధానం కాబట్టి వాయువులో స్వభావసిద్ధమైన చలనం ఉంది కాబట్టి వాయువును యజ్ఞారంభకంగా, యజ్ఞాధారంగా చెప్పారు. వాక్కు మనస్సులు రెండూ యజ్ఞానికి మార్గాలు).

యజ్ఞంలో బ్రహ్మ (ఋత్విక్కు) మౌనభంగం చేస్తే యజ్ఞానికి హాని కలుగుతుందని చెపుతున్నారు.

ఆ రెండు మార్గాలలోను (వాక్కు – మనస్సు) బ్రహ్మ అనే ఋత్విక్కు ఒక మార్గాన్ని వివేకవంతమైన మనస్సుతో సంస్కరిస్తాడు. అంటే పవిత్రం చేస్తాడు. మిగిలిన హోత, అధ్వర్యుడు ఉద్గాత అనేవారు ముగ్గురూ వాగ్రూపమైన మార్గం ద్వారా రెండవ మార్గాన్ని పవిత్రం చేస్తారు. ప్రాతరనువాకం ప్రారంభమై, పరిధానీయా ఋక్కు ఉచ్చరించటానికి పూర్వం (ఈ మధ్యకాలంలో) బ్రహ్మ మౌనభంగం చేసి మాట్లాడితే ఒక్క వాగ్రూపమైన మార్గం మాత్రమే పవిత్రమౌతుంది. (బ్రహ్మ యొక్క మౌనభంగంవల్ల మానసిక మార్గం అసంస్కృతమై, అపవిత్రమై ఆ మార్గానికి ఛిద్రం ఏర్పడుతుంది. ఒక కాలు మాత్రమే ఉన్నవాడు నడచినట్లుగా, ఒక చక్రం మీదనే రథం నడచినట్లుగా ఈ యజ్ఞ నాశనమౌతుంది. యజ్ఞహాని జరిగిందంటే, యజమానికి కూడా హాని జరిగి తీరుతుంది. ఈ విధమైన యజ్ఞం చేయటం వల్ల మరింత పాపి అవుతాడు.

కాబట్టి బ్రహ్మ యొక్క మౌనధారణం వల్ల యజ్ఞసిద్ధి కలుగుతుందని చెపుతున్నారు. విద్వాంసుడైన బ్రహ్మ, ప్రాతరనువాకం ప్రారంభించిన తరువాత పరిధానీయా ఋక్కుకు పూర్వం ఈ మధ్యకాలంలో మౌనాన్ని వదలిపెట్టకుండా ఉంటే ఋత్విక్కులంతా కలసి రెండు మార్గాలను పవిత్రం చేసిన వారౌతారు. ఏ మార్గానికీ హాని జరగదు.

రెండు కాళ్ళతోనూ నడిచే పురుషునిలాగా, రెండు చక్రాలమీద నడిచే రథం లాగా యాగంకూడా సుప్రతిష్ఠితమై, యజ్ఞంతోపాటు యజమాని కూడా సుప్రతిష్ఠుతుడౌతాడు. ఈ విధమైన మౌన విజ్ఞానం తెలిసిన బ్రహ్మద్వారా యజ్ఞం చేసినట్టి యజమాని శ్రేష్ఠుడు, కృతకృత్యుడు అవుతాడు.

పదునేడవ ఖండం

**మం॥ ప్రజాపతి ర్లోకానభ్యతపత్తేషాం తప్యమానానాం రసా న్ప్రావృహదగ్నిం పృథివ్యా వాయుమన్తరిక్షా దాదిత్యం దివః. 1**

**స ఏతాస్తిస్రో దేవతా అభ్యతవత్తాసాం తప్య మానానాంరసాన్ప్రవృ హదగ్నేర్ఋచో వాయోర్య జూంషి సామాన్యాదిద్యాత్. 2**

**స ఏతాం త్రయీం విద్యామభ్య తపత్తస్యాస్తప్యమా నాయా రసాన్ప్రవృ హద్భూరిత్యృగ్భ్యో భువరితి యజు ర్భ్యః స్వరితి సామభ్యః 3**

**తద్యదృక్తోరిష్యేద్భూః స్వాహేతి గార్హపత్యే జుహు యాదృచామేవ తద్రసేనర్చాం వీర్యేణర్చాం యజ్ఞస్య విరిష్టం సన్దధాతి. 4**

**అథ యది యజుష్టోరిష్యేద్భువః స్వాహేతి దక్షిణాగ్నౌ జుహుయాద్య జుషామేవ తద్రసేన యజుషాం వీర్యేణ యజుషాం యజ్ఞస్య విరిష్టం సందధాతి. 5**

**అథ యది సామతో రిష్యేత్స్వః స్వాహేత్యాహవ నీయే జుహు యాత్సామ్నా మేవ తద్రసేన సామ్నాం వీర్యేణ సామ్నాం యజ్ఞస్య విరిష్టం సందధాతి. 6**

(పైన చెప్పినట్లు బ్రహ్మవల్లగాని, ఇతర ఋత్విక్కులవల్లగాని ఏదైనా పొరపాటు జరిగినప్పుడు ఆ దోషాన్ని పోగొట్టుకోవటానికి వ్యాహృతుల ఉపాసనను గూర్చి చెపుతున్నారు. భూః భువః సువః అనేవి వ్యాహృతులు).

ప్రజాపతి, లోకాల్ని ఉద్దేశించి వాటి సారాన్ని గ్రహించాలనే తలంపుతో ధ్యానరూపమైన తపస్సు చేశాడు. ఆ విధంగా తపింపబడ్డ లోకాల నుండి రసాన్ని (సారాన్ని) తీశాడు. పృథివినుండి అగ్ని అనే రసాన్ని, అంతరిక్షం నుండి వాయువు అనే రసాన్ని, ద్యులోకం నుండి ఆదిత్యుడు అనే రసాన్ని పిండాడు – సారంగా గ్రహించాడు.

పిమ్మట ప్రజాపతి ఈ ముగ్గురిని గూర్చి (అగ్ని, వాయువు, ఆదిత్యుడు) ధ్యానరూపమైన తపస్సు చేశాడు. ఆ విధంగా తపింపబడిన ముగ్గురు దేవతలనుండి మూడు వేదాలనే రసాన్ని పిండాడు. అగ్నినుండి ఋగ్వేదాన్ని, వాయువునుండి యజుర్వేదాన్ని, ఆదిత్యుని నుండి సామవేదాన్ని సారంగా గ్రహించాడు.

పిమ్మట ప్రజాపతి ఈ త్రయీవిద్యను (మూడు వేదాలను) ఉద్దేశ్యంగా పెట్టుకొని ధ్యానరూపమైన తపస్సు చేశాడు. ఆ విధంగా తపింపబడ్డ త్రయీవిద్య నుండి సారాన్ని తీశాడు – ఋగ్వేదం నుండి భూలోకం, యజుర్వేదం నుండి భువః, సామవేదం నుండి సువః అనే లోకాన్ని రసరూపంలో గ్రహించాడు. భూః, భువః, సువః అనేవి వ్యాహృతులు. ఇవి వేదాలనుండి, దేవతలనుండి, లోకాలనుండి లభించిన సారతమమైనవి. అందుచేత యజ్ఞం చేసేటప్పుడు ఋగ్వేదసంబంధమైన లోటు లేక పొరపాటు ఏదైనా జరిగితే 'భూః స్వాహా' అనే మంత్రంతో గార్హపత్యాగ్నిలో హోమం చేయాలి.

ఈ విధంగా చేయటం వల్ల ఋగ్వేద మంత్రాల (ఋక్కుల సారం వల్ల, వాటి ప్రభావం వల్ల యజమాని ఋగ్వేదం వల్ల యజ్ఞానికి కలిగిన లోటును సరిదిద్దుకోగలుగుతాడు.

ఒకవేళ యజుర్వేద సంబంధమైనట్టి లోటు ఏదైనా జరిగితే 'భువః స్వాహా' అని అంటూ దక్షిణాగ్నిలో హోమం చేయాలి. ఈ విధమైన యజుర్వేద సారంవల్ల, దాని శక్తివల్ల యజ్ఞంలో యజుస్సంబంధమైన లోటుపాట్లు అన్నీ సరిచేయబడతాయి.

ఒకవేళ సామవేదానికి సంబంధించిన లోటు ఏదైనా జరిగితే 'సువః స్వాహా' అని ఆహవనీయాగ్నిలో హోమం చేయాలి. ఈ విధమైన సామసారంతో, దాని శక్తితో సామవేద సంబంధమైన హాని తొలగిపోతుంది.

మూడు వేదాల వల్ల విజ్ఞానం తెలిసినవాడే బ్రహ్మపదవికి అర్హుడు. కాబట్టి ఒకవేళ బ్రహ్మవల్ల యజ్ఞంలో ఏదైనా లోటు, పొరపాటు వాటిల్లితే అప్పుడు (ఆ లోటు మూడు వేదాలకు సంబంధించి ఉంటుంది కాబట్టి) మూడు వ్యాహృతులతోను (భూః స్వాహా, భువః స్వాహా, సువః స్వాహా అని లేదా భూర్భువ స్వః స్వాహా అని) మూడు అగ్నుల్లోను హోమం చేయాలి. ఆ లోటు మూడు వేదాలకు సంబంధించిన విజ్ఞానంవల్లనే తీరాలి కాబట్టి!

**మం॥ త ద్యథా లవణేన సువర్ణం సన్దధ్యా త్సువర్ణేన రజతం రజ తేన త్రపు త్రపునా సీసం సీసేన లోహం లోహేన దారు దారు చర్మణా. 7**

**ఏవ మేషాం లోకానామాసాం దేవతానా మస్యా స్త్రయా విద్యాయా వీర్యేణ యజ్ఞస్య విరిష్టం సన్దధాతి భేషజకృతో హ వా ఏష యజ్ఞో యత్రైవం విద్బ్రహ్మా భవతి. 8**

**ఏష హ వా ఉదక్ప్రవణో యజ్ఞో యత్రైవం విద్బ్రహ్మా భవత్యేవం విదం హ వా ఏషా బ్రహ్మాణ మనుగాథా యతో యత ఆవర్తతే తత్తద్గచ్ఛతి. 9**

**మానవో బ్రహ్మైవైక ఋత్విక్కు రునశ్వాభిరక్ష త్యేవం విద్ధ వై బ్రహ్మా యజ్ఞం యజమానం**

**సర్వాంశ్ఛర్త్విజో-భిరక్షతి తస్మాదేవం విద మేవ బ్రహ్మాణం కుర్వీత నానేవంవిదం నానేవంవిదం.** **10**

బంగారాన్ని వెలిగారం లేక టంకంతో అతుకుతారు – కలుపుతారు. అట్లాగే వెండిని బంగారంతోను, వెండితో తగరాన్ని లేక సత్తును, తగరంతో సీసాన్ని, సీసంతో ఇనుమును, ఇనుముతో కఱ్ఱను, లేదా చర్మంలో కఱ్ఱను కలిపి కట్టుతారు – అతుకుతారు.

అట్లాగే ఈ మూడు లోకాలు (పృథివి, అంతరిక్షం, ద్యులోకం) ముగ్గురు దేవతలు (అగ్ని, వాయువు, ఆదిత్యుడు) మూడు వేదాలు. వీటి శక్తితో యజ్ఞంలోని లోపాల్ని, లోటుపాట్లను పూరిస్తారు. త్రయీ విజ్ఞాన సంపన్నుడు, విద్వాంసుడు అయిన బ్రహ్మ గనుక ఉంటే ఓషధుల ద్వారా వైద్యుడు వ్యాధిని నయంచేసినట్లే యజ్ఞంలోని లోపాలన్నింటిని సరిచేస్తాడు.

ఇటువంటి విద్వాంసుడైన బ్రహ్మ గనుక ఉంటే, ఆ యజ్ఞం ఉత్తరాయణ మార్గాన్ని (దేవయాన మార్గాన్ని) పొందించేది అవుతుంది. ఎక్కడెక్కడ యజ్ఞానికి క్షతి (గాయం) లేదా ఎక్కడెక్కడ యజ్ఞకర్మ మళ్ళీ మొదటికి వస్తుందో అక్కడక్కడికల్లా వెళ్ళి బ్రహ్మ ప్రాయశ్చిత్తంతో యజమానిని రక్షిస్తాడనే గాథ ప్రచారంలోకి వచ్చింది.

మౌన శీలుడైనట్టి ఋత్విక్కే బ్రహ్మ. యుద్ధంలో గుఱ్ఱం వీరులందర్నీ అన్ని విధాల రక్షించినట్లే యాగంలో బ్రహ్మ యజ్ఞాన్ని, యజమానిని, ఇతర ఋత్విక్కుల్ని అందరిని కాపాడతాడు. ఈ విషయాలు తెలియని వానిని బ్రహ్మగా వరించరాదు – వరించరాదు.

# ఐదవ అధ్యాయం

## మొదటి ఖండం

**మం॥ ఓం యోహ వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ హ వై శ్రేష్ఠశ్చ భవతి ప్రాణో వావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ. 1**

**యో హ వై వసిష్ఠం వేద వసిష్ఠో హ స్వానాం భవతి వాగ్వావ వసిష్ఠః 2**

**యోహ వై ప్రతిష్ఠాం వేద ప్రతి హ తిష్ఠత్యస్మింశ్చ లోకేఽ ముష్మింశ్చ చక్షుర్వావ ప్రతిష్ఠా. 3**

**యో హ వై సంపదం వేద సం హాస్మై కామాః పద్యన్తేదైవాశ్చ మానుషాశ్చ శ్రోత్రం వావ సంపత్. 4**

**యో హ వా ఆయతనం వేదాయతనం హ స్వానాం భవతి మనోహవా ఆయతనం. 5**

ఎవ్వరైనా వయస్సులో పెద్దవాడైతే, మొదటివాడైతే వానిని జ్యేష్ఠుడనీ, సద్గుణాల్లో మొదటివాడైతే శ్రేష్ఠుడనీ అంటారు. ఈ రెండూ ఒకనిలోనే ఉండవచ్చు – జ్యేష్ఠత్వము, శ్రేష్ఠత్వమూను. ఈ కార్యకరణ సంఘాతరూపమైనట్టి ఈ శరీరంలో ఉండే ఇంద్రియాలన్నింటిలోకి నిశ్చయంగా ప్రాణమే జ్యేష్ఠము, శ్రేష్ఠమూ అయినది.

సంపన్నుడైన కారణంగా, మిక్కిలి రక్షణ ఉన్న కారణంగా, వశిష్ఠుడైన వానిని తెలుసుకొన్నవాడు తనవారిలో తాను కూడా అట్లాగే వశిష్ఠుడౌతాడు. అంటే తనవారిలో సంపన్నుడు, తనవారిని రక్షించేవాడు అవుతాడు. నిజానికి వాక్కు వశిష్ఠమే! ఎందుచేత? శ్రేష్ఠుడైన వక్త తన వాక్చాతుర్యంతో ఇతరులను జయించి ధనసంపన్నుడౌతున్నాడు.

అట్లాగే ప్రతిష్ఠ లేదా ఆధారం (ఆశ్రయం) విషయమై తెలుసుకున్నవాడు ఈ లోకంలోను పరలోకాల్లో కూడా ఆశ్రయం కలవాడౌతాడు. నిజానికి నేత్రమే ప్రతిష్ఠ. ఎందుచేతనంటే నేత్రంతో చూచేది సమస్థలమో, ఏది విషమ స్థలమో (సమానంగా ఉన్న నేల, ఎగుడు దిగుడు నేల) తెలుసుకొని ఆశ్రయాన్ని పొందుతున్నాడు – స్థిరంగా ఉంటున్నాడు.

సంపదను గురించి తెలుసుకున్నవాడు మానుషదైవీ సంపదలను, భోగాలను పొందుతాడు. శ్రోత్రమే సంపద. ఎందుచేతనంటే శ్రోత్రం ద్వారా వేదాల్ని, వేదార్థాన్ని తెలుసుకొని, కర్మానుష్ఠానం చేసి, తద్వారా భోగాల్ని పొందుతాడు కాబట్టి.

అట్లాగే ఆయతనాన్ని గురించి (ఆశ్రయాన్ని గురించి) తెలుసుకున్నవాడు సజాతీయులకు ఆశ్రయమౌతాడు. నిజానికి మనస్సే ఆయతనం. ఎందుచేతనంటే ఇంద్రియాల ద్వారా

సంపాదించబడిన విషయాలన్నింటికి మనస్సే ఆయతనం (ఆశ్రయం) కాబట్టి!

**మం॥ అథ హ ప్రాణా అహం శ్రేయసి వ్యూదిరేఽ హం శ్రేయానస్మ్యహం శ్రేయానస్మీతి. 6**

**తే హ ప్రాణాః ప్రజాపతిం పితరమేత్యోచుర్భగవన్కో నః శ్రేష్ఠ ఇతి తాన్హోవాచ యస్మిన్వ ఉత్క్రాంతే శరీరం పాపిష్ఠతరమివ దృశ్యతే సవః శ్రేష్ఠ ఇతి. 7**

ఒకానొకప్పుడు ఇంద్రియాలన్నీ నేను శ్రేష్ఠమైనదానినని, నేను శ్రేష్ఠమైనదానినని తమలో తాము వాదానికి దిగినాయి.

ఈ విధంగా వాదానికి దిగిన ఇంద్రియాలు తమ జనకుడైన ప్రజాపతి వద్దకు వెళ్ళి ఈ విధంగా అడిగాయి – 'ఓ దేవా! మాలో ఎవరు జ్యేష్ఠులు? ఎవరు శ్రేష్ఠులు?' అని. అప్పుడు ప్రజాపతి ఈ విధంగా చెప్పాడు. 'మీలో ఎవరు వెళ్ళిపోవటంవల్ల ఈ శరీరం శక్తిహీనమై, నికృష్టమై, మిక్కిలి పాపభూయిష్టమైనదిగా అవుతుందో అదే అన్నిటికంటే శ్రేష్ఠమైనది, జ్యేష్ఠమైనది' అని.

**మం॥ సా హ వాగుచ్చక్రామ సా సంవత్సరం ప్రోష్య పర్యేత్యోవాచ కథమశకత ర్తే మజ్జీవితు మితి? యథా కలా అవదన్తః ప్రాణన్తః ప్రాణేన పశ్యన్త శ్చక్షు షా శృణ్వంతః శ్రోత్రేణ ధ్యాయన్తో మనసైవమితి ప్రవివేశ హ వాక్. 8**

**చక్షుర్హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్య పర్యేత్యో వాచ కథమశకతర్తే మ జ్జీవితు మితి? యథాన్ధా అపశ్యన్తః ప్రాణన్తః ప్రాణేన పదన్తో వాచా శృణ్వం తః శ్రోత్రేణ ధ్యాయన్తో మనసైవమితి ప్రవివేశ హ చక్షుః 9**

**శ్రోత్రం హోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్య పర్యే త్యోవాచ కథమశకతర్తే మజ్జీవితుమితి? యథా బధిరా అశృణ్వంతః ప్రాణన్తః ప్రాణేన వదన్తో వాచా పశ్యం తశ్చక్షుషా ధ్యాయన్తో మనసైవమితి ప్రవివేశ హ శ్రోత్రమ్. 10**

**మనోహోచ్చక్రామ తత్సంవత్సరం ప్రోష్య పర్యేత్యో వాచ కథమశకతర్తే మజ్జీవితుమితి? యథా బాలా అమనసః ప్రాణేనః ప్రాణేన వదన్తో వాచా పశ్యన్త శ్చక్షుషా శృణ్వంతః శ్రోత్రేణైవమితి ప్రవివేశ హ మనః 11**

అప్పుడు ముందుగా వాక్కు శరీరం నుండి వెళ్ళిపోయింది. ఒక సంవత్సరం పాటు ప్రవాసంలో ఉంది. తరువాత తిరిగి వచ్చింది. తిరిగివచ్చి మిగతా ఇంద్రియాలను అడిగింది – నేను లేనప్పుడు మీరంతా ఎట్లా ఉండగలిగారు?' అని. అప్పుడా ఇంద్రియాలు ఇలా అన్నాయి – 'మూగవాడు, మాట రాకపోయినా ఊపిరి పీలుస్తూ, వదులుతూ, కళ్ళతో చూస్తూ, చెవుల్తో వింటూ, మనస్సుతో

ఆలోచిస్తూ ఇతర పనులన్నీ చేసుకుంటూ జీవించినట్లే మేమూ ఉన్నాము' అని. ఈ మాటలు విని వాక్కు తాను శ్రేష్ఠమైనదానను కానని గుర్తించి మళ్ళీ శరీరంలో ప్రవేశించింది.

పిమ్మట నేత్రం శరీరం నుండి ఉత్క్రమించింది. ఒక ఏడాదిపాటు ప్రవాసంలో ఉండి, తిరిగివచ్చి మిగతా ఇంద్రియాలను (ప్రాణాలను) అడిగింది – 'నేను లేనప్పుడు మీరంటా ఎట్లా జీవించి ఉండగలిగారు?' అని. అప్పుడా ఇంద్రియాలన్నీ యిట్లా అన్నాయి – 'కండ్లు లేనివాడు చూడలేకపోయినా, ప్రాణన కర్మనాచరిస్తూ (ఊపిరి పీలుస్తూ వదులుతూ) నోటితో మాట్లాడుతూ, చెవులతో వింటూ, మనస్సుతో ఆలోచిస్తూ బ్రతికినట్లుగానే మేమూ బ్రతికాం' అని. ఈ మాటలు విని చక్షురింద్రియం తాను శ్రేష్ఠమైనదాననపు కానని గుర్తించి మళ్ళీ శరీరంలో ప్రవేశించింది.

తరువాత శ్రోత్రం శరీరం నుండి ఉత్క్రమించింది. ఒక సంవత్సరంపాటు ప్రవాసంలో ఉండి, తిరిగివచ్చి మిగతా ఇంద్రియాలతో అంది – 'నేను లేనప్పుడు మీరంతా ఎట్లా జీవించి ఉండగలిగారు?' అని. అందుకు మిగతా ఇంద్రియాలన్నీ ఇలా అన్నాయి – 'చెవిటివాడు వినలేకపోయినా, ఊపిరి పీలుస్తూ, వదుల్తూ, కండ్లతో చూస్తూ, నోటితో మాట్లాడుతూ, మనస్సుతో ఆలోచిస్తూ బ్రతికినట్లుగానే మేమూ బ్రతికాము' అని. అప్పుడు శ్రోత్రం తన ఓటమిని గుర్తించి మళ్ళీ శరీరంలో ప్రవేశించింది.

పిమ్మట మనస్సు శరీరం నుండి లేచిపోయి, ఒక సంవత్సరంపాటు ప్రవాసంలో ఉండి, తిరిగివచ్చి మిగతా ఇంద్రియాలను అడిగింది – 'నేను లేనప్పుడు మీరు ఎట్లా జీవించగలిగారు?' అని. అందుకా ఇంద్రియాలు ఇట్లా అన్నాయి – 'మనస్సు లేని (మనస్సు వికసించని) చంటి పిల్లలు ఊపిరి పీలుస్తూ, వదులుతూ, నోటితో మాట్లాడుతూ, కండ్లతో చూస్తూ, చెవులతో వింటూ బ్రతికినట్లే మేమూ బ్రతికాము' అన్నాయి. అంతట మనస్సు తాను శ్రేష్ఠము, వరిష్ఠము కానని గుర్తించి మళ్ళీ శరీరంలో చేరింది.

**మం॥ అథ హ ప్రాణ ఉచ్చిక్రమిషన్స యథా సుహయః షడ్వీశశంకూన్సంఖిదే దేవమితరాన్ప్రాణాన్సమఖి దత్తం హోభిసమేత్యోచుర్భగవన్నేధిత్వం నః శ్రేష్ఠోఽసి మోత్క్రమీరిత. 12**

**అథ హైనం వాగువాచ యదహం వసిష్ఠోఽస్మి త్వం తద్వ సిష్ఠోఽసీత్యథ హైనం చక్షురువాచ యదహం ప్రతిష్ఠాస్మి త్వం తత్ప్రతిష్ఠాసీతి. 13**

**అథ హైనం శ్రోత్రమువాచ యదహం సంపదస్మి త్వం తత్సంపద సీత్యథ హైనం మన ఉవాచ యదహ మాయ తనమస్మి త్వం తదాయతనమసీతి. 14**

**న వై వాచో న చక్షూంసి న శ్రోత్రాణి న మానం సీత్యాచక్షతే ప్రాణా ఇత్యేవాచక్షతే ప్రాణో హ్యేవైతాని సర్వాణి భవతి. 15**

తరువాత ముఖ్యప్రాణం లేచిపోవటానికి సిద్ధపడింది. మంచి జాతికి చెందిన గుఱ్ఱం పరీక్షించటానికి కొరడాతో కొట్టగానే కాళ్ళకు కట్టిన త్రాళ్ళతోసహా కట్టు కొయ్యలను పెకిలించినట్లుగా ముఖ్యప్రాణం వాగాది ప్రాణాలన్నింటిని శరీరం నుండి పెకలించి వేసింది. ఇవన్నీ పోవటంతో శరీరం శవమై నికృష్టమైంది. అప్పుడు మిగతా వాగాది ఇంద్రియాలన్నీ ప్రాణంతో ఇట్లా అన్నాయి – 'స్వామీ! నీవే మా అందరికీ యజమానివి. మా అందరికంటే నీవే శ్రేష్ఠుడవు. నీవు శరీరం నుండి లేచిపోవద్దు' అని.

తరువాత వాక్కు ముఖ్యప్రాణంతో ఇట్లా అంది – 'నాలో ఏదైనా వరిష్ఠత్వం – శ్రేష్ఠత్వం ఉంటే అది నీవే! అది నీవల్లనే వచ్చింది' అని.

అట్లాగే నేత్రం అంది – 'నాలో ఏదైనా ప్రతిష్ఠ (ఆశ్రయమిచ్చే) గుణం ఉంటే అది నీవే! నీవే ఆ ప్రతిష్ఠ అనే గుణం కలదానవు!' అని.

అట్లాగే శ్రోత్రం కూడా అంది – 'నాలో ఏదైనా సద్గుణం ఉంటే అది నీవే! ఆ సమృద్ధము, సంపద అనే గుణం నీవల్లనే నాకు వచ్చింది' అని.

తరువాత మనస్సు అన్నది – 'నాకున్న ఆయతనత్వ గుణం (ఆశ్రయం ఇచ్చే గుణం) ఏదైనా ఉంటే అది నీదే! నీవే ఆయతనత్వ గుణంతో కూడినదానవు'.

అందుచేతనే లోకంలో శాస్త్రజ్ఞులైనవారు ఈ ఇంద్రియాలను నేత్రమని, శ్రోత్రమని, వాక్కు అని, మనస్సు అని అనరు. అన్నింటిని ప్రాణాలని అంటారు – ముఖ్యప్రాణం లేకపోతే ఇవి లేవు కాబట్టి. ఈ ఇంద్రియ సమూహమంతా ప్రాణమే!

## రెండవ ఖండం

**మం॥ స హోవాచ కిం మేఽన్నం భవిష్యతీతి యత్కించిది దమా శ్వభ్య ఆ శకునిభ్య ఇతి హోచుస్తద్వా ఏతదన స్యాన్నమనో హ వై వామ ప్రత్యక్షం న హ వా ఏవం విది కించనానన్నం భవతీతి.** **1**

అప్పుడు ముఖ్యప్రాణం మిగతా వాగాది ప్రాణాలతో (ఇంద్రియాలతో) అన్నది – 'అయితే సరే! మరి నాకు అన్నము ఏది?' అని. అప్పుడు మిగతా ప్రాణాలన్నీ ఇలా అన్నాయి – 'కుక్కలు, పిల్లులు, పక్షులు మొదలైన జీవజంతువులన్నింటి ఆహారము నీకు అన్నమే! ఎందుచేతనంటే ఏ ప్రాణి శరీరంలోనైనా ముఖ్యప్రాణంవల్లనే మిగతా ఇంద్రియాలన్నీ పనిచేస్తున్నాయి. కాబట్టి అన్నింటి ఆహారము ప్రాణానికి ఆహారమే అవుతుంది. అంటే విరాట్ ప్రాణానికి ఈ విరాడన్నమంతా ఆహారమే! ఈ ప్రాణ విజ్ఞానాన్ని తెలుసుకున్నవానికి అభక్ష్యం (తినరానిది) ఏదీ ఉండదు.

ఎందుచేతనంటే ఆ విద్వాంసుడు – ప్రాణోపాసకుడు ప్రాణస్వరూపుడే అవుతాడు కాబట్టి! 'అన' అంటే చలనము, పనిచేయు లేక వర్తించు అని అర్థం. ప్రాణ, అపాన, ఉదాన అనే వాటిలో మొదట చేరిన ఉపసర్గలనుబట్టి ఆయా క్రియాభేదాలు కనిపిస్తున్నాయి. అన్ని రకాల అన్నాన్ని తినేది 'అన' అనే ముఖ్యప్రాణం.

**మం॥ స హోవాచ కిం మే వాసో భవిష్యతీత్యాప ఇతి హోచుస్తస్మాద్వా ఏతదశి ష్యన్తః పురస్తాచ్చోపరిష్టా చ్చాద్భిః పరిదధతి లమ్భుకో హ వాసో భవత్యనగ్నో హ భవతి. 2**

అప్పుడు ప్రాణం మళ్ళీ అడిగింది – 'అయితే మరి నాకు వస్త్రం ఏది? – అచ్ఛాదన ఏది? అని. అప్పుడు ఆ యింద్రియాలన్నీ ఇలా అన్నాయి – 'జలం' అని. అందుకే విద్వాంసులైనవారు భోజనానికి ముందు తరువాత కూడా జలంతో ప్రాణాన్ని ఆచ్ఛాదిస్తున్నారు వస్త్రంలాగా. భోజనానికి పూర్వం, భోజనానికి తరువాత జలం త్రాగటాన్ని – ఆపోశనం, ఉత్తరాపోశనం – ప్రాణానికి వస్త్రాచ్ఛాదనగా చెప్పారు. ఈ విధంగా ప్రాణం, వస్త్రాల్ని పొంది నగ్నత్వం లేనిది అవుతోంది. ఈ విషయం తెలుసుకొన్నవాడు కూడా వస్త్రాల్ని పొంది నగ్నత్వం లేని వాడౌతాడు.

**మం॥ తద్ధైతత్సత్యకామో జాబాలో గోశ్రుతయే వైయాఘ్ర పద్యాయోక్త్వో వాచ యద్యప్యేతచ్ఛుష్కాయ స్థాణవే బ్రూయాజ్జాయేరన్నే వాస్మి న్ఛాఖాః ప్రరోహేయుః పలాశానీతి.**

సత్యకామ జాబాలుడు, ఈ ప్రాణవిజ్ఞానాన్ని వ్యాఘ్రపాదుని కొడుకైన గోశ్రుతి అనేవానికి చెప్పి, ఇంకా ఈ విధంగా అన్నాడు – "ఈ విధమైన ప్రాణ విజ్ఞానాన్ని తెలిసినవాడు ఎండిపోయిన మ్రానివద్దకు పోయి దానికి ఈ విజ్ఞానాన్ని చెబితే అది కొమ్మలు తొడిగి ఆకులతో చిగుర్చుతుంది. అటువంటప్పుడు ప్రాణం ఉన్నవారికి ఈ విజ్ఞానాన్ని చెపితే కలిగే ఫలం ఇంక చెప్పాల్సిందేముంది!" అని.

**మం॥ అథ యది మహజ్జిగమిషేదమావాస్యాయాం దీక్షిత్వా పౌర్ణమాస్యాం రాత్రౌ సర్వౌషధస్య మన్థం దధి మధునోరుపమథ్య జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ స్వా హేత్యగ్నా వాజ్యస్య హుత్వా మన్థే సంపాతమవనయేత్. 4**

**వసిష్ఠాయ స్వాహేత్యగ్నా వాజ్యస్య హుత్వా మన్థే సంపాతమవన యేత్ప్రతి ష్ఠాయై స్వాహేత్యగ్నా వాజ్యస్య హుత్వా మన్థే సంపాతమవనయేత్సంపదే స్వాహే త్యగ్నా వాజ్యస్య హుత్వా మన్థే సంపాతమవనయేఽఽ దాయతనాయ స్వాహేత్యగ్నా వాజ్యస్య హుత్వా మన్థే సంపాతమవనయేత్.**

ఇక తరువాత ఎవరైనా మహత్వాన్ని (గొప్పదనాన్ని) పొందాలని ఆశిస్తే అతడు అమావాస్యనాటి నుండి దీక్ష వహించి – పాలు త్రాగి ఉంటూ, నేలమీద శయనిస్తూ,

వ్రతనియమాలను పాటిస్తూ పూర్ణిమనాటి రాత్రి గ్రామాల్లోను, అడవుల్లోను దొరికే ఓషధులన్నీ గ్రహించి వాటి బెరడును సుద్దగా నూరి పెరుగులో తేనె వేసి కలిపి రాగిపాత్రలోగాని, మేడిపాత్రలోగాని వేసి బాగా కలిపి ఆ పాత్రను ముందుంచుకొని 'జ్యేష్ఠాయస్వాహా' 'శ్రేష్ఠాయస్వాహా' అనే మంత్రాలతో ఆవసధ్యాగ్నిలో హోమం చేసి స్రువంలో మిగిలి ఉన్న నేతిని మంథం మీద (పాత్రలో) ఉంచాలి.

అదే విధంగా 'వసిష్ఠాయస్వాహా' అనే మంత్రంతో ఆ అగ్నిలోనే నేతిని హోమం చేసి స్రువంలో మిగిలి ఉన్న నేతిని మంథపాత్రలో వేయాలి. తరువాత 'ప్రతిష్ఠాయై స్వాహా' అనే మంత్రంతో అగ్నిలో ఘృతాహుతినిచ్చి శేషఘృతాన్ని మంథపాత్రలో వేయాలి. తరువాత 'సంపదేస్వాహా' అనే మంత్రంతో ఘృతాహుతినిచ్చి స్రువంలో మిగిలిన నేతిని మంథపాత్రలో ఉంచాలి. అట్లాగే 'ఆయతనాయ స్వాహా' అనే మంత్రంలో హోమంచేసి శేష ఘృతాన్ని మంథపాత్రలో ఉంచాలి.

**మం॥ అథ ప్రతి సృజ్యాంజతా మంథమాధాయ జపత్యమో నామాస్యమా హి తే సర్వమిదం స హి జ్యేష్ఠః శ్రేష్ఠో రాజాధిపతిః స మా జ్యైష్ఠ్యం శ్రైష్ఠ్యం రాజ్యమాధి పత్యం గమయత్వహమే వేదం సర్వమసానీతి. 6**

**అథ ఖల్వేతయార్చ పచ్ఛ ఆచామతి తత్సవితుర్వృణీ మహ ఇత్యాచామతి, వయం దేవస్య భోజన మిత్యచా మతి, శ్రేష్ఠం సర్వధాతమ మిత్యాచామతి, తురం భగస్య ధీమహీతి సర్వం పిబతి, నిర్ణిజ్య కంసం చమసం వా పశ్చాదగ్నేః సంవిశతి చర్మణి వా స్థణ్డిలే వా వాచం మయొఽ ప్రసాహః స యది స్త్రియం పశ్యేత్స మృద్ధం కర్మేతి విద్యాత్. 7**

**తదేష శ్లోకో యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృద్ధిం తత్ర జానీయాత్తస్మిన్స్వప్న నిదర్శనే తస్మిన్స్వప్న నిదర్శనే 8**

తరువాత, అగ్నిహోత్రం నుండి కొంచెం దూరంగా జరిగి మంథపాత్రను దోసిట్లోకి తీసికొని "అమో నా మాసి అమాహితే" అనే మంత్రాన్ని జపించాలి. మంత్రార్థం ఇట్లా ఉంటుంది – 'ఓ మంథమా! ముఖ్యప్రాణమా! నీవు 'అమ' అనే పేరుకలదానవు. ఎందుచేతనంటే, ఈ భౌతికమైన భూతజగత్తు నీ వల్లనే నిలిచి ఉంది. నీవు జ్యేష్ఠమవు, శ్రేష్ఠమవు, కాంతివంతమవు, అన్నిటికి అధిష్ఠానమైనదానవు. అందుచేత నీవు నాకు కూడా జ్యేష్ఠత్వాన్ని, శ్రేష్ఠత్వాన్ని, రాజ్యాన్ని, ఆధిపత్యాన్ని ఇప్పించు. నేనుకూడా నీలాగానే సంపూర్ణ జగత్స్వరూపాన్ని అవుతాను!' అని.

పిమ్మట, ముందు చెప్పబోయే ఋక్కు పఠిస్తూ ఒక్కొక్క పాదానికి ఒక్కొక్క గ్రాసం (ముద్ద) భక్షిస్తాడు – 'తత్సవితుర్వృనీ మహే' (సమస్త విశ్వానికి సృష్టికర్తయైన ఆదిత్యునికి అన్నమైనట్టి మంథరూపమైన భోజనం కోసం ప్రార్థిస్తున్నాము). ఈ మంత్రపాదం చదివి ఒక గ్రాసం భుజించాలి.

'వయం దేవస్య భోజనం' (మేము ఆ దేవునికి అన్నం అయిన దానిని (మంథాన్ని) పొంది ఆ సూర్యనితత్వాన్ని శీఘ్రంగా పొందుదుముగాక) అని ఒక గ్రాసాన్ని భక్షించాలి. 'శ్రేష్ఠం సర్వధాతమమ్' (అన్ని రకాల అన్నాలకంటె శ్రేష్ఠతమమైనట్టి, సమస్త జగత్తుకు విధాత – భరించేది అయినది ఈ అన్నం) అని ఒక గ్రాసం భక్షించాలి. 'తురంభగస్య ధీమహి' (మేము సవితృదేవుని స్వరూపాన్ని ధ్యానించి శీఘ్రంగా తాదాత్మ్య భావం పొందుగాక) అని మొత్తం పాత్రనంతా కడిగి పూర్తిగా భక్షించాలి. తరువాత అగ్నికి వెనుకభాగంలో మృగచర్మంమీదగాని, లేదా శుభ్రమైన నేలమీదగాని వాక్సంయమాన్ని (మౌనాన్ని) పూని నిద్రించాలి. ఆ నిద్రలో – స్వప్నంలో, స్త్రీరూపం గనుక కనిపిస్తే ఆ విధమైన స్వప్నదర్శనంవల్ల తానుచేసిన కర్మ సఫలమైనట్లు గ్రహించాలి.

మూడవ ఖండం

**మం॥ శ్వేత కేతుర్హారుణేయః పంచాలానాం సమితిమేయాయ తంహ ప్రవాహణో జైవలిరువాచ కుమారాను త్వాసిషత్పి తేత్యను హి భగవఇతి. 1**

**వేత్థ యదితోఽధి ప్రజాః ప్రయన్తీతీ? న భగవ ఇతి. వేత్థ యథా పునరావర్తన్త 3 ఇతి? న భగవ ఇతి. వేత్థ పథోర్దేవయానస్య పితృయాణస్య చ వ్యావర్తనా 3 ఇతి? న భగవ ఇతి. 2**

**వేత్థ యథాసా లోకో న సంపూర్యత 3 ఇతి? న భగవ ఇతి, వేత్థ యథా పంచమ్యామాహుతావాపః పురుష వచసో భవన్తీతి? నైవ భగవ ఇతి. 3**

అరుణుని మనుమడైన శ్వేత కేతువు పాంచాలదేశపు రాజసభకు వెళ్ళాడు. జీవలుని పుత్రుడైన ప్రవాహణుడు వచ్చిన శ్వేతకేతువును చూచి ఈ విధంగా అన్నాడు – 'కుమారా! నీకు మీ తండ్రిగారు శిక్షణ ఇచ్చారా?' అని.

శ్వేతకేతువు : దేవా! నేను నా తండ్రిగారి వద్ద శిక్షణ పొందాను'.

ప్రవా : 'అయితే, ఇక్కడ చనిపోయినవాడు ఈ లోకానికి పైన ఏ లోకాలకు పోతాడు?'

శ్వేత : 'స్వామీ! నాకు తెలియదు'.

ప్రవా : 'ప్రజలు ఆయా లోకాలనుండి ఈ లోకానికి ఎట్లా తిరిగివస్తారో నీకు తెలుసా?"

శ్వేత : 'స్వామీ నాకు తెలియదు'.

ప్రవా : 'దేవయాన, పితృయాన మార్గాలు రెండు ఉన్నాయిగదా! ఆ రెండు మార్గాలు ఎక్కడినుండి చీలి విడిపోతాయో నీకు తెలుసా?

శ్వేత : 'దేవా! నాకు తెలియదు'.

ప్రవా : 'ఆ పితృలోకం ఇక్కడినుండి ఎంతమంది వెళ్ళినా నిండకుండా ఉండటానికి కారణం తెలుసా?'

శ్వేత : 'భగవాన్! నాకు తెలియదు!

ప్రవా : 'అయిదవ ఆహుతి ఇవ్వగానే సోమరసం, నెయ్యి మొదలైన జలతత్వంగల రసాలు 'పురుష' సంజ్ఞను (పేరును) ఎట్లా పొందుతాయో నీకు తెలుసా? అంటే, ఐదవ ఆహుతి ఇవ్వగానే జలం పురుష రూపాన్ని ఎట్లా పొందుతుందో తెలుసా?'

శ్వేత : 'స్వామీ! నాకు తెలియదు'.

**మం॥ అథాను కిమనుశిష్టోஉ వోచథా యో హీమాని న విద్యాత్కథం సోஉను శిష్టో బ్రువీ తేతి. స హాయస్తః పితురర్థ మేయాయ తం హోవాచననుశిష్య వావ కిల మా భగవానబ్రవీదను త్వాశిషమితి. 4**

**పంచ మా రాజ్యబంధుః ప్రశ్నానప్రాక్షీ త్తేషాం నైకంచనాశకం వివక్తుమితి స హోవాచ యథా మా త్వం తదైతానవదో యథాహమేషాం నైకంచన వేద యద్యహమిమాన వేదిష్యం కథంతే నావక్ష్యమితి. 5**

**సహ గౌతమో రాజ్ఞాஉ ర్థమేయాయ తస్మైహప్రాప్తా యార్హాంచకార సహ ప్రాతః సభాగ ఉదేయాయ తంహోవాచ మానుషస్య భగవన్గౌతమ విత్తస్య వరం వృణీథా ఇతి, స హోవాచ తవైవ రాజన్మానుషం విత్తం యామేవ కుమారస్యాన్తే వాచమభాషథాస్తా మేవ మే బ్రూహీతి స హ కృచ్ఛ్రీ బభూవ. 6**

**తం హ చిరం వసేత్యాజ్ఞాపయాంచ కార తగ్ంహోవాచ యథా మా త్వం గౌతమావదో యథేయం న ప్రాక్త్వ త్తః పురా విద్యా బ్రాహ్మణాన్గచ్ఛతి తస్మాదు సర్వేషు లోకేషు క్షత్రస్యైవ ప్రశాసనమభూదితి తస్మై హోవాచ. 7**

ప్రవా : "ఇవి ఏమీ తెలియకుండానే తండ్రిచేత శిక్షితుడనైనానని ఎట్లా అన్నావు? నా యీ ప్రశ్నలకు సమాధానం ఇవ్వలేనివాడు విద్వత్సంఘంలో తాను చదువుకున్నవాడనని ఎట్లా చెప్పుకోగలుగుతాడు?"

ఈ విధంగా రాజుచేత తృణీకరింపబడి శ్వేతకేతువు తన తండ్రి వద్దకు వచ్చాడు. వచ్చి తండ్రితో ఇట్లా అన్నాడు – 'స్వామీ! తాము నాకు పూర్తిగా విద్యను ఉపదేశించకుండానే సమావర్తన సంస్కార సమయంలో నీకు విద్య అంతా చెప్పటం పూర్తి అయిందని అన్నారు.

ఆ క్షత్రియబంధువు నన్ను అయిదు ప్రశ్నలు అడిగాడు. నేను ఆ అయిదింటిలో ఒక్కదానికి కూడా సమాధానం ఇవ్వలేకపోయాను. 'అప్పుడాతని తండ్రి యిట్లా అన్నాడు – 'నాయనా! నీవు

అక్కడినుండి వచ్చి నన్ను అడిగిన ఈ అయిదు ప్రశ్నలకు సమాధానం నాకు కూడా తెలియదు' నాకు తెలిస్తే నిజంగా నీకు చెప్పకుండా ఎందుకుంటాను! నా పుత్రుడవైన నీకు సమావర్తన కాలమందైనా చెప్పకుండా ఉంటానా?"

అంతట, గౌతమ గోత్రజుడైన శ్వేతకేతుని తండ్రి జైవలి వద్దకు (ప్రవాహణుని వద్దకు) వెళ్ళాడు. తన వద్దకు వచ్చిన ఆ మునికి ప్రవాహణుడు అభ్యాగత పూజలు చేశాడు. మరునాడు ఉదయం రాజు సభలోకి వచ్చిన పిమ్మట గౌతముడు కూడా అక్కడికి వెళ్ళాడు. అప్పుడు ప్రవాహణుడు గౌతమునితో ఇట్లా అన్నాడు – "స్వామీ! గ్రామాలు, ధనం మొదలైన మానుష సంపద తమకు ఏమికావాలో కోరుకొండి. యథేచ్ఛగా కోరుకోండి! ఇస్తాను" అని.

అది విన్న గౌతముడన్నాడు – 'ఓ రాజా! ఆ మానుష సంపదలన్నీ తమవద్దనే ఉండనీయండి. నా కుమారుని ప్రశ్నలరూపంలో అయిదు విషయాలను గూర్చి అడిగారు కదా! వాటిని గురించి నాకు చెప్పండి" అని. రాజు ఈ మాటలు విని ధర్మసంకటంలో పడ్డాడు – బ్రాహ్మణుని – కాదనటానికి వీలు లేదు. ధర్మానికి విరుద్ధంగా క్షత్రియుడైన తాను బ్రాహ్మణునికి విద్యాబోధన చేయరాదు.

ఇట్లా ఆలోచించి గౌతమునితో అన్నాడు – 'మీరు చాలాకాలం ఇక్కడ ఉండండి' అని ఆజ్ఞాపించి యింకా యిట్లా అన్నాడు – "ఓ గౌతమా! మీరు నాతో అన్నమాటలనుబట్టి మీకు పూర్వం ఈ పంచాగ్ని విద్య ఏ బ్రాహ్మణుని వద్దకు చేరలేదనే విషయం తెలుస్తోంది. (ఏ బ్రాహ్మణునికైనా తెలిసి ఉంటే పరంపరగా గౌతమునికి కూడా తెలిసి ఉండేది). దీనినిబట్టి పూర్వం నుండి అన్ని లోకాల్లోను ఈ పంచాగ్ని విద్య పూర్తిగా క్షత్రియుల అధీనంలోనే ఉండి వారే ఈ విద్యకు ఆచార్యత్వం వహించారు – అంటే ఈ విద్య ఇంతకాలమూ క్షత్రియపరంగా వస్తోంది అని తెలుస్తూంది.

## నాల్గవ ఖండం

**మం॥ అసౌ వావ లోకో గౌతమాగ్ని స్తస్యాదిత్య ఏవ సమిద్రశ్మయో ధూమోஉహరర్చిశ్చంద్రమా అంగారా నక్షత్రాణి విస్ఫులింగాః 1**

**తస్మిన్నేతస్మిన్న గ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి తస్యా ఆహుతేః సోమో రాజా సంభవతి. 2**

ప్రవాహణుడు తాను అడిగిన ఐదు ప్రశ్నల్లో ముందు అయిదవ ప్రశ్నకు సమాధానం చెపుతున్నాడు. ఎందుచేతనంటే దానికి సమాధానాన్ని ముందుగా తెలుసుకొని ఉంటే మిగతా ప్రశ్నలకు సమాధానాలు తేలికగా లభిస్తాయి. ఇప్పుడు ముందుగా 'జలం ఐదవ ఆహుతి అయిన పిమ్మట ఏ విధంగా పురుష సంజ్ఞను పొందుతోంది?' అనే ప్రశ్నకు సమాధానం చెపుతున్నారు.

ప్రవాహణుడు ఈ విధంగా చెపుతున్నాడు – "ఓ గౌతముడా! ఈ ప్రసిద్ధమైన ద్యులోకమే అగ్ని. ఆ అగ్నికి ఆదిత్యుడు సమిధ (కట్టె). ఎందుచేతనంటే సమిధలాగా ఆదిత్యుడు బాగా మండినప్పుడే ఈ లోకం ప్రకాశిస్తుంది – ఆదిత్యుని కిరణాలే ధూమం. పగలు అనేది జ్వాల. చంద్రుడు నిప్పుబొగ్గు – పగలు తరువాత (జ్వాల తరువాత) నిప్పుబొగ్గులాగా కనిపిస్తాడు కాబట్టి! నక్షత్రాలు నిప్పురవ్వలు. అగ్నిచుట్టూ నిప్పురవ్వల లాగా చంద్రునిచుట్టూ వెదజల్లినట్లుగా ఉండే నక్షత్రాలు నిప్పురవ్వలు.

ఈ ద్యులోకమనే అగ్నిలో దేవతలు శ్రద్ధను (సూక్ష్మమైన జలాన్ని హోమం చేస్తారు. పాలు నెయ్యి మొదలైనవన్నీ జలతత్వాలు. అవి శ్రద్ధతో హోమం చేయబడటంవల్ల వాటిలోని సూక్ష్మ జలాంశను శ్రద్ధ అన్నారు. ఆ విధంగా ఇవ్వబడిన ఆహుతులవల్ల సోమరాజు యొక్క ఉత్పత్తి జరుగుతుంది."

ఐదు ఆహుతులలో మొదటిది 'శ్రద్ధ' అని గుర్తుంచుకోవాలి.

## ఐదవ ఖండం

**మం॥ పర్జన్యో వావ గౌతమాగ్ని స్తస్య వాయురేవ సమి దభ్రం ధూమో విద్యుదర్చిరశనిరంగారా హ్రాదనయో విస్ఫులింగాః. 1**

**తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవాః సోమం రాజానం జుహ్వతి తస్యా ఆహుతే ర్వర్షం సంభవతి. 2**

ఓ గౌతముడా! వృష్టికి – వర్షానికి అభిమానదేవత అయిన పర్జన్యుడే (మేఘుడే) అగ్ని. వాయువు ఆ అగ్నికి సమిధ. ఎందుచేతనంటే ఈ పర్జన్యాగ్ని వాయువుచేతనే బాగా ప్రదీప్తమౌతుంది కాబట్టి! మేఘాలే పొగ. మెరపులే జ్వాల. వజ్రము (పిడుగు) నిప్పుబొగ్గు. మేఘ గర్జనలే నిప్పురవ్వలు. (గర్జన, నిప్పురవ్వలు ఈ రెంటికి నలువైపులకు వ్యాపించే సామ్యం ఉంది).

ఈ అగ్నిలో దేవతలు సోమరాజును (చంద్రుని) హోమం చేస్తారు. అట్లా చేయటంవల్ల వర్షం కురుస్తుంది. (అంటే శ్రద్ధ అనే సూక్ష్మజలం సోమరూపంలోకి మారి పర్జన్యాగ్నిలో ఆహుతిగా ఇవ్వబడి వర్షంగా మారింది. అంటే సోముడు రెండవ ఆహుతి).

## ఆరవ ఖండం

**మం॥ పృథివీ వావ గౌతమాగ్ని స్తస్యాః సంవత్సర ఏవ సమి దాకాశో ధూమో రాత్రి రర్చిర్దిశోంగారా అవాంతర దిశో విస్ఫులింగాః. 1**

**తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవా వర్షం జుహ్వతి తస్యా ఆహుతేరన్నం సంభవతి. 2**

'ఓ గౌతముడా! ఈ పృథివియే అగ్ని. ఆ అగ్నికి సంవత్సరమే సమిధ. ఎందుచేతనంటే, సంవత్సర కాలం వల్లనే ధాన్యాదులను పొందటానికి ఈ భూమి సమర్థమౌతోంది. ఆకాశం ధూమం. తమోరూపమైన రాత్రియే జ్వాల. దిక్కులు నిప్పుబొగ్గులు. చిన్నవైనందున అవాంతర దిశలు (మూలలు) నిప్పురవ్వలు.

ఈ పృథివి అనే అగ్నిలో దేవతలు వర్షాన్ని హోమం చేస్తారు (రెండవ ఆహుతివల్ల పుట్టినది వర్షం). ఈ ఆహుతుల వల్ల యవలు మొదలైన ధాన్యాలు ఉత్పత్తి అవుతున్నాయి. శ్రద్ధ, చంద్రుడు, వర్షం అనే మూడు ఆహుతులు అయినాయి.

ఏడవ ఖండం

**మం॥ పురుషో వావ గౌతమాగ్ని స్తస్య వాగేవ సమిత్ప్రాణో ధూమో జిహ్వార్చిశ్చక్షు రంగారాః శ్రోత్రం విస్ఫులింగాః 1**

**తస్మిన్నే తస్మిన్నగ్నౌ దేవా అన్నం జుహ్వతి తస్యా ఆహుతే రేతః సంభతి. 2**

"ఓ గౌతమా! పురుషుడే అగ్ని. అతని వాక్కే సమిధ – వాక్కు వలనే పురుషుడు శోభిస్తున్నాడు కాబట్టి ప్రాణమే ధూమం. ఎఱ్ఱగా ఉండటమనే సామ్యంవల్ల నాలుకయే జ్వాల. ప్రకాశానికి ఆశ్రయమవటంవల్ల నేత్రాలు నిప్పు బొగ్గులు, శ్రోత్రాలు విస్ఫులింగాలు.

ఈ పురుషుడనే అగ్నిలో దేవతలు అన్నాన్ని హోమం చేస్తారు. ఆ అన్నరూపమైన ఆహుతుల నుండి వీర్యం ఉత్పన్నమౌతుంది.

## ఎనిమిదవ ఖండం

**మం॥ యోషా వావ గౌతమాగ్ని స్తస్యా ఉపస్థ ఏవ సమిద్య దుపమంత్ర యతే స ధూమో యోనిరర్చిర్యదన్తః కరోతి తేఽ౭ఙ్గారా అభినన్దా విస్ఫులింగాః 1**

**తస్మిన్నే తస్మిన్న గ్నౌ దేవా రేతో జుహ్వతి తస్యా ఆహు తేర్గర్భః సంభవతి. 2**

ఓ గౌతమా! స్త్రీయే అగ్ని. ఆ స్త్రీయొక్క జననేంద్రియం సమిధ – పుత్రోత్పత్తి కోసం ప్రదీప్తమౌతుంది కాబట్టి! పురుషుడు చేసే ఉపమంత్రణమే ధూమం. యోనియే జ్వాల. అంతర్భాగం అగ్ని సంబంధంవల్ల నిప్పుకణాలు. అందువల్ల కలిగే క్షుద్రసుఖం నిప్పురవ్వలు.

ఈ అగ్నిలో దేవతలు వీర్యాన్ని హోమం చేస్తారు. ఆ ఆహుతి వల్ల గర్భం ఉత్పన్నమౌతుంది. (ఈ విధంగా శ్రద్ధ, సోముడు, వర్షం, అన్నం, వీర్యం ఈ జలాహుతుల్ని వరుసగా ద్యులోక, పర్జన్య, పృథివి, పురుష, యోషాగ్నుల్లో హోమం చేయటంవల్ల పురుషుడు జన్మిస్తున్నాడు. ఐదవ ఆహుతివల్ల జలం ఈ విధంగా పురుష సంజ్ఞను పొందుతోంది.

## తొమ్మిదవ ఖండం

ఇక పంచమాహుతిలో పురుష సంజ్ఞను పొందిన జలం యొక్క గతి.

**మం॥ ఇతి తు పంచమ్యా మాహుతావాపః పురుషవచసో భవన్తీతి స ఉల్బావృతో గర్భో దశ వా నవ వా మాసానన్తః శయిత్వా యావద్వాథ జాయతే.** **1**

**స జాతో యావదాయుషం జీవతి తం ప్రేతం దిష్ట మితోఽగ్నయ ఏవ హరన్తి యత ఏవేతో యతః సంభూతో భవతి.** **2**

పంచమాహుతిలో జలం పురుషశబ్దవాచ్యమౌతోంది. ఆ గర్భం జరాయువుచేత – పల్చని ఆమత్వచచేత కప్పబడి ఉండి, సమస్త అవయవాలు సంపూర్ణంగా ఏర్పడేవరకు తొమ్మిది లేక పదినెలలపాటు (ఇంకా ఎక్కువ కావచ్చు, తక్కువ కావచ్చు) తల్లి గర్భంలో శయనించి ఆ పిమ్మట జన్మిస్తాడు. (మల మూత్రాదులతో, ఆమంతో ఇతర హేయమైన వాయువులతో కూడిన గర్భంలో జరాయువనే పొరచే కప్పబడి గర్భంలో ఉండే భ్రూణాన్ని – పిండాన్ని ఈ విధంగా వర్ణించటం వైరాగ్యభావం కల్పించటం కోసం. ఆ భ్రూణం తల్లి తీసుకొనే ఆహార పానీయాదులతో శక్తిని, తెలివిని, చలనాన్ని, స్ఫూర్తిని ఇంకా ఇతర గుణాల్ని పొంది పరిపూర్ణావయవాలతో జన్మిస్తాడు.

అట్లాపుట్టి తనకు నిర్ణయింపబడిన ఆయుర్దాయాన్ని అనుభవించి జీవించి, చనిపోయిన తరువాత కర్మవశాన పరలోకానికి ప్రస్థానం చేస్తాడు – ఏ అగ్నినుండి పుట్టాడో ఆ అగ్నిలోకి తీసికొనిపోబడతాడు.

(ఈ వివరాలన్నీ మొదటి ప్రశ్నకు సమాధానం కోసం భూమికగా చెప్పారు)

## పదవ ఖండం

చనిపోయిన తరువాత ఇక్కడ నుండి ఈ లోకానికి పైన ఏ లోకాలకు పోతారో తెలుసునా? అనే ప్రశ్నకు సమాధానం.

**మం॥ తద్య ఇత్థం విదుః యే చేమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిషమభిసంభవన్త్యర్చిషోఽహరహ్న ఆపూర్యమాణ పక్షమాపూర్యఽమాణ పక్షాద్యాన్షడు దజేతి మాసాంస్తాన్.** **1**

**మాసేభ్యః సంవత్సరం సవత్సరాదాదిత్య మాదిత్యా చ్చంద్రమసంచంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః స ఏవాన్బ్రహ్మ గఽమయత్యేష దేవయానః పన్థా ఇతి.** **2**

అధికారులైన గృహస్థులు ఈ విధంగా పంచాగ్ని విద్యను తెలుసుకొని అరణ్యాలలో వానప్రస్థులై శ్రద్ధతోను, తపస్సుతోను ఉపాసన చేస్తారో అటువంటివారు (ఉపాసకులు) మరణించిన పిమ్మట అర్చిరభిమాన దేవతను (అగ్నిదేవతను) పొందుతారు. ఆ దేవతనుండి పగటి అభిమానదేవతను,

దివాభిమాన దేవతనుండి శుక్లపక్షాభిమాన దేవతను, శుక్లపక్షాభిమాన దేవతనుండి ఆరునెలలు కల ఉత్తరాయణాన్ని పొందుతారు.

ఉత్తరాయణం నుండి సంవత్సరాన్ని, సంవత్సరం నుండి ఆదిత్యుని, ఆదిత్యుని నుండి చంద్రుని, చంద్రుని నుండి విద్యుత్తును పొందుతారు. ఆ విద్యుల్లోకంలో మానవాతీతుడైన పురుషుడొకడు అధికారులైన వారిని హిరణ్యగర్భ లోకానికి తీసుకొనిపోతాడు. ఇది దేవయాన మార్గం.

**మం॥ అథ య ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తే దూమమభి సంభవన్తి ధూమాద్రాత్రిం రాత్రే రపరపక్షమపరపక్షాద్యాన్ షడ్దక్షిణైతి మాసాం స్తాన్నైతే సంవత్సర మభి ప్రాప్నువన్తి.** **3**

**మాసేభ్యః పితృలోకం పితృలోకా దాకాశ మాకాశా చ్చంద్రమస మేష సోమో రాజా తద్దేవానామన్నం తం దేవా భక్షయన్తి.** **4**

ఇక గృహస్థులైనవారు, అంటే అగ్నిహోత్రాది వైదికకర్మలు (ఇష్టకర్మలు) వాపీకూప తటాకనిర్మాణాది (పూర్తికర్మలు) దాన ధర్మాదులు ఆచరించినవారు ధూమాభిమాన దేవతను పొందుతారు. ధూమాభిమాన దేవత నుండి రాత్రికి అభిమానదేవతను, రాత్ర్యభిమాన దేవత నుండి కృష్ణపక్షాభిమాన దేవతను, కృష్ణపక్షాభిమాన దేవతనుండి ఆరు నెలలపాటు సూర్యుడు దక్షిణంగా వెళ్ళే (దక్షిణాయనం) కాలాన్ని పొందుతారు. వీరు లోగడ చెప్పినట్లుగా దక్షిణాయనం నుండి సంవత్సర కాలాన్ని పొందుతారు. (ఇక్కడే మార్గం చీలుతుంది). దక్షిణాయనం నుండి పితృలోకానికి, పితృలోకంనుండి ఆకాశాన్ని, ఆకాశంనుండి చంద్రుని పొందుతారు. ఈ చంద్రుడే బ్రాహ్మణుల సోమరాజు. అతడు దేవతలకు అన్నం. ఆ చంద్రరూపమైనట్టి అన్నాన్ని ఇంద్రాది దేవతలు భక్షిస్తారు. ఇష్టాపూర్తకర్మలు చేసినవారు కూడా తమ అనుభవకాలం పూర్తయ్యేదాకా ఆ అన్నాన్ని భక్షిస్తూ అక్కడ ఉంటారు. తరువాత లోగడ చెప్పిన క్రమంలో ఈ లోకానికి వస్తారు.

లోగడ శ్రద్ధ అనేది జలం అని చెప్పారు. దానిని హోమం చేస్తే సోమరాజు ఉద్భవిస్తాడని, యజ్ఞంలో హోమం చేసిన ఆ జలమే ఇతర తత్త్వాలతో కలసి చంద్రునిగా అయి, స్వర్గంలో ఇష్టాపూర్తకర్మలు చేసిన వారు అనుభవించటానికి యోగ్యమైన శరీరంగా అవుతుంది. అంత్యక్రియలలో ఈ శరీరాన్ని అగ్నిలో చివరి ఆహుతిగా వేసినపుడు ఈ శరీరం తగులబడి ఆ శరీరంలోని జలం పొగ ఆవిరితోపాటు పైకిపోయి చంద్రలోకాన్ని చేరి అచట భౌతిక శరీరానికి తగినట్లుగా మారుతుంది. అక్కడ కర్మఫలానుభవానికి తగినంతకాలం ఉండి మళ్ళీ ఈ లోకానికి వస్తారు.

**మం॥ తస్మి న్యావ త్సంపాత ముషిత్వాథైత మేవాధ్వానం పునర్నివర్తన్తే**

**యథేతమాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమో భవతి ధూమో భూత్వాభ్రం భవతి.** **5**

**అభ్రం భూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి త ఇహ వ్రీహి యవా ఓషధి వనస్పతయ స్తిలమాషా ఇతి జాయన్తేఽ తో వై ఖలు దుర్నిష్ప్రపతరం యో యో హ్యన్నమత్తి యో రేతః సించతి తద్భూయ ఏవ భవతి.** **6**

**తద్య ఇహ రమణీయ చరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోని మాపద్యేర న్బ్రాహ్మణయోనిం వా క్షత్రియ యోనిం వా వైశ్యయోనిం వాథ య ఇహ కపూయ చరణా అభ్యాశో హ యత్తే కపూయాం యోని మాపద్యేరన్శ్వ యోని వా సూకరయోనిం వా చండాల యోనిం వా.** **7**

తన కర్మఫలాన్ని అనుభవించటం పూర్తి అయ్యే పర్యంతం ఆ లోకంలో ఉండి, ఏ మార్గంనుండి వెళ్ళారో ఆ మార్గానే తిరిగి వస్తారో, అంటే చంద్రలోకం నుండి ఆకాశాన్ని, ఆకాశం నుండి వాయువును, వాయువునుండి ధూమాన్ని దానినుండి మేఘాన్ని పొందుతారు.

తెల్లగా ఉండే అభ్రం, వర్షించటానికి తగిన మేఘంగా మారి వర్షిస్తుంది. ఆ వర్షంతోపాటు జీవులు ఈ లోకంలో ధాన్యం, యవలు, ఓషధులు, వనస్పతులు, తిలలు, మినుములు మొదలైనవిగా పుడతాయి. తరువాత వీటిలోనుండి మళ్ళీ జన్మించడమనేది చాలా కష్టమైన పని. ఎందుచేతనంటే, ఆ ధాన్యాదులను ఏ ఏ జీవరాశులు అన్నంగా (ఆహారంగా) గ్రహిస్తే ఆ ధాన్యాదులలో ఉండే జీవం ఆ రూపమే ధరిస్తుంది – ఆ జీవ జంతువులకు తగిన వీర్యంగానే వృద్ధి చెందుతుంది.

(ఇంకా వివరంగా చెప్పుకోవాలంటే, ఊర్ధ్వరేతులనైన మహర్షులు, యోగులు, బాలకులు, నపుంసకులు తిన్న ఆహారం ఉదరంలోనే నష్టమై హరించిపోతుంది. అంటే వీర్యరూపం దాల్చదు. వీర్యసేచనం చేయటానికి సమర్థులైనవారు తిన్నప్పుడే తమ తమ కర్మల ననుసరించి మళ్ళీ ఆయా యోనులలో జన్మిస్తారు. అందుచేతనే అన్నరూపంగా ఉన్నదానినుండి జీవులకు విముక్తి కలిగి మంచి జన్మ రావటమనేది చాలా కష్టమని చెప్పారు.)

సంస్కార యుక్తులైనవారు, సదాచార సంపన్నులు త్వరలో ఉత్తమ యోనిని పొందుతారు – అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యాది యోనుల్ని పొందుతారు. సంస్కార హీనులు కుక్కలుగా, పందులుగా, చండాలురుగా హీనయోనుల్లో జన్మిస్తారు. ఈ విధంగా ఆయా లోకాలకు ఎట్లా వస్తారో చెప్పబడ్డది.

**మం॥ అథైతయోః పథోర్న కతరేణ చ న తానీమాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవన్తి జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానం తేనాసౌ లోకో న సంపూర్యతే తస్మాజ్జుగుప్సేత**

**తదేష శ్లోకః** **8**

**స్తేనో హిరణ్యస్య సురాం పిబంశ్చ గురోస్తల్పమావస న్బ్రహ్మహా చైతే పతన్తి చత్వారః పంచమశ్చా చరం స్తైరితి.** **9**

**అథ హ య ఏతానేవం పంచాగ్నీన్వేద న సహ తైరప్యాచరన్పాప్మనా లిప్యతే శుద్ధః పూతః పుణ్య లోకో భవతి య ఏవం వేద య ఏవం వేద.** **10**

పాపాత్ములైనవారు పైన చెప్పిన అర్చిరాది రెండు మార్గాలలో (ఉత్తరాయణ, దక్షిణాయన మార్గాలలో) దేనినుండి పోరు. అటువంటి క్షుద్రులు మాటిమాటికీ వస్తూపోతూ ఉండే ప్రాణులు – అంటే శీఘ్రంగా పుడుతూ చస్తూ ఉంటారు. వీరిది మూడవ మార్గం. అందుచేతనే ఇన్ని జీవులు ఈ లోకంలో చస్తూ ఉన్నా స్వర్గము మొదలైన పరలోకాలు ఎన్నటికీ నిండవు – వీరంతా అచటికి పోరు కాబట్టి! ఈ విధమైన చావుపుట్టుకల్ని అసహ్యించుకోవాలి. ఈ విషయాన్ని గురించే ఈ దిగువ శ్లోకం చెప్పబడ్డది.

బ్రాహ్మణుల బంగారాన్ని దొంగిలించేవాడు, బ్రాహ్మణుడై యుండి మదిరాపానం చేసేవాడు, గురుపత్నీ సంగమం చేసేవాడు, బ్రహ్మహత్యచేసేవాడు – ఈ నలుగురూ పతితులు. ఇక ఈ నలుగురితో సహవాసం చేసేవాడు ఐదవవాడు – వాడు కూడా పతితుడే!

పంచాగ్ని విద్యామహిమను చెపుతున్నారు. ఈ పంచాగ్ని విద్యను తెలుసుకున్నవాడు పైన చెప్పిన ఈ అయిదుగురు పతితుల సంసర్గానికి వచ్చినప్పటికి ఆ పాపం అంటదు. అందుచేత అతడు పరిశుద్ధుడు, పవిత్రుడు. పుణ్యలోకాలకు అర్హుడు అవుతాడు.

పదునొకండవ ఖండం

**మం॥ ప్రాచీనశీల ఔపమన్యవః సత్యయజ్ఞః పౌలుషిరింద్ర ద్యుమ్నో భల్లవేయో జనః శార్కరాక్ష్యో బుడిల ఆశ్వతరాశ్వి సే హైతే మహాశాలా మహాశ్రోత్రియాః సమేత్య మీమాంసాం చక్రుః కో న ఆత్మా కిం బ్రహ్మేతి.** **1**

**తే హ సంపాదయాంచక్రురుద్దాలకో వై భగవన్తోఽయ మారుణిః సంప్రతీమమాత్మానం వైశ్వానరమధ్యేతి తం హన్తాభ్యాగచ్ఛామేతి తం హాభ్యాజగ్ముః.** **2**

ఉపమన్యుని కొడుకైన ప్రాచీనశీలుడు, పులుషుని కుమారుడైన సత్యయజ్ఞుడు, భల్లవి మనుమడైన ఇంద్రద్యుమ్నుడు, శార్కరాక్ష్యుని పుత్రుడైన జనుడు, అశ్వతరాశ్వుని కొడుకైన బుడిలుడు – ఈ ఐదుగురు పెద్దకుటుంబం గల గృహస్థులు. మహాశ్రోత్రియులు. ఒకసారి వీరంతా ఒకచోట కూడి తమలో తాము ఆలోచింపసాగారు – “మన ఆత్మ ఏది? బ్రహ్మము ఏది?” అని.

పూజనీయులైన వీరు ఆత్మతత్వాన్ని నిశ్చయించలేకపోయారు – ఒక నిర్ణయానికి రాలేకపోయారు. అందుచేత అరుణుని కుమారుడైన ఉద్దాలకుడు వైశ్వానరాత్మను గూర్చి తెలిసినవాడు కాబట్టి అతనివద్దకు పోదామని నిశ్చయించుకొని, అంతా కలసి ఉద్దాలకుని వద్దకు వెళ్ళారు.

**మం॥ స హ సంపాదయాంచకార ప్రక్ష్యన్తి మామిమే మహా శాలా మహా శ్రోత్రియా స్తేభ్యోన సర్వమివ ప్రతిపత్స్యే హన్తాహమన్యమభ్యనూ శాసానీతి. 3**

**తాన్హోవాచాశ్వపతిర్వై భగవన్తోయం కైకేయః సంప్రతీమమాత్మానం వైశ్వానరమధ్యేతి తం హన్తాభ్యా గచ్ఛామేతి తం హాభ్యా జగ్ముః. 4**

శ్రోత్రియులు, మహాగృహస్థులు అయిన వీరిని చూచి, ఉద్దాలకుడు తనలో ఇట్లా అనుకున్నాడు – 'వీరు నన్ను వైశ్వానరుని విషయం అడుగుతారు. కాని, నేను వీరికా విషయం సరిగా చెప్పలేను. కాబట్టి, వీరికి ఆ విషయమై బాగా బోధించగలిగినట్టి వేరొక ఉపదేశకుని సూచించాలి!' అని.

ఈ విధంగా అనుకొని ఆ ఋషులతో ఇట్లా అన్నాడు – 'ఓ భగవత్స్వరూపులారా! ఇప్పుడున్నవారిలో కేకయుని కుమారుడైన అశ్వపతి ఈ వైశ్వానరాత్మను బాగా ఎరిగినవాడు. కాబట్టి మనమంతా కలసి అతని వద్దకే పోదాం రండి!' అని అంతా కలసి అశ్వపతి వద్దకు వెళ్ళారు.

**మం॥ తేభ్యో హ ప్రాప్తేభ్యః పృథగర్హాణి కారయాం చకార స హ ప్రాతః సంజిహాన ఉవాచ న మే స్తేనో జనపదే న కదర్యో న మద్యపో నానాహి తాగ్ని ర్నావిద్వాన్న స్వైరీ స్వైరిణీ కుతో యక్ష్యమాణో వై భగవన్తోహాహమస్మి యావదేకై కస్మా ఋత్విజేధనం దాస్యామి తావద్భగవద్భ్యోదాస్యామి వసన్తు భగవన్త ఇతి. 5**

**తేహోచుర్యేన హై వార్థేన పురుషశ్చరేత్తం హైవ వదేదాత్మానమేవేమం వైశ్వానరం సమ్ప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహీతి. 6**

**తాన్హోవాచ ప్రాతర్వః ప్రతివక్తాస్మీతి తే హ సమిత్పా ణయః పూర్వాహ్ణే ప్రతిచక్రమిరే తాన్హానుపనీయైవైత దువాచ. 7**

తన వద్దకు వచ్చిన మహర్షులను గాంచి అశ్వపతి మహారాజు పురోహితులను, సేవకులను నియమించి వారికి యథార్హ స్వాగత సత్కారాలు వేరువేరుగా చేయించాడు. మరునాడు ప్రాతఃకాలమే నిద్ర నుండి మేల్కాంచి వారివద్దకు వెళ్ళి వినయంగా ఇట్లా అన్నాడు – 'ఓ మహానుభావులారా! నా రాజ్యంలో దొంగలు లేరు. ధనవంతులున్నారు, కాని వారు లోభులు. కృపణులు కారు. మద్యపానం చేసేవారు లేరు. నా రాజ్యంలో ఆహితాగ్నులు కానివారు, విద్వాంసులు కానివారు

లేరు. పరస్త్రీ లంపటులు లేరు. ఇక దురాచారిణులైన స్త్రీలెక్క నుండి వస్తారు? ఓ పూజనీయులారా! నేను యజ్ఞం చేయాలని నిశ్చయించుకున్నాను. ఆ యజ్ఞంలో ఒక్కొక్క ఋత్విక్కుకు ఎంత ధనం ఇస్తానో మీకూ ఒక్కొక్కరికి అంత ఇస్తాను. మీరంతా ఇక్కడ ఉండండి' అని.

అప్పుడా ఋషులు ఈ విధంగా అన్నారు – "ఏదైనా ఒక ప్రయోజనం కోరి ఒకరి వద్దకు వెళ్ళినప్పుడు తాము వచ్చిన పని ఏమిటో చెప్పటం మంచిది. ఇప్పుడున్న వారిలో వైశ్వానరాత్మను మీరు బాగా ఎరుగుదురు. ఆ వైశ్వానరాత్మను గూర్చి మాకు చక్కగా వివరించి చెప్పండి" అని.

అప్పుడు అశ్వపతి ఇట్లా అన్నాడు – "మీకు నా సమాధానం రేపు ఉదయం చెబుతాను" అని. ఋషులు రాజు యొక్క అభిప్రాయం తెలుసుకొని మరునాడు పూర్వాహ్ణం సమిత్పాణులై రాజు వద్దకు వెళ్ళారు. (జ్ఞానార్జన కోసం గురువు వద్దకు వెళ్ళేటప్పుడు సమిధలు చేతిలో పట్టుకొని వెళ్ళాలి. అది సంప్రదాయం. ఈ ఋషులు శ్రోత్రియులైనా, మహాగృహస్థులైనా, అశ్వపతి క్షత్రియుడైనప్పటికీ అతని వద్దకు గురుభావంతో వెళ్ళారు.) రాజు వారికి ఉపనయనం చేయకుండానే (వారు అర్హులు కాబట్టి) వైశ్వానర విద్యను ఉపదేశించాడు.

## పండ్రెండవ ఖండం

**మం॥ ఔపమన్యవ కం త్వామాత్మాన ముపాస్స ఇతి. దివ మేవ భగవో రాజన్నితి హోవాచైషవైసుతేజా ఆత్మా వైశ్వానరోయం త్వమాత్మాన ముపాస్సే తస్మాత్తన సుతం ప్రస్తుత మాసుతం కులే దృశ్యతే.** **1**

**అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చ సం కులే య ఏతమేవమాత్మానం వైశ్వానరముపాస్తే మూర్ధా త్వేష ఆత్మన ఇతి హోవాచ మూర్ధా తే వ్యపతిష్యద్యన్మాం నాగమిష్య ఇతి.** **2**

రాజు అడిగాడు – "ఓ ఔపమన్యవుడా! ప్రాచీనశీలుడా! నీవు ఏ వైశ్వానరాత్మను ఉపాసిస్తున్నావు?" అని.

ఔపమన్యవుడు – 'రాజా! నేను ద్యులోకాన్నే వైశ్వానరునిగా భావించి ఉపాసిస్తున్నాను' అని అన్నాడు.

అశ్వపతి రాజు ఇట్లా అన్నాడు – "ఓ ప్రాచీనశీలుడా! నీవు ఉపసిస్తున్న వైశ్వానరాత్మ 'సుతేజ' మనే పేరుతో ప్రసిద్ధమైనట్టిది. ఇది ఆత్మకు ఒక భాగం – అవయవం. అందుచేతనే నీ కులంలో 'సుత, ప్రసుత, ఆసుతలు కనిపిస్తున్నారు. అంటే నీ కులంలో అనేకమైన క్రతువు లాచరించేవారు కనిపిస్తున్నారు ('సుత' అంటే ఏకాహాది యాగాల్లో (ఒకరోజు చేసే యాగం)

ఒకదాని కోసం పిండిన సోమరసం. 'ప్రస్తుత' అంటే జ్యోతిష్టోమాది యాగాలకోసం పిండిన సోమరసం. 'ఆసుత' అంటే ఎగతెగకుండా అనేక దినాలపాటు సాగే సత్రయాగాదుల కోసం నిరంతరం పిండే సోమరసం).

నీవు ఆ విధంగా ఉపాసిస్తున్నావు కాబట్టి మంచి జఠరాగ్ని కలవాడవై అన్నభక్షణం చేస్తున్నావు. పుత్రులు, పౌత్రులు మొదలైన ప్రేమాస్పదులైన వారిని చూస్తున్నావు, ఎక్కువ కాలం జీవిస్తున్నావు. వైశ్వానరాత్మను ఈ విధంగా నీలాగా ఉపాసించే వారెవరైనా సరే ఇట్లాగే అన్నభక్షణం చేస్తూ ప్రియమైన వారిని చూస్తూ ఉంటారు. అతని కులం సుత, ప్రసుత, ఆసుతాది కర్మరూపమైన బ్రహ్మతేజస్సు కలవారితో కూడి ఉంటుంది. ఇది (సుతేజం) వైశ్వానరాత్మకు శిరస్సు – పూర్తి వైశ్వానరుడు కాదు' అని చెప్పి ఇంకా ఇలా అన్నాడు – 'నీవు నా వద్దకు వచ్చి ఉండకపోతే నీ తల తెగి పడిపోయి ఉండేది' అని. (ఈ సుతేజాన్నే పూర్తి వైశ్వానరాత్మగా భావించిన దోషం వల్ల! సరిగా తెలుసుకోకుండా ఉపాసించినందువల్ల తలపడిపోయి ఉండేది. ఇక్కడికి రావటం మంచిదైంది – అని భావం). రాజు ఈ విధంగా వారికి ఎంతవరకు ఈ విద్యను గూర్చి తెలుసునో అడిగి, తరువాతి విషయం బోధించటానికి ఈ విధంగా ప్రశ్నించి తెలుసుకుంటున్నాడు. ఇది సరియైన పద్ధతి.

## పదమూడవ ఖండం

**మం॥ అథహోవాచ సత్యయజ్ఞం పౌలుషిం ప్రాచీన యోగ్యం కం త్వమాత్మాన ముపాస్స ఇత్యాదిత్యమేవ భగవో రాజన్నితి హోవాచైష వై విశ్వరూప ఆత్మా వైశ్వా నరో యం త్వమాత్మాన ముపాస్సే తస్మాత్తవ బహు విశ్వరూపం కులే దృశ్యతే. 1**

**ప్రవృత్తోఽ శ్వతరీరథో దాసీనిష్కోఽ త్త్యన్నం పశ్యసి ప్రియత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మ వర్చసం కులే య ఏతమేవమాత్మానం వైశ్వానర ముపాస్తే చక్షుష్ట్వేతదాత్మన ఇతి హోవాచాన్ధోఽ భవిష్యో యన్మాం నాగమిష్య ఇతి. 2**

తరువాత అశ్వపతి సత్యయజ్ఞుని ఈ విధంగా అడిగాడు – 'ఓ ప్రాచీన యోగ్యుడా నీవు ఏ ఆత్మను ఉపాసిస్తున్నావు?'

సత్యయజ్ఞుడీ విధంగా బదులిచ్చాడు – 'పూజనీయుడవైన ఓ రాజా! నేను ఆదిత్యుని వైశ్వానర దృష్టితో ఉపాసిస్తున్నాను' అని.

ఇది విని రాజు అన్నాడు – 'నిజంగా ఆదిత్యుడు విశ్వరూపమనే పేరు గల వైశ్వానరాత్మయే! వైశ్వానరుని అవయవమే గాని సంపూర్ణ వైశ్వానరాత్మ కాదు. నీవు ఈ విశ్వరూప సంజ్ఞ కల

ఆదిత్యుని ఉపాసించటంవల్లనే నీ కులంలో ఐహికమైనట్టి, పారలౌకికమైనట్టి విశ్వరూప సాధనాలు – అనేక వర్ణాలు కలిగిన భోగసామగ్రి – కనిపిస్తున్నాయి.

ఆ విశ్వరూపుని ఉపాసించినందువల్లనే నీకు రెండు ఆడగుఱ్ఱాలను పూన్చిన రథం, దాసీజనం, కంఠహారం లభించాయి. నీవు అన్నభక్షకుడవై ప్రియతముల్ని ప్రియవస్తువుల్ని చూస్తూ ఉన్నావు. ఎవరైనా సరే ఈ విధమైన వైశ్వానరాత్మను (ఆదిత్యుని) ఉపాసిస్తే అతడు మంచి భోక్త అయి ప్రియమైన వస్తువుల్ని చూస్తాడు. అతని వంశంలో బ్రహ్మతేజస్సు ఉంటుంది. అయినా ఈ ఆదిత్యుడు వైశ్వానరాత్మకు నేత్రమే! సంపూర్ణమైన వైశ్వానరాత్మ కాదు. నీవు ఇచటికి రాకుండా ఉంటే గ్రుడ్డివాడవై ఉండేవాడివి – ఆదిత్యుని సంపూర్ణ వైశ్వానరాత్మగా భావించి ఉపాసిస్తున్న కారణాన'.

## పదునాల్గవ ఖండం

**మం॥ అథ హోవాచేంద్రద్యుమ్నం భాల్లవేయం వైయాఘ్ర పద్య కం త్వామాత్మాన ముపాస్స ఇతి వాయుమేవ భగవో రాజన్నితి హోవాచైష వైపృథగ్వర్త్మా వైశ్వానరో యం త్వమాత్మానముపాస్సే తస్మాత్త్వాం పృథగ్బలయ ఆయన్తిపృథ గ్రథ శ్రేణయోఽనుయన్తి. 1**

**అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం ప్రియం భవత్యస్య బ్రహ్మవర్చసం కులే య ఏతమేవ మాత్మానం వైశ్వానర ముపాస్తే ప్రాణస్త్వేష ఆత్మన ఇతి హోవాచ ప్రాణస్త ఉదక్రమిష్యద్యన్మాం నాగమిష్య ఇతి. 2**

పిమ్మట, రాజు ఇంద్రద్యుమ్నునితో అన్నాడు – 'ఓ భాల్లవేయుడా! నీవు ఏ వైశ్వానరాత్మను ఉపాసిస్తున్నావు?'

ఇంద్రద్ర్యుమ్నుడు – 'ఓ పూజనీయుడవైన రాజా! నేను వాయువును వైశ్వానరునిగా భావిం చి ఉపాసిస్తున్నాను' అన్నాడు.

ఇది విని రాజు ఈ విధంగా అన్నాడు – 'నీవు ఉపాసిస్తున్న ఆ ఆత్మ (వాయువు) ఆవహ, ఉద్వహాది అనేక భేదాలు కలిగి వివిధ మార్గాల్లో సంచరించే వైశ్వానరాత్మ. ఈ కారణంగానే నీ వద్దకు అనేక విధాలైన ఉపహారాలు (వస్త్ర, ఆభరణ, ఆహారాదులు) వస్తున్నాయి. పైగా నీ వద్దకు అనేక దిక్కుల నుండి రథపంక్తులు వస్తున్నాయి.

అంతేకాదు, నీవు అన్నభక్షకుడవై ప్రియతముల్ని చూస్తున్నావు. వాయువును వైశ్వానరాత్మగా ఉపాసించే ఎవడైనా మంచి భోక్తయై, ప్రియ వస్తువుల్ని చూస్తాడు. అతని వంశంలో బ్రహ్మ తేజస్సు ఉంటుంది. అయితే వాయువు వైశ్వానరాత్మకు ప్రాణం! సంపూర్ణ వైశ్వానరాత్మ కాదు. నీవు నా వద్దకు రావటం మంచిదైంది. లేకపోతే నీ ప్రాణాలు లేచిపోయి ఉండేవి.

## పదునైదవ ఖండం

**మం॥ అథ హోవాచ జనం శార్క రాక్ష్య కం త్వమాత్మాన ముపాస్స ఇత్యాకాశమేవ భగవో రాజన్నితి హోవా చైషవై బహుల ఆత్మావైశ్వానరో యం త్వ మాత్మాన ముపాస్సే తస్మాత్త్వం బహులోஉసి ప్రజయా చ ధనేన చ. 1**

**అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మ వర్చసం కులే య ఏతమేవ మాత్మానం వైశ్వానరముపాస్తే సందేహస్త్వేష ఆత్మన ఇతి హోవాచ సందేహస్తే వ్యశీర్యద్యన్మాం నాగమిష్య ఇతి. 2**

పిమ్మట అశ్వపతి శార్కరాక్ష్యుని కుమారుడైన జనునితో ఈ విధంగా అడిగాడు – "ఓ శార్కరాక్ష్యుడా! నీవు ఏ ఆత్మను ఉపాసిస్తున్నావు?" అని.

జనుడిట్లా అన్నాడు – 'ఓ పూజనీయా! నేను ఆకాశాన్ని వైశ్వానర దృష్టితో ఉపాసిస్తున్నాను' అని.

ఇది విని అశ్వపతి అన్నాడు – 'నిజంగానే నీవు ఉపాసించే ఆకాశం 'బహుళము' అనేది వైశ్వానరాత్మ యొక్క ఒక అవయవం. సంపూర్ణ వైశ్వానరాత్మ కాదు. నీవు దీనిని ఉపాసించుటవల్లనే సంతానాన్ని, స్వర్ణము మొదలుగా గల ధనాన్ని పొంది పరిపూర్ణుడవైనావు.

నీవు అన్నభక్షణం చేస్తూ ప్రియవస్తువుల్ని చూస్తున్నావు. ఈ విధంగా వైశ్వానరాత్మను ఎవరు ఉపాసించినా వారు అన్నభోక్తలై, ప్రియవస్తు దర్శనం చేస్తూ ఉంటారు. వారి వంశంలో బ్రహ్మతేజస్సంపన్నులుంటారు. ఈ ఆకాశమనేది వైశ్వానరాత్మకు మధ్యభాగం. నీవు నా వద్దకు రాకుండా ఉంటే ఈ ఉపాసన వలన నీ మధ్యభాగం నష్టమైపోయి ఉండేది.

## పదునారవ ఖండం

**మం॥ అథహోవాచబుడిల మాశ్వతరాశ్విం వైయాఘ్ర పద్య కం త్వమాత్మాన ముపాస్స ఇత్యవ ఏవ భగవో రాజన్నితి హోవాచైష వైరయిరాత్మావైశ్వానరో యం త్వమాత్మాన ముపాస్సే తస్మాత్త్వం రయిమా న్పుష్టి మానసి. 1**

**అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మ వర్చసం కులే య ఏతమేవ మాత్మానం వైశ్వానరముపాస్తే బస్తిస్త్వేష ఆత్మన ఇతి హోవాచ బస్తిస్తే వ్యభేత్స్యద్యన్మాం నాగమిష్య ఇతి. 2**

తరువాత అశ్వపతి మహారాజు అశ్వతరాశ్వుని పుత్రుడైన బుడిలుని అడిగాడు. 'నీవు ఏ వైశ్వానరాత్మను ఉపాసిస్తున్నావు?' అని.

బుడిలుడు బదులిచ్చాడు – 'ఓ రాజా! నేను జలాన్ని వైశ్వానర దృష్టితో ఉపాసిస్తున్నాను' అని.

అది విని రాజిట్లా అన్నాడు – "నీవు ఉపాసించేది నిజంగా ధన సంజ్ఞకల వైశ్వానరాత్మ. ఎందుచేతనంటే జలం వల్ల అన్నము (ధాన్యాదులు), దానివల్ల ధనము లభిస్తుంది. అందుచేత నీవు ధనవంతులవలె శరీర పుష్టి కలిగి వున్నావు.

నీవు అన్నభక్షణం చేస్తూ, ప్రియుల్ని చూస్తున్నావు. నీలాగా ఎవరు జలాన్ని ఉపాసించినా పుష్కలంగా అన్నం తింటూ, ప్రియుల్ని చూస్తూ వంశంలో బ్రహ్మతేజస్సును పొందుతూ ఉంటారు. ఈ జలమనేది వైశ్వానరాత్మకు మూత్రం వంటిదేగాని సంపూర్ణమైన రూపం కాదు. నీవు నా వద్దకు వచ్చి ఈ విషయం తెలుసుకొని ఉండకపోతే నీ వస్తిస్థానం – మూత్రకోశం బ్రద్దలై యుండేది".

## పదునేడవ ఖండం

**మం॥ అథ హోవాచోద్దాల కమారుణిం గౌతమ కం త్వా మాత్మాన ముపాస్స ఇతి పృథివీమేవ భగవో రాజన్నితి హోవాచైష వై ప్రతిష్ఠాత్మా వైశ్వానరో యం త్వమాత్మానముపాస్సే తస్మాత్త్వం ప్రతిష్ఠితో–సి ప్రజయా చ పశుభిశ్చ. 1**

**అత్స్యన్నం పశ్యసి ప్రియమత్త్యన్నం పశ్యతి ప్రియం భవత్యస్య బ్రహ్మ వర్చసం కులేయ ఏతమేవ మాత్మానం వైశ్వానరముపాస్తేపాదౌ త్వేతావాత్మన ఇతి హోవాచ పాదౌ తే వ్యమ్లాస్యేతాం యన్మాం నాగమిష్య ఇతి. 2**

పిమ్మట అశ్వపతి ఉద్దాలకుని అడిగాడు – 'ఓ గౌతముడా! నీవు ఏ ఆత్మను ఉపాసిస్తున్నావు?' అని.

ఉద్దాలకుడన్నాడు – "ఓ రాజా! నేను పృథివిని వైశ్వానర దృష్టితో ఉపాసిస్తున్నాను" అని.

అశ్వపతి ఇట్లా అన్నాడు – 'నీవు ఉపాసించే పృథివి వైశ్వానరాత్మకు ప్రతిష్ఠ – పాదాలు. అంతేగాని సంపూర్ణ వైశ్వానర రూపం కాదు. దీనిని ఉపాసించటం వల్ల నీవు సంతానాన్ని, పశుసంపదను పొందావు.

నీవు అన్నభక్షణం చేస్తూ ప్రియవస్తువుల్ని చూస్తూ ఉన్నావు. నీలాగా ఎవరు ఈ పృథివిని ఉపాసించినా ఈ ఫలితాలు పొందుతారు – అన్నభక్షణం, ప్రియదర్శనం మొదలైనవి. అతని వంశం బ్రహ్మ తేజస్సుతో కూడి ఉంటుంది. కాని ఈ పృథివి వైశ్వానరాత్మ చరణాలని గుర్తుంచుకో! నీవు నా వద్దకు వచ్చి ఉండకపోతే నీ పాదాలు శిథిలమై ఉండేవి."

(ఇంతవరకు ఈ ఆరుగురు ఋషులు ఉపాసిస్తున్న వైశ్వానరుని అవయవాలను చెప్పారు.

| ఉపాసకుడు | ఉపాసనా వస్తువు | పేరు | వైశ్వానరుని అవయవం |
|---|---|---|---|
| ప్రాచీనశీలుడు | ద్యులోకం | సుతేజం | శిరస్సు |
| సత్యయజ్ఞుడు | ఆదిత్యుడు | విశ్వరూపం | నేత్రం |
| ఇంద్రద్యుమ్నుడు | వాయువు | ఆవహ, ఉద్వహాది నామాలు | ప్రాణం |
| జనుడు | ఆకాశం | బహుళము | మధ్యభాగం |
| బుడిలుడు | జలం | ధనము | మూత్రం |
| ఉద్దాలకుడు | పృథివి | ప్రతిష్ఠ | పాదాలు |

ఉపాసనా ఫలం చెప్పటంలో ప్రతిదానికి అన్నభక్షణం, ప్రియదర్శనం, వంశంలో బ్రహ్మతేజస్సు ఉండటం చెప్పారు. వైశ్వానరశక్తులు కూడా ఇవే! ఆహుతులన్నీ భక్షించటం, వెలుగునిచ్చి దర్శనం కలిగించటం, యజ్ఞముల నాచరించటం వల్ల బ్రహ్మతేజస్సు నీయటం).

పదునెనిమిదవ ఖండం

**మం॥ తాన్హోవాచైతే వైఖలు యూయం పృథగి వేమ మా త్మానం వైశ్వానరం విద్వాంసోఽ న్నమత్థ యస్త్వేతమేవం ప్రాదేశమాత్రమభివి మానమాత్మానం వైశ్వానరముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మ స్వన్నమత్తి.** 1

**తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వ రూపః ప్రాణః పృథగ్వర్త్మా మా సందేహో బహులో బస్తిరేవ రయిః పృథి వ్యేవ పాదా వుర ఏవ వేదిర్లోమాని బర్హిర్హృదయం గార్హపత్యో మనోఽ న్వాహార్యపచన ఆస్యామాహవనీయః.** 2

వ్యస్త వైశ్వానరోపాసన ఫలాలు చెప్పారు. ఇప్పుడు సమస్త వైశ్వానరోపాసనా ఫలం చెప్పబోతున్నారు.

వ్యస్త వైశ్వానరోపాసన చేస్తున్న ఋషులతో అశ్వపతి మహారాజు ఇలా అన్నాడు – "మీరంతా వైశ్వానరాత్మను ఎవరికి తోచిన పద్ధతిలో వేరు వారు వేరుగా తెలుసుకొని అన్నభక్షణం చేస్తున్నారు. (గ్రుడ్డివాడు ఏనుగు కాళ్ళను చేతులతో తాకి ఏనుగు స్తంభంలాగా ఉంటుందని, తొండాన్ని తాకి చూచిన గ్రుడ్డివాడు కొండచిలువలాగా ఉంటుందని, చెవులను తాకిచూచిన గ్రుడ్డివాడు విసనకఱ్ఱలాగా ఉంటుందని చెప్పినట్లుగా మీరు కూడా వైశ్వానరుని ఎవరికి తోచినట్లు వారు గుర్తించారని

భావం). ఎవరైనా 'అతడే నేను' అని భావించి – ఆ సంపూర్ణ వైశ్వానరాత్మను నేనే అని తలచి, ద్యులోకం నుండి పృథివీపర్యంతం కల వైశ్వానరాత్మను ఉపాసిస్తారో అటువంటి వైశ్వానరవేత్త సర్వాత్మయై, అన్నభక్షణం చేస్తాడు. (అంటే, అజ్ఞానుల్లాగా తన దేహంలో మాత్రమే అభిమానం కలిగి ఉన్నవాడై భుజించడు). సమస్త లోకాల్లోను, సమస్త ప్రాణుల్లోను, శరీరాది సమస్త ఆత్మలలోను తానుండి అన్నభక్షణం చేస్తాడు. అటువంటి సమస్త వైశ్వానరుడు ఎట్లా ఉంటాడో చెపుతున్నారు –

ఆ సమస్త వైశ్వానరుని మస్తకం ద్యులోకం. సూర్యుడే అతని నేత్రాలు. వేరు వేరు మార్గాల్లో చరించే వాయువే ప్రాణం. ఆకాశమే శరీర మధ్యభాగం. జలమే వస్తి (మూత్రకోశం). పృథివియే పాదాలు. వక్షఃస్థలమే వేదిక. కుశలే (దర్భలే) రోమాలు (వెంద్రుకలు). హృదయమే గార్హపత్యాగ్ని ఆ హృదయం నుండి పుట్టిన మనస్సే గార్హపత్యాగ్ని నుండి పుట్టిన దక్షిణాగ్ని లేక అన్వాహార్య పచనాగ్ని, ఆహవనీయాగ్నియే నోరు–అన్నం ఆహుతులు ఇస్తాము కాబట్టి.

## పందొమ్మిదవ ఖండం

**మం॥ తద్యద్భక్తం ప్రథమ మాగచ్ఛేత్తద్ధోమీయంస యాం ప్రథమా మాహుతిం జుహోయాత్తాం జుహు యా త్ప్రాణాయ స్వాహేతి ప్రాణస్తృప్యతి. 1**

**ప్రాణే తృప్యతి చక్షుస్తృప్యతి చక్షుషి తృప్యత్యా దిత్య స్తృప్యత్యాదిత్యే తృప్యతి ద్యౌస్తృప్యతి దివి తృప్యన్త్యాం యత్కించ ద్యౌశ్చదిత్యశ్చధితిష్ఠత స్తత్తృప్యతి తస్యాను తృప్తింతృప్యతి ప్రజయా పశుభి రన్నా ద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2**

వెనుక చెప్పిన సిద్ధాంతాన్ని అనుసరించి వైశ్వానరోపాసకుడు భోజన సమయంలో ముందుగా వడ్డించిన అన్నాన్ని హవనం చేయాలి – ప్రాణాహుతులివ్వాలి. భోక్త మొదటి ఆహుతి ఇచ్చేటప్పుడు 'ప్రాణాయ స్వాహా' అని నోట్లో అన్నం ఉంచుకోవాలి. దానివల్ల ప్రాణం తృప్తి పడుతుంది.

ప్రాణం తృప్తి పొందింది అంటే, నేత్రేంద్రియం తృప్తి పొందుతుంది. నేత్రేంద్రియం తృప్తి పొందితే ఆదిత్యుడు తృప్తి పొందుతాడు. సూర్యుడు తృప్తి పొందితే ద్యులోకం తృప్తి పొందుతుంది. ద్యులోకం తృప్తి పొందితే ఆ ద్యులోకాన్ని ఆదిత్యుని స్వామిభావంతో అధిష్ఠించి ఉన్న దేవతలు తృప్తి పొందుతారు. వారు తృప్తి పొందటం వల్ల భోక్త కూడా సంతానం, పశువులు, అన్నాద్యం, తేజస్సు, బ్రహ్మవర్చస్సుతో తృప్తి పొందుతారు.

## ఇరువదవ ఖండం

**మం॥ అథ యాం ద్వితీయం జుహుయాత్తం జుహుయా ద్వ్యానాయ స్వాహేతి వ్యానస్తృ
ప్యతి. 1**

**వ్యానే తృప్యతి శ్రోత్రం తృప్యతి శ్రోత్రే తృప్యతి చంద్రమా స్తృప్యతి చంద్రమసి తృప్యతి దిశ స్తృప్యన్తి దిక్షు తృప్యన్తీషు యత్కించ దిశశ్చ చంద్రమాశ్చాధి తిష్ఠన్తి తత్తృప్యతి తస్యాను తృప్తిం తృప్యతి ప్రజయా పశుభిరన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసే నేతి. 2**

తరువాత రెండవ ప్రాణాహుతి తీసుకోవాలి. దానిని 'వ్యానాయ స్వాహా' అని నోటిలో వేసుకోవాలి. దానివల్ల (ఆ ఆహుతి వల్ల) వ్యానవాయువు తృప్తి పొందుతుంది.

వ్యానం తృప్తి చెందితే శ్రోత్రం తృప్తి చెందుతుంది. శ్రోత్రం తృప్తి చెందటం వల్ల చంద్రుడు, చంద్రుడు తృప్తి పొందినందు వల్ల దిక్కులు, దిక్కులు తృప్తి పొందినందువల్ల చంద్రునికి దిక్కులకు అధిష్ఠానాలైన దేవతలు తృప్తి పొందుతారు. ఇవన్నీ తృప్తి పొందటంతో భోక్త కూడా సంతానం, పశువులు, అన్నాద్యము, శరీర తేజస్సు, బ్రహ్మవర్చస్సులతో తృప్తి చెందుతాడు.

## ఇరువది ఒకటవ ఖండం

**మం॥ అథ యాం తృతీయం జుహుయాత్తాం జుహుయాదపా నాయ స్వాహేత్యపాన స్తృప్యతి. 1**

**అపానే తృప్యతి వాక్తృప్యతి వాచి తృప్యన్త్యామగ్ని స్తృప్యత్యగ్నౌ తృప్యతి పృథివీ తృప్యతి పృథివ్యాం తృప్యన్త్యాం యత్కించ పృథివీ చాగ్నిశ్చాధితిష్ఠత స్త త్తృప్యతి తస్యాను తృప్తిం తృప్యతి ప్రజయా పశుభి రన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసే నేతి. 2**

తరువాత 'అపానాయ స్వాహా' అనే మంత్రంతో మూడవ ఆహుతిని నోటిలో వేసుకోవాలి. ఈ ఆహుతివల్ల అపానం అనే వాయువు తృప్తి పొందుతుంది.

అపానం తృప్తి చెందినందువల్ల వాక్కు తృప్తిని పొందుతుంది. వాక్కు తృప్తి చెందితే అగ్ని, అగ్ని తృప్తి చెందితే పృథివి, పృథివి తృప్తి చెందిన తరువాత పృథివికి అగ్నికి అధిష్ఠాన దైవతాలైనవారు తృప్తి చెందుతారు. వీరంతా తృప్తి పొందినందువల్ల భోక్త కూడా సంతానం, పశువులు, అన్నాద్యము, శరీరకాంతి, బ్రహ్మవర్చస్సులతో తృప్తి పొందుతాడు.

## ఇరువది రెండవ ఖండం

**మం॥ అథ యాం చతుర్థీం జుహుయాత్తాం జుహుయాత్సమా నాయ స్వాహేతి సమాన స్తృ ప్యతి. 1**

**సమానే తృప్యతి మన స్తృప్యతి మనసి తృప్యతి పర్జన్య స్తృప్యతి పర్జన్యే తృప్యతి విద్యుత్తృప్యతి విద్యుతి తృప్యన్త్యాం యత్కించ విద్యుచ్చ పర్జన్యశ్చాధితిష్ఠత స్తత్తృప్యతి తస్యాను తృప్తిం తృప్యతి ప్రజయా పశుభి రన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2**

తరువాత 'సమానాయ స్వాహా' అని నాల్గవ ఆహుతిని తీసికోవాలి. ఇట్లా తీసికొన్నందున సమానమనే వాయువు తృప్తి చెందుతుంది.

సమానం తృప్తి చెందినందువల్ల మనస్సు, మనస్సు తృప్తి చెందటం వల్ల పర్జన్యుడు, పర్జన్యుడు తృప్తి పొందటంవల్ల విద్యుత్తు, విద్యుత్తు తృప్తి పొందటంవల్ల విద్యుత్తు పర్జన్యులకు అధిష్ఠాన దైవతాలు అయిన వారు తృప్తి చెందుతారు. వారు తృప్తి చెందటం వల్ల భోక్త కూడా సంతానం, పశువులు, అన్నాద్యము, శరీరకాంతి, బ్రహ్మవర్చస్సుతో తృప్తి చెందుతాడు.

## ఇరువది మూడవ ఖండం

**మం॥ అథ యాం పంచమీం జుహుయాత్తాం జుహుయా దుదానాయ స్వాహేత్యుదానస్తృప్యతి. 1**

**ఉదానే తృప్యతి త్వక్తృప్యతి త్వచి తృప్యన్త్యాం వాయు స్తృప్యతి వాయౌ వృప్యత్యాకాశ స్తృప్యత్యాకాశే తృప్యతి యత్కించ వాయుశ్చాకాశశ్చాధి తిష్ఠత స్త త్తృప్యతి తస్యాను తృప్తిం తృప్యతి ప్రజయా పశుభి రన్నాద్యేన తేజసా బ్రహ్మవర్చసేనేతి. 2**

తరువాత ఐదవ ఆహుతిని 'ఉదానాయ స్వాహా' అంటూ నోట్లో వేసుకోవాలి. ఈ ఆహుతివల్ల ఉదాన వాయువు తృప్తి చెందుతుంది.

ఉదానవాయువు తృప్తి చెందినందువల్ల చర్మము, త్వక్కు తృప్తి చెందినందువల్ల వాయువు తృప్తి చెందుతుంది. వాయువు తృప్తి చెందినందున ఆకాశం తృప్తి చెందుతుంది. ఆకాశం తృప్తి చెందినందున వాయువు ఆకాశాలకు అధిష్ఠాన దైవతాలు తృప్తి చెందుతారు. అందువల్ల భోక్త కూడా సంతానం, పశువులు, అన్నాద్యము, తేజస్సు, బ్రహ్మవర్చస్సులతో తృప్తుడౌతాడు.

## ఇరువది నాల్గవ ఖండం

మం॥ స య ఇదమవిద్వానగ్నిహోత్రం జుహోతి యథాం గారానపోహ్య భస్మ నిజహుయా త్తాదృక్తత్స్యాత్. 1

అథ య ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సరేష్వాత్మసు హుతం భవతి. 2

తద్యథేషీ కాతూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయం తే య ఏతదేవం విద్వానగ్నిహోత్రం జుహోతి. 3

తస్మాదు హైవం విద్యద్యపి చండాలాయోచ్ఛిష్టం ప్రయ చ్ఛేదాత్మని హైవాస్య తద్వైశ్వానరే హుతం స్యాదితి దేషః శ్లోకః. 4

యథేహ క్షుధితా బాలా మాతరం పద్యుపాసత ఏవం సర్వాణి భూతానగ్నిహోత్ర ముపాసత ఇత్యగ్ని హోత్ర ముపాసత ఇతి. 5

ఈ వైశ్వానరాగ్ని విద్యను తెలుసుకోకుండా మామూలుగా అగ్ని గనుక చేస్తే, ఆ అగ్నికార్యం నిప్పుబొగ్గుల్ని తొలగించి బూడిదలో ఆజ్యాదులు ఆహుతిగా ఇచ్చినట్లే! అటువంటి ఆహుతులకు మహత్వం ఉండదు. అంటే, ఆ ఆహుతులు వ్యర్థమైనట్లే!

ఈ వైశ్వానరాగ్ని విద్యను బాగా తెలుసుకొని అగ్నిహోత్రాలు చేసే వాని ఆహుతులు సమస్త లోకాలకు, సమస్త జీవులకు, అందరి శరీరాలకు, మనస్సుకు, ఇంద్రియాలకు, బుద్ధికి చెందుతాయి – అన్ని ఆత్మలకు చెందుతాయి.

ఈ విషయమై ఒక దృష్టాంతం చెప్పుకోవచ్చు. ముంజదర్భ యొక్క కొనభాగం అగ్ని తగలటంతోనే ఏ విధంగా భస్మమైపోతుందో అట్లాగే ఈ వైశ్వానరాగ్ని విద్యను తెలుసుకొని హోమాదికాలు చేసినవాని పాపాలు కూడా అట్లాగే శీఘ్రంగా భస్మమైపోతాయి.

ఈ విషయం తెలుసుకున్న విద్వాంసుడు చండాలునికి ఉచ్ఛిష్టం (ఎంగిలి) ఇచ్చినప్పటికి అది (ఆ ఉచ్ఛిష్టాన్నం) వైశ్వానరాత్మలో ఆహుతి ఇచ్చినట్లే మహత్వాన్ని పొందుతుంది. ఆ విషయమై ఈ శ్లోకం చెప్పారు –

ఈ లోకంలో ఆకలిచేత బాధపడే పిల్లలంతా తల్లి తమకు అన్నం ఎప్పుడు పెడుతుందా అని తల్లిని గూర్చి ఉపాసించినట్లే, సమస్త ప్రాణులు ఈ వైశ్వానర విద్య నెరిగిన విద్వాంసుడు అగ్నిహోత్రంలో ఎప్పుడు ఆహుతులు ఇస్తాడో గదా అని, తమకు భోజనం ఎప్పుడు లభిస్తుందా అని ఆ అగ్నిని ఉపాసిస్తూ ఉంటారు.

# ఆరవ అధ్యాయం

## మొదటి ఖండం

ఈ విశ్వమంతా బ్రహ్మ నుండి అగ్ని జలాదిక్రమంలో ఉద్భవించి తద్విపరీత పద్ధతిలో మళ్ళీ బ్రహ్మలోనే లయమౌతోందని స్థితి సమయంలో కూడా ఆ బ్రహ్మలోనే చేష్టలతో కనిపిస్తుందని లోగడ (14 (1) లో) చెప్పారు. ప్రపంచం ఏ క్రమంలో పుట్టి, ఏ క్రమంలో స్థితిని పొంది, ఏ పద్ధతిలో ఆ పరబ్రహ్మలోనే లీనమౌతోందో విపులీకరించాల్సి ఉంది. విజ్ఞానవంతుడైనవాడు భుజిస్తే ప్రపంచమంతా తృప్తి పొందుతుందని చెప్పారు – సమస్త జీవరాశులలోని ఆత్మ ఒకటైనప్పుడే అది సంభవం. ఆత్మలు భిన్నమైతే అది అసంభవమే గదా! ఈ ఏకత్వానికి ఉండే స్వభావం ఎటువంటిదో చెప్పటం కోసం ఈ అధ్యాయం ప్రారంభిస్తున్నారు.

**మం॥ ఓం శ్వేతకేతుర్హారుణేయ ఆస తం హ పితోవాచ శ్వేతకేతో వస బ్రహ్మచర్యం నవైసోమ్యాస్మత్కు లీనోఽ ననూచ్య బ్రహ్మ బంధురివ భవతీతి.** **1**

**స హ ద్వాదశవర్ష ఉపేత్య చతుర్వింశతి వర్షః సర్వా న్వేదానధీత్య మహామనా అనూచానమానీ స్తబ్ధ ఏవాయ తం హ పితోవాచ శ్వేతకేతో యన్ను సోమ్యేదం మహామనా అనూచానమానీ స్తబ్ధోఽ స్యుత తమా దేశమప్రాక్ష్యః** **2**

**యేనా శ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతమితి కథం ను భగవః స ఆదేశో భవతీతి.** **3**

**యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతం స్యాద్వా చారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం.** **4**

**యథా సోమ్యైకేన లోహమణినా సర్వ లోహమయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం లోహమిత్యేవ సత్యం.** **5**

**స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం కృష్ణాయసమి త్యేవ సత్యమేవం సోమ్య స ఆదేశో భవతీతి.** **6**

**న వై నూనం భగవన్తస్త ఏతదవేదిషుర్య ద్ధ్యే తరవేది ష్యన్కథం మే నా వక్ష్య న్నితి భగవాం స్త్వేవ మే తద్బ్రవీత్వితి తథా సోమ్యేతి హోవాచ.** **7**

శ్వేతకేతువు అరుణుని మనుమడనే విషయం తెలిసిందే! అతనితో తండ్రియైన ఉద్దాలకుడు ఈ విధంగా అన్నాడు – 'నాయనా! శ్వేతకేతూ! నీవు మన వంశాచారానికి తగినట్లుగా గురువు వద్దకు వెళ్ళి బ్రహ్మచర్య పూర్వకంగా గురుకులంలో నివసించు. ఓ ప్రియదర్శనుడా! మన వంశంలో

పుట్టినవాడెవడూ అధ్యయనం లేకుండా బ్రాహ్మణ బంధువుగా ఉండలేడు. కేవలం పుట్టుకవల్లనే కాకుండా అధ్యయనం ద్వారా కూడా బ్రాహ్మణులమవటం మన వంశాచారం.

తండ్రి ఈ విధంగా చెప్పినమీదట, పండ్రెండవ ఏట ఉపనయనం అయిన పిమ్మట ఇరవై నాలుగు సంవత్సరాలు వచ్చేదాకా గురుకులంలో ఉండి, అన్ని వేదాలు అధ్యయనం చేసి, వేదార్థాలు తెలుసుకున్నాడు. అయితే, తానే గొప్ప పండితుడననే అహంకారంతో, అవినీతుడుగా గురుకులం నుండి యింటికి వచ్చాడు. ఈ విధంగా దుందుడుకు స్వభావంతో వచ్చిన కొడుకును చూచి తండ్రి ఇలా అన్నాడు – 'నాయనా! శ్వేతకేతూ! నిన్ను నీవు గొప్ప తెలివిగలవాడవుగా, పండితుడవుగా అనుకుంటూ దుందుడుకు స్వభావంతో, గర్వంతో ఉన్నట్లు కనిపిస్తున్నావు. నీవు ఆ ఆదేశాన్ని (ఉపదేశాన్ని) గురించి అడిగి తెలుసుకున్నావా?'

ఏ ఉపదేశం వల్ల లోగడ విని ఉండని విషయాలు సైతం వినిన విషయాలై పోతాయో, మననం చేయని విషయాలు సైతం బాగా మననం చేసిన విషయాలై పోతాయో, అనిశ్చితమైన విషయాలు సైతం నిశ్చితమైన విషయాలైపోతాయో అటువంటి ఉపదేశాన్ని నీవు విన్నావా?' అని. (ఎన్ని వేదాలు చదివినా, ఎన్ని శాస్త్రాలు తెలుసుకున్నా, ఆత్మజ్ఞానం లేకపోతే అన్నీ వ్యర్థమే అనే విషయం చెప్పటానికే ఈ కథ.) ఇది విని శ్వేతకేతువు అడిగాడు – 'స్వామీ! ఆ ఉపదేశం ఎటువంటిది?' అని.

ఉద్దాలకుడు చెపుతున్నాడు – 'ఓ ప్రియదర్శనుడా! లోకంలో మనం చూస్తున్నాం. ఒక మట్టి ముద్ద ద్వారా మట్టితో తయారయ్యే సమస్త కార్యజాతాన్ని, వస్తుసమూహాన్ని మనం తెలుసుకోగలుగుతున్నాం. వికారం లేదా మార్పు అనేది, భేదం అనేది, పేరులోను, ఆకారంలోను తప్ప సత్యమైనది మట్టి మాత్రమే! అంటే కుండ, కడవ, చట్టి అనేవి పేరులోను, ఆకారంలోను భిన్నంగా కనిపిస్తాయి. అన్నిటిలోను ఉన్నది మాత్రం మట్టి అనేది ఒక్కటే! అనే విషయం మనకు తెలుసు.

అదే విధంగా, ఓ ప్రియదర్శనుడా! ఒక బంగారపు ముద్ద ద్వారా బంగారపు వస్తువులన్నింటిని మనం తెలుసుకోగలుగుతున్నాం. అంటే, ఆయా వస్తువుల్లో ఉన్న సత్యపదార్థం బంగారమని, ఆయా వస్తువులు, పేరువల్ల ఆకారం వల్ల మాత్రమే భిన్నంగా కనిపిస్తున్నాయని, ఆ పేరు, ఆకారం పోగానే సత్యమైన బంగారం మాత్రమే మిగులుతుందని మనకు తెలుసు.

అదే విధంగా, నాయనా! ఒక నఖకృంతాన్ని (గోళ్ళు కత్తిరించే కత్తెరను – గోరుగుల్లును) చూచి ఇనుముతో తయారయ్యే అనేక వస్తువులను మనం గ్రహించగలుగుతున్నాం. అంటే ఇనప వస్తువులలో ఉన్నది ఇనుము అని. వస్తువుల నామరూపాలు మాత్రం భిన్నంగా కనిపిస్తాయని

తెలుసు. అంటే ఇనుము మాత్రం అన్ని వస్తువులలోను ఉన్న సత్యపదార్థం అని తెలుసు. నాయనా! ఆ ఆదేశం కూడా ఇప్పుడు నేను చెప్పిన విషయం లాంటిదే!'

ఇది విని శ్వేతకేతువు ఇట్లా అన్నాడు – 'దేవా! మీరు నన్ను అడిగిన విషయం నిజంగా పూజ్యులైన మా గురువుగారికి తెలిసి ఉండదు. వారికి మీరు చెప్పిన విషయం తెలిసి ఉంటే, నాలాంటి గుణవంతునికి, గురుభక్తి కలవానికి, తెలివిగలవానికి చెప్పకుండా ఉంటారా? కాబట్టి, మీరే నాకా విషయాన్ని ఉపదేశించండి'. ఈ మాటలు విని తండ్రి 'సరే, నీకా తత్వాన్ని గూర్చి చెపుతాను' అన్నాడు.

## రెండవ ఖండం

**మం॥ స దేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయం, తద్ధైక ఆహురసదేవేదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయం తస్మాద సతః సజ్జాయత. 1**

**కుతస్తు ఖలు సోమ్యైవం స్యాదితి హోవాచ కథమసతః సజ్జాయతేతి సత్త్వేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవా ద్వితీయమ్. 2**

**తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి తత్తేజోఽ సృజత తత్తేజ ఐక్షత బహు స్యాం ప్రజాయేయేతి తదపోఽ సృజత తస్మాద్యత్ర క్వచ శోచతి స్వేదతే వా పురుషస్తేజస ఏవ తదధ్యాపో జాయన్తే. 3**

**తా ఆప ఐక్షన్త బహ్వ్యః స్యామ ప్రజాయేమహీతి తా అన్నమసృజన్త తస్మాద్యత్ర క్వచ వర్షతి తదేవ భూయిష్ఠమన్నం భవత్యద్భ్య ఏవ తదధ్యన్నాద్యం జాయతే. 4**

తండ్రియైన ఉద్దాలకుడు కొడుకుతో అంటున్నాడు – 'ప్రియదర్శనుడా! శ్వేతకేతూ! ఈ ప్రపంచం ఉత్పత్తికి పూర్వం ఇప్పుడున్నట్లుగా, ఇప్పుడు మనకు కనిపిస్తున్నట్లుగా, నామరూపాలతో కూడిలేదు. సజాతీయమైనవి, విజాతీయమైనవి, స్వగతమైనవి అనే భేదాలు లేకుండా కేవలం అద్వితీయమైన (రెండవదంటూ లేని, ఒకే ఒక) సత్తుమాత్రమే ఉండేది. ఈ విధమైన నామరూపాలు లేవు. పదార్థాలు లేవు. ఈ విషయమై కొంత మంది, సృష్టికి ఆరంభంలో అద్వితీయమైనట్టి 'అసత్తు' మాత్రమే అంటే అసద్రూపం మాత్రమే ఉండేదని, ఆ అసత్తునుండే సత్తు ఉద్భవించిందని అంటారు 'సత్తు' అంటే ఉనికి, సత్యం అని, 'అసత్తు' అంటే లేనిది అసత్యం అని చెప్పుకోవచ్చు.

కాని, నాయనా! శ్వేతకేతూ! నీవే ఆలోచించు. ఇది ఎక్కడైనా సంభవమేనా? అసత్తునుండి సత్తు ఎట్లా పుడుతుంది? లేనిదాని నుండి ఉన్నది ఎట్లా పుడుతుంది! కాబట్టి నాయనా! ఈ సృష్టికి ఆరంభంలో ఈ నామరూపాలతో కూడిన జగత్తు అంతా కేవలం అద్వితీయమైన 'సత్తు'గా ఉండేది.

అంటే, సూక్ష్మమైన 'ఉనికి' ఏదో ఉండేది. ఆ 'సత్తు' అనేది సర్వవ్యాపియై, అనిర్వచనీయమై, అవిభాజ్యమై, నిష్కళంకమై ఒకటిగా ఉండేది అని అన్ని ఉపనిషత్తులలోను చెప్పినదే!

ఆ సత్యమే, "నేను అనేకం కావాలి" అని ఈ విధంగా తలచింది. ఈ విధంగా తలచిన ఆ సత్తు ముందుగా తేజస్సును సృష్టించింది. అంటే అగ్నిని సృష్టించింది. ఆ అగ్ని మళ్ళీ తాను అనేకం కావాలని అనుకుంది. ఆ విధమైన ఆలోచన వల్ల ఆ అగ్ని నీటిని సృష్టించింది – అగ్ని నుండి నీరు పుట్టింది. అందుచేతనే ఈనాడు కూడా ఎవరైనా శోకతప్తులైతే చెమట పడుతుంది. అట్లాగే ఈ క్షణపూర్వకమైన తాపం వల్ల అగ్నినుండి జలం పుట్టింది.

ఆ జలరూపంలో ఉండే 'సత్తు' ఈ క్షణ పూర్వకమైన తపస్సు చేసింది – 'నేను అనేకం కావాలి. అనేక రూపాలుగా నేను పుట్టాలి' అని. ఈ విధంగా తపించిన జలం అన్నాన్ని సృష్టించింది. అందుచేతనే ఈనాడు కూడా జలం ఎక్కడ వర్షిస్తే అక్కడల్లా అన్నోత్పత్తి జరుగుతోంది. అంటే, అన్నాద్యము – భుజించటానికి వీలైన అన్నం నీటివల్లనే పుడుతోంది.

## మూడవ ఖండం

**మం॥ తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవ న్త్యాండజం జీవజ ముద్భిజ్జమితి. 1**

**సేయం దేవతైక్షత హన్తాహ మిమాస్తిస్రోదేవతా అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకర వాణీతి. 2**

**తాసాం త్రివృతం త్రివృతమేకై కాం కరవాణీతి సేయం దేవతే మాస్తిస్రో దేవతా అనేనైవ జీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరోత్. 3**

**తాసాం త్రివృతం త్రివృతమేకై కామకరోద్యథా తు ఖలు సోమ్యేమాస్తిస్రో దేవతాస్త్రి వృత్త్రివృదేకై కా భవతి తన్మే విజానీహీతి. 4**

ఈ స్థావర జంగమాత్మకమైన జీవులన్నీ పుట్టుకరీత్యా మూడు విధాలుగా ఉన్నాయి. అండజములు, జీవజములు, ఉద్భిజములు అని. అంటే గ్రుడ్డునుండి పుట్టేవి (పక్షులు, పాములు మొదలైనవి) జీవం వల్ల పుట్టేవి (మనుష్యులు పశువులు మొదలైనవి) ఉద్భిజములు విత్తనాల వల్ల భూమి నుండి పుట్టేవి (చెట్లు చేమలు) ఈ మూడు రకాలు కాక స్వేదజాలని (చెమట నుండి పుట్టేవి) ఊష్మజాలని (వెచ్చదనం వల్ల పుట్టేవి) క్రిమికీటకాదులు ఉన్నాయి. కాని ఇవన్నీ అండజాలలో గాని, ఉద్భిజాలలో గాని చేరతాయి. కాబట్టి ప్రధానంగా పై మూడు రకాలే చెప్పారు.

మనం వెనుక చెప్పుకొన్న తేజస్సు (అగ్ని), జలం, అన్నం (పృథివి) ఈ మూడింటి పుట్టుకకు కారణమైన (సత్తు మళ్ళీ ఈ విధంగా తలచింది – 'నేను జీవాత్మ రూపంలో ఈ ముగ్గురు

దేవతలలోను (అగ్ని, జలం, అన్నం) ప్రవేశిస్తాను. (ఎట్లా? సూర్యుడు అద్దంలోగాని, నీటిలోగాని ప్రతిబింబించినట్లుగా తాను కూడా ఈ మూడింటిలోను వ్యక్తం కావాలని కోరింది) అట్లా ప్రవేశించి అనేక పేర్లు, అనేక రూపాలు వ్యక్తం చేస్తాను' అని.

ఈ విధంగా ఒక్కొక్కరిని మూడేసి చేయాలని తలచిన 'సత్తు' తనలో అవ్యక్తంగా, బీజభూతంగా ఉన్న నామరూపంతో అగ్ని, జలం, పృథివి ఈ మూడింటిలో ప్రవేశించింది. పృథివి అన్నరూపం. పృథివిలో నుండే భోజ్యమైన అన్నాద్యం లభిస్తోంది కాబట్టి పృథివికి అన్నానికి అభేదం. ఈ విధంగా ముగ్గురిలోను చేతి త్రివృత్కరణం చేసేటప్పుడు ఒక దేవత ప్రధానమై మిగతా ఇరువురు గౌణంగా ఉంటారు. ముప్పేట పేనేత్రాడుతో ఒకపేట ప్రధానమై పైకి వస్తూ మిగతావి రెండూ అప్రధానమైనట్లు. అయితే మూడూ కలసి కనిపిస్తాయి. విడివిడిగా కనిపించవచ్చు. అట్లాగే ఈ ముగ్గురు విడివిడిగా కూడా వ్యక్తమౌతారు – అంటే ప్రత్యేకమైన నామరూపాలతో, ఈ విధంగా ఇది అగ్ని, ఇవి నీళ్ళు, ఇది అన్నం అని ప్రత్యేకనామాలు, భావాలు ఉన్నప్పుడే వీటి ప్రయోజనం సిద్ధిస్తుంది.

ఆ దేవత (సత్తు) వెనుక చెప్పిన అగ్ని, జలం, పృథివి అనే దేవతలను వారి వారి గుణాలను ప్రధానంగా తీసుకొని మూడింతలుగా చేసింది. ఓ ప్రియదర్శనుడా! ఈ ముగ్గురు దేవతలు పిండాలకు (శరీరాలకు) బయట కూడా మూడేసిగా వ్యక్తమౌతున్నారు. వీరు ఏ విధంగా వ్యక్తమౌతున్నారనే విషయం నావల్ల తెలుసుకో! త్రివృత్కరణానికి ఉదాహరణ తరువాతి ఖండంలో చెపుతారు.

## నాల్గవ ఖండం

**మం॥ యదగ్నే రోహితం రూపం తేసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్న స్యాపాగాదగ్నేరగ్నిత్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణి రూపాణీ త్యేవ సత్యమ్.** 1

**యదా దిత్యస్య రోహితం రూపం తేజస స్తద్రూపం యచ్ఛుక్ల తదపాం యత్కృష్ణం తదన్నస్యాపాగా దాదిత్యాదాదిత్యత్వం వాచారంభణం వికారో నామ ధేయం త్రీణి రూపాణీ త్యేవ సత్యమ్.** 2

**యచ్చన్ద్రమసో రోహితం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్యాపాగా చ్చన్ద్రాచ్చంద్రత్వం వాచారంభణం వికారో నామ ధేయం త్రీణి రూపాణీత్యేవ సత్యం.** 3

**యద్విద్యుతో రోహితం రూపం తేజస్తద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్యస్యాపాగా ద్విద్యుతో విద్యుత్త్వం వాచారంభణం వికారో నామ ధేయం త్రీణి రూపాణీత్యేవ సత్యమ్.** **4**

స్థూలాగ్నిలో ఎరుపు, తెలుపు, నలుపు అనే మూడు రంగులు కనిపిస్తాయి. స్థూలాగ్నిలో మనకు కనిపించే ఎఱ్ఱదనం, త్రివృత్కృతం కాని అగ్ని యొక్క సూక్ష్మరూపం (తేజస్సు) అన్నమాట. అట్లాగే త్రివృత్ కృతం కాని స్థూలాగ్నిలో కనిపించే తెల్లని రంగు సూక్ష్మజలం యొక్క తేజస్సు. స్థూలాగ్నిలో కనిపించే కృష్ణవర్ణం (నల్లని రంగు) పృథివి యొక్క సూక్ష్మ తేజం. ఎప్పుడైతే మనం స్థూలాగ్నిలో ఉండే ఈ మూడు రంగుల్ని గుర్తించామో అప్పుడే అగ్నిలో ఉండే అగ్నిత్వం నివృత్తమైపోయింది. ఆ స్థూలాగ్ని మిగతా రెంటి తేజస్సులతో వికారం చెందిన వస్తువని తెలిసింది. అట్లా తెలియటంతో దానికి ఉన్న అగ్ని అనే పేరు కూడా పోతుంది. ఇక యదార్థంగా మిగిలి ఉన్న ఆ మూడు వర్ణాలే సత్యం. (మనం ఒక స్ఫటికాన్ని ఒక ఎఱ్ఱని వస్తువు యొక్క సామీప్యంలో చూచాము. ఆ స్ఫటికం ఎఱ్ఱగా కెంపులాగా కనిపించింది. కెంపు అని అనుకున్నాము. తరువాత స్ఫటికాన్ని దానివద్ద నున్న ఎఱ్ఱని పదార్థాన్ని గుర్తించాము. అప్పుడు మనకు అంతకుపూర్వం స్ఫటికంలో ఉన్న కెంపు అనే భావం పోయింది. దానితోపాటు లోగడ మనం పెట్టిన కెంపు అనే పేరు కూడా పోయింది. మిగిలింది స్ఫటికం. ఎఱ్ఱని వస్తువు అవే సత్యం అని తెలిసింది. ఈ ఉదాహరణ కూడా పైన చెప్పిన విషయానికి సరిపోతుంది. అగ్ని, జలం పృథివి అని దేవతల్ని త్రివృత్కరణం చేసి చూపటానికి ఉదాహరణ చెప్పారు. అగ్నిని గూర్చి చెప్పారు కాబట్టి ఇచట అగ్ని ప్రధానమై మిగతా రెండూ అప్రధానం (గౌణం) అవుతాయి. అట్లాగే జలాన్ని చెప్పినప్పుడు జలం ప్రధానమై మిగతావి గౌణమౌతాయి).

ఆదిత్యుని గురించి చెపుతున్నారు. ఆదిత్యునిలో ఉండే ఎఱ్ఱనివర్ణం స్థూలాగ్నిలో ఉండే ఎఱ్ఱదనం, అట్లాగే ఆదిత్యునిలోని తెల్లని వర్ణం జలం యొక్క తేజస్సు, నల్లని రంగు పృథివి యొక్క తేజస్సు. ఈ విషయం తెలియటంతో సూర్యునిలో ఉండే సూర్యత్వం తొలగిపోయింది – సూర్యుని విషయమై మనకున్న భావం తొలగిపోయింది. ఈ మార్పుకు వాక్కే ఆధారం. ఇప్పుడు మిగిలిందల్లా పేరు మాత్రమే! యదార్థానికి ఆ మూడు వర్ణాలే సత్యం.

అట్లాగే చంద్రునిలో ఉన్న ఎఱ్ఱని వర్ణం అగ్ని యొక్క రూపం – స్థూలాగ్ని యొక్క రూపం, చంద్రునిలోని శుక్లవర్ణం జలం యొక్క రూపం. చంద్రునిలోని కృష్ణవర్ణం పృథివి యొక్క రూపం. ఈ మూడింటిని వేరు చేసి చూడగా మన దృష్టిలో చంద్రునిలో ఉండే చంద్రత్వం తొలగిపోయింది. నామమాత్రంగా చంద్రుడనే పేరు మిగిలింది అంతే! ఈ మూడు వర్ణాలు కలియగా ఏర్పడిన

చంద్రుని రూపం కేవలం వాక్కు మీద ఆధారపడిందే తప్ప అన్యం కాదు. యదార్థానికి ఆ మూడు వర్ణాలే సత్యం. దీనివల్ల మనం గ్రహించాల్సింది ఏమంటే, మనకు కనిపించేది ఈ సమస్తమూ ఆ పరమసత్త యొక్క వికారములే! మార్పులే! కాబట్టి ఆ పరమ సత్యాన్ని మనం తెలుసుకున్నప్పుడు ఈ కనిపించే వస్తు సమూహమంతా అర్థమౌతుంది. అంటే, అద్వితీయమైనదేదో అదే సత్యం అని తెలుస్తుంది.

విద్యుత్తులో ఉండే ఎఱ్ఱని రూపం అగ్ని యొక్క రూపం. తెల్లని వర్ణం అనేది జలం యొక్క రూపం. నల్లని కాంతి అనేది పృథివి యొక్క రూపం. విద్యుత్తులో ఉండే ఈ మూడు వర్ణాలను వేరుచేసి చూచినప్పుడు విద్యుత్తులోని విద్యుదత్త్వం తొలగిపోతుంది. విద్యుత్తు అనే పేరు మాత్రమే మిగిలి ఉంటుంది. అంటే ఆ స్థితిలో విద్యుత్తు పేరు తప్ప వేరే ఆధారం ఉండదు. విద్యుదత్వం అనేది ఈ మూడు వర్ణాల కలయిక వల్ల ఏర్పడిందే తప్ప, మాటలవల్ల వచ్చిన వికారం తప్ప అన్యం కాదు. యదార్థంగా దానిలోని మూడు వర్ణాలే సత్యం. ఎట్లా? భూమికి నీరు మూలాధారం. కాబట్టి నీరే సత్యం. ఇక భూమికి మిగిలిన ఆధారం వాక్కే. అట్లాగే నీటికి అగ్ని ఆధారం. కాబట్టి అగ్ని సత్యం. నీటికి మిగిలిన ఆధారం వాక్కే. అట్లాగే అగ్నికి ఆ 'సత్తు' ఆధారం. కాబట్టి ఆ సత్ అనేదే సత్యం. అగ్నికి మిగిలిన ఆధారం వాక్కే! ఇట్లా పరమసత్యమైన ఆ సత్‌ను తెలుసుకుంటే అన్నీ తెలుసుకన్నట్లే!

**మం॥ ఏతద్ధస్మవై తద్విద్వాంస ఆహుః పూర్వే మహాశాలా మహాశ్రోత్రియా న నోఽద్య కశ్చనాశ్రుత మమత మవిజ్ఞాత ముదాహరిష్యతీతి హ్యేభ్యో విదాం చక్రుః. 5**

**యదు రోహితమువాభూదితి తేజస స్తద్రూపమితి తద్వి దాంచక్రుర్యదు శుక్ల మివాభూదిత్యపాం రూపమితి తద్వి దాంచక్రుర్యదు కృష్ణమివా భూదిత్యన్నస్య రూపమితి తద్విదాం చక్రుః. 6**

**యద్విజ్ఞాత మివాభూది త్యేతాసామేవ దేవతానాం సమాస ఇతి తద్విదాంచక్రుర్యథా ఖలు ను సోమ్యే మాస్తిస్రో దేవతాః పురుషం ప్రాప్య త్రివృత్త్రివృదే కైకా భవతి తన్మే విజానీహీతి. 7**

పూర్వం మహాగృహస్థులైనవారు, మహాశ్రోత్రియులైనవారు ఈ విధంగా అన్నారు – ఏమని? – 'మన వంశపరంపరలో తాము వినని దానిని గురించి, తాము ఆలోచించని దానిని గురించి, తమకు తెలియని దానిన గురించి మాట్లాడేవారు ఎవరూ లేరు' అని అంటే, మన వంశంలో అందరూ సత్పదార్థాన్ని గురించి విన్నవారే! దానిని గురించి ఆలోచించిన వారే! దానిని బాగా తెలుసుకున్నవారే అని భావం. ఆ సత్తును తెలుసుకోగలిగితే అన్నీ తెలుసుకున్నట్లే గదా! అందుచేత తమ వంశం వారంతా బ్రహ్మజ్ఞానులే అని.

ఆ ఎఱ్ఱనికాంతి తేజస్సు (అగ్ని యొక్క) యొక్క రూపమని, ఆ తెలుపే జలస్వరూపమని, ఆ కృష్ణవర్ణమే – ఆ నల్లని రంగే – పృథివి యొక్క (అన్నం యొక్క) రూపమని వారికి తెలుసు.

అంతేకాదు, మనకు తెలియనివిగా కనపడేవన్నీ ఈ మూడింటి కలయిక అనీ వారూ తెలుసుకున్నారు. ఓ ప్రియదర్శనుడా! ఈ దేవతల యొక్క మూడేసి మూడేసిగా ఉన్న రూపాలు, ఈ మానవ శరీరానికి సంబంధించి ఏ విధంగా కనిపిస్తున్నాయో నా వల్ల తెలుసుకో! ఈ మూడూ ఒక్కొక్కటి మూడేసిగా మారి వివిధ అవయవాలుగా, ఇంద్రియాలుగా ఎట్లా మారినాయో తెలుసుకో?

ఐదవ ఖండం

**మం॥ అన్నమశితం త్రేధా విధీయతే తస్య యః స్థవిష్ఠో ధాతు స్తత్పురీషం భవతి యో మధ్యమస్తన్మాంసం యోఽణిష్ఠస్తన్మనః** **1**

**ఆపః పీతాస్త్రేధా విధీయన్తే తాసాం యః స్తవిష్ఠో ధాతుస్తన్మూత్రం భవతి యో మధ్యమస్తల్లోహితం యోఽణిష్ఠః స ప్రాణః.** **2**

**తేజోఽసితం త్రేధా విధీయతే తస్య యః స్తవిష్ఠో ధాతుస్తదస్థి భవతి యో మధ్యమః స మజ్జా యోఽణిష్ఠః సా వాక్.** **3**

**అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజో మయీ వాగితి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.** **4**

మనం తిన్న ఆహారం (ఆహారమే పృథివి) మూడు భాగాలుగా విభజింపబడుతోంది. అన్నంలోని స్థూలభాగం లేదా స్థూలధాతువు పురీషం (మలం) గా మారుతోంది. స్థూలమూ కాక, సూక్ష్మమూ కాక మధ్య రకంగా ఉండే ధాతువు మాంసం అవుతోంది. మిక్కిలి సూక్ష్మమైన భాగము మనస్సుగా మారుతోంది. మనస్సు అనేది అన్నవికారమని తేలుతోంది.

అట్లాగే మనం త్రాగిన నీరు కూడా మూడు విధాలుగా విభజింపబడుతోంది. ఆ నీటిలో ఉండే స్థూలభాగం (స్థూలధాతువు) మనం విసర్జించే మూత్రం. మధ్య రకంగా ఉండే ధాతువు రక్తం అవుతోంది. మరి సూక్ష్మధాతువు ప్రాణం అవుతోంది. జలం ప్రాణానికి ఆధారమని తెలుస్తోంది. జలం త్రాగకుండా బ్రతకలేదని (6 అ. 7 ఖం. 1 మం)లో చెప్పారు.

అదే విధంగా మనం భుజించిన తేజస్సు కూడా (అగ్నికూడా) మూడుగా విభజింపబడుతోంది. (మనం తినే అగ్ని అంటే నెయ్యి, నూనె, వెన్న వగైరాలు. ఈ క్రొవ్వు పదార్థాలు వేడిని ఇస్తాయని తెలుసు గదా!) ఈ తేజస్సులోని స్థూలభాగం శరీరంలోని ఎముకలుగా మారుతోంది. మధ్య రకంగా ఉండే ధాతువు మజ్జ (మూలుగ) అవుతోంది. మరీ సూక్ష్మమైన ధాతువు వాక్కు అవుతోంది.

ఓ ప్రియదర్శనుడా! ఈ పైన చెప్పిన విధంగా చూస్తే మనస్సు అనేది అన్నమయమౌతోంది. ప్రాణమనేది జలమయమౌతోంది. వాక్కు అనేది తేజోమయమౌతోంది". ఇదంతా విన్న శ్వేతకేతువు తండ్రితో ఇలా అంటున్నాడు – 'ఓ పూజ్యుడా! నాకు ఇంకా బాగా అర్థమయ్యేటట్లు చెప్పండి' అని. 'సరే! అట్లాగే చెపుతాను' అన్నాడు ఉద్దాలకుడు.

## ఆరవ ఖండం

**మం॥ దధ్న సోమ్య మథ్యమానస్య యోఽణిమా స ఊర్ధ్వః సముదీషతి తత్సర్పిర్భవతి.** 1

**ఏవ మేవ ఖలు సోమ్యాన్న స్యాశ్యమానస్య యోఽణిమా స ఊర్ధ్వః సముదీషతి తన్మనో భవతి.** 2

**అపాం సోమ్య పీయమానా నాం యోఽణిమా స ఊర్ధ్వః సముదీషతి స ప్రాణో భవతి.** 3

**తేజసః సోమ్యాశ్యమానస్య యోఽణిమా స ఊర్ధ్వః సముదీషతి స వాగ్భవతి.** 4

**అన్నమయం హి సోమ్య మన ఆపోమయః ప్రాణస్తేజో మయీ వాగితి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతిహోవాచ.**

ఓ ప్రియదర్శనుడా! పెరుగును కవ్వంతో బాగా చిలికినప్పుడు ఆ పెరుగులో ఉన్న సూక్ష్మాంశం వెన్నలాగా పైకి తేలుతోంది. అదే నెయ్యి అవుతోంది.

అట్లాగే, నాయనా! మనం తిన్న అన్నంలోని సూక్ష్మాంశం పైకి తేలి మనస్సుగా మారుతుంది.

ఓ ప్రియదర్శనుడా! అట్లాగే మనం త్రాగినట్టి నీటిలోని సూక్ష్మాంశం తేరుకొని పైకి వచ్చి ప్రాణం అవుతోంది.

అట్లాగే మనం భుజించిన తేజస్సు యొక్క (నెయ్యి, నూనె మొదలైనవాటి) సూక్ష్మాంశం పైకి తేలివచ్చి అదే వాక్కు అవుతోంది.

అందుచేత, నాయనా! శేతకేతూ! మనస్సు అనేది అన్నమయమని, ప్రాణమనేది జలమయమని, వాక్కు అనేది తేజోమయమని తెలుసుకో! అని ఈ విధంగా చెప్పిన తండ్రితో శ్వేతకేతువు మళ్ళీ అంటున్నాడు – 'ఓ దేవా! ఆ మనస్సు యొక్క మనస్తత్వాన్ని ఇంకొకసారి అర్థమయ్యేలాగా చెప్పండి. మనస్సు అన్నమయమనే విషయం నాకు బాగా అర్థమయ్యేటట్లు చెప్పండి' అని.

## ఏడవ ఖండం

మం॥ షోడశ కలః సోమ్య పురుషః పంచదశాహాని మాశీః కామమపః పిబాపోమయః ప్రాణో న పిబతో విచ్ఛే త్స్యత ఇతి. 1

స హ పంచదశాహాని నాశాథ హైనముపససాద కిం బ్రవీమి భో ఇత్యృచః సోమ్య యజూంషి సామానీతి స హోవాచ న వై మాప్రతిభాన్ని భో ఇతి. 2

తం హోవాచ యథా సోమ్య మహతోఽభ్యాహిత స్యైకోంగారః ఖద్యోతమాత్రః పరిశిష్టః స్యాత్తేన తతోఽపిన బహు దహేదేవం సోమ్య తేషోడశానాం కలానామేకా కలాతిశిష్టా స్యాత్తయైతర్హి వేదాన్నాను భవస్యశానాథ మే విజ్ఞాస్యసీతి. 3

స హాశాథ హైన ముపససాద తం హ యత్కించ ప్రపచ్ఛ సర్వం హ ప్రతిపేదే. 4

తం హోవాచ యథా సోమ్య మహతోఽభ్యాహిత స్యైకమంగారం ఖద్యోతమాత్రం పరిశిష్టం తం తృణై రుపసమాధాయ పాజ్వలయత్తేన తతోఽపి బహు దహేత్. 5

ఏవం సోమ్య తే షోడశానాం కలానామేకా కలాతి శిష్టాభూత్సా-,,న్నేనోపసమాహితా ప్రాజ్వాలీ తయై తర్హి వేదాననుభవస్యన్న మయం హి సోమ్య మన ఆపో మయః ప్రాణస్తే జోమయీ వాగితి తద్ధాస్య విజజ్ఞావితి విజజ్ఞావితి. 6

ఉద్దాలకుడు తన కుమారునితో అంటున్నాడు – ‘ఓ ప్రియదర్శనుడా! పురుషునికి పదహారు కళలున్నాయి. అతన్ని అందుకనే షోడశకలా పురుషుడని అన్నారు. మనస్సు అనేది అన్నమయమనే విషయం నీకు ప్రత్యక్షంగా అనుభవంలోకి రావాలంటే 15 రోజులపాటు అన్నం తినకుండా నీరు మాత్రం త్రాగుతూ ఉండు. ప్రాణమనేది జలానికి వికారం కదా! అంటే ప్రాణం జలం వల్ల ఏర్పడ్డది కాబట్టి నీవు నీరు త్రాగుతూ ఉన్నందున జలానికి కార్యమైనట్టి ప్రాణం నశించదు.

(మనం భుజించినట్టి అన్నంలోని సూక్ష్మాంశం మనస్సుకు శక్తిని ఇస్తుంది. అన్నం తినటంవల్ల వచ్చిన ఆ శక్తిని16 భాగాలుగా విభజిస్తూ ఈ మానసిక శక్తి పెరుగుతోంది. అంటే అన్నంచేత పోషింపబడ్డ మనస్సు యొక్క శక్తియే 16 భాగాలుగా విభజింపబడ్డది. శరీరము ఇంద్రియాలు వీటి అన్నింటి సమిష్టిరూపమే ఆ 16 కళలు గల పురుషుడు. ఈ 16 కళలను గూర్చి ప్రశ్నోపనిషత్తులో చెప్పబడ్డది – ప్రాణం, శ్రద్ధ, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, భూమి, ఇంద్రియాలు, మనస్సు, అన్నం, బలం, తపస్సు, వేదమంత్రాలు, కర్మలు, లోకాలు, ప్రాణుల పేర్లు. పైన చెప్పినట్టి ఆ శక్తి ఉన్నవాడు ఋషి అవుతాడు. మంచి శ్రోత, మంచివక్త, మంచిమంత, విజ్ఞాత అవుతాడు. అన్ని కర్మలు చేయటానికి సమర్ధుడౌతాడు. ఆ శక్తి లేకపోతే ఏమీ లేదు).

తండ్రి చెప్పినట్లుగా మనస్సు యొక్క శక్తిని తెలుసుకోవటానికై శ్వేతకేతువు 15 రోజులపాటు భోజనం మానివేశాడు. తరువాత తండ్రి వద్దకు వచ్చి అన్నాడు – 'స్వామీ! ఏమి మాట్లాడమంటారు?' అని. తండ్రి అన్నాడు – 'నాయనా! ఋగ్యజుస్సామ మంత్రాలు చదువు' అని. అప్పుడే శ్వేతకేతువు అన్నాడు 'స్వామీ! నాకు ఆ మంత్రాలేవీ స్ఫురణకు రావటం లేదు' అని.

అప్పుడు కుమారునితో ఉద్దాలకుడిట్లా అన్నాడు – 'నాయనా! బాగా కట్టెలు వేసి ప్రజ్వలింపచేసిన అగ్ని, మండి మండి చివరకు అందులో మిణుగురులాంటి ఒక చిన్న నిప్పుకణం మిగిలింది అనుకో! అప్పుడా స్వల్పమైన నిప్పుకణం వెనుకటి ఆ పెద్ద అగ్ని యిచ్చినంతటి వేడిని, శక్తిని యివ్వలేదుకదా! అట్లాగే, ఓ ప్రియదర్శనుడా! నీ పదహారు కళలలోను ఉపవాసం వల్ల క్రమంగా పదిహేను కళలు పోగా ఒక్క కళ మాత్రమే మిగిలి ఉంది. అందుచేత నీవు ఆ ఒక్క కళ ద్వారా వేదాల్ని గుర్తు చేసుకోలేకపోతున్నావు. ఇక నీవు వెళ్ళి భోజనం చెయ్యి. తరువాత నేను చెప్పిన విషయం నీకు బాగా తెలుస్తుంది'.

తండ్రి ఆదేశాన్ని అనుసరించి శ్వేతకేతువు భోజనం చేశాడు. పిమ్మట తండ్రి వద్దకు వచ్చాడు. అప్పుడు తండ్రి అడిగిన ఋగ్వేదాదుల్లోని మంత్రాలను, వాటి అర్థాన్ని తెలుసుకోగలిగాడు.

అప్పుడు ఆరుణి శ్వేతకేతువుతో అన్నాడు 'ఓ ప్రియదర్శనుడా! శ్వేతకేతూ! చాలా కట్టెలతో ప్రజ్వరిల్లి ఆ అగ్నిలో మిగిలి ఉన్న మిణుగురులాంటి చిన్న అగ్ని కణాన్ని మళ్ళీ గడ్డి, పుల్లలు వగైరాలు వేసి ప్రజ్వలింపచేస్తే ఆ అగ్ని వెనుకటికంటె ఎక్కువ దాహకశక్తి కలది అవుతుంది. అంటే, స్వల్పంగా మిగిలి ఉన్న నీలోని అగ్ని మళ్ళీ ఆహారం ద్వారా ప్రజ్వరిల్లి ఎక్కువ శక్తివంతమైనది అని భావం. అందుకే మళ్ళీ ఆ మంత్రాలన్నీ జ్ఞాపకం వచ్చాయి.

ఓ ప్రియదర్శనుడా! 16 కళలలోను ఒక్క కళ మాత్రమే నీలో మిగిలి ఉంది. ఆ మిగిలి ఉన్న ఒక్క కళ, అన్నం ద్వారా పెంపొందింది. అందుచేత మళ్ళీ యిప్పుడు వేదమంత్రాలను, వాటి అర్థాల్ని అనుభవించగలుగుతున్నావు. నాయనా! మనస్సు అనేది అన్నానికి వికారం, ప్రాణం జలానికి వికారం. అట్లాగే వాక్కు అనేది అగ్నికి (తేజస్సుకు) వికారం! ఈ విధంగా తండ్రిచేత బోధింపబడి, మనస్సు మొదలైన వాని అన్నమయత్వాది వికార తత్త్వాల్ని బాగా అర్థం చేసుకోగలిగాడు శ్వేతకేతువు. బాగా అర్థం చేసుకోగలిగాడు.

## ఎనిమిదవ ఖండం

**మం॥ ఉద్దాలకో హారుణిః శ్వేతకేతుం పుత్రమువాచ స్వప్నాన్తం మే సోమ్య విజానీహీతి యత్రైతత్పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మాదేవం స్వపితీత్యాచక్షతే స్వం హ్యపీతో భవతి. 1**

అరుణుని కుమారుడైన ఉద్దాలకుడు, తన కొడుకైన శ్వేతకేతువుతో అన్నాడు. 'ఓ ప్రియదర్శనుడా! నీవు నా వల్ల సుషుప్తి యొక్క స్వరూపాన్ని (స్వప్నాంతాన్ని) గూర్చి స్పష్టంగా తెలుసుకో! మానవుడు గాఢ నిద్రలో ఉన్నప్పుడు 'అతడు సుషుప్తిలో ఉన్నాడు' అని అంటారు. నాయనా! ఆ సుషుప్తి సమయంలో జీవుడు ఆ పరమసత్తను పొందుతాడు. అంటే తన నిజస్వరూపాన్ని పొందుతాడు – తన ఆత్మను తాను పొందుతాడు. అందుచేతనే అతన్ని గురించి చెప్పేటప్పుడు అతడు నిద్రిస్తున్నాడని అంటారు. అంటే అతడు తన నిజస్థితిని పొందాడని అర్థం. (అద్దంలో మన రూపం ప్రతిబింబించింది. ఆ అద్దాన్ని తీసివేయటంతోనే ఆ ప్రతిబింబం మాయమైపోయింది. నిజరూపం మాత్రమే మిగిలింది. అట్లాగే సుషుప్తిలో మనస్సు, ఇంద్రియాలు పనిచేయటం మానివేస్తాయి. కాబట్టి ఆత్మ తన నిజరూపంలో మిగులుతుంది. ప్రతిబింబంలాంటి జీవభావం పోతుంది. మిగిలేది ఆత్మభావం మాత్రమే! అందుచేతనే ఆ స్థితిలో ఉన్న ఆత్మను 'స్వపితి' అంటారు. తన ఆత్మలో తానే ఉన్నాడని అర్థం. అతడు నిద్రిస్తున్నాడని సామాన్యంగా అంటారు. (ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కటొక్కటే మనస్సులో లీనమైపోగా, మనస్సు కూడా అలసిపోయి ప్రాణంలో లీనమైపోతుంది. అంటే సుషుప్తిలో – గాఢ నిద్రలో – ఒక్క ప్రాణం మాత్రమే మేల్కొని ఉంటుంది. ఆ అర్థం అతడు నిద్రిస్తున్నాడని సామాన్యంగా అంటారు. (ఇంద్రియాలన్నీ అలసట చెంది ఒక్కటొక్కటే మనస్సులో లీనమైపోగా మనస్సుకూడా అలసిపోయి ప్రాణంలో లీనమైపోతుంది. అంటే సుషుప్తిలో – గాఢనిద్రలో ఒక్క ప్రాణం మాత్రమే మేల్కొని ఉంటుంది. ఆ ప్రాణమే ఇంద్రియాల యొక్క మనస్సు, మనస్సు యొక్క అలసటను తీరుస్తుంది.)

**మం॥ స యథా శకునిః సూత్రేణ ప్రబద్ధో దిశం దిశం పతి త్వాన్యత్రాయ తనమ లబ్ధ్వా బంధనమేవోపశ్రయత ఏవ మేవ ఖలు సోమ్య తన్మనో దిశం దిశం పతిత్వా వ్యత్రాయతనమలబ్ధ్వా ప్రాణమేవోపశ్రయతే ప్రాణ బంధనం హి సోమ్య మన ఇతి. 2**

ఒక ఉదాహరణ ఇచ్చి ఈ విషయాన్నే ఇంకా విపులీకరిస్తున్నారు – ఒక పక్షిని పట్టుకొని త్రాటితో బంధించారు. ఆ త్రాటిని ఒకచోట కట్టివేశారు. ఆ పక్షి అన్ని దిక్కులలోను, త్రాడు అవకాశమిచ్చినంత దూరం పరుగెత్తి పరుగెత్తి ఎక్కడా విశ్రాంతి స్థానం దొరకక తనను బంధించిన స్థానానికే ఆశ్రయం పొందుతుంది. అట్లాగే నాయనా! ఈ మనస్సు కూడా అనేక దిక్కులలో

పోయినంత దూరంపోయి తిరిగి తిరిగి ఎక్కడా విశ్రాంతి స్థానం దొరకక ప్రాణరూపంలో మనకు వ్యక్తమయ్యే ఆ పరదేవతనే ఆశ్రయిస్తుంది. ఎందుచేత? ఆ ప్రాణమనే బంధనం చేత ఈ మనస్సు బంధింపబడి ఉన్నది కాబట్టి! ఆలంకారికంగా మనస్సు బంధన స్థానమైన ప్రాణాన్ని పరదేవతగా, మనస్సును జీవాత్మగా భావించాలి.

**మం॥ అశనా పిపాసే మే సోమ్య విజానీహీతి యత్రైతత్పురుషోஉ శిశిషతి నామాప ఏవ తదశితం నయన్తే తద్యథా గోనాయోஉ శ్వనాయః పురుషనాయ ఇత్యేవం తదప ఆచక్షతేஉ శనాయేతితత్రైతచ్ఛుంగ ముత్పతితం సోమ్య విజానీహి నేదమమూలం భవిష్యతీతి. 3**

ఓ ప్రియదర్శనుడా! శ్వేతకేతూ! నా వల్ల ఆకలి దప్పికలను గూర్చి బాగా తెలుసుకో! ఒకడు ఆకలిగా ఉన్నాడంటే (ఆకలిగా ఉన్నవాడనేది వాడిపేరు) ఆ సమయంలో అతనికి ఆహారాన్ని తీసుకొని పోయేది జలం – అంటే, అతడు తిన్న ఆహారాన్ని లోనికి తీసుకొనిపోయేది జలం అన్నమాట. లోకంలో ఆవుల్ని తీసికొని పోయేవానిని 'గోనాయ' అని, అశ్వాల్ని తీసికొని వెళ్ళేవానిని 'అశ్వనాయ' అని, పురుషుల్ని తీసికొని వెళ్ళేవానిని 'పురుషనాయ' అని అంటారు. అట్లాగే, మానవుడు తిన్న ఆహారాన్ని తీసికొని వెళ్ళే జలాన్ని 'అశనాయ' అంటారు. అశనము అంటే ఆహారం, అన్నం. కాబట్టి నాయనా! నీవు ఈ జలాన్నే ఈ శరీరమనే అంకురం ఉత్పత్తి చెందటానికి కారణం అని తెలుసుకో! అంటే ఈ శరీరాంకురానికి జలమే మూలం. ఎందుచేతనంటే కారణం లేకుండా ఏ కార్యమూ ఉండదు – కాబట్టి జలం అనే కారణం లేకుండా శరీరమనే కార్యమూ ఉండదు – కాబట్టి ఆహారం అనేది (అన్నం అనేది) బీజం అయితే అది మొలవటానికి కారణమైన జలమనేది దానికి మూలం అనుకోవాలి.

**మం॥ తస్య క్వ మూలం స్యాదన్యత్రాన్నా దేవమేవ ఖలు సోమ్యాన్నేన శుఙ్గేనాపో మూలమన్విచ్ఛాద్భిః సోమ్య శుఙ్గేన తేజో మూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుఙ్గేన సన్మూలమన్విచ్ఛ సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః 4**

నాయనా! ఈ శరీరానికి కారణం అన్నం తప్ప ఇంకేమి ఉంటుంది? అన్నమే శరీరానికి మూలకారణం. ఈ అన్నమనే కారణాన్ని తీసుకొని, దాని (శరీరం యొక్క) మూలరూపాన్ని (జలాన్ని) పరిశీలించు! అట్లాగే జలం అనే అంకురం ద్వారా దానికి మూలకారణమైన తేజస్సును (అగ్నిని) పరిశీలించు. ఈ తేజస్సు ద్వారా దానికి మూలకారణాన్ని 'సత్తు'ను తెలుసుకో! ఈ విధమైన పరిశీలనతో అన్వేషిస్తూ పోతే ఈ సమస్తానికి – జీవరాశులన్నింటికి – చరాచరాలన్నింటికి – ఆ 'సత్తు' అనేదే మూలం. ఆ సత్, సత్యమే వీటి అన్నింటికి ఆశ్రయం. ఆ సత్తే ఈ విశ్వానికంతకు లయస్థానం అని కూడా తెలుస్తుంది.

(మనం తిన్న ఆహారం జలంతో కలిసి గిలకొట్టబడి (మథింపబడి) ద్రవంగా మారి, అగ్నివల్ల జీర్ణమై, రక్తమాంసాదులుగా వీర్యంగా పరిణతి చెందుతుంది. స్త్రీలలో శోణితంగా మారి ఈ శుక్ర శోణితాలు కలసి జీవోత్పత్తికి కారణమౌతున్నాయి. కాబట్టి, ఈ శరీరమనే మొలకకు ఆహారం మూలంగా ఉంటోంది. అట్లాగే జలం, అగ్ని కూడా కారణాలుగా అయిన చివరకు అన్నింటికి కారణం ఆ సత్తు అని తేలుతోంది. స్థావరాలలో కూడా ఈ సత్యమే గోచరిస్తుంది.

**మం॥ అథ యత్రైతత్పురుషః పిపాసతి నామ తేజ ఏవ తత్పీతం నయతే తద్యథా గోనాయోఽ శ్వనాయః పురుషనాయ ఇత్యేవం తత్తేజ ఆచష్ట ఉదన్యేతి తత్రైత దేవ శుఙ్గముత్పతితం సోమ్య విజానీహి నేదమమూలం భవిష్యతీతి. 5**

జలం అనే అంకురం ద్వారా సద్రూపమైన మూలాన్ని గురించిన జ్ఞానం కలిగించటానికై ఉద్దాలకుడీ విధంగా చెపుతున్నాడు – "ఈ పురుషునికి దాహం వేసినప్పుడు 'పిపాసతి' అని అంటాము. అంటే 'త్రాగాలని అనుకుంటున్నాడు' అని అర్థం. అంటే అప్పుడు ఆ పేరు కలవాడు అవుతాడు. అప్పుడాతడు త్రాగిన నీటిని తేజస్సే (అగ్ని) తీసికొనిపోతుంది. వెనుక చెప్పినట్లు (గోనాయ, అశ్వనాయ, పురుషనాయ అని అన్నట్లు) ఈ నీటిని తీసికొనిపోయే తేజస్సును 'అదన్యా' అని అంటారు. 'అదన్యా' అంటే ఉదకాన్ని తీసికొనిపోయేది అని అర్థం. నాయనా! శ్వేతకేతూ! ఆ జలరూపమైన మూలం నుండే ఈ శరీరమనే అంకురం ఉత్పన్నమైంది అనే విషయం తెలుసుకో! ఎందుచేతనంటే ఒక మూలమనేది లేకుండా ఈ శరీరం ఉండనే ఉండలేదు.

**మం॥ తస్యక్వ మూలం స్యాదన్యత్రాద్భ్యోఽ ద్భిః సోమ్య శుఙ్గేన తేజో మూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుఙ్గేన సన్మూలమన్విచ్ఛ సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠా యథా ను ఖలు సోమ్యేమాస్తిస్రో దేవతాః పురుషం ప్రాప్య త్రివృత్త్రి వృదేకైకా భవతి తదుక్తం పురస్తాదేవ భవత్యస్య సోమ్య పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం. 6**

నాయనా! శ్వేతకేతూ! ఈ భౌతిక శరీరానికి జలం తప్ప వేరే మూలమనేది ఎక్కడ ఉంటుంది? ఉండదు కాబట్టి. ఓ ప్రియదర్శనుడా! నీవు ఈ జలరూపంలో ఉండే అంకురం ద్వారా తేజస్సు రూపంలో ఉండే మూలాన్ని అన్వేషించు! అట్లాగే నాయనా! తేజస్సు రూపంలో ఉండే అంకురం ద్వారా సద్రూపంలో ఉండే మూలాన్ని అనుసంధానం చెయ్యి! (జలానికి తేజస్సు మూలమైతే, తేజస్సుకు 'సత్' అనేది మూలం.) నాయనా! ఈ జీవులందరూ 'సత్' మూలంగా కలవారే! ఆ 'సత్' అనేదే ఈ ప్రజలందరికీ ఆయతనం (ప్రతిష్ఠ. ఆశ్రయం). ఆ 'సత్' అనేదే అన్నింటికి లయస్థానం. అంటే ఆ 'సత్'లోనే పుట్టి, దానిలోనే ఉండి, దానిలోనే లయమౌతాయి. ఓ

ప్రియదర్శనుడా! పృథివి, జలం, తేజస్సు అనే ఈ ముగ్గురు దేవతలు సచ్చిదానంద స్వరూపుడైన పురుషుని పొంది ఒక్కొక్కటి వెనుక చెప్పినట్లు మూడేసిగా అవుతాయి (త్రివృత్కరణాన్ని చెందుతాయి). నాయనా! చనిపోయేటప్పుడు ఈ పురుషుని వాక్కు మనస్సులో లయమౌతుంది. మనస్సు ప్రాణంలో లయమౌఉంది. ప్రాణం తేజస్సులో లయమౌతుంది. తేజస్సు పరమాత్మలో (సత్) లీనమౌతుంది.

**మం॥ స య ఏషోఽ ణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మాతత్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 7**

నాయనా! ఈ జగత్తుకు మూలకారణంగా ఏ సూక్ష్మమైన సారాన్ని చెప్పామో అదే ఈ సమస్తమైన జగత్తూను. అదే (ఆ సూక్ష్మమైన సారమే) ఆత్మ. అదే సత్యం. అదే ఆత్మ. ఓ ప్రియదర్శనుడా! అదే నీవు? నీవే అది?" ఇది విని శ్వేతకేతువు అన్నాడు – 'దేవా! నాకు మళ్ళీ అర్థమయ్యేటట్లు బోధించండి' అని.

'ఓ ప్రియదర్శనుడా! సరే! అట్లాగే! నీకు మళ్ళీ ఈ విషయాన్నే బోధపరుస్తాను' అన్నాడు తండ్రియైన ఆరుణి. ఏకీభావాన్ని పొందుతూనే వున్నాయి.

(జీవులన్నీ ప్రతిరోజూ సుషుప్తిని అనుభవిస్తూనే ఉన్నాయి అంటే, ఆ సత్ పదార్థంలో లీనమైపోతూనే ఉన్నాయి. అయినప్పటికి మనం ఆ చిరంతన సత్యంలో లీనమైనాము అనే విషయం తెలుసుకోలేకుండా ఉన్నాయి. కాబట్టి ఈ విషయం బాగా అర్థమయ్యేటట్లు ఏదైనా ఉదాహరణ యిచ్చి బోధించమని అడిగాడు).

## తొమ్మిదవ ఖండం

**మం॥ యథా సోమ్య మధు మధుకృతో నిస్తిష్ఠన్తి నానా త్యయానాం వృక్షాణాం రసాన్సమవహార మేకతాం రసం గమయన్తి. 1**

**తే యథా తత్ర న వివేకం లభన్తేఽ ముష్యాహం వృక్షస్య రసోఽ స్మ్య ముష్యాహం వృక్షస్య రసోఽ స్మీ త్యేవమేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి సంపద్యామహ ఇతి. 2**

**త ఇహ వ్యాఘ్రోవాసింహో వాకృకోవా వరాహో వా కీటో వా పతంగో వా దంశో వా మశకో వా యద్యద్భవన్తి తదాభవన్తి. 3**

**స య ఏషోఽ ణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 4**

ఆరుణి మళ్ళీ ఈ విధంగా చెపుతున్నాడు – "నాయనా! శ్వేతకేతూ! లోకంలో మనం చూస్తూనే ఉన్నాం – తేనెటీగలు అనేక దిక్కులకు పోయి అనేక రకాల మొక్కల పూలనుండి రసాన్ని తెచ్చి తేనెతుట్టెలో ఉంచుతున్నాయి. అంటే ఆ వివిధ రసాలకు మొత్తంగా ఒక మధువు – తేనె – అనే పేరు వచ్చేటట్లు చేసినాయి.

తేనె రూపం దాల్చిన తరువాత ఆ రసాలకు ఆ మధువులో నేను ఫలానా చెట్టు రసాన్ని, నేను ఫలానా చెట్టు రసాన్ని అనే వివేకం ఉండదు. అట్లాగే ఈ సమస్త ప్రజలు సుషుప్తిలో, ఆ పరమసత్తలో లీనమౌతారు – తాదాత్మ్యం చెందుతారు. కాని ఆ వివిధ రసాల లాగానే తాము ఆ సత్పదార్థంలో తాదాత్మ్యం చెందినట్లు గమనించలేరు – భేదభావాన్ని పొందలేరు. అంటే నేను ఫలానా వాని కొడుకుని, నేను ఫలానావాని మనుమడిని అనే ప్రత్యేకతలన్నీ పోతాయి. పూలరసాల్లో కొన్ని తియ్యగా, కొన్ని వగరుగా, కొన్ని చేదుగా వివిధ రుచుల్లో ఉండవచ్చు. కాని తేనె రూపంలోకి వచ్చిన తరువాత ప్రత్యేక రుచులు పోయి ఒకే విధమైన రుచి మాత్రమే ఉంటోంది – అది తేనెరుచి.

అట్లాగే, లోకంలో పెద్ద పులులు, సింహాలు, తోడేళ్ళు, పందులు, కీటకాలు, గడ్డిపురుగులు, దోమలు ఇవన్నీ సుషుప్తికి పూర్వం ఉంటున్నాయి. సుషుప్తికి తరువాత మళ్ళీ వాటికి పూర్వరూపాలు వస్తున్నాయి – అంటే గాఢనిద్ర తరువాత అవన్నీ మళ్ళీ వెనుకటి తమ స్థితికి వస్తున్నాయి. అంటే, కొన్నివేల యుగాలు గడిచినా అజ్ఞానులైన జీవులు ఎన్ని జన్మలెత్తినా వాటికి పూర్వ వాసనలు పోవు. వాటి పూర్వవాసనా జన్యమైన అభినివేశాన్ని బట్టి జన్మలెత్తుతూ ఉంటాయి.

నాయనా! ఈ అణురూపమైన ఏ సత్పదార్థాన్ని గురించి లోగడ చెప్పామో, ఇవన్నీ (ఈ జీవరాశులన్నీ) ఆ సత్యమే! అదే ఆత్మ. ఇన్నిమాటలెందుకు? నాయనా! శ్వేతకేతూ! నీవు కూడా ఆ సత్పదార్థమే! అదే సత్యం" ఈ విధంగా చెప్పిన తండ్రి ఉపదేశాన్ని విని శ్వేతకేతువు అన్నాడు – 'స్వామీ! నాకు మళ్ళీ చెప్పండి!' అని.

'సరే! అట్లాగే చెపుతాను' అన్నాడు తండ్రి.

(ఒక గ్రామం నుండి వేరొక గ్రామానికి వెళ్ళినవాడు, 'నేను నా ఊరు నుండి ఈ ఊరికి వచ్చాను' అని అనుకున్నట్లుగా జీవులు 'నేను ఫలానా 'సత్' నుండి ఈ శరీరంలోనికి వచ్చాను' అని స్పష్టంగా ఎందుకు తెలుసుకోలేకుండా ఉన్నాయి? ఈ విషయమే బాగా అర్థమయ్యేటట్లు చెప్పండి అని శ్వేతకేతువు అభ్యర్థన.

## పదవ ఖండం

మం॥ ఇమాః సోమ్య నద్యః పురస్తాత్ప్రాచ్యః స్యన్దన్తే పశ్చాత్ప్రతీచ్యస్తాః సముద్రాత్సముద్రమేవాపియన్తి స సముద్ర ఏవ భవతి తా యథా తత్ర న విదురియ మహమస్మీయ మహమస్మీతి. 1

ఏవమేవ ఖలు సోమ్యేమాః సర్వాః ప్రజాః సత ఆగమ్య న విదుః సత ఆగ చ్ఛామహ ఇతి త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా కీటో వా పతంగో వా దంశో వా మశకో వా యద్యద్భవన్తి తదాభవన్తి. 2

స య ఏషోఽ ణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3

నదుల్ని సముద్రాన్ని దృష్టాంతంగా తీసుకొని సత్యాత్మను ప్రతిపాదిస్తున్నారు – ఉద్దాలకుడు ఈ విధంగా చెపుతున్నాడు.

'ఓ ప్రియదర్శనుడా! గంగ మొదలైన నదులు తూర్పుదిక్కుగా ప్రవహించి సముద్రంలో కలుస్తున్నాయి. అట్లాగే సింధు మొదలైన నదులు పడమటి దిక్కుగా ప్రవహించి సముద్రంలో కలుస్తున్నాయి. అంటే, నదులన్నీ సముద్రం నుండి పుడుతున్నాయని (నీరు ఆవిరిగా మారి, మేఘరూపమై వర్షించి, నదీరూపాన్ని పొందుతున్నాయని) తెలుసు. ఆ నదులు ఏ ఏ దిక్కుగా, ఏ ఏ రూపంలో, ఏ ఏ పేరుతో ప్రవహించినా చివరకు మళ్ళీ సముద్రంలోనే కలుస్తున్నాయి. అంటే, సముద్రంలోని నీరు ఆవిరియై, మేఘంగా పరిణమించి, వర్షించి నదిగా రూపుదాల్చి సముద్రంలోకి ప్రవహించి మళ్ళీ సముద్రమే అవుతున్నాయి. ఆ విధంగా సముద్రంలో చేరిన నీటికి నేను ఫలానా నదినుండి వచ్చాననే స్పృహ ఉండదు. అంటే, నేను గంగనుండి వచ్చిన నీటినని, నేను సింధునది నుండి వచ్చిన నీటినని, నేను ఫలానా నీటినని తెలియదు. అట్లాగే సముద్రంలో బుడగలు, నురుగు పుడుతున్నాయి. మళ్ళీ దానిలోనే లయమౌతున్నాయి – తాదాత్మ్యం చెందుతున్నాయి.

అట్లాగే నాయనా! శ్వేతకేతూ! ఈ జీవులన్నీ ఆ సత్పదార్థం నుండి వచ్చినప్పటికి, ఆ సత్తునుండి పుట్టినట్లు వాటికి తెలియదు. సుషుప్తికి పూర్వం అంటే గాఢనిద్రకు పూర్వం ఏ ఏ రూపాల్లో ఉంటున్నాయో, సుషుప్తి తరువాత కూడా ఆయా రూపాల్లోనే ఉంటున్నాయి. అంటే, లోగడ మనం చెప్పుకొన్న పెద్ద పులులు, సింహాలు, వగైరాలన్నీ నిద్రలేచిన తరువాత మళ్ళీ వెనుకటి విధంగానే అవుతున్నాయి. ఇవన్నీ ప్రతిరోజూ తమ సహజ రూపంతో తాదాత్మ్యం చెందుతున్నాయి. మళ్ళీ వస్తున్నాయి. (నదుల్లాగా) అంటే నిద్రలోగాని, మృత్యువు ద్వారాగాని వెనుకటి రూపాన్ని కోల్పోయి మళ్ళీ అదే రూపాన్ని పొందుతున్నాయి.

కాబట్టి, ఓ ప్రియదర్శనుడా! శ్వేతకేతూ! అత్యంత సూక్ష్మరూపంలో ఉండే ఆ సద్రూపమే సత్యం. అదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అదే నీవు!'

ఇదంతా విని శ్వేతకేతువు మళ్ళీ ఈ విధంగా అన్నాడు – 'ఓ భగవానుడా? నాకు ఇంకా బాగా తెలిసేటట్లు మళ్ళీ చెప్పండి' అని.

'సరే! నాయనా! అట్లాగే చెపుతాను' అన్నాడు ఉద్దాలకుడు.

## పదునొకండవ ఖండం

**మం॥ అస్య సోమ్య మహతో వృక్షస్య యో మూలేఽభ్యాహన్యాజ్జీవన్స్రవేద్యో మధ్యేఽభ్యాహన్యాజ్జీవన్స్ వేద్యోఽగ్రే–భ్యాహన్యాఽజ్జీవన్స్ వేత్స ఏష జీవేనాత్మా నాను ప్రభూతః పేపీయమానో మోదమాన స్తిష్ఠతి. 1**

**అస్య యదేకాం శాఖాం జీవో జహాత్యథ సా శుష్యతి ద్వితీయాం జహా త్యథ సా శుష్యతి తృతీయాం జహా త్యథ శుష్యతి సర్వం జహాతి సర్వః శుష్యతి. 2**

**ఏవమేవ ఖలు సోమ్య విద్ధీతి హోవాచ జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియత ఇతి స య ఏషోఽణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవా న్విజ్ఞాపయత్విితి తథా సోమ్యేతి హోవాచ. 3**

వృక్షాన్ని దృష్టాంతంగా తీసికొని సత్యాత్మను ఉపదేశిస్తున్నారు. ఉద్దాలకుడు మళ్ళీ ఈ విధంగా అంటున్నాడు – 'ఓ ప్రియదర్శనుడా! ఎదురుగా శాఖోపశాఖలుగా పెరిగి ఉన్న మహావృక్షం ఉంది. ఆ వృక్షాన్ని ఎవరైనా మొదట్లో కొడితే – ఒకే దెబ్బకు అది ఎండిపోదు కాబట్టి – బ్రతికి ఉండే రసస్రావం చేస్తూ ఉంటుంది. అంటే నీరు లాంటి ద్రవాన్ని కార్చుతూ బ్రతికే ఉంటుంది. ఎవరైనా ఆ వృక్షాన్నే మధ్యకు నరికితే అప్పుడు కూడా అట్లాగే బ్రతికి ఉంటూ రసాన్ని స్రవిస్తూ ఉంటుంది. అదే విధంగా ఆ చెట్టు చివరిభాగంలో నరికినా అట్లాగే బ్రతికి ఉండి రసాన్ని స్రవిస్తూ ఉంటుంది; జీవించే ఉంటుంది. నాయనా! దీనివల్ల మనకు ఏమి తెలుస్తోంది? ఆ చెట్టు యొక్క మూలం నుండి సమస్త శాఖోపశాఖల్లోనూ జీవాత్మ ద్వారా వ్యాప్తమై ఉంది. అందుచేతనే వ్రేళ్ళ ద్వారా భూమి నుండి నీరు వగైరాలు గ్రహిస్తూ బ్రతికి ఉంటోంది.

ఈ వృక్షంలో ఒక కొమ్మకు ఏదైనా రోగం వచ్చి ఆ కొమ్మలో నుండి జీవం పోతే అప్పుడా కొమ్మ ఎండిపోతుంది. ఇంకొక కొమ్మలోని జీవం పోతే అదీ ఎండిపోతుంది. అట్లాగే ఏ కొమ్మ అయినా అదే విధంగా మొత్తం చెట్టునుండి జీవం పోతే అప్పుడు ఆ చెట్టు పూర్తిగా ఎండిపోతుంది. దీనివల్ల మనకు చెట్లు చేమల్లో కూడా జీవాత్మ ఉన్నదని తెలుస్తోంది.

ఓ ప్రియదర్శనుడా! దీనిని బట్టి నీవు గ్రహించవలసింది ఏమిటంటే, జీవం పోయిన తరువాత శరీరం చస్తోంది. కాని, జీవం చావటం లేదు' అని. కాబట్టి ఈ సూక్ష్మాతి సూక్ష్మంగా ఉండే ఈ చేతన తత్త్వమే, సమస్తమూను. అదే సత్యం, అదే ఆత్మ. ఓ శ్వేతకేతూ! అదే నీవూనూ!" అని తండ్రి చెప్పిన ఉపదేశం విని శ్వేతకేతువు మళ్ళీ ఈ విధంగా అన్నాడు.

"స్వామీ! మరియొక దృష్టాంతం ద్వారా ఈ తత్త్వాన్ని బాగా తెలియజెప్పండి" అని.

"సరే! అట్లాగే చెపుతాను" అని అన్నాడు ఆరుణి. అట్లా వేరొక దృష్టాంతం ద్వారా ఆత్మ నిరూపణానికి పూనుకుంటున్నాడు.

## పండ్రెండవ ఖండం

**మం॥ న్యగ్రోధ ఫలమత ఆహరేతీదం భగవ ఇతి భిద్ధీతి ఛిన్నం భగవ ఇతి కిమత్ర పశ్యసీత్యణ్వ్య ఇవేమా ధానా భగవ ఇత్యాసామంగైకాం భిద్ధీతి భిన్నా భగవ ఇతి కిమత్ర పశ్యసీతి న కించన భగవ ఇతి. 1**

**తం హోవాచ యం వై సోమ్యైత మణిమానం న నిభా లయస ఏతస్య వై సోమ్యైషోఽణిమ్న ఏవం మహాన్య గ్రోధస్తిష్ఠతి శ్రద్ధత్స్వ సోమ్యేతి. 2**

**స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3**

"నాయనా! ఎదురుగా ఉన్న వటవృక్షం నుండి ఒక పండు తీసికొని రా" అన్నాడు ఆరుణి కుమారునితో.

శ్వేతకేతువు తండ్రి చెప్పినట్లుగా మఱ్ఱిచెట్టు వద్దకు వెళ్ళి ఒక పండు తెచ్చి తండ్రితో అన్నాడు – 'స్వామీ! ఇదిగో! మీరు చెప్పినట్లు మఱ్ఱిపండు తెచ్చాను.

ఆరుణి : "అయితే దానిని పగులగొట్టు"!

శ్వేత : "దేవా! అట్లాగే పగులగొట్టాను."

ఆరుణి : సరే! ఆ పండు లోపల నీకేమి కనిపిస్తున్నాయి?"

శ్వేత : 'స్వామీ! దీనిలోపల అణుపరిమాణంలో చిన్న చిన్న గింజలున్నాయి.

ఆరుణి : "నాయనా! ఆ గింజలలో నుండి ఒక గింజను తీసికొని చితకగొట్టు."

శ్వేత : భగవానుడా! మీరు చెప్పినట్లే చితకకొట్టాను."

ఆరుణి : "అయితే ఆ గింజ లోపల ఏమి కనిపిస్తోంది?"

శ్వేత : "స్వామీ! దీనిలోపల ఏమీ లేదు".

ఆరుణి : ఓ ప్రియదర్శనుడా! నీవు ఈ బ్రహ్మాండమైన వటవృక్షం యొక్క సూక్ష్మరూపాన్ని ఈ గింజలోపల చూడలేకపోతున్నావు. కాని, దీనిలో ఈ కంటికి కూడా కనపడని సూక్ష్మరూపమే ఉంది. ఈ సూక్ష్మ రూపానికి కార్యంగా ఈ బ్రహ్మాండమైన మఱ్ఱిచెట్టు నిలబడి ఉంది. చూచావు గదా! అంటే, ఈ మఱ్ఱిచెట్టుకు కారణం ఆ సత్యాత్మయే! ఆ సూక్ష్మతత్వమే! నేను చెప్పిన విషయాన్ని బాగా ఆలోచించి చూడు.

నాయనా! శ్వేతకేతూ! ఈ అత్యంత సూక్ష్మరూపమే ఇదంతా! అది సత్యం. అది ఆత్మ. అదే నీవు. ఇదంతా విని శ్వేతకేతువు "స్వామీ! నాకు వేరొక దృష్టాంతంతో బాగా అర్థమయ్యేటట్లు చెప్పండి" అన్నాడు. సరే! నాయనా! అట్లాగే చెపుతాను అన్నాడు ఆరుణి. ఇట్లా అని మళ్ళీ చెప్పటం ఆరంభించాడు.

పదమూడవ ఖండం

**మం॥ లవణమేతదుదకేఽవధాయాథ మా ప్రాతరుపసీదథా ఇతి స హ తథా చకార తం హోవాచ యద్దోషా లవణముదకేఽవాథా అంగ తదాహరేతి తద్ధావ మృశ్య న వివేద. 1**

**యథా విలీన మేవాఙ్గాస్యాన్తాదాచమేతి కథమితి లవణ మితి మధ్యాదాచామేతి కథమితి లవణమిత్యన్తాదాచా మేతి కథమితి లవణ మిత్యభిప్రాస్యైతదథ మోపసీదథా ఇతి తద్ధ తథా చకార తచ్ఛశ్వత్సంవర్తతే తం హోవాచాత్ర వావ కిల సత్సోమ్య న నిభాలయసేఽత్రైవ కిలేతి. 2**

**స య ఏషోఽణిమైత దాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3**

లవణాన్ని దృష్టాంతంగా చేసి సత్యాత్మను నిర్దేశిస్తున్నారు.

ఉద్దాలకుడు కుమారునితో ఇట్లా అన్నాడు – 'నాయనా! శ్వేతకేతూ! ఈ ఉప్పుముద్దను నీటిలో వేసి రేపు ఉదయం నా వద్దకు తీసికొని రా!'

సత్యజిజ్ఞాసువైన శ్వేతకేతువు తండ్రి చెప్పినట్లే చేసి మరునాడు ఉదయం తండ్రి వద్దకు వచ్చాడు.

అప్పుడు తండ్రి యిట్లా అన్నాడు – 'వత్సా! రాత్రి నీవు లవణాన్ని నీటిలో వేశావు గదా! దానిని తీసికొని రా!'

శ్వేతకేతువు నీటిలో ఉప్పుముద్ద కోసం వెతికాడు. కాని నీటిలో ఉప్పుముద్ద కనిపించలేదు.

తండ్రియైన ఆరుణి అన్నాడు – 'నాయనా! ఆ ఉప్పుముద్ద నీటిలో కలిసిపోయింది. అందుచేత కనిపించటంలేదు. సరే! ఆ నీటిని పై భాగంలో కొద్దిగా తీసుకొని ఆచమించు!'

శ్వేతకేతువు అట్లాగే ఆచమించి చూచాడు.

ఆరుణి : ఎట్లా ఉన్నాయి?

శ్వేత : ఉప్పగా ఉన్నాయి.

ఆరుణి : 'ఆ నీటి మధ్య భాగం నుండి తీసికొని ఆచమించి చెప్పు. ఎట్లా ఉన్నాయో!'

శ్వేతకేతువు ఆచమించి అన్నాడు – 'ఉప్పగా ఉన్నాయి'.

ఆరుణి : ఆ నీటి అడుగు భాగం నుండి తీసికొని ఆచమించి చెప్పు. ఎట్లా ఉన్నాయో!

శ్వేతకేతువు ఆచమించి అన్నాడు – 'ఉప్పగా ఉన్నాయి'.

ఆరుణి : అయితే, ఆ నీటిని పారబోసి, నా వద్దకు రా!

శ్వేతకేతువు ఆ నీరు పారబోసి తండ్రి వద్దకు వచ్చాడు. వచ్చి తండ్రితో అన్నాడు – 'ఆ జలంలో లవణం అంతటా ఉంది. ఉప్పుముద్దను రాత్రి అందులో వేశాం గదా!'

అప్పుడు ఆరుణి అన్నాడు – 'ప్రియదర్శనుడా! అవును. అట్లాగే ఈ సత్యం కూడా యధార్థంగా ఇక్కడే ఉంది. నీవు దానిని (సత్తును) చూడలేకపోయినా అది యిక్కడ ఉండనే ఉంది. నీటిలో లవణం నీకు కనబడకపోయినా నీటిలో సర్వత్రా వ్యాప్తమై ఉన్నట్లుగా ఆ సత్యాత్మ కూడా అంతటా వ్యాప్తమై ఉంది. అయితే, నీటిలో ఉన్న లవణాన్ని నీవు రసనేంద్రియంతో (నాలుకతో) అనుభవించావు – తెలుసుకున్నావు. అట్లాగే సర్వత్రా వ్యాప్తమై ఉన్న ఈ సత్యాత్మను – సూక్ష్మ తత్వాన్ని వేరొక ఉపాయం ద్వారా తెలుసుకోవాల్సిందే! అనుభవించాల్సిందే! నాయనా? అదే సత్యం! అదే ఆత్మ! అదే నీవు కూడా!'

ఇది విని శ్వేతకేతువు మళ్ళీ అన్నాడు – 'స్వామీ! నాకు మరొక దృష్టాంతంతో ఈ తత్వాన్ని బాగా తెలియజేయండి'.

'అట్లాగే' అని ఆరుణి ప్రారంభిస్తున్నాడు.

## పదునాల్గవ ఖండం

**మం॥ యథా సోమ్య పురుషం గంధారేభ్యోఽభినద్ధాక్షమా నీయ తం తతోఽతిజనే విసృజేత్స యథా తత్ర ప్రాఙ్వోదఙ్వాధరాఙ్వా ప్రత్యఙ్వా ప్రధ్మాయీతాభిన ద్ధాక్ష ఆనీతో-భినద్ధాక్షో విసృష్టః 1**

**తస్య యథాభివహనం ప్రముచ్య ప్రబ్రూయాదేతాం దిశం గంధారా ఏతాం దిశం వ్రజేతి స గ్రామా ద్గ్రామం పృచ్ఛన్పండితో మేధావీ గంధా రానేవోప సంపద్యేతైవమేవేహాచార్య వాన్పురుషో వేద తస్య తావ దేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్య ఇతి. 2**

**స య ఏషోఽణిమైతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మాతత్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ.**

ఆరుణి కుమారునితో అంటున్నాడు – "ఎవరో దొంగలు ఒక పురుషుని కండ్లకు గంతలు కట్టి గాంధారదేశం నుండి తీసుకొని వచ్చి అన్యదేశంలో ఎవ్వరూ ప్రజలు లేని నిర్జనస్థానంలో వదలివేశారనుకో! ఆ పురుషుడు కండ్లు తెరచి, దిగ్భ్రాంతి చెందినవాడై తూర్పు, ఉత్తర, దక్షిణ, పశ్చిమ దిక్కులవైపుకు తిరిగి అరుస్తాడు – 'నన్ను కండ్లకు గంతలు కట్టి గాంధారదేశం నుండి దొంగలు తీసికొని వచ్చారు. కండ్లు మూసి ఉండగానే నన్ను ఇక్కడ వదలిపెట్టి పోయారు' అని.

అప్పుడెవరైనా దయాళువు వచ్చి అతని కండ్లకున్న గంతలు తొలగించి గాంధారదేశం ఫలానావైపున ఉన్నదని సూచిస్తాడు. ఆ వైపుకు పొమ్మని చెపుతాడు. అప్పుడా తెలివిగలవాడు ఒక గ్రామంనుండి వేరొక గ్రామానికి జనాన్ని అడుగుతూ చివరకు తన గాంధారదేశం చేరతాడు. అట్లాగే ఈ లోకంలో సదాచార సంపన్నుడు, వివేకవంతుడునైన గురువును పొందినవాడు సత్యాన్ని తెలుసుకోగలుగుతాడు. ప్రారబ్ధ కర్మాన్ని అనుభవించి, ఈ శరీరాన్ని త్యాగం చెయ్యటమే ఆలస్యం. అటువంటి తత్త్వవేత్తకు ముక్తి వెంటనే లభిస్తుంది. తరువాత ఆతడు ఆ సత్య బ్రహ్మను పొందుతాడు – తాదాత్మ్యం చెందుతాడు.

ఆ అణురూపంలో ఉండే ఆ అణుత్వమే ఈ సమస్తమూను. అదే సత్యం, అదే ఆత్మ, శ్వేతకేతూ! అదే నీవూను!'

ఇది విని శ్వేతకేతువు – 'స్వామీ! నాకు ఇంకా ఆ సత్యాన్ని, ఆ సత్య తత్త్వాన్ని విపులంగా చెప్పండి' అని అడిగాడు.

'సరే! అట్లాగే చెపుతాను' అని ఉద్దాలకుడు ప్రారంభిస్తున్నాడు.

## పదునైదవ ఖండం

**మం॥ పురుషం సోమ్యోతోపతాపినం జ్ఞాతయః పర్యుపాసతే జానాసి మాం జానాసి మామితి తస్య యావన్న వాజ్ మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయాం తావజ్జానాతి. 1**

**అథ యదాస్య వాజ్ మనసి సంపద్యతే మనః ప్రాణే ప్రాణస్తేజసి తేజః పరస్యాం దేవతాయామథ న జానాతి. 2**

**స య ఏషోఽణిమైతదాత్మ్యమిదం సర్వం సత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్విజ్ఞాపయత్వితి తథా సోమ్యేతి హోవాచ. 3**

“ఓ ప్రియదర్శనుడా! మరణాసన్నుడైనవాని వద్దకు (చావటానికి సిద్ధంగా ఉన్నవానివద్దకు) అతని బంధువులు, స్నేహితులు, మొదలైనవారు వచ్చి, అతని చుట్టూచేరి నన్ను గుర్తు పట్టావా? నన్ను గుర్తు పట్టావా? వీడు ఎవడు? అని ఇట్లా అడుగుతారు. అతడు గుర్తుపట్టినది లేనిది తెలుసుకుందామని. అంటే గుర్తుపట్టే శక్తి ఉన్నదా? నశించిందా? అనేది తెలుసుకోవాలని. ఎందుచేతనంటే, మరణాసన్నుడైన వాని వాక్కు మనస్సులోను, మనస్సు ప్రాణంలోను, ప్రాణం తేజస్సులోను, తేజస్సు పరదేవతలోను లీనమయ్యేంతవరకు అతడు గుర్తుపట్టగలుగుతాడు.

ఎప్పుడైతే అతని వాక్కు మనస్సులో లీనమైపోయిందో అతని మాట పడిపోయిందన్నమాట. అట్లాగే మనస్సు ప్రాణంలో, ప్రాణం తేజస్సులో (అగ్నిలో) తేజస్సు పరదేవతలోను లీనమైపోతే ఇక అతనికి గుర్తుపట్టే శక్తి ఉండదు. స్పృహ వుండదు. శరీరంలో వేడి ఉండదు. ఇక ఆ శరీరాన్ని ‘శవం’ అంటారు.

కాబట్టి ఈ తేజస్సుకు, ప్రాణానికి, వాక్కుకు శరీరానికి కారణమైనట్టి ఆ సూక్ష్మతత్త్వమే, ఆ పరదేవతయే సమస్తమూను. అదే సత్యం, అదే ఆత్మ, ఓ శ్వేతకేతూ! అదే నీవు.

ఇది విన్న శ్వేతకేతువు మళ్ళీ తండ్రితో అన్నాడు – ‘ఓ భగవానుడా! నాకు ఆ పరతత్త్వాన్ని గూర్చి ఇంకా చెప్పండి’ అని.

‘సరే! అట్లాగే చెపుతాను’ అని ఆరుణి ఇంకా చెపుతున్నాడు.

## పదునారవ ఖండం

మం॥ పురుషం సోమ్యోత హస్తగృహీత మానయన్త్య పహార్షీత్స్తేయమకార్షీ త్పరశు మస్మై తపతేతి
స యది తస్యకర్తా భవతి తత ఏవానృత మాత్మానం కురుతే సోఽ నృతాభిసన్ధోఽ
నృతేనాత్మానమంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స దహ్య తేఽ థ హన్యతే. 1

అథ యది తస్యాకర్తా భవతి తత ఏవ సత్యమాత్మానం కురుతే స సత్యాభిసన్ధః సత్యేనాత్మాన
మంతర్ధాయ పరశుం తప్తం ప్రతిగృహ్ణాతి స వ దహ్య తేఽ థ మిచ్యతే. 2

స యథా తత్ర నాదాహ్యేతైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మాతత్త్వమసి శ్వేతకేతో
ఇతి తద్ధాస్య విజజ్ఞావితి. 3

"ఓ ప్రియదర్శనుడా! దొంగతనం చేశాడనే అనుమానంతో ఒకనిని చేతులు కట్టి రాజపురుషులు తీసికొని వచ్చారు. అతనితో రాజభటులు 'నీవు ఈతని సొమ్ము దొంగిలించావు. దొంగతనం చేశావు అన్నారు. కాని అతడు దొంగతనం చేశానని అంగీకరించలేదు. న్యాయాధిపతి అడిగినప్పటికీ తాను దొంగతనం చేయలేదని చెప్పి తాను చేసిన దొంగతనాన్ని దాచటానికే యత్నించాడు. అప్పుడు న్యాయాధిపతి 'ఈతని కోసం ఒక గొడ్డలిని నిప్పులో బాగా కాల్చండి' అని ఆజ్ఞాపించాడు. అతడు నిజంగా దొంగతనం చేసి కూడా తన అబద్ధాన్ని కప్పిపుచ్చుకుంటున్నాడు. అతడు తన అసత్యాన్ని కప్పిపుచ్చుకోవటానికే నిశ్చయించుకొని ఆ కాలిన గొడ్డలిని పట్టుకున్నాడు. అంటే మోహవశుడై, మిథ్యావాదియై, మిథ్యాభినివేశం కలవాడై గొడ్డలిని పట్టుకోవటంవల్ల శరీరం కాలుతుంది. రాజపురుషులాతనిని వధిస్తారు.

అతడు నిజంగా దొంగతనం చేయనివాడైతే ఆ పరీక్షలో అతడు తన నిర్దోషిత్వాన్ని, సత్యాన్ని రుజువు చేసుకొనేవాడే! సత్యాగ్రహి అయినవాడైతే ఆ సత్పురుషుడు సత్యంతో తనను ఆచ్ఛాదించుకుని ఆ కాలిన గొడ్డలిని పట్టుకొనేవాడు. సత్యాచ్ఛాదనం వల్ల అతని శరీరం కాలేది కాదు. అనవసరంగా బంధించిన రాజపురుషులు అతనిని వదిలిపెట్టేవారు.

సత్యాగ్రహియైనవాడు ఆ పరీక్షలో ఎట్లా కాలకుండా ఉంటాడో అట్లాగే తత్త్వజ్ఞాని యైనవాడు ప్రారబ్ధ కర్మ క్షయం అయిన తరువాత విదేహముక్తిని పొందుతాడు. మళ్ళీ తిరిగి పుట్టడు. కాని నామరూపాలలో ఆసక్తిని చూపించే అజ్ఞానియైనవాడు చనిపోయి మళ్ళీ జన్మిస్తాడు! ఇదంతా ఆ సూక్ష్మసారమైన రూపమే! అదే సత్యం! అదే ఆత్మ! ఓ శ్వేతకేతూ! అదే నీవు!" ఈ విధంగా తండ్రిచేత తొమ్మిదిసార్లు (దృష్టాంతాలతో) ఉపదేశం పొంది శ్వేతకేతువు బ్రహ్మ – ఆత్మల యొక్క ఏకత్వాన్ని (ఆత్మ పరమాత్మ ఒకటే అనే విషయాన్ని) తెలుసుకున్నాడు. అతడు నిజంగానే తెలుసుకున్నాడు.

# ఏడవ అధ్యాయం

## మొదటి ఖండం

మం॥నారదుడు గొప్ప మహర్షి అయినప్పటికీ, తన విద్యుక్త ధర్మాలన్నీ ఆచరించినవాడు అయినప్పటికీ, అన్ని విధాలైన జ్ఞానాన్ని సంపాదించినప్పటికీ ఆత్మానుభూతి కలగకపోవటం వల్ల విచారగ్రస్తుడైనాడు. అంటే ఎన్నిరకాలైన గొప్ప గుణాలున్నా, ఎన్ని విషయాలు తెలిసినా, మహోత్కృష్టమైన ఆత్మజ్ఞానం, ఆత్మానుభూతి కలగకపోతే లక్ష్యాన్ని చేరలేడు. ఈ నారద సనత్కుమారుల గాథవల్ల మనకు తెలిసేదేమంటే, ఆత్మజ్ఞానం తప్ప మోక్షాన్ని చేరటానికి వేరొక మార్గం, సాధనం లేదని. కర్మ, భక్తి మొదలైన ఇతర విషయాలకు సంబంధించిన జ్ఞానం ఎంత ఉన్నా నారదుడు ఆ గమ్యాన్ని చేరుకోలేకపోయాడు. కాబట్టి, అధ్యయనం, సదాచారం, ధర్మానుష్ఠానం మొదలైన శిక్షణలన్నీ పొందికూడా అంతకంటే ఉన్నతమైన దానిని తెలుసుకోవటం కోసం, జీవిత లక్ష్యాన్ని పొందటం కోసం నారదుడు సనత్కుమారుని వద్దకు శిష్యభావంతో వచ్చాడు.

**మం॥ ఓం అధీహి భగవ ఇతి హోపససాద సనత్కుమారం నారదస్తం హోవాచ యద్వేత్థ తేన మోపసీద తతస్త ఊర్ధ్వం వక్ష్యామితి స హోవాచ. 1**

**ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యంరాశి దైవం నిధిం వాకో వాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూత విద్యాం క్షత్త్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవజన విద్యామేతద్భగవోఽధ్యేమి. 2**

**సోఽహం భగవో మంత్రవిదేవాస్మి నాత్మవిచ్ఛ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్యస్తరతి శోకమాత్మవిదితి సోఽహం భగవః శోచామి తం మా భగవాన్ఛోకస్య పారం తారయత్వితితం హోవాచ యద్వైకిం చైతదధ్య, గీష్ఠా నామైవైతత్. 3**

**నామ వా ఋగ్వేదో యజుర్వేదః సామవేద అథర్వణ శ్చతుర్థ ఇతిహాసపురాణః పంచమో వేదానాం వేదః ప్రిత్ర్యో రాశిర్దైవో నిధిర్వాకోవాక్య మేకాయనం దేవ విద్యా బ్రహ్మవిద్యా భూతవిద్యాక్షత్త్రవిద్యా నక్షత్ర విద్యా సర్పదేవ జనవిద్యా నామైవైతన్నామో పాస్స్వేతి. 4**

**స యో నామ బ్రహ్మేత్యుపాస్తే యావన్నామ్నో గతం తత్రాస్య యథా కామచారో భవతి యో నామ బ్రహ్మేత్యుపాస్తేఽస్తిభగవో నామ్నో భూయ ఇతి నామ్నో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీ త్వితి. 5**

నారదుడు శిష్యభావంతో బ్రహ్మనిష్ఠుడు, యోగీశ్వరుడు అయిన సనత్కుమారుని వద్దకు వచ్చి ఈ విధంగా అంటున్నాడు – “ఓ పూజనీయుడా! నాకు ఉపదేశం చేయండి’ అని.

నియమపూర్వకంగా తన వద్దకు వచ్చి ఈ విధంగా అర్థించిన నారదునితో సనత్కుమారుడీ విధంగా అన్నాడు –

"నారదా! నీవు ఉపదేశం చేయమని అంటే నా వద్దకు వచ్చావు. నీకు ఎంతవరకు ఏమేమి తెలుసునో చెపితే, ఆ తరువాతి విషయం నీకు నేను చెపుతాను". ఇది విని నారదుడీ విధంగా చెప్పాడు –

"దేవా! నేను ఋగ్వేదాన్ని, యజుర్వేదాన్ని అధ్యయనం చేశాను. సామవేదాన్ని నాల్గవ వేదమైన అధర్వణవేదాన్ని అభ్యసించాను. ఇంతే కాక, ఇతిహాస పురాణరూపమైనట్టి పంచమ వేదాన్ని (భారతాన్ని) వేదాలకు వేదం వంటిదైన వ్యాకరణాన్ని, శ్రాద్ధకల్పము, గణితము, ప్రకృతి విపర్యయ శాస్త్రము, మహాకల అనే గ్రంథం లాంటి గ్రంథాలలో ఉన్న లోహశాస్త్రాన్ని (నిధి శాస్త్రం) తర్కాన్ని, నీతిశాస్త్రాన్ని, నిరుక్తము, శిక్షాకల్పం, ఛందస్సు, వేదార్థరూపమైన బ్రహ్మవిద్యను, భూతశాస్త్రం, ధనుర్వేదం, జ్యోతిషం, గారుడవిద్య (సర్పశాస్త్రం) నృత్య సంగీతాది కళలు ఇవన్నీ నేను చదివాను, నేర్చుకున్నాను.

ఓ పూజనీయుడా! ఇవన్నీ చదివినా, కేవలం శబ్దార్థం మాత్రమే తెలిసింది కాని ఆత్మను మాత్రం (పరమార్థాన్ని మాత్రం) తెలుసుకోలేకపోయాను. ఆత్మజ్ఞానియైనవాడు సమస్త దుఃఖాలను తరిస్తాడని తమలాంటి పూజనీయులైన వారిద్వారా విన్నాను. నేను దుఃఖాభాగుణ్ణి! శోకగ్రస్తుడనైన నన్ను తరింపజేయండి. నాకు అభయప్రాప్తిని కలిగించండి.' ఈ విధంగా చెప్పిన నారదుని ప్రార్థనను విని సనత్కుమారుడన్నాడు –

"ఇంతవరకు నీవు తెలుసుకున్నదంతా నామమాత్రమైనదే! ఎందుచేతనంటే, నీవు చదివానని చెప్పుకొన్న ఈ వేదశాస్త్రాలన్నింటికి పేరు ఉంది. ఋగ్వేదమనేది ఒకపేరు. అట్లాగే మిగతా వేదశాస్త్ర పురాణాదులన్నీ నామాలే! పేర్లే! వ్యాకరణం. శ్రాద్ధకల్పం, ప్రకృతి విపర్యయ శాస్త్రం, ఖనిశాస్త్రం, తర్కం, నీతిశాస్త్రం, నిరుక్తం, వేదార్థ విద్య, భూతవిద్య, ధనుర్వేదం, జ్యోతిషం, సర్పశాస్త్రం, సంగీతం, కళలు శిల్పశాస్త్రం ఇవన్నీ పేర్లేగదా! కాబట్టి, నీవు ఒక ప్రతిమలో విష్ణుబుద్ధిని స్థాపించుకొని (ఒక విగ్రహాన్ని విష్ణువుగా భావించుకొని) ఉపాసించినట్లే వీటి అన్నింటికి సామాన్యంగా ఉన్న నామాన్ని పరబ్రహ్మమనే బుద్ధితో ఉపాసించు.

నామాన్ని పరమాత్మగా భావించి ఉపాసించేవాడు నామమనేది వ్యాప్తమై ఉన్నంతమేర (అన్నిలోకాల్లోను, ఈ విశ్వమంతటా పేరు అనేది ఉన్నది కాబట్టి ఈ విశ్వమంతటా అని భావం) స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. ఇతర లోకాల్లో కూడా దేవజాతుల పేర్లు, దేవతల పేర్లు ఉన్నాయి. విశ్వంలో ఉన్న గ్రహతారకాదులన్నింటికి పేర్లు ఉన్నాయి. కాబట్టి విశ్వమంతటా ఆ

ఉపాసకుడు స్వేచ్ఛగా చరించగలుగుతాడు" అని ఈ విధంగా సనత్కుమారుడు చెప్పినది విని నారదుడు అన్నాడు – "స్వామీ! నామాన్ని మించినది కూడా ఏమైనా ఉన్నదా?"

సనత్కుమారుడు – 'ఉన్నది'.

నారదుడు – 'దేవా! నాకు దానిని ఉపదేశించండి.'

## రెండవ ఖండం

**మం॥ వాగ్వావ నామ్నో భూయసీ వాగ్వా ఋగ్వేదం విజ్ఞాపయతి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదం ప్రిత్యం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవజన విద్యాం దివం చ పృథివీం చ వాయుం చాకాశం చాపశ్చ తేజశ్చ దేవాంశ్చ మనుష్యాంశ్చ పశూంశ్చ వయాంసి చ తృణవనస్పతీంచ శ్వాపదాన్యాకీట పతంగ పిపీలికం ధర్మం చాధర్మం చ సత్యం చానృతం చ సాధు చాసాధు చ హృదయజ్ఞం చాహృద యజ్ఞం చ యద్వై వాజ్నాభవిష్యన్న ధర్మో నాధర్మో వ్యజ్ఞాపయిష్యన్న సత్యం నానృతం న సాధు నాసాధు న హృదయజ్ఞో నా హృదయజ్ఞో.. వాగేవైత త్సర్వం విజ్ఞాపయతి వాచము పాస్స్వేతి. 1**

**స యో వాచం బ్రహ్మేత్యుపాస్తే యావద్వాచో గతం తత్రాస్య యథా కామచారో భవతి యో వాచం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో వాచో భూయ ఇతి వాచో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

సనత్కుమారుడిలా అంటున్నాడు – "నిజానికి వాక్కు అనేది (వాణి) నామం కంటె కూడా గొప్పది. కంఠం మొదలైన వర్ణోత్పత్తి, వర్ణాభివ్యంజక స్థానాలు ఎనిమిదింటిని కలిపి ఒకే ఇంద్రియంగా, (వాణిగా) వ్యవహరిస్తారు. (రొమ్ము, గొంతు, శిరస్సు, నాలుక మొదటి భాగం, దంతాలు, ముక్కు రంధ్రాలు, పెదవులు, అంగిలి ఈ ఎనిమిది వాక్కు పుట్టటానికి తోడ్పడే స్థానాలు) వర్ణాన్ని కూడా నామమనే అంటారు. అక్షరాలకు కూడా పేర్లు ఉన్నాయి. అనేక రకాలైన వర్ణాలకు వివిధ నామాలున్నాయి. కాని వీటి అన్నింటిలోను ఉన్న వాణి మాత్రం ఒకటే! వాణి అంటే స్థూలంగా 'వాగింద్రియం నుండి వచ్చే స్వరం' అనుకోవచ్చు. ఈ వాణి అనేది 'ఋగ్వేదం' అనే పేరును (నామాన్ని) తెలియజేస్తోంది. యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం, ఇతిహాస పురాణాత్మకమైన పంచమవేదం (మహాభారతం) వేదాలకు వేదంలాంటిదైన వ్యాకరణం, శ్రాద్ధకల్పం, గణితం, ప్రకృతివైపరీత్య శాస్త్రం, ఖని శాస్త్రం, తర్క శాస్త్రం, నీతి శాస్త్రం, నిరుక్తం, వేదవిద్య, భూతవిద్య, ధనుర్విద్య, జ్యోతిషం, గారుడం, సంగీత శాస్త్రం, ద్యులోకం, పృథివి, వాయువు,

ఆకాశం, జలం, తేజస్సు, దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, తృణాలు, చెట్లు చేమలు, క్రూర జంతువులు, కీటకాలు, పురుగులు, పిపీలికా పర్యంతం గల ప్రాణులు. ధర్మం, అధర్మం, సత్యం, అసత్యం, మంచి, చెడు, తప్పు, ఒప్పు, అందము, వికారము ఇవన్నీ కూడా వాణికి విషయాలే! అంటే వాణి ద్వారా వ్యక్తమయ్యే నామాలే! వాణి అనేది లేకపోతే ఈ ధర్మాధర్మాలకు, సత్యాసత్యాలకు సంబంధించిన జ్ఞానమే కలగదు. మంచి చెడులు, రూపం కురూపం అనే జ్ఞానం కలగదు. శబ్దోచ్చారణ ద్వారా వాక్కు అనేది వీటన్నింటిని వ్యక్తం చేస్తోంది. కాబట్టి నామం కంటె కూడా వాణి అనేది శ్రేష్ఠమైనది. అందుచేత నీవు ఈ వాక్కును బ్రహ్మగా భావించి ఉపాసించు.

ఈ 'వాక్కే బ్రహ్మ' అని భావించి ఉపాసించే ఉపాసకునికి వాక్కు వ్యాప్తమై ఉన్నంతమేర, అంటే శబ్దం, లేక స్వరం వ్యాప్తమై ఉన్నంతమేర స్వేచ్ఛగా సంచరించే అవకాశం కలుగుతుంది' ఇది విని నారదుడు మళ్ళీ అడిగాడు – 'దేవా! ఈ వాక్కు కంటే శ్రేష్ఠమైనది ఏదైనా ఉందా?' అని.

సనత్కుమారుదన్నాడు – 'ఉన్నది. వాక్కుకు మించినది కూడా ఉంది'.

నారదుడు – 'స్వామీ! నాకు దానిని గురించి బోధించండి'.

## మూడవ ఖండం

**మం॥ మనో వావ వాచో భూయో యథా వై ద్వె వామ లకే ద్వే వా కోలే ద్వౌ వాక్షౌ మష్టిరను భవత్యేవం వాచం చ నామ చ మనోఽనుభవతి స యదా మనసా మనస్యతి మన్త్రానధీయా యేత్యథాధీతే కర్మాణి కుర్వీయేత్యథ కురుతే పుత్రాంశ్చ పశూంశ్చేశ్ఛే యేత్యథేచ్ఛత ఇమం చ లోకమముం చేచ్ఛేయేత్య థే చ్ఛతే మనోహ్యాత్మా మనో హి లోకో మనో హి బ్రహ్మ మన ఉపాస్స్వేతి. 1**

**స యో మనో బ్రహ్మేత్యుపాస్తే యావన్మనసో గతం తత్రాస్య యథా కామచారో భవతి యోమనో బ్రహ్మే త్యుపాస్తేఽస్తి భగవో మనసో భూయ ఇతి మనసో వావ భూయోఽ స్తీతి తన్మే భగాన్బ్రవీ త్వితి. 2**

సనత్కుమారుడు చెపుతున్నాడు – "వాక్కు కంటె కూడా నిజానికి మనస్సు శ్రేష్ఠమైనది. ఎందుచేతనంటే, మనన వ్యాపారం గల (ఆలోచించటమనే గుణం కలిగిన) మనస్సే వాక్కును మాట్లాడటానికి ప్రోత్సహిస్తుంది. ఎట్లాగంటే, మనం గుప్పిట్లో పట్టుకున్న వస్తువుల్ని 'ఇవి రెండు ఉసిరికాయలని లేదా, ఇవి రెండు రేగుపండ్లని, లేదా ఇవి రెండు రుద్రాక్షలని (ఉసిరి, కరక్కాయ, తాడికాయ అనే త్రిఫలాలు) ముందుగా మనస్సు గ్రహిస్తోంది – అంటే మనస్సు ఆ వస్తువుల నామాన్ని గ్రహిస్తోంది – 'ఆ నామాన్ని పైకి ఉచ్చరించకపోయినా అట్లాగే, మానవుడు తన మనస్సులో ఒక మంత్రాన్ని చదువుదాము అని అనుకున్నప్పుడే ఆ మంత్రాన్ని పైకి చదువుతాడు.

అంటే వానిని మనస్సు ప్రోత్సహించాలన్నమాట. అట్లాగే 'నేను ఈ పని చేయాలని' అనుకున్నప్పుడే కర్మ చేస్తున్నాడు. నేను సంతానాన్ని, పశువుల్ని కోరాలి అని అనుకున్నప్పుడే కోరుతున్నాడు. నేను ఈ లోకాన్ని, పరలోకాన్ని కోరాలి అని అనుకున్నప్పుడే ఇహలోకపరలోకాల్ని కోరుతున్నాడు. అంటే వాక్కుకు, కర్మకు కూడా మనస్సే ప్రేరకం. కాబట్టి మనస్సే ఆత్మ. అదే లోకం, మనస్సే బ్రహ్మ. అందుచేత మనస్సునే ఉపాసించు.

మనస్సును 'ఇదే బ్రహ్మ' అని తలచి ఉపాసించేవాడు మనస్సు పోగలిగినంత మేర స్వేచ్ఛగా విహరించగలుగుతాడు".

ఇది విని నారదుడన్నాడు – "స్వామీ! ఈ మనస్సు కంటె శ్రేష్ఠమైనది ఏదైనా ఉన్నదా?" అని.

'అవును. ఉన్నది' అన్నాడు సనత్కుమారుడు.

'అయితే దేవా! నాకు దానిని బోధించండి' అని అడిగాడు నారదుడు.

నాల్గవ ఖండం

**మం॥ సంకల్పో వావ మనసో భూయన్యదా వై సంకల్ప యతేऽథ మనస్యత్యథ వాచమీరయతి తాము నామ్నీరయతి నామ్ని మంత్రా ఏకం భవన్తి మంత్రేషు కార్మాణి. 1**

**తాని హ వా ఏతాని సంకల్పైకాయనాని సంకల్పాత్మ కాని సంకల్పే ప్రతిష్ఠితాని సమక్లృపతాం ద్యావా పృథివీ సమకల్పేతాం వాయుశ్చాకాశం చ సమకల్పన్తా పశ్చ తేజశ్చ తేషాం సంక్లృప్త్యై వర్షం సంకల్పతే వర్షస్య సంక్లృప్త్యా అన్నం సంకల్పతేऽ న్నస్య సంక్లృప్త్యై ప్రాణాః సంకల్పన్తే ప్రాణానాం సంక్లృప్త్యై మంత్రాః సంకల్పన్తే మంత్రాణాం సంక్లృప్త్యైకర్మాణి సంకల్పన్తే కర్మణాం సంక్లృప్త్యై లోకః సంకల్పతే లోకస్య సంక్లృప్త్యై సర్వం సంకల్పతే స ఏవ సంకల్పః సంకల్పముపాస్స్వేతి. 2**

**స యః సంకల్పం బ్రహ్మేత్యుపాస్తే క్లృప్తాన్వైస లోకాన్ధ్రువాన్ ధ్రువః ప్రతిష్ఠితాన్ప్రతిష్ఠితోऽ వ్యథ మానానవ్యథమానోऽ భిసిధ్యతి యావత్సం కల్పస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యః సంకల్పః బ్రహ్మేత్యు పాస్తేऽ స్తి భగవః సంకల్పా ద్భూయ ఇతి సంకల్పాద్వావ భూయోऽ స్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 3**

సనత్కుమారుడు ఈ విధంగా చెపుతున్నాడు – "సంకల్పం అనేది మనస్సు కంటె శ్రేష్ఠమైనది. కర్తవ్యా కర్తవ్యాలను చక్కగా విమర్శనాత్మకంగా విశ్లేషించి నిర్ణయించుకొన్నట్టి నిశ్చయాత్మకమైన బుద్ధినే సంకల్పం అంటారు. అంటే, ఒక పనిని చేయవచ్చునా చేయరాదా అని బాగా విమర్శించుకొని

ఒక నిర్ణయానికి వస్తాం. అట్లా ఒక నిశ్చయానికి వచ్చిన బుద్ధిని సంకల్పం అంటాం. ఈ నిశ్చయాత్మకమైన బుద్ధి ఉన్నప్పుడే (సంకల్పం ఉన్నప్పుడే) మనస్సు ఆలోచిస్తుంది. తరువాత, ఆ మనస్సే వాక్కును మాట్లాడటానికి ప్రేరేపిస్తుంది. అది నామం వైపుకు ప్రవృత్తం చేస్తుంది. నామంలో అన్ని మంత్రాలు ఏకీభావం చెందుతాయి. మంత్రాలన్నీ నామమే! మంత్రంలో కర్మలన్నీ ఏకీభావం చెందుతాయి. అంటే, సంకల్పం లేకుండా మనస్సు, మనస్సు లేకుండా వాక్కు, వాక్కు లేకుండా నామం, నామం లేకుండా మంత్రాలు, మంత్రాలు లేకుండా కర్మలు ఉండవు. ఇవన్నీ ఒకదానిలో ఒకటి అంతర్భావం చెందుతాయి.

ఈ మనస్సు మొదలైనవన్నీ సంకల్పంలో లయాన్ని పొందుతాయి. అంటే, పైన చెప్పిన మనస్సు, వాక్కు, నామం, మంత్రం, కర్మ వీటి అన్నింటికి లయస్థానం – లీనమయ్యే చోటు – సంకల్పమన్నమాట. ఇవన్నీ ఉత్పత్తి సమయంలో సంకల్పంతో కూడి ఉంటాయి. స్థితి సమయంలో కూడా సంకల్పాన్ని ఆశ్రయించే ఉంటాయి. లయమయ్యేటప్పుడు సంకల్పంలోనే లయమౌతాయి. ద్యులోకం, పృథివి ఈ రెండూ సంకల్పం చేశాయి. వాయువు ఆకాశం ఈ రెండూ సంకల్పం చేశాయి. అంటే, ఇవన్నీ వాటి స్వభావంలో నిశ్చలంగా ఉన్నట్లు ఉంటాయి. అట్లా ఉండాలని సంకల్పించుకొని ఆవిధంగా ఉన్నట్లు జలము తేజస్సు సంకల్పం చేశాయి. వాటి సంకల్పం వల్ల వర్షం సిద్ధించింది. అంటే, ద్యులోకాదుల యొక్క సామర్థ్యం వల్ల వర్షం కలుగుతోంది. వర్షం వాటి సంకల్పానికి ఫలం. అట్లాగే వర్ష యొక్క సంకల్పానికి అన్నం కలుగుతోంది. అన్నం యొక్క సంకల్పం వల్ల ప్రాణం సమర్థవంతమౌతోంది. అంటే అన్నాన్ని ఆశ్రయించి ప్రాణం ఉంటోంది. ప్రాణాల యొక్క సంకల్పాన్ని ఆశ్రయించి మంత్రాలు ఉన్నాయి – బలవంతుడైన వాడే మంత్రాలు పఠించగలుగుతాడు. మంత్రాల యొక్క సంకల్పాన్ని కర్మలు అనుసరిస్తున్నాయి. అంటే కామ్యకర్మల జ్ఞానం మనకు మంత్రాల వల్లనే కలుగుతోంది. కర్మల యొక్క సంకల్పాన్ని బట్టి లోకాలు సిద్ధిస్తున్నాయి. లోకాల యొక్క సంకల్పం వల్ల ఈ జగత్తంతా సమర్థమౌతోంది. అంటే ఈ జగత్తు అంతా సంకల్పమూలకమన్నమాట. అందుచేత నీవు ఈ జగత్కారణమైన సంకల్పాన్ని (నిశ్చయాత్మక బుద్ధిని) ఉపాసించు.

'ఇదే బ్రహ్మ' అంటే సంకల్పమే బ్రహ్మ అని సంకల్పాన్ని ఉపాసించేవారు భగవంతుని చేత సంకల్పింపబడిన లోకాల్ని పొందుతారు. విధాత ద్వారా సంకల్పింపబడిన నిత్యలోకాలలో తాను (ఉపాసకుడు నిత్యుడై, ప్రతిష్ఠిత లోకాలలో తాను ప్రతిష్ఠితుడై, దుఃఖాలు లేనివాడై శత్రుభయం లేనివాడై దుఃఖం లేని, భయం లేని, లోకాలను పొందుతాడు. సంకల్పానికి ఎంతవరకు వ్యాప్తి ఉంటుందో అంతపర్యంతం అతడు స్వేచ్ఛగా సంచరిస్తాడు. ఎవరు? ఈ సంకల్పాన్నే బ్రహ్మగా ఉపాసించేవాడు.

ఇదంతా విని, నారదుడు అడిగాడు – 'దేవా! సంకల్పం కంటె కూడా శ్రేష్ఠమైనది ఏదైనా ఉన్నదా?' అని.

"అవును ఉన్నది!" అన్నాడు సనత్కుమారుడు.

'అయితే స్వామీ! నాకు దానిని బోధించండి' అని అడిగాడు నారదుడు.

## ఐదవ ఖండం

**మం॥ చిత్తం వావ సంకల్పాద్భూయో యదా వై చేత యతేஉథ సంకల్పయతేஉథ మనస్యత్యథ వాచమీర యతి తాము నామ్నీరయతి నామ్ని మంత్రా ఏకం భవన్తి మంత్రేషు కర్మాణి. 1**

**తాని హ వా ఏతాని చిత్తైకాయనాని చిత్తాత్మాని చిత్తే ప్రతిష్ఠితాని తస్మాద్యద్యపి బహువిదచిత్తో భవతి నాయమస్తీత్యేవైన మాహుర్యదయం వేద యద్వా అయం విద్వాన్నేత్థమచిత్తః స్యాదిత్యథ యద్యల్ప విచ్చిత్తవాన్భవతి తస్మా ఏవోత శుశ్రూషన్తే చిత్తం హ్యేవైషామేకాయనం చిత్తమాత్మా చిత్తం ప్రతిష్ఠా చిత్తముపాస్స్వేతి. 2**

**స యశ్చిత్తం బ్రహ్మేత్యుపాస్తే చిత్తాన్వైస లోకాన్ ధ్రువాన్ ధ్రువః ప్రతిష్ఠి తాన్ప్రతిష్ఠితోஉ వ్యథమానా నవ్యథమానోஉభిసిధ్యతి యావచ్చి త్తస్య గతంతత్రాస్య యథాకామచారో భవతి యశ్చిత్తం బ్రహ్మేత్యు పాస్తేஉస్తి భగవశ్చిత్తాద్భూయ ఇతి చిత్తాద్వావ భూయోஉ స్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 3**

సంకల్పం కంటె కూడా చిత్తం శ్రేష్ఠమైనది. విచక్షణా జ్ఞానం లేదా తెలివినే చిత్తం అనవచ్చు. పురుషుడు చింతనాయుక్తుడైనప్పుడే అంటే నిశ్చయాత్మకమైన తెలివిని పొందినప్పుడే భూత భవిష్యద్విషయాల యొక్క ప్రయోజనాన్ని గూర్చి సమర్థవంతమైన సంకల్పం చేయగలుగుతాడు. అంటే మంచి చిత్తం ఉన్నప్పుడే సంకల్పం చేయగలుగుతాడు. తరువాత మననం చేస్తాడు. తరువాత ఆ మననం చేసిన మనస్సుతోనే మాట్లాడటానికి వాక్కును ప్రేరేపిస్తాడు. ఆ వాక్కులో నామాన్ని చేరుస్తాడు. ఆ నామంలోనే మంత్రాలు ఏకీభావం చెందుతాయి. మంత్రాలలో కర్మలు ఉంటున్నాయి.

ఇవన్నీ, అంటే సంకల్పం మొదలు కర్మ వరకు అన్నీ కూడా చిత్తాన్నే లయస్థానంగా కలిగి ఉన్నాయి. అంటే ఇవన్నీ చిత్తంలోనే ఉత్పన్నమై చిత్తంలోనే ఉంటూ ఉంటాయి. అందుచేతనే ఒకడు శాస్త్రాలు చదివి, శాస్త్రజ్ఞానం బాగా సంపాదించినా అతనికి విచక్షణతో కూడిన చిత్తం గనక సరిగా లేకపోతే అతనిని మూర్ఖుడని, ఏమీ తెలియనివాడని, అతడు తెలివిగలవాడైతే ఇట్లా మూర్ఖుడుగా ఉండడని అంటూంటారు. ఒకడు పెద్దగా చదువుకోనివాడైనా, చింతన శీలుడైతే అతడు చెప్పింది

వినటానికి అంతా ఇష్టపడతారు. కాబట్టి చిత్తమనేదే వీటి అన్నింటికి ఆధారం. చిత్తమే ఆత్మ. ఆ చిత్తమే అన్నిటికి ప్రతిష్ఠ – ఆశ్రయం. అందుచేత, ఓ నారదుడా! నీవు చిత్తాన్ని ఉపాసించు.

'ఇదే బ్రహ్మ' (చిత్తమే బ్రహ్మ) అని ఉపాసన చేసేవాడు. చింతనశీలుడై, చిత్తం కలవాడై బుద్ధితో కూడిన ధృవలోకాన్ని (నిత్యలోకాల్ని) తానే నిత్యుడై పొందుతాడు. తాను సువ్యవస్థితుడై సుప్రతిష్ఠితమైన లోకాన్ని పొందుతాడు. తాను శోకహీనుడై శోకరహితమైన లోకాల్ని పొందుతాడు. ఈ చిత్తోపాసకుడు, చిత్తానికి వ్యాప్తి ఉన్నంతవరకు తాను జ్ఞానవంతుడై స్వేచ్ఛగా చరించగలుగుతాడు'.

సనత్కుమారుడు చేసిన ఈ ఉపదేశం విని, నారదుడన్నాడు – 'స్వామీ! ఈ చిత్తం కంటే శ్రేష్ఠమైనదేదైనా ఉన్నదా?

'ఉన్నది'.

"అయితే, స్వామీ! నాకు దానిని ఉపదేశించండి".

## ఆరవ ఖండం

**మం॥ ధ్యానం వావ చిత్తాద్భూయో ధ్యాయతీవ పృథివీ ధ్యాయతీవాన్తరిక్షం ధ్యాయతీవ ద్యౌర్ధ్యాయతీవాపో ధ్యాయన్తీవ పర్వతా ధ్యాయన్తీవ దేవమను ష్యాస్త స్మాద్య ఇహ మనుష్యాణాం మహత్తాం ప్రాప్నువంతి ధ్యానాపాదాంశా ఇవైవ తే భవన్త్యథ యే஽ల్పాః కలహినః పిశునా ఉపవాదినస్తే–థ యే ప్రభవో ధ్యానాపాదాంశా ఇవైవ తే భవన్తి ధ్యానముపా స్స్వేతి. 1**

**స యో ధ్యానం బ్రహ్మేత్త్యుపాస్తే యావద్ధ్యానస్య గతం తత్రాస్య యథా కామచారో భవతి యోధ్యానం బ్రహ్మేత్త్యుపాస్తే஽స్తి భగవో ధ్యానాద్భూయ ఇతి ధ్యానాధ్వావ భూయో஽ స్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

చిత్తం కంటె కూడా ధ్యానమనేది శ్రేష్ఠమైనది. ఈ ధ్యానాన్నే మనం ఏకాగ్రత అనవచ్చు. అంటే అచంచలమైన భావప్రవాహం. ఈ భావ ప్రవాహం దేవతా సంబంధమైనదై, నిరంతరమూ సాగితే ఉపాసన అవుతుంది.

ఈ ఏకాగ్రత లేదా ధ్యానమనేది చిత్తం కంటె శ్రేష్ఠమైనది – బుద్ధి కంటె శ్రేష్ఠమైనదన్నమాట. ఈ పృథివి ధ్యానం చేస్తున్నట్లే ఉంటుంది. అంతరిక్షం కూడా ధ్యానం చేస్తున్నట్లే ఉంటుంది. ద్యులోకం కూడా ధ్యానం చేస్తున్నట్లు ఉంటుంది. ఎందుచేతనంటే, ఇవన్నీ కూడా నిశ్చలంగా ఏకాగ్రతతో ఉన్నట్లు కనిపిస్తాయి. దైవ సమానులైన మానవులు కూడా ధ్యానం చేస్తున్నట్లు ఉంటారు. మానవుల్లో గొప్పవారంతా ధ్యానం చేస్తున్నట్లు, ఆ ధ్యానం వల్ల కొంత ప్రయోజనాన్ని

పొందుతున్నట్లు కనిపిస్తారు. క్షుద్రులు, కలహస్వభావులు, పరనిందకులు, ఈర్ష్యాళువులు పరుల దోషాల్ని ఎదురుగానే ఎన్నుతూ ఉండేవారు కూడా అంశతః ఈ ధ్యానం వల్ల కొంత ప్రయోజనాన్ని పొందుతున్నారని చెప్పవచ్చు – సజ్జనుల ధ్యానానికి, దుర్జనుల ధ్యానానికి భేదం ఉంటుంది. వారు పొందే ఫలితాలలోనూ తేడా ఉంటుంది. కాబట్టి, ఓ నారదా! నీవు ధ్యానాన్ని ఉపాసించు – అంటే, ఉపాసననే ఉపాసించు' అని భావం.

ధ్యానమే బ్రహ్మ అనే భావంతో ఉపాసన చేయాలి. అట్లా చేసినవాడు, ధ్యానానికి ఎంతవరకు వ్యాప్తి ఉంటుందో అంతవరకు స్వేచ్ఛగా సంచరిస్తాడు. ఎవరు? ఈ ఏకాగ్రతతో కూడిన ధ్యానాన్ని బ్రహ్మనుగా భావించి ఉపాసించేవాడు.'

నారదుడు – "దేవా! ఈ ధ్యానాన్ని మించినది, ఇంతకంటె శ్రేష్ఠమైనది ఏదైనా ఉన్నదా?'

సనత్కుమారుడు – "ఉన్నది".

నారదుడు – "అయితే స్వామీ! నాకు దానిని ఉపదేశించండి".

## ఏడవ ఖండం

**మం॥ విజ్ఞానం వావ ధ్యానాద్భూయో విజ్ఞానేన వా ఋగ్వేదం విజానాతి యజుర్వేదం సామవేద మాథ ర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం, వేదం ప్రిత్యం రాశిం దైవం నిధిం వాకోవాక్యమేకా యనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్ర విద్యాం నక్షత్ర విద్యాం సర్పదేవజనవిద్యాం దివం చ పృథివీం చ వాయుం చాకాశం చాపశ్చ తేజశ్చ దేవాంశ్చ మనుష్యాంశ్చ పశూంశ్చ వయాంసి చ తృణ వనస్పతీంశ్వాపదాన్యాకీట పతంగ పిపీలికం ధర్మం చాధర్మం చసత్యం చానృతం చ సాధు చాసాధు చ హృదయజ్ఞం చాహృదయజ్ఞం చాన్నం చ రసం చేమం చ లోకమముం చ విజ్ఞానేనైవ విజానాతి విజ్ఞాన ముపాస్స్వేతి. 1**

**స యో విజ్ఞానం బ్రహ్మేత్యుపాస్తే విజ్ఞానవతో వై స లోకాన్ జ్ఞానవతోఽభి సిధ్యతి యావద్విజాఽనస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యో విజ్ఞానం బ్రహ్మేత్యు పాస్తేఽస్తి భగవో విజ్ఞానాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

శాస్త్ర విషయకమైన విజ్ఞానం (అవగాహన) ధ్యానం కంటె కూడా గొప్పది. ఈ విజ్ఞానం వల్లనే, ఈ శాస్త్రార్థ విషయకమైన అవగాహన వల్లనే 'ఇది ఋగ్వేదము' అని ప్రమాణ పూర్వకంగా తెలుసుకుంటున్నాము. ఈ విధమైన విజ్ఞానం వల్లనే యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం, ఇతిహాస పురాణరూపమైన పంచమ వేదం (భారతాదులు), శ్రాద్ధకల్పం, గణితం, ప్రకృతి ఉత్పాతాలకు సంబంధించిన శాస్త్రం, ఖనిజశాస్త్రం (లోహ శాస్త్రం), తర్కం, నీతి శాస్త్రం, నిరుక్తం,

బ్రహ్మవిద్య, భూతవిద్య, ధనుర్వేదం, జ్యోతిషం, గారుడవిద్య, శిల్పవిద్య, ద్యులోకం, పృథివి, వాయువు, ఆకాశం, జలం, తేజస్సు, దేవ, మనుష్య, పశు పక్ష్యాదులు, తృణ వనస్పతి శ్వాపద కీటపతంగ పిపీలికాది పర్యంతం సమస్త జీవులు, ధర్మము, అధర్మము, సత్యము, అసత్యము, మంచి చెడు, సంతోషం, దుఃఖం, అన్నం, రసం, ఈలోకం, పరలోకం, ఇవన్నీ ఈ శాస్త్ర విషయకమైన విజ్ఞానం వల్లనే తెలుస్తున్నాయి. కాబట్టి, నారదా! నీవు ఈ విధమైన విజ్ఞానాన్ని ఉపాసించు.

'ఈ విజ్ఞానమే బ్రహ్మ' అని భావించి విజ్ఞానాన్ని ఉపాసించేవాడు విజ్ఞానంతో, జ్ఞానంతో కూడిన లోకాలను పొందుతాడు. విజ్ఞానానికి ఎంతవరకు వ్యాప్తి ఉందో, అంటే విజ్ఞానం ప్రవేశించగలిగినంతమేర ఆ ఉపాసకుడు స్వేచ్ఛగా సంచరించ గలుగుతాడు. ఎవరు? ఆ ఉపాసకుడు!'

నారదుడు – 'స్వామీ! ఇంతకంటె శ్రేష్ఠమైన దేదైనా ఉన్నదా?'

సనత్కుమారుడు – 'అవును ఉన్నది'.

నారదుడు – 'భగవాన్! నాకు దానిని ఉపదేశించండి'.

## ఎనిమిదవ ఖండం

**మం॥ బలం వావ విజ్ఞానాద్భూయోఽపి హ శతం విజ్ఞాన వతామేకో బలవానా కంపయతే స యదా బలీ భవ త్యథోత్థాతా భవత్యు త్తిష్ఠన్పరిచరితా భవతి పరిచర న్నుపసత్తా భవత్యుపసీద్ర ష్టా భవతి శ్రోతా భవతి మంతా భవతి బోద్ధా భవతి కర్తా భవతి విజ్ఞాతా భవతి బలేన వై పృథివీ తిష్ఠతి బలేనాంతరిక్షం బలేన ద్యౌర్బలేన పర్వతా బలేన దేవమనుష్యా బలేన పశ వశ్చ వయాంసి చ తృణ వనస్పతయః శ్వాపదాన్యాకీట పతంగపిపీలికం బలేన లోక స్తిష్ఠతి బలముపాస్స్వేతి. 1**

**స యో బలం బ్రహ్మేత్యుపాస్తే యావద్బలస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యో బలం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవో బలాద్భూయ ఇతి బలాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

సనత్కుమారుడు మళ్ళీ చెపుతున్నాడు –

"నారదా! బలం (శక్తి) అనేది నిజంగా విజ్ఞానం కంటె శ్రేష్ఠమైనది. వందమంది విజ్ఞాన సంపన్నుల్ని ఒక్క బలవంతుడు వణికించేస్తున్నాడు. మానవుడు శక్తి సంపన్నుడైనప్పుడే లేవగలుగుతాడు. అట్లా లేచి తిరగగలిగినప్పుడే గురుజనుల సేవా పరిచర్యలు చేయగలుగుతాడు. వారి పరిచర్య చేసే వారి సన్నిధానంలో ఆసీనుడౌతాడు. గురుజనుల వద్ద కూర్చుండి అన్నీ వింటాడు. వారు చెప్పిన దానిని గురించి ఆలోచిస్తాడు. తెలుసుకుంటాడు. తదనుగుణమైన కర్మ చేస్తాడు. ఇదంతా అవగాహన ఉన్నవానికి బలం కూడా ఉన్నప్పుడే సాధ్యమౌతుంది.

విజ్ఞానవంతుడైనా బలం లేకపోతే, శక్తిహీనుడైతే ఏమీ చేయలేడు. విజ్ఞానంతో పాటు బలం కూడా ఉండాలి. నిజంగా బలం వల్లనే, ఈ భూమి నిలిచి ఉంది. శక్తి (బలం) వల్లనే అంతరిక్షం, ద్యులోకం, పర్వతాలు, దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షుల, తృణాలు, వనస్పతులు, క్రూరమృగాలు, కీటకాలు, పురుగులు, పిపీలికాపర్యంతం సమస్త ప్రాణులు నిలిచి ఉన్నాయి. కాబట్టి ఓ నారదా! నీవు బలాన్ని ఉపాసించు.

ఈ బలమే బ్రహ్మ అని తెలుసుకొని ఉపాసన చేసేవాడు బలానికి వ్యాప్తి ఉన్నంతమేర స్వేచ్ఛగా విహరిస్తాడు.

ఇది విని, నారదుడన్నాడు – "దేవా ఇంతకంటె శ్రేష్ఠమైనదేదైనా ఉన్నదా?"

"ఉన్నది" అన్నాడు సనత్కుమారుడు.

"అయితే స్వామీ! నాకు దానిని గురించి బోధించండి" అని అడిగాడు నారదుడు.

## తొమ్మిదవ ఖండం

**మం॥ అన్నం వావ బలాద్భూయ స్తస్మా ద్యద్యపి దశరాత్రీ ర్నాశ్నీయాద్యద్యు హ జీవేదథవా ద్రష్టా శ్రోతా మంతా బోద్ధా కర్తా విజ్ఞాతా భవత్యథాన్నస్యాయై ద్రష్టా భవతి శ్రోతా భవతి మంతా భవతి బోద్ధా భవతి కర్తా భవతి విజ్ఞాతా భవత్యన్న ముపాస్స్వేతి.** 1

**స యోఽన్నం బ్రహ్మేత్యుపాస్తే-న్నవతో వై స లోకాన్పానవతోఽభిసిధ్యతి యావదన్నస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యోన్నం బ్రహ్మే త్యుపాస్తేఽస్తి భగవోఽన్నాద్భూయ ఇత్యన్నా ద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీ త్వితి.** 2

"ఓ నారదా! బలానికి కారణం అన్నం. అంటే ఆహారం. కాబట్టి బలం కంటె అన్నం శ్రేష్ఠమైనది. ఎవడైనా పదిరోజులపాటు అన్నం తినకుండా ఉండే వాడు శక్తిహీనుడై చూడలేడు, వినలేడు, ఆలోచించలేడు, తెలుసుకోలేడు, పనిచేయలేడు, అవగాహన చేసుకోలేడు అనే విషయం రుజువౌతుంది. భోజనం లేకపోవటం వల్ల ఈ పనులన్నింటికి అతడు అసమర్థుడౌతాడు. మళ్ళీ అన్నం తిన్న తరువాత చూడగలుగుతాడు, వినగలుగుతాడు, ఆలోచించగలుగుతాడు, తెలుసుకోగలుగుతాడు, పనిచేయగలుగుతాడు, విషయాలను అవగాహన చేసుకోగలుగుతాడు, అందుచేత ఓ నారదా! నీవు అన్నాన్ని బ్రహ్మగా తలచి ఉపాసించు.

ఈ విధంగా అన్నాన్ని ఉపాసించినవాడు సమృద్ధిగా అన్నోదకాలతో కూడి ఉన్నట్టి లోకాలను పొందుతాడు. అన్నం ఉన్నంతమేర ఆ ఉపాసకుడు స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. ఇదే – అన్నమే బ్రహ్మ అని ఉపాసిస్తాడు."

ఇది విన్న నారదుడు మళ్ళీ అడిగాడు – "దేవా! అన్నం కంటె శ్రేష్ఠమైనది ఏదైనా ఉన్నదా?" అని.

"ఉన్నది" అన్నాడు సనత్కుమారుడు.

"అయితే స్వామీ! నాకు దానిని బోధించండి" అని అడిగాడు నారదుడు.

## పదవ ఖండం

**మం॥ ఆపో వావాన్నాద్భూయస్త స్మా ద్యదా సువృష్టిర్న భవతి వ్యాదీయన్తే ప్రాణా అన్నం కనీయో భవిష్యతీ త్యథా యదా సువృష్టిర్భవత్యానందినః ప్రాణా భవ న్త్యన్నం బహు భవిష్యతీత్యాప ఏవేమా మూర్తా యేయం పృథివీ యదన్తరిక్షం యద్ద్యౌర్యత్పర్వతా యద్దేవమనుష్యా యత్పశవశ్చ వయాంసి చ తృణవన స్పతయః శ్వాపదాన్యా కీటపతంగపిపీలికమాప ఏవేమా మూర్తా ఆప ఉపాస్స్వేతి. 1**

**సయేఽ షో బ్రహ్మేత్యుపాస్త ఆప్నోతి సర్వాన్కామాం స్తృప్తిమాన్భవతి యావదపాం గతం తత్రాస్య యథా కామచారో భవతి యోఽ పో బ్రహ్మేత్యుపాస్తేఽ స్తి భగవోఽ ద్భ్యో భూయ ఇత్యద్భ్యో వావ భూయోఽ స్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

అన్నానికి కారణమైనందున జలం దానికంటె శ్రేష్ఠమైనది. అంటే అన్నోత్పత్తికి జలం కారణం. నీరు లేకపోతే ఆహార వస్తువులు పండవు. కాబట్టి వర్షాలు లేకపోతే అన్నం లేక ప్రాణులన్నీ అల్లల్లాడిపోతాయి. ఈ సంవత్సరం వర్షం లేదు. పంటలు ఉండవు. అన్నం ఉండదు అని జనం బాధపడతారు గదా? వర్షాలు బాగా కురిస్తే ఈ సంవత్సరం పంటలు బాగుంటాయని, అన్నం సమృద్ధిగా ఉంటుందని సంతోషిస్తారు. ఈ పృథివి రూపంలో ఉండేది నిజానికి జలమే గదా! జలంలో నుండి పృథివి పుట్టిందని గదా శ్రుతి! అట్లాగే, ఈ అంతరిక్షం, ద్యులోకం, పర్వతాలు, దేవతలు, మనుష్యులు, పశువులు, పక్షులు, తృణాలు, వనస్పతులు, వన్యజంతువులు, కీటకాలు, రెక్కల పురుగులు, పిపీలికాది పర్యంతం అన్నీ జలస్వరూపమే! అందుచేత ఓ నారదుడా! నీవు జలాన్ని ఉపాసించు.

'ఈ జలమే బ్రహ్మ' అనే భావంతో ఉపాసించేవాడు తాను కోరిన వస్తువులన్నీ పొంది తృప్తి చెందుతాడు. జలం ఉన్నంతమేర స్వేచ్ఛగా తిరుగుతాడు" ఇది విని నారదుడు మళ్ళీ యిట్లా అన్నాడు –

"స్వామీ! జలం కంటె శ్రేష్ఠమైనది ఉన్నదా?" అని.

"ఉన్నది" అన్నాడు సనత్కుమారుడు.

"అయితే, ఓ భగవానుడా! నాకు దానిని ఉపదేశించండి" అన్నాడు నారదుడు.

పదునొకండవ ఖండం

**మం॥ తేజో వావాద్భ్యో భూయస్తద్వా ఏతద్వాయు మాగృహ్యాకాశమభితపతి తదాహుర్నిశోచతి నితపతి వర్షిష్యతి వా ఇతి తేజ ఏవ తత్పూర్వం దర్శయిత్వా థాపః సృజతే తదేతదూర్ధ్వాభిశ్చ తిరశ్చీభిశ్చ విద్యుద్భిరా హ్రాదాశ్చరన్తి తస్మాదాహుర్విద్యోతతే స్తనయతి వర్షిష్యతి వా ఇతి తేజ ఏవ తత్పూర్వం దర్శ యిత్వాథాపః సృజతే తేజ ఉపాస్స్వేతి. 1**

**స య స్తేజో బ్రహ్మేత్యుపాస్తే తేజస్వీ వై స తేజ స్వతో లోకాన్భాస్వతోఽ సహతతమస్కానభిసిధ్యతి యావత్తేజసో గతం తత్రాస్య యథాకామచారో భవతి యస్తేజో బ్రహ్మేత్యుపాస్తే-స్తి భగవస్తేజసో భూయ ఇతి తేజసో వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

"ఓ నారదా! జలానికి కూడా కారణమైనందున తేజస్సు, జలం కంటె కూడా శ్రేష్ఠమైంది. ఈ తేజస్సు, వాయువును కదలకుండా చేసి ఆ వాయువు సహాయంగా ఆకాశాన్ని అన్ని దిక్కుల నుండి తపింపచేసినప్పుడు ప్రజలు అంటారు – 'ఈ లోకమంతా మండిపోతోంది. ఈ వేడి భరించలేకుండా ఉన్నాము; ఉక్కపోస్తోంది. ఇక వర్షం కురుస్తుంది అని. ఇదంతా వర్షానికి పూర్వం స్థితి. కాబట్టి జలం కంటె ముందే ఈ అగ్ని (తేజస్సు) పుట్టి, పిమ్మట జలాన్ని సృష్టిస్తోందని తెలుస్తోంది. ఈ తేజస్సే ఊర్ధ్వంగాను, అడ్డంగానూ పోయేటటువంటి మెరపులతోపాటు పెద్ద ఉరుములతో శబ్దాలు చేస్తుంది. అప్పుడు ప్రజలంతా మెరుపులు మెరుస్తున్నాయి. మేఘాలు గర్జిస్తున్నాయి. వర్షం తప్పకుండా కురుస్తుంది అని అంటారు. తేజస్సు ముందుగా తన రూపాన్ని ఈ విధంగా చూపించి తరువాత నీటిని వర్షిస్తోంది. అందుచేత, నారదా! నీవు తేజస్సును బ్రహ్మగా ఉపాసించు.

ఈ తేజస్సే బ్రహ్మ అని భావించి ఉపాసించే ఉపాసకుడు తాను తేజస్వియై, తేజస్సంపన్నమైనట్టి లోపల, బయటకూడా చీకటి అనేది లేనట్టి లోకాన్ని పొందుతాడు – తేజస్సునే బ్రహ్మగా ఉపాసించినవాడు." ఇది విని నారదుడు స్వామీ! "ఈ తేజస్సు కంటె శ్రేష్ఠమైన దేదైనా ఉన్నదా?" అని అడిగాడు.

"ఉన్నది" అన్నాడు సనత్కుమారుడు.

"అయితే, ఓ భగవానుడా! నాకు దానిని ఉపదేశించండి" అని అడిగాడు నారదుడు.

## పండ్రెండవ ఖండం

**మం॥ ఆకాశో వాయ తేజసో భూయానాకాశే వై సూర్యా చంద్రమసావుభౌ విద్యున్నక్షత్రాణ్యగ్ని రాకాశేనాహ్వ యత్యాకాశేన శ్రుణోత్యాకాశేన ప్రతిశ్రుణో త్యాకాశే రమత ఆకాశే న రమత ఆకాశే జాయత ఆకాశమభి జాయత ఆకాశముపాస్స్వేతి. 1**

**స య ఆకాశం బ్రహ్యేత్యుపాస్త ఆకాశవతో వై స లోకాన్ప్రకాశవతోఽ,,సంబాధాను రుగాయవతోఽభిసిధ్యతి యావదాకాశస్య గతం తత్రాస్య యథా కామ చారో భవతి య ఆకాశం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవ ఆకాశాద్భూయ ఇత్యాకాశాద్వావ భూయో-స్తీతి తన్మే భగవాన్బ్రవీ త్వితి. 2**

వాయువుతోబాటు తేజస్సుకు కూడా కారణమైనందున, ఆకాశం తేజస్సుకంటె శ్రేష్ఠమైనది. ఆకాశంలోనే సూర్యుడు, చంద్రుడు, మెరపులు, నక్షత్రాలు, అగ్ని ఇవన్నీ ఉన్నాయి. ఆకాశం ఉండటంవల్లనే ఒక వ్యక్తి మరియొక వ్యక్తిని పిలవగలుగుతున్నాడు – ఆకాశం లేకపోతే శబ్దానికి వ్యాప్తియే ఉండదు. అవకాశం (ఆకాశం) ఉండటం వల్లనే ఒకడు ఇంకొకనితో మాట్లాడుతున్నాడు. ఒక వ్యక్తికి, మరొక వ్యక్తికి మధ్యనున్నది ఆకాశం. అట్లాగే నోటిలోను, స్వరపేటికలో, కంఠంలో ఉన్నది ఆకాశం. కాబట్టి ఆకాశం ద్వారానే శ్రవణం చేస్తున్నాడు. ప్రతిశ్రవణం చేస్తున్నాడు – ఒకడు అన్నమాటలు ఇంకొకడు వింటున్నాడు. అంతేకాదు – ఆకాశంలోనే రమిస్తున్నాడు. సంతోషం అనుభవిస్తున్నాడు. ఆకాశంలోనే రమించకుండానూ ఉంటున్నాడు. ఆకాశంలోనే సమస్తమూ పుడుతున్నాయి. ఆకాశం వైపుకే పెరుగుతున్నాయి (జీవులు, వృక్షాదులు పైకి – ఆకాశంలోకి పెరుగుతున్నాయి). అందుచేత, ఓ నారదుడా! నీవు ఆకాశాన్ని ఉపాసించు.

ఈ విధమైన ఆకాశాన్నే బ్రహ్మగా ఉపాసించే ఉపాసకుడు, విశాలమైనట్టి, ప్రకాశంతో కూడినట్టి, దుఃఖం శోకం లేనట్టి విశాలమైన లోకాలను పొందుతాడు. ఆకాశం వ్యాప్తమై ఉన్నంతమేర అతడు స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. ఆకాశమే బ్రహ్మ అని ఉపాసిస్తాడు".

ఇది విని నారదుడు 'స్వామీ! ఇంతకంటె శ్రేష్ఠమైనది ఉన్నదా?' అని అడిగాడు.

'ఉన్నది' అన్నాడు సనత్కుమారుడు.

'అయితే, దేవా! నాకు దానిని ఉపదేశించండి' అన్నాడు నారదుడు.

## పదమూడవ ఖండం

**మం॥ స్మరో వా వాకాశాద్భూయ స్తస్మాద్యద్యపి బహవ ఆసీరన్న స్మరన్తో నైవ తే కంచన శ్రుణుయుర్న మన్వీ రన్న విజానీరన్యదా వావ తే స్మరేయురథ శ్రుణుయు రథ మన్వీరన్నథ విజానీరన్స్మరేణ వై పుత్రాన్విజా నాతి స్మరేణ పశూన్స్మరముపాస్స్వేతి. 1**

**స యః బ్రహ్మేత్యుపాస్తే యావత్స్మరస్య గతం తత్రాస్య యథాకామచారో భవతి యః స్మరం బ్రహ్మేత్యుపాస్తేఽస్తి భగవః స్మరాద్భూయ ఇతి స్మరాద్వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్రవీత్వితి. 2**

స్మరణము అనేది అంతఃకరణ యొక్క ధర్మము. అటువంటి స్మరణ మనేది ఆకాశం కంటె శ్రేష్ఠమైనది. ఈ స్మరణం అనేదానినే స్థూలంగా జ్ఞాపకశక్తి అని అనుకోవచ్చు. ఈ స్మరణశక్తి లేనివారు, చాలామంది ఒకచోట చేరి మాట్లాడుతున్నప్పుడు వినవలసినదానిని వినలేరు. ఆలోచించవలసిన దానిని గురించి ఆలోచించలేరు. తెలుసుకోదగిన దానిని గురించి తెలుసుకోలేరు – స్మరణశక్తి లేనందువల్ల ఎవరు ఏమి చెప్పారో, దేనిని గురించి చెప్పారో తెలియదు. ఒకరు చెప్పిన తరువాత వేరొకరు చెప్పినదానిని అన్వయించుకోలేరు. స్మరణం అనే శక్తి ఉంటే వినవలసిన దానిని వింటారు. ఆలోచించవలసిన దానిని ఆలోచిస్తారు. తెలుసుకోవలసిన దానిని తెలుసుకుంటారు. వీరు నా కుమారులు. ఇవి నా పశువులు అనే స్మరణ ఉండటంవల్లనే తన పుత్రుల్ని పశువుల్ని తెలుసుకుంటున్నాడు, గుర్తిస్తున్నాడు. అందుచేత, ఓ నారదా! నీవు స్మరణను ఉపాసించు.

ఈ స్మరణనే బ్రహ్మగా భావించి ఉపాసించేవాడు స్మరణశక్తి పోగలిగినంత మేర స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు – స్మరణను బ్రహ్మగా ఉపాసించేవాడు. ఇదంతా విని నారదుడు మళ్ళీ అడిగాడు – 'స్వామీ! ఈ స్మరణకంటె శ్రేష్ఠమైనది ఉన్నదా?' అని.

'ఉన్నది' అన్నాడు సనత్కుమారుడు.

'అయితే! నాకు దానిని ఉపదేశించండి' అన్నాడు నారదుడు.

## పదునాల్గవ ఖండం

**మం॥ ఆశా వావ స్మరాద్భూయస్యాశేద్ధో వై స్మరో మంత్రానధీతే కర్మాణి కురుతే పుత్రాంశ్చ పశూంశ్చే చ్ఛత ఇమం చ లోకమముం చేచ్ఛత ఆశాముపా స్స్వేతి. 1**

**స య ఆశాం బ్రహ్మేత్యుపాస్త ఆశయాస్య సర్వే కామాః సమృద్ధ్యన్త్యమోఘా హాస్యాశిషోభవన్తి యావదాశాయా గతం తత్రాస్య యథాకామచారో భవతి య ఆశాం బ్రహ్మేత్యుపాస్తేఽ**

**స్తి భగవ ఆశాయా భూయ ఇత్యాశాయా వావ భూయోఽస్తీతి తన్మే భగవాన్బ్ర వీత్వితి.** **2**

సనత్కుమారుడు అంటున్నాడు – 'అప్రాప్యమైన వస్తువును కోరటమనే దానిని ఆశ ఉంటారు. ఆశ అనేది స్మరణకంటె గొప్పది. ఆశచేతనే స్మరణశక్తి ప్రదీప్తమౌతుంది. అట్లా ఆశచేత ప్రదీప్తమైన స్మరణశక్తితోనే ఋగ్వేదాదుల్లో ఉండే మంత్రాలను చదువుతున్నాడు. ఫలాన్ని అశించే కర్మ చేస్తున్నాడు. ఫలాన్ని ఆశించే పుత్రుల్ని, పశువుల్ని కోరుతున్నాడు. ఆశతో బాగా నిండినవాడై మానవుడు ఈ లోకాన్ని పరలోకాన్ని కోరుతున్నాడు. అంటే, వేదాదులు చదవటం, కర్మలాచరించటం, పుత్రుల్ని, పశువుల్ని పొందటం, పరలోకాల్ని కోరటం అన్నీ ఆశవల్లనే! వీటన్నింటికి కారణం ఆశే! కాబట్టి ఓ నారదా! ఆశను ఉపాసించు.

ఇదే బ్రహ్మ అనే భావంతో ఆశను ఉపాసించేవాని కోరికలన్నీ ఆ ఆశవల్లనే నెరవేరుతాయి. అతని ప్రార్థనలు (కోరికలు) వ్యర్థం కావు. ఆశ వ్యాప్తమై ఉన్నంతమేర ఆ ఉపాసకుడు స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. ఇది విని నారదుడు మళ్ళీ అడిగాడు – 'ఆశ కంటే శ్రేష్ఠమైనది ఉన్నదా?' అని.

'ఉన్నది' అన్నాడు సనత్కుమారుడు.

'అయితే ఓ భగవానుడా! నాకు దానిని బోధించండి' అన్నాడు నారదుడు.

## పదునైదవ ఖండం

**మం॥ ప్రాణో వావ ఆశాయా భూయన్యథా వా అరా నాభౌ సమర్పితా ఏవమస్మిన్ప్రాణే సర్వం సమర్పితం ప్రాణః ప్రాణేన యాతి ప్రాణః ప్రాణం దదాతి ప్రాణాయ దదాతి ప్రాణో హ పితా ప్రాణో మాతా ప్రాణో భ్రాతా ప్రాణః స్వసా ప్రాణ ఆచార్యః ప్రాణో బ్రాహ్మణః 1**

**స యది పితరం వా మాతరం వా భ్రాతరం వా స్వసారం వాచార్యం వా బ్రాహ్మణం వా కించిద్భృశ మివ ప్రత్యహదిక్త్వాస్విత్యే వైనమాహుః పితృహా వై త్వమసి మాతృహా వై త్వమసి భ్రాతృహావై త్వమసి స్వసృహా వై త్వమస్యాచార్యహా వై త్వమసి బ్రాహ్మణహా వై త్వమసీతి** **2**

**అథయద్యప్యేనానుత్క్రాన్తప్రాణాన్ఛూలేన సమాసం వ్యతిషన్దహేన్నైవైనం బ్రూయుః పితృహాసీతి న మాతృహాసీతి న భ్రాతృహాసీతి న స్వసృహాసీతి నాచార్యహాసీతి న బ్రాహ్మణహాసీతి. 3**

**ప్రాణో హ్యేవైతాని సర్వాణి భవతి స వా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజానన్నతి వాదీ భవతి తం చేద్బ్రూయురతివాద్యసీ తృతివాద్యస్మీతి బ్రూయాన్నాప హనువీత. 4**

సనత్కుమారు డీ విధంగా చెపుతున్నాడు – 'ఓ నారదా! ఆశ కంటె కూడా ప్రాణమనేది నిస్సందేహంగా శ్రేష్ఠమైనది. రథచక్రం యొక్క నాభియందు ఆకులన్నీ అమరి ఉన్నట్లుగా ఈ శరీరంలోని ముఖ్యప్రాణంలో సమస్త ప్రపంచం అమరి ఉంది. ఇక్కడ ముఖ్యప్రాణాన్నే జీవాత్మగా భావించుకోవచ్చు. సూత్రాత్మ లేదా హిరణ్యగర్భుడే పంచప్రాణాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, మనస్సు, బుద్ధితో కూడిన ఈ మానవ శరీరంలో అద్దంలో ప్రతిబింబంలాగా నామరూపాలతో వ్యక్తమౌతున్నాడని భావం. ఈ ప్రాణమే తన శక్తియైన ప్రాణం ద్వారా (ప్రాణశక్తి ద్వారా) నడుస్తోంది. అంటే ప్రాణమే ప్రాణానికి ప్రాణం ఇస్తోంది. ఇచ్చేది ఇవ్వబడేది కూడా ప్రాణమే! కాబట్టి తండ్రి ప్రాణమే! తల్లికూడా ప్రాణమే! అట్లాగే ప్రాణమే సోదరుడు, ప్రాణమే సోదరి. ప్రాణమే గురువు. ప్రాణమే బ్రాహ్మణుడు. వీరందరిలోనూ ఉన్నది ప్రాణమే! ప్రాణం ఉన్నంతవరకు వారు తల్లిగా, తండ్రిగా, సోదరుడు వగైరా పేర్ల ద్వారా పిలవబడతారు.

తండ్రిని గురించిగాని, తల్లిని గురించిగాని, సోదరుడు, సోదరి, గురువు, బ్రాహ్మణుడు మొదలైన ఈ పెద్దలను గూర్చి ఎవడైనా అనుచితంగా మాట్లాడినా లేక వారిని నిందించినా అటువంటి వానిని 'నీవు పితృ హంతకుడవు, మాతృ హంతకుడవు, భ్రాతృ హంతకుడవు, భగినీ హంతకుడవు, గురు హంతకుడవు, బ్రాహ్మణ హంతకుడవు' అని (అనుచితంగా మాట్లాడినవానిని) అంటారు. ఎందుచేత? వారందరిలోనూ ప్రాణం ఉన్నది కాబట్టి. వారంతా తండ్రి మొదలైన రూపాల్లో కనిపిస్తున్నారు కాబట్టి. ఆ పెద్దలను పూజించటం ధర్మం. నిందించటం అధర్మం కాబట్టి ఆ విధంగా అంటారు.

అయితే ఆ తండ్రి, తల్లి మొదలైన వారిలో ఉండే ప్రాణం పోయింది. అప్పుడిక వారిని తల్లి, తండ్రి వగైరా పేర్లతో పిలవరు. ఇక పైన చెప్పినవారంతా లేనప్పుడు శవాలే! వారిని స్మశానంలో చితిపై ఉంచి శూలాలతో అవయవాలను అగ్నిలోకి తోస్తూ తగులబెడుతున్నప్పటికి అతనిని ఎవ్వరూ 'నీవు పితృహంతకుడవు, మాతృ హంతకుడవు, భ్రాతృ హంతకుడవు, భగినీ హంతకుడవు, గురు హంతకుడవు, బ్రాహ్మణ హంతకుడవు' అని అనరు. ఎందుచేత? అవి కేవలం శరీరాలే? వాటిలో ప్రాణం లేదు కాబట్టి!

దీనికంతకు కారణం ఏమిటి? ప్రాణమే! ఈ చరాచర జగత్తు అంతా ప్రాణమయమే! అన్నింటిని మించినది ప్రాణమే! ఇదంతా బాగా ఆలోచించి, బాగా తెలుసుకొని ఎవడైనా ప్రాణాన్ని గురించి అతిశయంగా మాట్లాడితే – అంటే లోగడ చెప్పినట్టి నామంతో ఆరంభమై ఆశ పర్యంతరం సమస్తాన్ని ప్రాణమే అతిశయించినదని అతిగా మాట్లాడుతూ ఉంటే అతనిని నీవు అతివాదిగా పేర్కొనవచ్చు. అంటే అతనిని నీవు అతిగా మాట్లాడుతున్నావని అనవచ్చు. అప్పుడా

ఉపాసకుడేమనాలి? – అవును నిజమే! నేను ప్రాణాన్ని గూర్చి అతిగా మాట్లాడుతున్నాను అని అనాలి. అట్లా అనకుండా దాచవలసినదంటూ ఏమీ లేదు. అతనికి దాచవలసిన అగత్యం ఏమి ఉంది. అతడు ప్రాణాన్ని అన్నిటికి ప్రభువుగా గుర్తించాడు. ఆ ప్రాణమే తానని గుర్తించాడు. ఇందులో అసత్యం ఏమి ఉంది? దాపరికం ఎందుకు? ఇదే సత్యం. ఇదే పరమార్థం కదా!

పదునారవ ఖండం

**మం॥ ఏష తు వా అతివదతి యః సత్యేనాతివదతి సోఽహం భగవః సత్యేనాతి వదానీతి సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్య మితి సత్యం భగవో విజిజ్ఞాస ఇతి. 1**

సనత్కుమారు డింకా ఇలా అంటున్నాడు – 'నారదా! పరమార్థము, సత్యము అయినట్టి ఆత్మవిజ్ఞానాన్ని గూర్చి మాట్లాడుతూ, ఎవరైనా ఎక్కువగా, అతిగా మాట్లాడితే నిజంగానే అతడు అతివాది కావచ్చు – అంటే ఆత్మ విజ్ఞానాన్ని, సత్యాన్ని బాగా తెలుసుకొని మాట్లాడే అతివాది అన్నమాట!

ఇది విని నారదుడిలా అన్నాడు – 'దేవా! మీ శరణాగతుడనైన నేను పరమార్థము, సత్యము అయిన విషయాన్ని గురించి (ఆత్మ విజ్ఞానాన్ని గురించి) అతిగానే మాట్లాడుతాను'.

సనత్కుమారుడన్నాడు – 'అట్లా అయితే నీవు ఆ సత్యాన్ని గూర్చి (ఆత్మను గూర్చి) ఇంకా బాగా జిజ్ఞాస చేసి, బాగా అవగాహన చేసుకోవాలి'.

నారదు డంటున్నాడు – 'అయితే, స్వామీ! నేను ఈ విషయమైన సత్యాన్ని, విజ్ఞానాన్ని తమద్వారానే ఇంకా అధికంగా తెలుసుకోవాలని అనుకుంటున్నాను.

పదునేడవ ఖండం

**మం॥ యదా వై విజానాత్యథ సత్యం వదతి నావిజాన నృత్యం వదతి విజానన్నేవ సత్యం వదతి విజ్ఞానం త్వేవ విజిజ్ఞాసితవ్యమితి విజ్ఞానం భగవో విజిజ్ఞాస ఇతి. 1**

సనత్కుమారుడిలా చెపుతున్నాడు – 'తాను గ్రహించినట్టి, తాను దర్శించినట్టి, మిథ్యావికారాలేవీ లేనట్టి పరమసత్యాన్ని ఎవరు బాగా వివరించి చెప్పగలుగుతారు? ఎవరైతే ఆ సత్యాన్ని, ఆ పరమార్థమైన సత్యాన్ని బాగా గ్రహించి ఉంటారో వారే చెప్పగలుగుతారు. అంటే తమకు బాగా తెలిస్తే తప్ప ఇతరులకు చెప్పలేరు. కాని, బాగా తెలుసుకున్నప్పుడు మాత్రం ఆ సత్యం ఇటువంటిది అని బాగా వర్ణించి చెప్పగలుగుతారు. అందుచేత ఆ బాగా తెలుసుకోవటం (విజ్ఞానం) అనేది సత్యంకంటె కూడా గొప్పది. అంటే, విజ్ఞానమనేది సత్యంకంటె గొప్పది. అందుచేత ఆ విజ్ఞానాన్ని తెలుసుకోవాలనే కోరిక బాగా ఉండాలి'

ఇది విన్న నారదుడిలా అన్నాడు – 'స్వామీ నేను అటువంటి ఆ విజ్ఞానాన్ని తమద్వారా తెలుసుకోవాలని అనుకుంటున్నాను' అని.

(ఈ విధంగా సత్యం మొదలుకొని రాబోయే 22వ మంత్రంలోని 'కరోతి' అనే పర్యంతం ఉత్తరోత్తర, ఒకదానికొకటి కారణమని గ్రహించాలి.)

## పదునెనిమిదవ ఖండం

**మం॥ యదా వై మనేతేఽథ విజానాతి నామత్వా నాతి మత్త్వేవ విజానాతి మత్తిస్త్వేవ విజజ్ఞాసితవ్యేతి మతిం భగవో విజిజ్ఞాస ఇతి.**

సనత్కుమారుడు చెపుతున్నాడు – 'ఒక విషయాన్ని గూర్చిన విజ్ఞానం పొందాలంటే – అర్థం చేసుకోవాలంటే, ఆ విషయాన్ని బాగా మననం చేయాలి. మనం తెలుసుకోవాల్సిన విషయాన్ని ధ్యానిస్తూ ఉండటం, దానిని తర్కించటం, ఆ విషయాన్ని గురించిన ఆసక్తి ఇవన్నీ మననానికి సంబంధించిన విషయాలు. అంటే ధ్యానం, తర్కం, ఆసక్తి ఈ మూడింటి కలయిక మననం అన్నమాట. విషయం మీద ఆసక్తి, ఆ విషయాన్ని గూర్చి తర్కించటం, ఆ విషయాన్ని గూర్చి ధ్యానిస్తూ (తలుస్తూ) ఉండటం అనే ఈ విధమైన మననం ఉంటే తప్ప ఏ విషయాన్నైనా మనం సరిగా అర్థం చేసుకొని తెలుసుకోలేము. కాబట్టి మననాన్ని గూర్చిన జిజ్ఞాస చెయ్యి!'

ఈ మాటలు విన్న నారదుడు 'స్వామీ నేను ఆ మతిని గురించి (ధ్యానము లేక తలంపును గూర్చి) బాగా తెలుసుకోవాలనుకుంటున్నాను' అన్నాడు.

## పందొమ్మిదవ ఖండం

**మం॥ యదా వై శ్రద్ధధాత్యథ మనుతే నాశ్రద్ధధన్మనుతే శ్రద్ధధదేవ మనుతే శ్రద్ధా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి శ్రద్ధాం భగవో విజిజ్ఞాస ఇతి. 1**

సనత్కుమారు డంటున్నాడు – 'ఓ నారదా! ఏదైనా ఒక విషయాన్ని గూర్చి పైన చెప్పిన విధంగా మననం చెయ్యాలంటే ఆస్తిక్య బుద్ధి అనేటటువంటి శ్రద్ధ ఉండాలి. గురువు చెప్పిన విషయం మీద, శాస్త్రాల్లో చెప్పిన విషయం మీద నమ్మకముండాలి. అటువంటి నమ్మకమే శ్రద్ధ. ఆ శ్రద్ధ అనేది ఆస్తిక్య బుద్ధితో కూడి ఉంటుంది. ఆస్తిక్య బుద్ధి లేకపోతే శ్రద్ధ ఉండదు. శ్రద్ధ లేకపోతే మననం చెయ్యలేము. శ్రద్ధాళువైనవాడే మననం చేయగలుగుతాడు. అందుచేత, నీవు శ్రద్ధను గూర్చి తెలుసుకోవటానికి యత్నించాలి.

ఇది విని నారదుడు – 'ఓ భగవానుడా! నేను మీరు చెప్పినట్లే శ్రద్ధను గూర్చి బాగా తెలుసుకోవాలనుకుంటున్నాను'? అన్నాడు.

## ఇరువదవ ఖండం

**మం॥ యదా వై నిస్తిష్ఠత్యథ శ్రద్ధధాతి నాని స్తిష్టన్ఛ్రద్ధ ధాతి నిస్తిష్ఠన్నేవ శ్రద్ధధాతి నిష్ఠా త్వేవ విజిజ్ఞాసితవ్యేతి నిష్ఠాం భగవో విజిజ్ఞాస ఇతి.** 1

సనత్కుమారుదు మళ్ళీ ఈ విధంగా అంటున్నాడు – 'నారదా! మానవునికి శ్రద్ధ ఉండాలంటే గురు శుశ్రూష మొదలైన విషయాల్లో నిష్ఠ ఉండాలి. ఆ విధమైన నిష్ఠాపరునికే శ్రద్ధ అనేది సాధ్యమౌతుంది. నిష్ఠలేనివానికి శ్రద్ధ ఉండదు. నియమ పూర్వకంగా సేవించటమనే నిష్ఠ ఉన్నప్పుడే శ్రద్ధ అనేది సంభవం. కాబట్టి నీవు నిష్ఠను గూర్చి బాగా తెలుసుకో!

ఇది విన్న నారదుడు 'ఓ భగవానుడా! మీరు చెప్పినట్లుగా నిష్ఠను గురించి బాగా తెలుసుకోవటానికి యత్నిస్తాను' అన్నాడు.

ఇరువది ఒకటవ ఖండం

**మం॥ యదా వై కరోత్యథ నిస్తిష్ఠతి నాకృత్వా నిస్తిష్ఠతి కృత్వైవ నిస్తిష్ఠతి కృతిస్త్వేవ విజిజ్ఞాసితవ్యేతి కృతిం భగవో విజిజ్ఞాస ఇతి.** 1

సనత్కుమారుడంటున్నాడు – 'నారదా! నిష్ఠతో సేవించాలి అంటే కృతి ఉండాలి. కృతి అంటే కర్మ. పని అని మామూలుగా చెప్పుకొనే అర్థం కాకుండా, ఇంద్రియ నిగ్రహంతో, చిత్తైకాగ్రతతో చేసే వ్రతం అని అర్థం చెప్పుకోవాలి. అంతేకాని మామూలు పనికాదు. నిష్ఠకు, ఈ కృతి అనేది ఎందుకు అవసరం? అంటే, ఏదైనా కొంత చేస్తే తప్ప ఒక విషయం మీద మనిషికి నిష్ఠ ఏర్పడదు. ఏదైనా చిత్తైకాగ్రతతో, నియమంగా చేస్తూ ఉన్నప్పుడే నిష్ఠ ఏర్పడుతుంది. కాబట్టి నిష్ఠకు క్రియ అనేది కారణం. కాబట్టి నీవు కృతిని గూర్చి బాగా తెలుసుకో!' అని.

ఇది విని నారదుడంటున్నాడు – 'దేవా! మీరు చెప్పినట్లుగా కృతిని గూర్చి బాగా తెలుసుకోవటానికి యత్నిస్తాను' అని.

సత్యానికి విజ్ఞానం, విజ్ఞానానికి మననం, మననానికి శ్రద్ధ, శ్రద్ధకు నిష్ఠ, నిష్ఠకు కృతి వరుసగా కారణాలని గ్రహించాలి. అంటే సాధకుడు ఆత్మదర్శనానికి కృతినుండి ఆరంభించి క్రమంగా సత్యాన్ని దర్శించాలి.

ఇరువది రెండవ ఖండం

**మం॥ యదా వై సుఖం లభ్యతేఽథ కరోతి నాసుఖం లబ్ధ్వా కరోతి సుఖమేవ లబ్ధ్వా కరోతి సుఖం త్వేవ విజిజ్ఞాసి తవ్యమితి సుఖం భగవో విజిజ్ఞాస ఇతి.** 1

సనత్కుమారుడు అంటున్నాడు. నారదా! మనిషి ఏదైనా చెయ్యాలంటే సుఖంగా ఉండాలి. అంటే శారీరక మానసిక సుఖం ఉండాలి. సుఖంగా ఉన్నప్పుడు మాత్రమే ఏదైనా చేయగలుగుతాడు. సుఖంగా లేకపోతే, కులాసాగా లేకపోతే ఏమీ చేయలేడు. కాబట్టి నీవు సుఖాన్ని గూర్చి జిజ్ఞాస చేయాలి' అని.

ఇది విన్న నారదుడు – 'దేవా! మీరు చెప్పినట్లుగా సుఖాన్ని గూర్చి, సంతోషాన్ని గూర్చి తెలుసుకోవాలనుకుంటున్నాను' అన్నాడు.

ఇరువది మూడవ ఖండం

**మం॥ యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ సుఖం భూమా త్వేవ విజిజ్ఞాసితవ్య ఇతి భూమానం భగవో విజిజ్ఞాస ఇతి. 1**

నిజానికి అనంతమైనది (భూమము) ఏదో, అదే సుఖానికి కారణం. ఈ భూమాన్నే మహత్ అనవచ్చు. అల్పత్వంలో సుఖంలేదు – సంతోషం ఉండదు. అనంతత్వంలోనే, మహత్త్వంలోనే సుఖం ఉంటుంది. ఈ అనంతత్వ మనేదానినే సర్వోత్కృష్టమని, అపరిమితత్వం అని, భూమమనేదానికి పర్యాయపదాలుగా చెప్పుకోవచ్చు. నిజానికి ఈ భూమమే సుఖము (సంతోషం) కాబట్టి నీవు దీనిని గూర్చి జిజ్ఞాస చేయాలి.

ఇది విని నారదుడు – 'దేవా! నేను మీరు చెప్పినట్లు భూమాన్ని గూర్చి తెలుసుకుంటాను' అన్నాడు.

## ఇరువది నాల్గవ ఖండం

**మం॥ యత్ర నాన్యత్పశ్యతి నానచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమాథ యత్రాన్యత్పశ్యత్యన్యచ్ఛృ ణోత్యన్య ద్విజానాతి తదల్పం యో వై భూమా తదమృత మథ యదల్పం తన్మర్త్యం స భగవః కస్మిన్ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని యది వా న మహిమ్నీతి. 1**

**గో అశ్వమిహ మహిమేత్యాచక్షతే హస్తి హిరణ్యం దాసభార్యం క్షేత్రాణ్యాయతనానీతి నాహమేవం బ్రవీమి బ్రవీమీతి హోవాచాన్యో హ్యన్యస్మిన్ప్రతిష్ఠిత ఇతి. 2**

సనత్కుమారుడన్నాడు –

"ఈ భౌమత్త్వంలో (మహత్తత్వంలో) ద్రష్టయైనవాడు ఇతరమైన దేనినీ చూడడు. అంటే చూచేందుకు దృశ్యమనేది ఉండదు. ఇతరమైన దానిని దేనినీ వినడు. వినేందుకు శ్రవ్యమైన దేదీ ఉండదు. అట్లాగే ఇతరమైన దానిని దేనినీ తెలుసుకోడు. అంటే తెలుసుకోదగినది (జ్ఞాతవ్యము) ఏదీ ఉండదు. ఒకవేళ ఏదైనా దృశ్యము, శ్రవ్యము, జ్ఞాతవ్యము అనేవి ఉంటే, అది మహత్త్వం

కాదు. అల్పత్వమే అవుతుంది. భూమమనేది అమృతము. అల్పత్వమనేది మృతస్వభావం కలది' అని. ఇదంతా విని నారదుడు అడిగాడు – 'దేవా! ఈ భూమమనేది దేనియందు ప్రతిష్ఠితమై ఉంది? దీనికి ఆధారం ఏది? అని. అందుకు సమాధానంగా సనత్కుమారుడు అన్నాడు – భూమమనేది తన మహిమలో తానే ప్రతిష్ఠితమై ఉంది. అంటే, అది దేనినీ ఆశ్రయించి ఉండదు. దానికి అదే ఆశ్రయం.

ఈ లోకంలో ఆవులు, గుఱ్ఱాలు మొదలైనవాటిని మహిమ అంటున్నాం – కీర్తి అంటున్నాం. ఏనుగులు, బంగారం, దాసీజనం, కళత్రం, పొలాలు, ఇండ్లు ఇవన్నీ గొప్పదనాలుగా పరిగణింపబడుతున్నాయి. అంటే ఇవన్నీ ఉన్నవానిని మహిమ కలవాడని, కీర్తివంతుడని అంటున్నాము. కాని నేను ఆ విధంగా అనటాన్ని అంగీకరించను. ఎందుచేతనంటే ఒక పదార్థం అంటూ ఉంటే అది వేరొక పదార్థంలో ప్రతిష్ఠితమై ఉంటుంది. అంటే ఒక పదార్థం ఇంకొక పదార్థం మీద ఆధారపడి ఉంటుంది. అటువంటప్పుడు అది గొప్పది ఎట్లా అవుతుంది? కాబట్టి అనంతత్వము, మహిమ, భూమము అనేవి పదార్థాలు కావు. అది అనంతం కాబట్టి అనంతత్వం మీదనే ఆధారపడాలి. అంటే తనలో తానే ప్రతిష్ఠితమై ఉండాలి. కాబట్టి అదే గొప్పది. ఇది నా ఉద్దేశ్యం! నేననేది ఇదే!' అన్నాడు సనత్కుమారుడు.

## ఇరువది ఐదవ ఖండం

**మం॥ స ఏవాధస్తాత్స ఉపరిష్టాత్స పశ్చాత్స పురస్తాత్స దక్షిణతః స ఉత్తరతః స ఏవేదం సర్వమిత్యథాతోఽహంకారా దేశ ఏవాహమే వాధస్తాదహముపరిష్టా దహం పశ్చా దహం పురస్తాదహం దక్షిణతోఽహ ముత్తరతోఽహ మే వేదం సర్వమితి. 1**

**అథాత ఆత్మాదేశ ఏవాత్మైవాధస్తాదాత్మోపరిష్టా దాత్మా పశ్చాదాత్మా పురస్తాదాత్మ దక్షిణత ఆత్మో త్తరత ఆత్మైవేదం సర్వమితి స వా ఏష ఏవం పశ్య న్నేవం మాన్వాన ఏవం విజానన్నాత్మరతి రాత్మక్రీడ ఆత్మమిథున ఆతానన్దః స స్వరాడ్భదతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి. అథ యేఽన్యథాతో విదురస్య రాజానస్తే క్షయ్యలోకా భవన్తి తేషాం సర్వేషు లోకేష్వ కామచారో భవతి. 2**

ఈ భూమము (అనంతత్వం) అనేది క్రింద ఉన్నది. పైనా ఉన్నది. వెనక ఉన్నది. ముందూ ఉన్నది. కుడివైపున, ఎడమవైపున కూడా ఉంది. అంటే సర్వత్రా ఉన్నదన్నమాట. సమస్తమూ అదే! అది ఆధారపడి ఉండటానికి తగినది ఏదీ లేదు. అది తప్ప దానికి భిన్నమైనది ఏదీ లేదు. అంటే అద్వితీయమన్నమాట. ఈ అద్వితీయమైన మహత్తత్వాన్ని లేదా భూమాన్ని అహంకార రూపంలో (నేను అనే మాటల్తో) చెప్పవచ్చు. ఏమని? ఎట్లా? 'నేనే క్రింద ఉన్నాను, నేనే పైన

ఉన్నాను, నేనే వెనక ఉన్నాను, నేను ముందు ఉన్నాను, నేనే కుడివైపున ఉన్నాను, నేనే ఎడమవైపున ఉన్నాను' అని. ఈ విధంగా ద్రష్టకు, భూమానికి అభేదం చెప్పారు. ద్రష్టయైన ఆత్మయే భూమమన్నమాట.

ఇక విశుద్ధ రూపంలో (ఆత్మరూపంలో) ఆ అనంతత్వాన్ని గురించి ఉపదేశిస్తున్నారు. 'ఆత్మయే క్రింద ఉన్నది. ఆత్మయే పైన ఉంది. ఆత్మయే వెనుక ఉంది. ఆత్మయే ముందు ఉంది. ఆత్మయే కుడివైపున ఉంది. ఆత్మయే ఎడమవైపున ఉంది. ఇన్ని మాటలెందుకు? సమస్తమూ ఆత్మయే! సర్వత్ర ఆత్మయే! ఆ ఆత్మయే ఈ విధంగా చూస్తోంది. ఆ ఆత్మయే ఈ విధంగా మననం చేస్తోంది. ఆ ఆత్మయే ఈ విధంగా తెలుసుకుంటోంది. ఆత్మ రమణ రూపంలో (తనలో తాను రమిస్తూ ఉన్నట్లుగా) అభ్యంతర ఆత్మక్రీడ సల్పుతోంది. దేహానికి భిన్నమైన పదార్థాల్లో (దేహం లేని వాటిల్లో) బాహ్య ఆత్మక్రీడ సల్పుతోంది మిత్రులు మొదలైనవారితో. ఆత్మ మిథునరూపంలో ఆత్మానందం కలదిగా అవుతోంది. ఆ ఆత్మ అనేది స్వరాట్ (తనకు తానే ప్రభువు) సమస్త లోకాల్లోను స్వేచ్ఛగా అది సంచరిస్తుంది. అంటే ప్రాణము మొదలైన వాటి పూర్వ భూమికల్లో స్వేచ్ఛా సంచారం చేస్తుంది. ఈ విషయం తెలియనివారు (తామే 'స్వరాట్' అని గుర్తించలేనివారు) ఇతర శాసకుల అధీనంలో పరతంత్రులౌతారు, నశ్వరమైన లోకాల్ని పొందుతారు. వారు పైన చెప్పినట్లుగా అనంత లోకాల్లో సంచరించలేరు – తమ అనంతత్వాన్ని గుర్తించలేని కారణంగా!'

ఇరువది ఆరవ ఖండం

**మం॥ తస్య హో వా ఏతస్యైవం పశ్యత ఏవం మన్వాన స్యైవం విజానత ఆత్మతః ప్రాణ ఆత్మత ఆశాత్మతః స్మర ఆత్మత ఆకాశ ఆత్మత స్తేజ ఆత్మత ఆప ఆత్మత ఆవిర్భావతిరోభావావాత్మతోఽన్నమాత్మతో బల మాత్మతో విజ్ఞానమాత్మతో ధ్యానమాత్మతశ్చిత్త మాత్మతః సంకల్ప ఆత్మతో మన ఆత్మతో వాగాత్మతో నామాత్మతో మంత్రా ఆత్మతః కర్మాణ్యాత్మత ఏవేదం సర్వమితి.** **1**

**తదేష శ్లోకః –**

**న పశ్యో మృత్యుం పశ్యతి న రోగం నోత దుఃఖతాం। సర్వంహ పశ్యః పశ్యతి సర్వమాప్నోతి సర్వశః ॥ఇతి॥**

**స ఏకధా భవతి త్రిధా భవతి పంచధా సప్తధా నవధా చైవ పునశ్చై కాదశః స్మృతః శతం చ దశ చైకశ్చ సహస్రాణిచ వింశతి రాహారశుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వ శుద్ధౌ ధ్రుశా స్మృతిః స్మృతిలమ్భే సర్వగ్రంథీనాం విప్రయోక్షస్తస్మై మృదితకషాయాయ తమసస్పారం దర్శయతి భగవాన్స నత్కుమారస్తం స్కన్ద ఇత్యా చక్షతే తం స్కన్ద ఇత్యాచక్షతే.** **2**

ఈ విధంగా చూడగలిగిన ద్రష్టకు, ఈ విధంగా మననం చేయగలిగినంతకు, ఈ విధంగా తెలుసుకోగలిగిన విజ్ఞాతకు (తత్త్వవేత్తకు) వెనుక చెప్పిన ప్రాణం మొదలైనవన్నీ ఆత్మనుండే పుడుతున్నట్లు తెలుస్తుంది. అంటే, ఆత్మనుండే ప్రాణం, ఆత్మనుండే ఆశ, ఆత్మనుండే స్మృతి. ఆ్మనుండే ఆకాశం! ఆత్మనుండే జలం, ఆత్మనుండే ఆవిర్భావ తిరోభావాలు (జనన మరణాలు) ఆత్మనుండే అన్నం, ఆత్మనుండే బలం, ధ్యానం, మనస్సు, వాక్కు, నామ, మంత్రం, కర్మ మొదలైన సమస్తము ఉద్భవిస్తున్నాయని తెలుస్తుంది. అన్నీ ఆత్మనుండి పుట్టటాన్ని తెలుసుకోగలుగుతాడు. ఈ విషయమై ఈ క్రింది విధముగా తెలుపబడినది.

తత్త్వవేత్తయైన వాడు మృత్యువును చూడవు. అతడు రోగాన్ని చూడడు. అంటే, అతనికి జరామృత్యువులు లేవని భావం. చావు, రోగం అతనిని అంటవు. ఆ విద్వాంసుడు అన్నిటిని, అందరిని, ఆత్మభావంతో చూస్తాడు. అందుచేత అతడు అందరిని, అన్నింటిని పొంది ఉంటాడు.

ఒకడే అవుతాడు. అతడే మూడుగా, ఐదుగా, ఏడుగా, తొమ్మిదిగా, రూపాలు ధరిస్తాడు. అంతేకాదు, అతడే పదకొండు, నూటపది, ఒక వెయ్యి ఇరవై ఇట్లా అసంఖ్యాకంగా, బహుముఖాలుగా, బహురూపాలుగా విస్తరిస్తాడు. ఆత్మయే అట్లా విస్తరిస్తుందని భావం – లయకాలంలో మళ్ళీ ఏకమైపోతుంది. శబ్దం మొదలైనవి శ్రోత్రం మొదలైన ఇంద్రియాలకు విషయాలు గదా! అంటే అవి ఇంద్రియాలకు ఆహారం. అంటే, శబ్దం చెవికి, రసం నాలుకకు, రూపం కళ్ళకు ఇట్లా ఆహారాలు శబ్దం మొదలైన విషయాల రూపంలో ఉండే ఆహారం శుద్ధి అయితే మనస్సు శుద్ధి అవుతుంది. అంటే వినేవి, చూచేవి అయిన విషయాలు స్వచ్ఛమైనవైతే మనస్సు స్వచ్ఛం అవుతుంది. మనస్సు పరిశుద్ధమైతే నిశ్చలమైన స్మృతి కలుగుతుంది. ఆ స్మృతి పరిశుద్ధమైతే సమస్త హృదయ గ్రంధులు విడిపోతాయి. అంటే అజ్ఞానం వల్ల కలిగిన సమస్త సాంసారిక బంధనాలు తొలగిపోతాయి. ఈ విధంగా సమస్త విషయ వాసనలు నశించిపోయిన తత్త్వవేత్తయైన సనత్కుమారుడు నారదుణ్ణి అజ్ఞానమనే అంధకారాన్ని దాటించాడు – తరింపచేశాడు. అందుచేతనే, ఆ సనత్కుమారుని స్కందుడన్నారు. స్కందుడు అంటే జ్ఞాని అని అర్థం. (దుర్గాదేవి కుమారునికి కూడా స్కందుడనే పేరు ఉంది).

## ఎనిమిదవ అధ్యాయం

## మొదటి ఖండం

**మం॥ ఓం అథ యదిదమస్మిన్బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽ స్మిన్నన్తరాకాశ స్తస్మిన్యదన్త స్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్య మితి. 1**

**తం చేద్బ్రూయుర్యదిదమస్మిన్బ్రహ్మపురే దహరం పుండరీకంవేశ్మద హరోఽ స్మిన్నన్తరాకాశః కింతదత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజిజ్ఞాసితవ్యమితి స బ్రూయాత్. 2**

**యావాన్వా అయమాకాశస్తావానేషోఽ న్తర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ద్యావా పృథివీ అన్తరేవ సమాహితో ఉభావగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచంద్రమసావుభౌ విద్యు న్నక్షత్రాణి యచ్చాస్యేహాస్తి యచ్చ నాస్తి సర్వం తదస్మిన్సమాహిత మితి. 3**

**తం చేద్బ్రూయురశ్మింశ్చేదిదం బ్రహ్మపురే సర్వం సమాహితం సర్వాణి చ భూతాని సర్వే చ కామా యదైతజ్జరా వాప్నోతి ప్రధ్వంసతే వా కిం తతో1 తి శిష్యత ఇతి. 4**

“ఈ శరీరమనేది పరబ్రహ్మ నివసించే చోటు కాబట్టి ఇది బ్రహ్మపురం. రాజధానిలో రాజసేవకులు, అధికారులు ఉన్నట్లే ఈ పురంలో ఇంద్రియాలు, మనస్సు వగైరాలు యజమాని ఆజ్ఞాపాలన కోసం ఉన్నాయి. ఈ పురంలో పద్మం వంటి ఆకారంలో ఉండే ఒక ప్రదేశం ఉంది. అది హృదయ కమలం. ఆ పద్మం మధ్యభాగంలో సూక్ష్మమైన ఆకాశం ఉంది. ఆ ఆకాశ తత్త్వానికి లోపల ఉన్న వస్తువును గూర్చి మనం అన్వేషణ చేయాలి. దానిని గురించే తెలుసుకోవటానికి ప్రయత్నం చేయాలి. అంటే గురూపదేశం ద్వారా, శాస్త్రాలను విని మననం చేయటం ద్వారా ఆ తత్త్వాన్ని సాక్షాత్కరించుకోవటానికి ప్రయత్నం చేయాలి”. ఇది శిష్యునికి ఆచార్యుడు చేసిన బోధ.

పైన చెప్పిన ఉపదేశం విన్న శిష్యుడు ఆచార్యుని ఈ విధంగా అడగాలి – “స్వామీ! ఈ చెప్పబడిన బ్రహ్మపురంలో సూక్ష్మమైన కమలం లాగా ఉండే గృహంలో సూక్ష్మ ఆకాశం ఉందని, అందులో ఉన్న వస్తువును తెలుసుకోవాలని అన్నారు గదా! దానిని అన్వేషించాలని అన్నారు గదా! ఆ సూక్ష్మాకాశంలో ఉన్నదేది! దేనిని గురించి అన్వేషించి తెలుసుకోవాలి? జిజ్ఞాస చేయాలి?” అని.

ఈ విధమైన సందేహాన్ని వెలిబుచ్చిన శిష్యునితో గురువు ఈ విధంగా చెప్పాలి – “ఈ భౌతికాకాశం – మన కండ్లకు కనిపిస్తూ ఉన్న ఈ ఆకాశం – ఎంత ఉందో, ఈ హృదయంలో ఉన్న ఆకాశం కూడా అంత ఉంది. ఈ బుద్ధి అనే ఉపాధితో కూడినట్టి ఈ హృదయాకాశంలో – బ్రహ్మాకాశంలో – ద్యులోకం, పృథివి రెండూ ఇమిడి ఉన్నాయి. అట్లాగే అగ్ని, వాయువు కూడా

ఉన్నాయి. అంతేకాదు, సూర్యచంద్రులు, విద్యుత్తు, నక్షత్రాలు కూడా ఇమిడి ఉన్నాయి. ఇంత ఎందుకు. ఈ ఆత్మ లోకంలో ఆత్మీయ పదార్థంగా ఉన్నది. ఆత్మీయ పదార్థంగా లేనిదీ (నష్టమైపోయినదీ) భవిష్యత్తులో ఉండనిదీ కూడా ఈ హృదయాకాశంలో చక్కగా ఇమిడి ఉన్నాయి" అని.

ఈ విధంగా సమాధానం చెప్పిన ఆచార్యుని, శిష్యుడు మళ్ళీ ఈ విధంగా అడగాలి – "దేవా! బ్రహ్మపురమనే ఈ అంతరాకాశంలో అన్నీ చక్కగా నిలిచి ఉన్నప్పుడు, సమస్త భూతాలు, సమస్త కామనలు (కోరికలు) అన్నీ ఈ హృదయాకాశంలో ఉన్నప్పుడు మరి ఈ బ్రహ్మపురం (శరీరం) జీర్ణము, శీర్ణము అయి నాశనం అయ్యేటప్పుడు కుండ పగిలినప్పుడు కుండలోని పాలు అన్నీ నాశనమైపోయేటట్లుగా ఇవన్నీ నాశనమౌతాయా? అంటే ఈ భూతాలు, కామనలు వగైరా అన్నీ శరీరంతోబాటు నశిస్తాయా? నశిస్తే ఇక మిగిలేదేమిటి?' అని.

**మం॥ స బ్రూయాన్నాస్య జరయైతజ్జీర్యతి న వధేనాస్య హన్యత ఏతత్సత్యం బ్రహ్మపురమస్మిన్కామాః సమా హితా ఏష ఆత్మాపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽ పిపాసః సత్యకామః సత్యసంకల్పో యథా హ్యేవేహ ప్రజా అన్వావిశన్తి యథానుశాసనం యం యమన్తమభికామా భవన్తి యం జనపదం యం క్షేత్రభాగం తం తమేవో పజీవన్తి. 5**

**తద్యథేహ కర్మజితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యజితో లోకః క్షీయతే తద్య ఇహాత్మాన మనను విద్య వ్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాం స్తేషాం సర్వేషు లోకేష్వకామచారో భవత్యథ య ఇహా త్మానమను విద్య వ్రజన్త్యేతాంశ్చ సత్కాన్కామాం స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి. 6**

శిష్యుడు అడిగిన శూన్యత్వానికి సంబంధించిన అనుమానాన్ని గురువు ఈ విధంగా సమాధానం చెప్పాలి – "ఈ శరీరం వార్ధక్యాన్ని పొందినప్పటికీ అంతరాకాశంలో ఉన్న బ్రహ్మ జీర్ణం కాదు. శస్త్రాలతో, ఆయుధాలతో ఈ శరీరాన్ని వధించినప్పటికీ లోన్ను ఆత్మ నాశనం కాదు. అది వధింపబడదు. ఈ బ్రహ్మపురమనేది సత్యం. ఇందులో సమస్త కోరికలు (కామములు) ఉన్నాయి. ఈ ఆత్మ అనే దానికి ధర్మాధర్మములతో సంబంధం లేదు. దీనికి ముసలితనం లేదు. మృత్యువు లేదు. శోకం లేదు. ఆకలి లేదు. దప్పిక లేదు. ఇది సత్యకామము, సత్యసంకల్పము అయినది. అంటే, సాంసారిక పురుషుల్లాగా అసత్యకామనలు, అసత్య సంకల్పాలు ఈ ఆత్మకు లేవు. ఈ లోకంలో ప్రజలు రాజు యొక్క లేదా యజమాని యొక్క ఆజ్ఞలను పాలిస్తూ, సన్నిహితమైన దానిని కోరుతూ, ఏ ఏ వస్తువులు, ఏ ఏ ప్రాంతాలు, ఏ ఏ భూఖండాలు తాము అనుభవించటానికి కావాలని అనుకుంటారో వాటిని పొంది జీవిస్తున్నారు.

ఈ లోకంలో ఈ విధంగా సేవ చేస్తూ పొందిన లోకాలు, వస్తువులు అన్నీ నశించిపోతాయి. అంటే, కామ్యకర్మల ద్వారా పొందినవన్నీ నశించిపోతాయి. అగ్నిహోత్రాది కర్మలవల్ల పొందినవన్నీ కూడా (స్వర్గాదులు) కాలం తీరిన తరువాత – నిర్ణీతకాలం కాగానే – నష్టమైపోతాయి. ఈ మానవలోకం కర్మాధికారం కల లోకం. ఈ లోకంలో ఆత్మను, ఈ సత్య సంకల్పం వల్ల ప్రాప్తించినట్టి, అంతఃకరణలో ఉన్నట్టి సత్యకామనను తెలుసుకోకుండానే చనిపోయి పరలోకానికి పోతే అటువంటివారు సమస్త లోకాల్లోను చక్కగా సంచరించలేరు. వారికా స్థితి కలగదు. ఎవరైతే ఈ లోకంలో బ్రతికి ఉండగా ఆత్మను (సత్యకామనను, సత్యసంకల్పాన్నీ) తెలుసుకొని పరలోకానికి పోతారో వారికి మాత్రం సమస్త లోకాల్లోను యథేచ్ఛా విహారం కలుగుతుంది. అంటే సత్యకాముడైన ఆత్మను తెలుసుకొని శరీరత్యాగం చేసిన వానికి మాత్రం (తాను పరబ్రహ్మతో అభేదస్థితిని పొందిన కారణంగా) సమస్త లోకాల్లోను విహరించే అదృష్టం పడుతుంది. ఈ విషయాన్నే ఇంకా విపులీకరిస్తున్నారు.

## రెండవ ఖండం

హృదయాకాశంలో ఉండే బ్రహ్మను ఉపాసించినందువల్ల కలిగే ఫలితం చెపుతున్నారు –

మం॥ **స యది పితృలోకకామో భవతి సంకల్పాదేవాస్య పితరః సముత్తిష్ఠన్తి తేన పితృలోకేన సంపన్నో మహీ యతే. 1**

**అథ యది మాతృలోకకామో భవతి సంకల్పా దేవాస్య మాతరః సముత్తిష్ఠన్తి తేన మాతృలోకేన సంపన్నో మహీయతే. 2**

**అథ యది భ్రాతృలోకకామో భవతి సంకల్పదేవాస్య భ్రాతరః సముత్తిష్ఠన్తి తేన భ్రాతృలోకేన సంపన్నో మహీయతే. 3**

**అథ యది స్వసృలోకకామో భవతి సంకల్పాదేవాస్య స్వసారః సముత్తిష్ఠన్తి తేన స్వసృలోకేన సంపన్నో మహీయతే. 4**

**అథ యది సఖిలోకకామో భవతి సంకల్పాదేవాస్య సఖాయః సముత్తిష్ఠన్తి తేన సఖిలోకేన సంపన్నో మహీయతే. 5**

**అథ యది గంధమాల్యలోకకామో భవతి సంకల్పా దేవాస్య గంధమాల్యే సముత్తిష్ఠత స్తేన గంధమాల్య లోకేన సంపన్నో మహీయతే. 6**

**అథ యద్యన్నపానలోకకామో భవతి సంకల్పా దేవాస్యాన్నపానే సముత్తిష్ఠత స్తేనాన్నపాన లోకేన సంపన్నో మహీయతే. 7**

**అథ యది గీతవాదిత్రలోకకామో భవతి సంకల్పా దేవాస్య గీతవాదిత్రే సముత్తిష్ఠత స్తేన గీతవాదిత్ర లోకేన సంపన్నో మహీయతే.** **8**

**అథ యది స్త్రీలోకకామో భవతి సంకల్పాదేవాస్య స్త్రియః సముత్తిష్ఠన్తి తేన స్త్రీలోకేన సంపన్నో మహీయతే.** **9**

**యం యమ న్తమభికామో భవతి యం కామం కామ యతే సోఽస్య సంకల్పా దేవ సముత్తిష్ఠతి తేన సంపన్నో మహీయతే.** **10**

అన్ని లోకాల్లోను చరించే స్వేచ్ఛ ఎట్లా ఉంటుందో చెపుతున్నారు – సత్యకామమైన హృదయబ్రహ్మను తెలుసుకున్నవాడు చనిపోయిన తరువాత అతడు పితృలోకాన్ని కోరితే పితృగణం ప్రత్యక్షమౌతుంది. అతడు వారితో పితృలోకాలకు పోయి ఆ పితృలోకానుభవాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

ఆ సత్యకాముడు మాతృలోకాల్ని కోరితే అతని సత్యసంకల్పాన్ని బట్టి అతనికి వెనుకటి జన్మలలో జన్మనిచ్చినట్టి, అతనికి సుఖాన్ని, సంతోషాన్ని ఇవ్వగలిగినట్టి మాతృగణం ప్రత్యక్షమౌతుంది. అతడు వారితో కలసి మాతృలోకాలకు పోయి వారితో కలిసి మాతృలోక సుఖాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అట్లాగే ఆ సత్యకాముడైన ఆత్మవేది భ్రాతృలోకాల్ని కోరితే అతని సత్యసంకల్పాన్ని బట్టి భ్రాతృగణం ప్రత్యక్షమౌతుంది. అతడు వారితో కలసి భ్రాతృలోకాలకు పోయి ఆ లోకాలలోని అనుభవాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అతడు భగినీ (సోదరి) లోకాల్ని కోరితే అతని కోరిక ప్రకారం భగనీగనం ప్రత్యక్షమౌతుంది. అతడు వారితో కలసి స్వసృలోకానికి పోయి అక్కడ లభించే సుఖాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అతడు మిత్రలోకాల్ని కోరితే మిత్రులంతా ప్రత్యక్షమౌతారు. వారితో కలసి అతడు మిత్రలోకాలకు పోయి అచటి భోగాలతో సంపన్నుడై మహిమాన్వితుడు అవుతాడు.

అతడు గంధమాల్య లోకాల్ని (పూలదండలు, సుగంధద్రవ్యాలు పుష్కలంగా గల లోకం) కోరితే అతని సత్యసంకల్పాన్ని అనుసరించి గంధమాల్య లోకవాసులు ప్రత్యక్షమౌతారు. అతడు వారితో కలసి వారి లోకంలోని అనుభవాలతో సంపన్నుడై మహిమాన్వితుడౌతాడు.

అతడు అన్నపాన లోకాల్ని కోరితే ఆ లోకవాసులు ప్రత్యక్షమౌతారు. అతడు ఆ లోకవాసులతో కలసి అచటి అనుభవాలను పొంది మహిమాన్వితుడౌతాడు.

అతడు గీతవాద్య సంబంధమైన లోకాల్ని కోరితే ఆ లోకంలో ఉండేవారు ప్రత్యక్షమౌతారు. వారితో కలసి అతడు అచటి కోరికలు అనుభవించి మహిమాన్వితుడౌతాడు.

అట్లాగే అతడు స్త్రీ లోకాన్ని కోరితే ఆ లోకవాసులైన స్త్రీలు ప్రత్యక్షమౌతారు. అతడు ఆ లోకవాసులతో కలసి ఆ లోకంలోని అనుభవాల్ని పొంది మహిమాన్వితుడౌతాడు.

అతడు ఏ ఏ లోకాలను, ఏ ఏ ప్రదేశాలను కోరితే వాటినన్నింటిని పొందుతాడు. ఆ లోకాలన్నీ అతని సత్యసంకల్పాన్ని బట్టి లభిస్తాయి. ఆయా లోకాల్ని అనుభవించి మహిమాన్వితుడౌతాడు.

## మూడవ ఖండం

**మం॥ త ఇమే సత్యాః కామా అనృతాపిధానా స్తేషాం సత్యానాం సతామనృతమపి ధానం యో యో హ్యస్యేతః ప్రైతి న తమిహ దర్శనాయ లభతే. 1**

**అథ యే చాస్యేహ జీవా యే చ ప్రేతా యచ్చాన్య దిచ్ఛన్న లభతే సర్వం తదత్ర గత్వా విందతేఽ త్ర హ్యస్యైతే సత్యాః కామా అనృతాపిధానా స్తద్యథాపి హిరణ్యనిధిం నిహిమక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచాన్తోన విందేయురేవమేవేమాః సర్వాః ప్రజా అహ రహర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం న విన్దన్త్యనృ తేన హి ప్రత్యూఢాః. 2**

**స వా ఏష ఆత్మా హృది తస్యైతదేవ నిరుక్తం హృద్యయమితి, తస్మాద్ధృదయ మహరహర్వా ఏవం విత్స్వర్గం లోకమేతి. 3**

**అథ య ఏష సంప్రసాదోఽ స్మాచ్ఛరీరాత్సాముత్థాయ పరం జ్యోతిరుపసం పద్య స్వేన రూపేణాభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవాచైతద మృతమభయ మేతద్బ్ర హ్మేతి తస్య హ వా ఏతస్య బ్రహ్మణో నామ సత్యమితి. 4**

**తాని హ వా ఏతాని త్రీణ్యక్షరాణి సతీయమితి తద్యత్సత్తదమృతమథ యత్తి తన్మర్త్యమథ యద్యం తేనోభే యచ్ఛతి యదనేనోభే యచ్ఛతి తస్మాద్య మహరహర్వా ఏవం విత్స్వర్గం లోకమేతి. 5**

అసత్ లేక అనృతంతో ఆచ్ఛాదింపబడ్డ సత్యాన్ని, సత్యమనే పేరును ఉపాసించటం చెపుతున్నారు.

పైన చెప్పబడిన ఈ సత్యకామాలన్నీ, అంటే – స్త్రీ, అన్నం, వస్త్రం మొదలైనవాటి అన్నింటిమీద ఉండే కోరికలన్నీ అసత్యంతో ఆచ్ఛాదింపబడి ఉన్నాయి. ఈ అసత్యాన్ని అనృతమని, మిథ్య అని, మాయ అని, అజ్ఞానం అని కూడా అంటారు. ఈ సత్యకామాలకు అసత్యమే ఆచ్ఛాదనగా ఉంది.

చచ్చిపోయిన తరువాత, ఈ పుత్ర, భ్రాతృ, మాతాదులతో సంబంధం ఉండదు. తన హృదయాకాశంలోనే ఉంటూన్నా, అతన్ని (ఆత్మను, సత్యకాముని) చూద్దామన్నా ఇక్కడ దొరకడు. ఎందుచేత? అనృతం చేత ఆచ్ఛాదింపబడి ఉండటంవల్ల.

ఈ ప్రపంచంలో బ్రతికి ఉన్నవారిని గాని, ఈ ప్రపంచంనుండి పోయినవారిని గాని, తాను కోరిన ధన, కనక, వస్తు, వాహనాదుల్ని గాని పొందలేరు. మనం కోరినవన్నీ మనం అనుకున్నవన్నీ పొందాలంటే పురుషుడు తన హృదయాకాశంలో ఉన్న బ్రహ్మలో చేరి మాత్రమే పొందగలుగుతారు. ఇక్కడ ఎందుకు పొందలేడు అంటే ఈ సత్యకామాలన్నీ మిథ్య లేక అసత్యం చేత కప్పబడి ఉన్నాయి కాబట్టి! ఇక్కడ ఉంటూ కూడా వీటిని పొందలేకపోవటానికి దృష్టాంతం చెపుతున్నారు. బంగారపు నిధి భూమిలో పాతిపెట్టబడి ఉంది. తెలియనివాడు ఆ నిధి మీద నుండి వస్తూ పోతూనే నడుస్తూనే ఉంటాడు. కాని ఆ నిధిని గుర్తించలేడు. అట్లాగే ఈ ప్రజలు నిత్యమూ నిద్రలో బ్రహ్మలోకానికి పోతున్నా, తమ లక్ష్యమైనట్టి బ్రహ్మను పొందుతున్నా ఆ బ్రహ్మను మాత్రం గుర్తించలేరు. ఎందుచేతనంటే ఆ బ్రహ్మ అనృతం, అసత్యం, మిథ్య లేక మాయచేత లేదా జీవభావం చేత కప్పబడి ఉన్నందున. నిజంగానే ఆ ఆత్మ హృదయంలోనే ఉంది. 'హృది+అయమ్' అంటే హృదయంలో ఇది (ఆత్మ) ఉంది అని అర్థం. ఇదే హృదయం అనే శబ్దానికి వ్యుత్పత్తి. ఈ విషయం తెలిసినవాడు నిత్యము స్వర్గలోకాన్ని పొందుతాడు. అంటే, హృదయంలో ఉన్న బ్రహ్మలోకాన్ని పొందుతాడు. దేహపాతం జరిగిన తర్వాత కూడా ఈ విద్వాంసునికి 'తత్త్వమసి' అనే జ్ఞానం కలిగినందున బ్రహ్మలోకాన్ని పొందటమనేది నిశ్చితమే!

ఈ సుషుప్తి అవస్థలో ఉండే సంప్రసాదం (ప్రశాంతత – సుప్రసన్నత) అంటే, సంప్రసాదంగా వ్యవహరింపబడే ఆత్మ ఈ శరీరంతో ఉన్న సంబంధాన్ని (శరీరంతో ఉన్న ఆత్మబుద్ధిని) వదలి, పరమజ్యోతిని (పరమాత్మను) పొంది స్వీయరూపంలో ఉంటుంది. అంటే శరీర స్పృహ ఏ మాత్రమూ ఉండదు. ఇదే ఆత్మ అని, ఇదే అమృతమని, ఇదే అభయమని, ఇదే బ్రహ్మ అని అంటారు. ఈ బ్రహ్మకే సత్యమనే పేరు ఉంది. ఇదే గురువు ఉపదేశించిన విషయం.

ఇదే 'సత్యం' అన్నారు గదా! సత్యం అనేదానిలోని అక్షరాలు సత్ ఈయం అనేవి. అంటే సకారం, తకారం, యకారం. తకారానికి తరువాత నున్న ఈకారం ఉచ్చారణ సౌలభ్యం కోసం (త్ అనే హల్లును తేలికగా ఉచ్చరించటానికై) వచ్చిందే మొదట హ్రస్వమైన ఇకారంతోనే పిలిచారు. ఆ అక్షరాల్లో సకారమనేది అమృతం. తకారమనేది మర్త్యం. యం అనే పురుషుడు ఈ రెంటిని నియమనం చేస్తున్నాడు – ఈ రెంటిని అధీనంలో ఉంచుతున్నాడు. ఈ యం అనే దానిని ఈ విధంగా (సత్య పురుష సంజ్ఞగా) తెలుసుకున్నవాడు రోజూ స్వర్గలోకాన్ని పొందుతాడు.

## నాల్గవ ఖండం

**మం॥ అథ య ఆత్మా స సేతుర్విధృతి రేషాం లోకానామసం భేదాయ నైతం సేతుమహోరాత్రే తరతో న జరా న మృత్యు ర్న శోకో న సుకృతం న దుష్కృతం సర్వే పాప్మానోఽతో నివర్తంతేఽ పహతపాప్మా హ్యేష బ్రహ్మలోకః 1**

**తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వాంధః సన్ననన్ధో భవతి విద్ధః సన్నవిద్ధో భవత్యుపతాపీ సన్నుపతాపీ భవతి తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వాపి, నక్తమహరేవాభి నిష్పద్యతే సకృద్విభాతో హ్యేవైష బ్రహ్మలోకః. 2**

**తద్య ఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణాను విన్దన్తి తేషామేవైష బ్రహ్మలోక స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి. 3**

సేతు రూపంలో ఆత్మోపాసన :

పైన చెప్పినట్టి సంప్రసాద రూపమైన ఆత్మ, ఈ లోకాలకు అంటే కర్తృకార్య కారణాలకు ఆధారములైన ఈ పృథివ్యాదులకు సేతువు లాంటిది – ఆనకట్ట లాంటిది. ఇది పరస్పర సంఘర్షణకు లోను కాకుండా ఈ లోకాలను నిలిపి ఉంచుతుంది. ఈ నియామకుని వల్లనే బ్రాహ్మణాది వర్ణాలు, బాల్యాదవస్థలు మొదలైన వాటివల్ల కర్మలవల్ల కలిగే ఫలితాలు మొదలైనవాటి అన్నింటితో ఈ ప్రపంచాన్ని నిలిపి ఉంచుతోంది. ఈ అడ్డుకట్ట ఎందుకు? అంటే, పరస్పర సంఘర్షణ నుండి, వినాశనం నుండి కాపాడటానికి, రాత్రింబవళ్ళు ఈ ఆత్మను పొందలేవు. ఎందుచేత? ఈ ఆత్మ కాలంచేత పరిమితమైనది కాదు కాబట్టి! దీనిని జర, మృత్యువు, శోకం, పుణ్యం, పాపం ఏవీ పొందలేవు – దీనిని అంటవు. అంతేకాదు. ఆనకట్టయైన ఈ ఆత్మవల్ల సమస్త పాపాలు నివృత్తమౌతాయి. మరలిపోతాయి. ఈ ఆత్మ అనేది బ్రహ్మస్వరూపం కాబట్టి పాపరహితమైనది. బ్రహ్మనే బ్రహ్మలోకంగా భావించారనేది గమనించాలి.

అజ్ఞానం చేత అంధుడుగా ఉన్న పురుషుడు సేతురూపమైన ఈ ఆత్మను దాటి వెళ్ళిన తరువాత – అంటే జ్ఞానాన్ని పొందిన తరువాత – ఇక అంధుడుగా ఉండడు. అంధత్వం పోతుంది. శరీరం ఉండగా గాయాలు తగిలి ఉండేవాడు గాయాలు లేనివాడౌతాడు. రోగాలచేత పరితృప్తుడై ఉండే వాని తాపాలన్నీ పోతాయి. అట్లాగే ఆ సేతువును పొందటంతోనే (ఆత్మజ్ఞానం కలగటంతోడనే) రాత్రి కూడా పగలే అవుతుంది. ఎందుచేత? ఆ బ్రహ్మలోకం (పరబ్రహ్మ) సర్వదా ప్రకాశవంతంగానే ఉంటుంది. అక్కడ చీకటి అనేది ఉండదు కాబట్టి రాత్రి అనేది ఉండదు.

అందుచేత, వెనుక చెప్పిన బ్రహ్మను స్త్రీ విషయ తృష్ణా పరిత్యాగ రూపమైన బ్రహ్మచర్యం ద్వారా, శాస్త్రోపదేశం, గురూపదేశం ద్వారా తెలుసుకున్న ఉపాసకునికి ఆ బ్రహ్మలోకం లభిస్తుంది. పిమ్మట సమస్త లోకాల్లోను స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు.

## ఐదవ ఖండం

మం॥ అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవ యోజ్ఞాతా తం విందతేఽథ యదిష్టమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మ చర్యేణ హ్యేవేష్ట్వాత్మాన మను విందతే. 1

అథ యత్సత్రాయణ మిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ తద్బ్రహ్మచర్యేణ హ్యేవసత ఆత్మవస్త్రాణం విన్దతేఽథ యన్మౌన మిత్యాచక్షతే బ్రహ్మచర్య మేవ తద్బ్రహ్మ చర్యేణ హ్యేవాత్మానమనువిద్య మనుతే. 2

అథ యదనాశకాయనమి త్యా చక్షతే బ్రహ్మచర్యమేవ తదేష హ్యాత్మాన నశ్యతి యం బ్రహ్మచర్యేణాను విందతేఽథ యదరణ్యామనమి త్యాచక్షతే బ్రహ్మచర్య మేవ తత్తదరశ్చ హ వైణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే తృతీయాస్యామితో దివి తదైరమ్మదీయం సరస్తదశ్వత్థః సోమసవన స్తదపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితం హిరణ్మయం. 3

తద్య ఏవై తావరం చణ్యం చార్ణవౌ బ్రహ్మలోకే బ్రహ్మచర్యేణానువిన్దన్తి తేషామేవైష బ్రహ్మలోక స్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి. 4

ఈ లోకంలో పరమ పురుషార్థ సాధనమైనట్టి యజ్ఞం అనేది బ్రహ్మచర్యమే! అంటే స్త్రీ విషయ పరిత్యాగరూపమైన బ్రహ్మచర్యంతోపాటు ఇంకా కొన్నివిధాలైన బ్రహ్మచర్యాలను చెపుతున్నారు. వాటిలో యజ్ఞం అనేది బ్రహ్మచర్యమే! ఎందుచేతనంటే, జ్ఞానవంతుడైనవాడు ఈ బ్రహ్మచర్యం ద్వారానే ఆ బ్రహ్మలోకాన్ని పొందుతాడు. అట్లాగే 'ఇష్టము' లేక 'ఇష్టి' అనేది కూడా బ్రహ్మచర్యమే! ఎందుచేతనంటే ఈ బ్రహ్మచర్యరూపమైన ఇష్టము - పూజనం - ద్వారానే ఆత్మకాములై శాస్త్రాదేశాన్ననుసరించి లేదా గురూపదేశాన్ననుసరించి ఆత్మను పొందగలుగుతారు.

తరువాత, మౌనము అనేది కూడా బ్రహ్మచర్యమే. దీనినే ధ్యానం అని కూడా అనవచ్చు. బ్రహ్మచర్య రూపమైన మౌనము అనే సాధనం ద్వారానే ఆత్మను తెలుసుకొని ధ్యానం చేస్తారు కాబట్టి ఇదికూడా బ్రహ్మచర్యమే!

అట్లాగే, సత్త్రాయణమనేది కూడా బ్రహ్మచర్యమే! నిజానికి ఈ సత్త్రాయణ మనే బ్రహ్మచర్యం ద్వారానే–త్+త్రాయణం–సత్ స్వరూపమైన పరమాత్మ ద్వారా తనను రక్షించుకోవటం – జరుగుతుంది కాబట్టి ఇది కూడా బ్రహ్మచర్యమే!

అనాశకాయన మనేది కూడా బ్రహ్మచర్యమే! దీనినే అనశనంతో లేదా ఉపవాసంలో ఉండడం అనవచ్చు. 'అనాశకాయనం' అనే శబ్దానికి రెండు అర్థాలు చెప్పుకోవచ్చు. 1. ఉపవసించి

– ఆహారం లేకుండా ఉండటం. 2. అనాశన+అయనం – నాశనం లేని ఆత్మను పొందటం అని. ఆత్మ అనేది అవినాశి. ఉపవాసమనే సాధనం ద్వారా నాశనం లేని ఆత్మను పొందటం అనేది కూడా బ్రహ్మచర్యమే! 'అరణ్యాయన' మనేది కూడా బ్రహ్మచర్యమే! అరణ్యాయన మంటే అరణ్యాల్లో నివసించటం. దీనినే 'అర' 'ణ్య' అనేవి రెండు సముద్రాలని, బ్రహ్మచారులైనవారు బ్రహ్మలోకంలో ఈ రెండు సముద్రాలను దాటుతారని అంటారు. ఇక్కడ నుండి మూడవదైన స్వర్గలోకంలో 'ఐరంమదీయ' మనే సరోవరం ఉంది. (ఐర=ఆహారం, ఐరం మదీయమంటే హర్షోత్పాదకమైనట్టి ఆహారం) ఆ సరోవరం ఉల్లాసాన్ని కలిగించే ఆహారంతో కూడి ఉంది. అక్కడ 'సోమసవనం' అనే అశ్వత్థవృక్షం ఉంది. అక్కడే హిరణ్యగర్భుని 'అపరాజిత' అనే పేరుగల పట్టణం ఉంది. అక్కడే బ్రహ్మదేవుని చేత నిర్మింపబడిన ఒక బంగారపు మండపం ఉంది.

'అర' 'ణ్య' అనే రెండు సముద్రాలు లేక సరోవరాలు ఉన్నాయని చెప్పాం. బ్రహ్మచర్యం ద్వారా, పైన చెప్పిన యజ్ఞం, ఇష్టము మొదలైన వాటిద్వారా ఆ సముద్రాలను దాటగలిగినవారే ఆ బ్రహ్మలోకాన్ని చేరగలుగుతారు. అటువంటివారికే ఆ లోకం ప్రాప్తిస్తుంది. వారు సమస్త లోకాల్లోనూ స్వేచ్ఛగా సంచరించగలుగుతారు.

ఆరవ ఖండం

మం॥ అథ యా ఏతా హృదయస్య నాడ్యస్తాః పింగలస్యాణి మ్నస్తిష్ఠన్తి శుక్లస్య నీలస్య పీతస్య లోహిత స్యేత్యసౌ వా ఆదిత్యః పింగల ఏష శుక్ల ఏష నీల ఏష పీత ఏష లోహితః.

1

తద్యథా మహాపథ ఆతత ఉభౌ గ్రామౌ గచ్ఛతీమం చాముం
చైవమేవైతా ఆదిత్యస్య రశ్మయ ఉభౌ లోకౌ గచ్ఛన్తీమం చాముం
చాముష్మాదాదిత్యా త్ప్రతాయన్తేతా ఆసు నాడీషు సృప్తా ఆభ్యో
నాడీభ్యః ప్రతాయన్తే తేఽ ముష్మిన్నాది త్యే సృప్తాః.

2

**తద్యత్రైతత్సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజా నాత్యాసు తదా నాడీషు సృప్తో భవతి తం న కశ్చన పాప్మా స్పృశతి తేజసా హి తదా సంపన్నో భవతి. 3**

**అథయ త్రైతదబలిమానం నీతో భవతి తమభిత ఆసీనా ఆహుర్జానాసి మాం జానాసి మామితి స యావదస్మా చ్ఛరీరాదనుత్క్రాన్తో భవతి తావజ్జానాతి. 4**

**అథ యత్రైతదస్మాచ్ఛరీరాదుత్క్రామత్యథై తైరేవ రశ్మిభిరూర్ధ్వ మాక్రమతే స ఓమితి వా హోద్వా మీయతే స యవతిష్యే న్మనస్తావ దాదిత్యం గచ్ఛత్యే తద్వైఖలు లోకద్వారం విదుషాం ప్రపదనం నిరోధోஉ విదుషామ్. 5**

**తదేష శ్లోకః శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధానమభినిః సృతై కా తయోర్ధ్వమాయన్న మృతత్వమేతి విష్వజ్ఞన్యా ఉత్క్రమణే భవన్త్యుత్క్ర మణే భవన్తి. 6**

హృదయనాడిని, ఆదిత్యరశ్మిని గూర్చిన ఉపాసన చెపుతున్నారు. తరువాత వ్యష్టి ఆత్మ, సమిష్టి ఆత్మల అభేదాన్ని చెపుతూ బ్రహ్మోపాసనను ఉపదేశిస్తున్నారు.

ఈ హృదయంలో ఉండే నాడులు సూక్ష్మరసాలతో పింగలవర్ణం (రంగు) కలిగి ఉంటాయి. అట్లాగే కొన్ని నాడులు తెల్లనిరంగు, నీలపురంగు, పసుపు పచ్చని రంగు, ఎఱ్ఱని రంగు కలిగిన రసాలతో కూడి ఉంటాయి. దీనికి కారణం ఆదిత్యుడు పింగళ వర్ణం, శుక్లవర్ణం, నీలవర్ణం, పీతవర్ణం, రక్తవర్ణం కలిగి ఉండటమే. సూర్యకిరణాలలో ఈ రంగులున్నాయని, ఆదిత్యునితో సంబంధం ఉండటంవల్ల ఈ నాడులు కూడా ఆయా వర్ణాలు కలవి అవుతున్నాయి (ఈ వర్ణాలను గురించి – సూర్యుని వేడిని పిత్తమంటారు. ఆ పిత్తం కొద్దిగా శ్లేష్మంతో కలసి వేడెక్కినపుడు తామ్రవర్ణం వస్తుంది. అదే ఎక్కువ గాలితో కలిస్తే నీలవర్ణం వస్తుంది. అదే ఎక్కువ బరువుగల – సాంద్రమైన శ్లేష్మంతో కూడినప్పుడు తెల్లనివర్ణం వస్తుంది. అదే సమానమైన కఫంతో కలిసి పసుపు పచ్చని రంగు వస్తుంది. రక్తం సమృద్ధిగా ఉంటే అదే ఎరుపు రంగు అవుతుంది. ఈ రంగులను గురించి వైద్యులు చెప్పాలి. ఆధునిక వైద్యులు బహుశః వివిధ జీర్ణరసాలు, ఖనిజ లవణాలు, జీవరసాలు ఆ వర్ణాలకు కారణమంటారేమో!)

ఈ విషయంలో అంటే సూర్యునిలోని, సూర్యకిరణాలలోని రంగుల వల్ల హృదయంలోని నాడులకు ఆయా వర్ణాలు వచ్చాయనే విషయంలో ఒక దృష్టాంతం చెప్పుకోవచ్చు – ఒక పెద్ద పొడవైన రాజమార్గం ఉన్నదీ అంటే అది సమీప గ్రామానికీ వెడుతుంది. దూరగ్రామానికీ వెడుతుంది. ఈ సూర్యకిరణాలనేవి పొడవైన బాటలాంటివి. ఈ సూర్యకిరణాలు ఈ పురుషునిలోనికి, ఆదిత్యునివద్దకు కూడా వెడతాయి. అంటే ఈ రెంటిని కలుపుతాయి. అవి నిరంతరం ఆదిత్యుని నుండి వెలువడి, ఈ శరీరంలో ఉండే నాడుల్లోనికి చేరి వ్యాపిస్తాయి. అట్లాగే ఈ హృదయస్థ

నాడుల నుండి బయలుదేరి ఆదిత్య మండలాన్ని చేరతాయి. ఈ కిరణాలు సూర్యుని నుండి హృదయస్థ పురుషుని, హృదయస్థ పురుషుని నుండి సూర్యుని చేరతాయని భావం.

అందుచేత, జీవుడు స్వప్నాలేవీ చూడకుండా నిద్రపోతూ సంప్రసన్నరూపంలో ఉన్నప్పుడు అతడు ఆదిత్య తేజంతో నిండి ఉంటాడు. అప్పుడు వెనుక చెప్పిన నాడులలో ప్రవేశిస్తాడు. ఆ సమయంలో జీవునికి పాపం అంటదు – జీవుడు ఆ స్థితిలో ఆదిత్య తేజంతో పరివ్యాప్తుడై ఉండటం వల్ల.

ఇక ఈ జీవుడే రోగం వల్ల గాని, ముసలితనం వల్ల గాని, శారీరకంగా దుర్బలుడై పోయినప్పుడు అతని సమీప బంధువులంతా అతని నలువైపులా చేరి అడుగుతారు – 'నీ కొడుకునైన నన్ను గుర్తుపట్టావా?' ఫలానావాడినైన నన్ను గుర్తుపట్టావా?' అని. ఆ మరణాసన్నుడైనవాడు తనలోని జీవుడు శరీరం నుండి వెడలిపోయే దాకా గుర్తుపట్టగలుగుతాడు.

ఈ శరీరం నుండి వెలువడ్డ తర్వాత ఆ జీవుడు ఆదిత్య కిరణాల వెంట పైకి పోతాడు. అతడు 'ఓం' అంటూ స్మరిస్తూ ఊర్ధ్వలోకాలకు పోతాడు – అతడు జ్ఞానాన్ని పొందినవాడైతే! అతడు అజ్ఞాని అయితే, అధోలోకాలకు పోతాడు. మనోవేగం వంటి వేగంతో ఆ ఉపాసకుడు ఆదిత్యలోకానికి చేరతాడు. ఈ బ్రహ్మోపాసకులంతా బ్రహ్మలోకాన్ని చేరటానికి నిస్సందేహంగా ఈ ఆదిత్యుడే ద్వారం వంటివాడు–అజ్ఞానులైన వారిని ద్వారం అడ్డగించినట్లుగా అడ్డగించేవాడూ ఆదిత్యుడే!

ఈ విషయమై ఈ దిగువ మంత్రం చెప్పారు – మాంసపు ముద్దలాగా ఉండే ఈ హృదయంలో నూట ఒక్క సంఖ్యగల నాడులున్నాయి. ఇవి హృదయంలో కలసి ఉన్నాయి. అందులో నుండి ఒక నాడి ఊర్ధ్వంగా మూర్ధానికి పోతుంది. జీవుడు ఆ పైకిపోయే నాడిద్వారా పోయి – శరీరాన్ని వదలి అమృతత్వాన్ని పొందుతాడు – మోక్షాన్ని పొందుతాడు. ఇటూ అటూ పోయే మిగతా నాడులన్నీ కేవలం బయటకుపోయే మార్గాలే! ఆ మార్గాలగుండా పోయిన జీవుడు మళ్ళీ జన్మ ఎత్తక తప్పదు. ఇక్కడికీ విషయం పూర్తి అయింది.

## ఏడవ ఖండం

**మం॥ యఆత్మాపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః స సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ కామాన్యస్తమాత్మాన మనువిద్య విజానా తీతి హ ప్రజాపతిరువాచ. 1**

**తద్ధోభయే దేవాసురా అనుబుబుధిరే తే హోచు ర్హన్త తమాత్మాన మన్విచ్ఛామో యమాత్మాన మన్విష్యసర్వాంశ్చ లోకానాప్నోతి**

**సర్వాంశ్చ కామాని తీంద్రోహైవ దేవానామభి ప్రవవ్రాజ విరోచనో-సురా ణాం తౌ హాసంవిదానావేవ సమిత్పాణీ ప్రజాపతి సకాశమా జగ్మతుః. 2**

ఆత్మతత్త్వ జిజ్ఞాసతో ఇంద్రుడు విరోచనుడు కలసి ప్రజాపతి వద్దకు వెళ్ళటం.

"సుషుప్తిలో, సంప్రసాద రూపమై యుండే ఆత్మ, శరీరంలో ఆత్మభావాన్ని వదలి పరంజ్యోతిని పొందుతుంది – నిజరూపాన్ని పొందుతుంది. అదే ఆత్మ, అదే అభయం, అదే బ్రహ్మ" అని ఈ అధ్యాయంలోనే మూడవ ఖండంలోని నాల్గవ మంత్రంలో చెప్పారు. ఆ సంప్రసాదం ఏది? ఈ శరీరం నుండి లేచిపోయి స్వస్వరూపంలో – నిజతత్త్వంలో ఎట్లా లీనమౌతుంది? ఆ సంప్రసాద స్వరూపుని లక్షణం ఏమిటి? దానికి ఆ నిజతత్త్వానికి ఉన్న భేదమేమిటి? ఇవన్నీ చర్చించటానికే ఈ దిగువ కథ ఆరంభమౌతోంది. జ్ఞానబోధకు, జ్ఞానార్జనకు తగిన ఆదేశాలను, జ్ఞాన ప్రాశస్త్యాన్ని గూర్తి చెప్పటానికై ఈ దిగువ కథను ఆరంభిస్తున్నారు –

ఒకప్పుడు ప్రజాపతి ఈ విధంగా అన్నాడు – "ధర్మా ధర్మాలకు సంబంధించినట్టి పాపం అంటని, ముసలితనం లేనట్టి, చావు లేనట్టి, శోకం లేనట్టి, ఆకలిదప్పికలు లేనట్టి, సత్యకాముడు, సత్యసంకల్పుడు అయినట్టి ఈ ఆత్మను గురించిన జ్ఞానం పొందాలంటే శాస్త్రాలలో చెప్పబడిన విషయాలద్వారా, గురూపదేశం ద్వారా పరిశోధించి తెలుసుకోవాలి. అట్లా ఆత్మయొక్క తత్త్వాన్ని గూర్చి చక్కగా తెలుసుకున్నవాడు సమస్త లోకాల్లోను స్వేచ్ఛగా సంచరించగలుగుతాడు. సమస్త కోరికలు పొందగలుగుతాడు" అని.

దేవతలకు రాజు ఇంద్రుడు, అసురులకు రాజు విరోచనుడు. ప్రజాపతి అనిన ఈ మాటలు కర్ణాకర్ణిగా, పరంపరాగతంగా దేవాసురులిద్దరూ విన్నారు. ఇరువురు తమ తమ సభలలో ఉన్న సభాసదులతో అన్నారు – 'మీరు గనుక అనుమతిస్తే మేము ఆత్మను గురించి తెలుసుకోవాలని అనుకుంటున్నాము – దేనిని తెలుసుకున్న తరువాత జీవులు సమస్త భోగాల్ని, సమస్త కోరికల్ని పొందుతారో అటువంటి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలనుకుంటున్నాము'. ఈ విధంగా వారితో చెప్పి నిశ్చయించుకొని ఇంద్రుడు, విరోచనుడు తమ తమ భోగసామగ్రినంతా ఆత్మీయులైనవారికి అప్పగించి ఒకరిమీద ఒకరు ఈర్ష్యతో, ప్రతిస్పర్థతో, సమిధలు చేతబట్టుకొని ప్రజాపతి దగ్గరకు బయలుదేరారు.

ప్రజాపతి వద్దకు వెళ్ళి వారిద్దరూ 32 సంవత్సరాలపాటు బ్రహ్మచర్యంతో ఉన్నారు. అప్పటికి ప్రజాపతి వారి అభిప్రాయం తెలుసుకోవాలని ఇట్లా అడిగాడు – 'మీరు ఇక్కడ దేనిని కోరి నివసిస్తున్నారు?' అని. అందుకు సమాధానంగా వారిద్దరూ ఇట్లా అన్నారు. 'మీరు ఆత్మ అనేది పాపరహితమైనదని, దానికి ముసలితనం లేదని, మృత్యువు లేదని, అది నాశనం లేనిదని, ఆకలిదప్పికలు లేనిదని, అది సత్యకామము, సత్య సంకల్పము అని ఒకప్పుడు అన్నారు. ఆ ఆత్మను అన్వేషించాలని, దానిని బాగా జిజ్ఞాస చేయాలని, అట్లా ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నవారు

సమస్త లోకాల్లోను సమస్త భోగాలు అనుభవిస్తారని మీరు అనిన మాటల్ని శిష్టులైనవారు పరంపరగా చెపుతూ వస్తున్నారు. మేము ఇద్దరము ఇక్కడికి రాకపూర్వం పరస్పరం ద్వేషభావంతో ఉన్నా, ఇక్కడికి వచ్చి ఆ ద్వేషభావాన్ని వీడి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవటానికి బ్రహ్మచర్యంతో ఇక్కడ ఉన్నాము" అని.

ప్రజాపతి, వారి విశుద్ధాంతఃకరణను గుర్తించి వారితో ఇట్లా అన్నాడు – 'ఈ నేత్రంలో ఏ పురుషుడు కనిపిస్తున్నాడో అదే ఆత్మ. అది చావులేనిది, అది భయం లేనిది, అదే బ్రహ్మ." ప్రజాపతి చెప్పిన ఈ మాటలు విని వారిద్దరు నేత్రస్థమైన ఛాయనే – నేత్రంలో ప్రతిబింబించే ప్రతిబింబాన్నే ఆత్మగా భావించి తమ అభిప్రాయాన్ని నిర్ధారణ చేసుకోవటానికై ఇట్లా అన్నారు – "ఓ భగవానుడా! ఈ జలంలో అంతటా కనిపిస్తున్న పురుషుడు, ఈ అద్దంలో కనిపిస్తున్న పురుషుడు వీరిలో ఆత్మ ఎవరు?" అని. అప్పుడు ప్రజాపతి ఇట్లా అన్నాడు – 'ఈ నేత్రంలో ఉన్నాడని ఎవనిని గురించి చెప్పానో అతడే నీటిలోనో, అద్దంలోనో ఉన్నాడు."

## ఎనిమిదవ ఖండం

**మం॥ ఉదశరావ ఆత్మానమవేక్ష్య యదాత్మనో న విజానీ థస్తన్మే ప్రబ్రూతమితి తౌ హోదశరావేఽవేక్షాం చక్రాతే తౌ హ ప్రజాపతి రువాచ కిం పశ్యథ ఇతి తౌ హోచతుః సర్వమేవేదమావాం భగవ ఆత్మానం పశ్యావ ఆ లోమభ్య ఆ నఖేభ్యః ప్రతిరూపమితి. 1**

**తౌ హ ప్రజాపతిరువాచ సాధ్వలంకృతౌ సువసనౌ పరిష్కృతౌ భూత్వోదశ రావే-వేక్షేథా మితి తౌ హ సాధ్వలంకృ సువసనౌ పరిష్కృతౌ భూత్వోదశరావేఽ వేక్షాంచక్రాతే తౌ హ ప్రజాపతిరువాచ కిం పశ్యథ ఇతి. 2**

**తౌ హోచతుర్యథై వేదమావాం భగవః సాధ్వలంకృతౌ సువసనౌ పరిష్కృతౌ స్వ ఏవమేవేమౌ భగవః సాధ్వలంకృతౌ సువసనా పరిష్కృతా విత్యేష ఆత్మేతి హోవాచైతదమృతమభయ మేత ద్బ్రహ్మేతి తౌ హ శాంత హృదయౌ ప్రవవ్రజతుః 3**

ప్రజాపతి వారితో ఇట్లా అన్నాడు – 'మీరు ఈ నీటితో నిండినట్టి పళ్ళెంలో చూడండి. ఆత్మ విషయంలో మీరు తెలుసుకోలేకపోయిన దానిని నాకు చెప్పండి. మీరు అట్లా చూచినా తెలియనిదేదైనా ఉంటే నాకు చెప్పండి' అని. ప్రజాపతి చెప్పినట్లుగానే వారిద్దరూ పళ్ళెంలోని నీటిలోనికి చూచారు. వారిని ప్రజాపతి అడిగాడు – 'మీకు ఏమి కనపడుతోంది? ఏమి చూస్తున్నారు?' అని. వారు – 'ఓ భగవానుడా, మేము మా రూపాన్ని నఖశిఖ పర్యంతం, వెంట్రుకలతో సహా ఎట్లా ఉన్నామో అట్లా కనబడుతున్న మా ప్రతిబింబాన్ని చూస్తున్నాము' అన్నారు.

తరువాత ప్రజాపతి ఛాయాత్మలో వారికున్న ఆత్మతత్వ నిశ్చయాన్ని పోగొట్టటం కోసం వారితో ఇట్లా అన్నాడు – 'మీ యిద్దరూ మంచి దుస్తులు ధరించి, ఆభరణాలతో అలంకరించుకొని నఖశిఖలు కత్తిరించుకొని చక్కగా తయారై వచ్చి చూడండి' అని. వారు అట్లాగే అలంకరించుకొని వచ్చి ఆ పళ్ళెంలోని నీటిలో చూచారు. వారిని ప్రజాపతి 'ఏమి చూస్తున్నారు'? అని అడిగాడు.

ఇంద్రుడు, విరోచనుడు కూడా ఇట్లా అన్నారు – 'ఓ భగవానుడా! మేము ఏ అందమైన వస్త్రాలు, అలంకారాలు తాల్చి చూచామో సరిగా అవే వస్త్రాలతో అలంకారాలతో జలంలో చూస్తున్నాము' అని. అప్పుడు ప్రజాపతి వారికి విచక్షణ జ్ఞానం, వివేకం లేకపోవటాన్ని వారి పరిమిత జ్ఞానాన్ని గ్రహించాడు. తాను తన మనస్సులో ఉన్నట్టి, తాను చెప్పదలచుకొన్నట్టి ఆత్మతత్వాన్ని గూర్చి ఇలా అన్నాడు – 'అదే ఆత్మ, అదే అమృతం, అదే అభయం, అదే బ్రహ్మ' అని. వారిని దుఃఖపెట్టటానికి యిష్టం లేక, తాను చెప్పినదాన్ని బాగా మననం చేసి సత్యాన్ని వారే తెలుసుకోగలుగుతారనే భావంతో అట్లా అన్నాడు. వారిద్దరూ ప్రజాపతి చెప్పినదానిని విని శాంతచిత్తులై – తృప్తులై వెళ్ళిపోయారు. (చాలాకాలం బ్రహ్మచర్యాన్ని అవలంబించి శ్రుతిప్రతిపాదితమైన నేత్రస్థ పురుషుని ద్వారా, పళ్ళెంలోని నీటిలోనికి చూడటమనే యుక్తి ద్వారా ఇరువురు సంస్కారం పొందారని, ఇక నా ఉపదేశాన్ని మాటిమాటికి మననం చేస్తుంటే స్వయంగానే ఆత్మజ్ఞానాన్ని పొందుతారని తలచి ప్రజాపతి తన కర్తవ్యం తాను నెరవేర్చినట్లుగా అనుకొని వారిద్దరినీ ఉపేక్షించి పంపివేశాడు. ఇంద్రుడు, విరోచనుడు ఇద్దరూ మహారాజులే! ఇద్దరూ భోగలాలసులే! వారిద్దరిని ప్రత్యక్షంగా కష్టపెట్టటానికి ఇష్టం లేక పంపివేశాడు).

**మం॥ తౌ హాన్వీక్ష ప్రజాపతిరువాచా నుపలభ్యాత్మాన మననువిద్య వ్రజతో యతర ఏతదుపనిషదో భవిష్యన్తి దేవా వాసురా వా తే పరాభవిష్యన్తీతి స హ శాంతహృదయ ఏవ విరోచనోఽ సురాంజగామ తేభ్యో హైతా ముపనిషదం ప్రోవాచాత్మైవేహ మహయ్య ఆత్మా పరిచర్య ఆత్మానమేవేహ మహయ న్నాత్మానం పరిచరన్నుభౌ లోకావ వాప్నోతీమం చాముంచేతి. 4**

**తస్మాదస్య ద్యేహాదదాన మశ్రద్దధాన మయజమాన మాహురాసురో బతే త్యాసురాణాం హ్యేషోపనిష ద్ప్రేతస్య శరీరం భిక్షయావసనేనాలంకారేణేతి సంస్కు ర్వన్త్యే తేన హ్యాముం లోకం జ్యేష్యన్తో మన్యన్తే. 5**

వారిద్దరూ ఇట్లా వెళ్ళిపోతూ ఉండగా ప్రజాపతి ఈ దిగువ వాక్యాలు అన్నాడు – ఈ మాటలు కూడా తాను వెనుక చేసిన ఉపదేశంలాగానే వారి చెవుల్లో పడతాయి గదా అని. "వీరిద్దరూ ఆత్మను పొందకుండానే, ఆత్మను తెలుసుకోకుండానే వెళ్ళిపోతున్నారు. దేవతలైనా, రాక్షసులైనా ఎవరైనా సరే, ఈ విధమైన వ్యతిరేకమైన నిశ్చయం కలవారైతే తప్పకుండా ఓడిపోతారు"

అని. విరోచనుడు ప్రశాంతమనస్కుడై ఏమీ పట్టించుకోకుండా, అసురుల వద్దకు వెళ్ళిపోయాడు. వారికి దేహమే ఆత్మ అనే బుద్ధి కలిగేటట్లుగా ఆత్మ విద్యను ఉపదేశించాడు – 'లోకంలో దేహరూపమైన ఆత్మయే పూజనీయమైనదని, అదే సేవింపబడదగినదని, ఈ దేహరూపమైనట్టి ఆత్మను పూజిస్తూ, సేవిస్తూ ఉండేవారు ఈ లోకంలోను, పరలోకంలోనూ కూడా సమస్త భోగాలు పొందుతారు" అని వారికి ఉపదేశించాడు.

ఈనాడు కూడా అసురుల సంప్రదాయం కనిపిస్తోంది. ఈ లోకంలో దానం చేయనివారు, శ్రద్ధలేనివారు, యధాశక్తి యజ్ఞం చేయనివారు ఉన్నారు. వారిని చూచి శిష్టులైనవారు – 'వీరు అసుర స్వభావం కలవారని, ఇది అసురులకు సంబంధించిన ఆత్మవిద్య అని, వారు చచ్చినవాని శవానికి గంధం, పూలమాలలు, నైవేద్యం, వస్త్రం మొదలైన అలంకారాలతో అలంకరిస్తూ పరలోకాన్ని పొందాలని అనుకుంటూ ఉంటారు' అని అంటారు.

## తొమ్మిదవ ఖండం

**మం॥ అథ హేన్ద్రోఽ ప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ యథైవ ఖల్వయమస్మి న్ఛరీరే సాధ్వలం కృతే సాధ్వలం కృతో భవతి సువసనే సవసనః పరిష్కృత ఏవమేవాయమస్మిన్నన్ధేఽ ద్ధో భవతి స్రామే స్రామః పరివృక్ణే పరివృక్ణోఽ స్యైవ శరీరస్య నాశమన్వేష నశ్యతి నాహమత్ర భోగ్యం పశ్యామీతి. 1**

**స సమిత్పాణిః పునరేయాయ తం హో ప్రజాపతిరువాచ మఘవన్యచ్ఛాన్తహృదయః ప్రావ్రాజీః సార్థం విరోచ నేన కిమిచ్ఛన్పునరాగమ ఇతి స హోవాచ యథైవ ఖల్వయం భగవోఽ స్మిన్ఛరీరే సాధ్యలంకృతే సాధ్వ లంకృతో భవతి సువసనే సువసనః పరిష్కృతే పరి ష్కృత ఏవమేవాయ మస్మిన్నన్ధేఽ న్ధో భవతి స్రామే స్రామః పరివృక్ణే పరివృక్ణోఽ స్యైవ శరీరస్య నాశమ న్వేష నశ్యతి నాహమత్ర భోగ్యం పశ్యామీతి. 2**

**ఏవమేవైష మఘవన్నితి హోవాచైతం త్వేవ తే భూయోఽ నువ్యాఖ్యాస్యామి వసాపరాణి ద్వాత్రిం శతం వర్షానీతి స హాపరాణి ద్వాత్రింశతం వర్షాణ్యు వాస తస్మై హోవాచ. 3**

ఇంద్రుడు దేవల వద్దకు చేరటానికి పూర్వమే అతనికి భయం వేసింది. అనుమానం కలిగింది. ఏమని? ఎందుకు! ఈ శరీరం చక్కగా అలంకరించబడితే ఈ ఛాయారూపమైన ఆత్మ కూడా అలంకృతమై కనిపిస్తోంది. మంచి అందమైన వస్త్రాలు కట్టుకుంటే ఛాయారూపమైన ఆత్మ కూడా సుందరమైన వస్త్రాలు ధరించినట్లు, ఈ శరీరానివైన నఖరోమాదులు కత్తిరిస్తే ఆ ఛాయ కూడా అట్లాగే కనిపిస్తోంది. ఈ శరీరం గ్రుడ్డిదైతే ఛాయ కూడా గ్రుడ్డిదౌతుంది. కళ్ళు ముక్కులు వగైరాలనుండి స్రావం వస్తూంటే ఈ ఛాయాత్మకు కూడా అట్లాగే స్రావాలు కనిపిస్తున్నాయి. ఈ

శరీరపు కాళ్ళు చేతులు నరకబడితే ఛాయారూపమైన ఆత్మ కూడా అట్లాగే నరకబడి కనిపిస్తుంది. ఈ దేహం నాశనమైతే ఛాయాత్మ కూడా నాశనమౌతుంది. ఇక ఈ విధమైన శరీరాన్ని ఆత్మగా భావించినా, లేక ఛాయను ఆత్మగా భావించినా ఒకటే! దీనివల్ల ఉపయోగమేముంది?' అని.

ఇంద్రుడు ఇట్లా భావించి, మళ్ళీ చేతిలో సమిధలు దాల్చి ప్రజాపతి వద్దకు వచ్చాడు. అతన్ని చూచి ప్రజాపతి – "ఓ ఇంద్రుడా! నీవు విరోచనునితోపాటు, సంతృప్తుడవై, ప్రశాంతంగా వెళ్ళావు గదా! మళ్ళీ ఎందుకు వచ్చావు? ఏమి కోరి వచ్చావు?" అని అడిగాడు. అందుకు ఇంద్రుడు ఇట్లా అన్నాడు – 'ఓ దేవా! ఈ శరీరం అలంకారాలతో కూడి ఉంటే ఛాయాత్మ కూడా అలంకారాలతో ఉంటోంది. ఈ శరీరం సుందరమైన వస్త్రాలు ధరిస్తే, ఛాయా శరీరం కూడా అటువంటి వస్త్రాలు దాల్చి కనిపిస్తోంది. శరీరానికి స్రావాలుంటే! ఛాయాత్మకు కూడా స్రావాలు కనిపిస్తున్నాయి. ఈ శరీరం ఖండింపబడితే ఆ ఛాయారూపమైన ఆత్మ కూడా ఖండింపబడి ఉంటోంది. ఈ శరీరం నశిస్తే, అది కూడా నశిస్తోంది. కాబట్టి ఈ ఛాయారూపమైన ఆత్మ వల్ల ఉపయోగమేమీ కనపడటం లేదు' అని.

అప్పుడు ప్రజాపతి ఇట్లా అన్నాడు – "ఓ ఇంద్రుడా! నీవనుకున్నది నిజమే! నిజంగా ఇది ఇంతే! ఈ విషయమై నేను మళ్ళీ వ్యాఖ్యానం చేస్తాను. నీవు మళ్ళీ ముప్పది రెండు సంవత్సరాలు యిక్కడ ఉండు" అని. అట్లాగే ఇంద్రుడు అంగీకరించి 32 సంవత్సరాలు ప్రజాపతి వద్ద ఉన్నాడు. అప్పుడు ప్రజాపతి ఇంద్రునితో అంటున్నాడు –

## పదవ ఖండం

**మం॥ య ఏష స్వప్నే మహీయమాన శ్చర త్యేష ఆత్మేతి హోవాచైతదమృతమ భయ మేతద్బ్రహ్మేతి స హ శాంతహృదయః ప్రవవ్రాజ స హాప్రాప్యైవ దేవానేత ద్భయం దదర్శ తద్యద్యపీదం శరీరమన్ధం భవత్యనన్ధః స భవతి యది స్రామమస్రామో నైవైషోఽ స్య దోషేణ దుష్యతి. 1**

**స వ ధేనాస్య హన్యతే నాస్య స్రామ్యేణ స్రామోఘ్నన్తి త్వేవైనం విచ్ఛాదయన్తీ వాప్రియవేత్తేవ భవత్యపి రోదితీవ నాహమత్ర భోగ్యం పశ్యామీతి. 2**

**స సమిత్పాణిః పునరేయాయ తం హ ప్రజాపతి రువాచ మఘవన్యచ్ఛాన్త హృదయః ప్రావ్రాజీః కిమిచ్ఛన్పున రాగమ ఇతి స హోవాచ తద్యద్యపీదం భగవః శరీర మన్ధం భవత్యనన్ధః స భవతి యది స్రామమస్రామో నైవైషోఽ స్య దోషేణ దుష్యతి. 3**

**న వధేనాస్య హన్యతే నాస్య స్రామ్యేణ స్రామో ఘ్నన్తి త్వేవైనం విచ్ఛాదయ న్తీవాప్రియవేత్తేవ భవ త్యపి రోదితీవ నాహమత్ర భోగ్యం పశ్యామీ త్యేవ మేవైష మఘవన్నితి హోవాచైతం**

**త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి వసాపరాణి ద్వాత్రింశతం వర్షాణీతి స హాపరాణి ద్వాత్రింశతం వర్షాన్యువాస తస్మై హోవాచ.** **4**

'స్వప్నంలో కాంతా కనకాదులతో అనేక విధాలైన అనుభవాలతో కూడి విహరిస్తూ ఉండేది ఈ ఆత్మయే! ఇది చావులేనిది. ఇది అభయం. ఇదే బ్రహ్మ అని ప్రజాపతి చెప్పగా విని తృప్తుడై, ప్రశాంతచిత్తుడై ఇంద్రుడు వెళ్ళిపోయాడు. కాని, దేవతల వద్దకు చేరటానికి పూర్వమే మళ్ళీ అతనికి అనుమానం, భయం కలిగింది. అంతేకాదు, ఆ స్వప్నాత్మలో ఒక విధమైన భయం కనిపించింది. ఈ శరీరం గ్రుడ్డిదైనా ఆ స్వప్నాత్మ గ్రుడ్డిది కావటం లేదు – గ్రుడ్డివాడు కూడా స్వప్నంలో చూస్తున్నాడు. శరీరావయవాలకు స్రావం కనిపిస్తే స్వప్నాత్మ కండ్లు ముక్కు మొదలైన అవయవాల్లో స్రావం కనిపించటం లేదు. ఈ శరీరానికి ఏ విధమైన దోషాలున్నా ఆ దోషాలు స్వప్నాత్మకు కనిపించటం లేదు.

ఈ శరీరం వధింపబడినంత మాత్రం చేత స్వప్నశరీరం వధింపబడటం లేదు. నష్టం కావటం లేదు. ఈ శరీరంలోని ముక్కులు, కండ్లు కారుతున్నా స్వప్న శరీరంలో అవి కనిపించటం లేదు. ఈ శరీరాన్ని ఎవరైనా కొట్టినా గాయపరచినా స్వప్న శరీరం గాయపడదు. అయినప్పటికి దీనిని ఎవరో కొట్టుతూన్నట్లు, తరుముతూన్నట్లు, ఏదో అప్రియమైనవాటిని చూస్తున్నట్లు ప్రియవియోగంలో దుఃఖిస్తున్నట్లు కనిపిస్తుంది. కాబట్టి ఇటువంటి స్వప్నాత్మదర్శనం వల్ల ఫలమేమిటి?

ఇట్లా అనుకొని మళ్ళీ సమిధలు చేతబట్టి ప్రజాపతి వద్దకు వెళ్ళాడు ఇంద్రుడు. తన వద్దకు మళ్ళీ వచ్చిన ఇంద్రుని చూచి ప్రజాపతి – 'ఓ ఇంద్రుడా! నీవు తృప్తితో, ప్రశాంతంగా వెళ్ళావు గదా! మళ్ళీ ఎందుకు వచ్చావు? ఏమి కోరి వచ్చావు?' అని అడిగాడు. ఇది విని ఇంద్రుడు – "ఓ దేవా! ఈ శరీరం గ్రుడ్డిదైనా స్వప్నశరీరం గ్రుడ్డిది కావటం లేదు. ఈ శరీరానికి చక్షుర్నాసికా స్రావాదులున్నా అటువంటి స్రావాలు స్వప్నాత్మలో కనపడటం లేదు. ఈ విధంగా చూస్తే స్వప్నదేహం ఈ దేహానికున్న దోషాలవల్ల దూషితం కావటం లేదు.

ఈ దేహం వధింపబడటం వల్ల ఆ స్వప్నాత్మ వధింపబడటం లేదు. దీనికున్న స్రావాలు ఆ స్వప్నాత్మకు కనిపించటం లేదు. అయినప్పటికీ ఎవరో దానిని కొట్టుతూ ఉన్నట్లు, తరుముతూ ఉన్నట్లు, ఏదో అనిష్టాన్ని శంకిస్తున్నట్లు, ఏదో భయంతో ఏడుస్తున్నట్లు ఉంటుంది. ఈ విధంగా ఉండే స్వప్నాత్మను తెలుసుకొని ఏమి ప్రయోజనం?" అని అన్నాడు. ఇది విని ప్రజాపతి ఇట్లా అన్నాడు – 'ఓ ఇంద్రా! ఇది ఇంతే! నీవు చెప్పినది నిజమే! నీకు నేను మళ్ళీ ఆత్మతత్త్వాన్ని వివరిస్తాను. అందుకోసం నీవు మళ్ళీ 32 సంవత్సరాలు ఇక్కడ బ్రహ్మచర్యంలో ఉండు'. అట్లాగే ఇంద్రుడు మళ్ళీ 32 సంవత్సరాలు గురుశుశ్రూష చేస్తూ బ్రహ్మచర్యంతో ప్రజాపతి వద్ద ఉన్నాడు. అప్పుడు ప్రజాపతి మళ్ళీ ఈ విధంగా చెప్పాడు.

## పదునొకండవ ఖండం

మం॥ తద్యత్రైత త్సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానాత్యేష ఆత్మేతి హోవాచైతదమృత మభయ మేతద్బ్రహ్మేతి స హ శాంతహృదయః ప్రవవ్రాజ స హాప్రాప్యైవ దేవానేతద్భయం దదర్శ నాహ ఖల్వయ మేవం సంప్రత్యాత్మానం జానాత్యయమహమస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమేవాపీతో భవతి నాహ మత్ర భోగ్యం పశ్యామీతి. 1

స సమిత్పాణిః పునరేయాయ తం హ ప్రజాపతిరువాచ మఘవన్య చ్ఛాన్తహృదయః ప్రావ్రాజీః కిమిచ్ఛన్పున రాగమ ఇతి స హోవాచ నాహ ఖల్వయం భగవ ఏవం సంప్రత్యాత్మానం జానాత్యయమహ మస్మీతి నో ఏవేమాని భూతాని వినాశమేవాపీతో భవతి నాహ మత్ర భోగ్యం పశ్యామీతి. 2

ఏవమేవైష మఘవన్నితి హోవాచైతం త్వేవ తే భూయోఽనువ్యాఖ్యాస్యామి నో ఏ వాన్యత్రైతస్మాద్వ సాపరాణి పంచవర్షాణీతి స హాపరాణి వపంచవర్షాణ్యు వాస తాన్యే కశతం సంపేదురేతత్తద్యదాహు రేకశతం హ వై వర్షాణి మఘవాన్ప్రజాపతౌ బ్రహ్మచర్య మువాస తస్మై హోవాచ. 3

పురుషుడు తన ఇంద్రియాలన్నింటిని ఉపసంహరించుకొని, సుప్రసన్నుడై, స్వప్నాలేవీ చూడకుండా గాఢనిద్రలో ఉండే స్థితిని సుషుప్తి అంటారు. ఆ స్థితిలో ఉండే ఆ పురుషుడే ఆత్మ, అతడే అమృతుడు, అతడే అభయుడు, అతడే బ్రహ్మ అని ఉపదేశించిన ప్రజాపతి ఉపదేశాన్ని విని తృప్తుడై, ప్రశాంతచిత్తుడై ఇంద్రుడు వెడలిపోయాడు. కాని అతడు దేవతల వద్దకు చేరేలోపుగానే అతనికి అనుమానం కలిగింది. ఏమని? ఈ సుషుప్తిలో ఉండే పురుషుడు నిజంగా 'ఇది నేనే' అని తనను తాను ఎరుగడు. జాగ్రత్ స్వప్నాల్లో లాగా ఇతర జీవుల్ని ఎరగడు. అందుచేత ఆ స్థితిలో అతడు వినాశనాన్ని పొందినట్లు, సమస్తము కోల్పోయినట్లు ఉంటాడు. కాబట్టి ఈ విషయంలో నాకేమీ ప్రయోజనం కనిపించటంలేదు అని.

మళ్ళీ ఇంద్రుడు సమిధలు చేతపట్టుకొని ప్రజాపతి వద్దకు వెళ్ళాడు. అతనిని చూచి ప్రజాపతి – 'ఓ ఇంద్రుడా! నీవు శాంతచిత్తుడవై వెళ్ళావు గదా! మళ్ళీ ఏమి కోరివచ్చావు? అని అడిగాడు. ఇంద్రుడన్నాడు – దేవా! ఈ సుషుప్తిలో నన్ను నేను తెలుసుకోలేకుండా ఉన్నాను. అంటే సుషుప్తిలో 'ఇది నేనే' అనే విషయం నాకు తెలియటం లేదు. ఇతర జీవరాశుల్నీ, ఇతర భూతాల్నీ వేటినీ తెలుసుకోలేకుండా ఉన్నాను. వినాశనం ప్రాప్తించినట్లుగా తోస్తోంది. అందుచేత నాకు ఇందులో కూడా కోరిన ప్రయోజనం కనిపించటం లేదు' అని.

అప్పుడు ప్రజాపతి ఇట్లా అన్నాడు – 'ఓ ఇంద్రా! ఇది ఇట్లాగే ఉంటుంది. దీనిని గురించి నీకు మళ్ళీ వివరిస్తాను. ఆత్మ అనేది దీనికి భిన్నమైంది కాదు. ఇదే ఆత్మ. ఇందులో ఇంకేదో దోషం మిగిలి ఉన్నట్లుంది. దాని నివృత్తికోసం ఇంకొక అయిదు సంవత్సరాలు మళ్ళీ బ్రహ్మచర్యవాసం చెయ్యి! ఇంద్రుడు అట్లాగే అయిదు సంవత్సరాలు బ్రహ్మచర్యం పాటించాడు. మొత్తం అన్నీ కలిపితే 101 సంవత్సరాలు అయినాయి. అందుచేతనే శిష్టులైనవారు 'ఇంద్రుడు ప్రజాపతి వద్ద 101 సంవత్సరాలపాటు గురుకులవాసం చేశాడని, అప్పటి కాతనికి ఆత్మజ్ఞానం కలిగిందని' అంటూ ఉంటారు. (అంటే, స్వర్గాధిపతియైన ఇంద్రుడు సమస్త భోగాలు వదలి, దేవతల సాహచర్యం వదలి ఆత్మజ్ఞానం కోసం కఠోరమైన బ్రహ్మచర్య దీక్ష అనుభవించాడంటే, స్వర్గభోగాలకంటె ఆత్మజ్ఞానం మిన్న అనే విషయం తెలుస్తోంది. దానికోసం ఎవరైనా అంతటి కష్టాన్ని సహించక తప్పదు అని తెలుస్తోంది.)

తరువాత ప్రజాపతి ఇంద్రునితో ఇట్లా అన్నాడు –

## పండ్రెండవ ఖండం

**మం॥ మఘవన్మర్త్యం వా ఇదం శరీరమాత్తం మృత్యునా తదస్యామృతస్యా శరీర స్యాత్మనోఽ ధిష్ఠానమాత్తో వై సశరీరః ప్రియా ప్రియాభ్యాం న వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతిర స్త్య శరీరం వావ సన్తం న ప్రియాప్రియే స్పృశతః 1**

**అశరీరో వాయురభ్రం విద్యుత్ స్తనయిత్నురశరీరాణ్యే తాని తద్యథై తాన్యముష్మాదాకాశాత్స ముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యన్తే. 2**

**ఏవమేవైష సంప్రసాదోఽ స్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే స ఉత్తమః పురుషః స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్ రమ మాణః స్త్రీభిర్వా యానైర్వా జ్ఞాతిభిర్వా నోపజనం స్మరన్నిదం శరీరం స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవమేవాయ మస్మిన్ఛరీరే ప్రాణో యుక్తః 3**

**అథ యత్రైతదాకాశమనువిషణ్ణం చక్షుః స చాక్షుషః పురుషో దర్శనాయ చక్షురథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా గంధాయ ఘ్రాణమథ యోవేదేదమభి వ్యాహరాణీతి స ఆత్మాభి వ్యాహరాయ వాగథ యో వేదేదం శృణవానీతి స ఆత్మా శ్రవణాయ శ్రోత్రం. 4**

**అథ యో వేదేదం మన్వానీతి స ఆత్మా మనోఽ స్య దైవం చక్షుః స వా ఏష ఏ తేన దైవేన చక్షుషా మనసైతాన్కామాన్పశ్యన్రమతే య ఏతే బ్రహ్మ లోకే 5**

**తం వా ఏతం దేవా ఆత్మాన ముపాసతే తస్మాత్తేషాం సర్వే చ లోకా ఆత్తాః సర్వే చ కామాః స సర్వాంశ్చ లోకానాప్నోతి సర్వాంశ్చ**

**కామాన్యస్త మాత్మాన మనువిద్య విజానాతీతి హ ప్రజాపతిరువాచ ప్రజాపతి రువాచ. 6**

"ఓ ఇంద్రుడా! నిజంగా ఈ శరీరం మరణశీలమైనదే! మరణించడమే దీని స్వభావం. ఈ శరీరం సర్వదా మృత్యుగ్రస్తమై ఉంటుంది. చావులేనట్టి, నాశనం లేనట్టి ఆత్మకు ఈ శరీరమనేది నివాస స్థానంగా ఉంటుంది. కాబట్టి ఈ శరీరం, ఆత్మ లభించే చోటు అన్నమాట. శరీరంతో కూడి ఉన్నదానికి దేనికైనా సరే ఇష్టము – అయిష్టము, ప్రియము – అప్రియము అనేవి ఉంటాయి. అందుచేత ఈ శరీరం ఉన్నంతవరకు ఇష్టానిష్టాలు, ప్రియాప్రియాలు పూర్తిగా నశించవు. ఈ శరీరం నశించటంతోనే ఇష్టానిష్టాలు, ప్రియాప్రియాలు అన్నీ ఈ ఆత్మను వదలిపోతాయి – దీనికి అవి అంటవు. అందుచేత ఆత్మకు శరీరం లేకపోవటమనేది స్వాభావికం. ఉపాధి, లేక శరీరం ధరించటమనేది అస్వాభావికం. కాబట్టి ఈ శరీరం వల్ల సంక్రమించినట్టి ఇష్టానిష్టాలు కూడా అస్వాభావికాలే! ఆత్మ తన స్వభావాన్ని పొందటంతోనే ఈ అస్వాభావికమైనవి ఇక ఉండవు.

కాళ్ళు చేతులు మొదలైన అవయవాలు లేనందువల్ల వాయువు అశరీరం. మేఘం, మెరపులు, ఉరుములు ఇవన్నీ వస్తుతః అశరీరాలే! వీటికి శరీరమనేది లేదు – అంటే రూపం లేదు. అయినా వర్షం కురవటం కోసం ఇవి పైకిపోయి సూర్యుని పరమజ్యోతిని పొంది ఆయా రూపాల్లో కనిపిస్తున్నాయి. అంటే శీతాకాలం గడిచిపోయిన తరువాత, వేసవి యందలి తీవ్రతాపాన్ని పొంది, అంతవరకు ప్రశాంతంగా, నిశ్చలంగా ఉన్న స్థితిని వదలి (సూర్యతేజం వల్ల) వర్షాకాలం రాగానే ఆయా రూపాల్లో మేఘంగా, మెరపుగా, వాయువుగా, ఉరుములుగా స్థిరపడతాయి. అంటే వాయువు ఋతుపవన రూపం ధరిస్తుంది. అంతవరకు రూపంలేని మేఘం భూమిలాగా, కొండల్లాగా, ఏనుగుల్లాగా రూపాల్ని ధరిస్తుంది. అంతవరకు రూపంలేని మెరపు రకరకాల తీగల్లాగా, ఉరుములు వివిధ శబ్దాలతోను రూపుదాలుస్తాయి. అట్లాగే శరీరం లేనట్టి ఆత్మ, ఆనంద స్వరూపమైనట్టి ఆత్మ అజ్ఞానం కారణంగా శరీరం దాల్చి, మళ్ళీ ఆ బంధనాన్ని వదల్చుకొని తన స్వస్వరూపంలో తాను ఉంటోంది అనేందుకు పైన చెప్పిన వాయు మేఘాదులు ఉదాహరణలు.

పైన చెప్పిన ఈ సంప్రసాద స్వరూపుడు – జీవాత్మ – శరీరంనుండి పైకి పోయి (మేఘంలాగా) పరమజ్యోతిని పొంది తన స్వస్వరూపంలో తాను సంస్థితుడౌతాడు. శరీరమే ఆత్మ అనే భావం వదలివేస్తాడు. అప్పుడాతడు పరమపురుషుడు. అక్కడ ఆ స్థితిలో అందరితోను అభేదాన్ని పొంది అతడు నవ్వుతాడు, క్రీడిస్తాడు, స్త్రీలతో, వాహనాలతో, సన్నిహితులతో రమిస్తూ ఉంటాడు. స్త్రీ పురుష సంయోగం వల్ల పుట్టిన ఈ శరీరాన్ని విస్మరిస్తూ అశరీరుడై మనస్సుతో మాత్రమే అంతటా తిరుగుతూ ఉంటాడు. బండికి కట్టిన గుఱ్ఱంలాగా ఈ జీవాత్మ శరీరానికి బంధింపబడి ఉంది.

జాగ్రదవస్థలో కంటిద్వారా ఆకాశాన్ని చూచేది ఆత్మ – చూడాలని అనుకునేది ఆత్మ. అతడు చాక్షుష పురుషుడు. రూపగ్రహణం కోసం అతనికి నేత్రాలున్నాయి. అవి చూడటానికి సాధనాలు. 'దీనిని వాసన చూస్తాను' అని అనుకునేది ఆత్మ. గంధ గ్రహణం కోసం అతనికి ముక్కు ఉంది. 'నేను ఇది మాట్లాడాలి' అనుకునేది ఆత్మ. శబ్దోచ్చారణకోసం అతనికి వాక్కు ఉంది. 'నేను వినాలి' అని అనుకునేది ఆత్మ. వినటానికి అతనికి చెవులున్నాయి.

ఈ బాహ్యేంద్రియాలేవీ లేకుండానే నేను మననం చేస్తాను అని అనుకునేది ఆత్మ. మనస్సు అనేది అతనికి దివ్యనేత్రం. అటువంటి ఈ ఆత్మయే ఈ దివ్య చక్షువుతో (మనస్సుతో) భోగాల్ని చూస్తూ, రమిస్తూ ఉంటుంది.

బ్రహ్మలోకంలో ఈ భోగాలన్నీ స్వర్ణనిధిలాగా, బాహ్య విషయాల మీద ఆసక్తి అనేటటువంటి అసత్యంతో ఆచ్ఛాదింపబడి ఉన్నాయి. వాటిని చూస్తూ రమిస్తూ ఉండే ఆత్మను దేవతలు ఉపాసిస్తారు. అందువల్ల దేవతలకు సంపూర్ణమైన లోకాలు, సమస్త భోగాలు ప్రాప్తిస్తాయి. శాస్త్రాధ్యయనం ద్వారా, గురూపదేశం ద్వారా తెలుసుకొని సమస్త భోగాల్ని పొందుతాడు" అని ఈ విధంగా అన్నాడు ప్రజాపతి.

పదమూడవ ఖండం

**మం॥ శ్యామాచ్ఛబలం ప్రపద్యే శబలాచ్ఛ్యామం ప్రపద్యేఽశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోర్ముఖాత్ప్రముచ్య ధూత్వా శరీరమ కృతం కృతాత్మా బ్రహ్మలోకమభిసంభవామీ త్యభి సంభవా మీతి.** **1**

ఈ 'శ్యామాచ్ఛబలం' అనే మంత్రం శుద్ధి కోసం, జపం కోసం, ఉపాసన కోసం ఉద్దేశించబడింది.

అత్యంత దుర్గమమైనది కాబట్టి (చేరటం చాలా కష్టం కాబట్టి) నేను హృదయంలో ఉన్నట్టి శ్యామల వర్ణం గల బ్రహ్మ నుండి చిత్రవర్ణ బ్రహ్మను పొందుతాను. చిత్రవర్ణ బ్రహ్మనుండి శ్యామబ్రహ్మను పొందుతాను. అంటే శరీరపాతం తరువాత చిత్రవర్ణశోభితమై వివిధవస్తుజాతంతో (అర, ణ్య అనే సరోవరాలతో) కూడిన బ్రహ్మను పొందుతాను. అంటే నా స్వస్వరూపాన్ని పొందుతాను. ఆ చిత్రవర్ణ బ్రహ్మలోకాన్ని పొందటం ఎట్లాగో చెపుతున్నారు – గుఱ్ఱం తన శరీరాన్ని విదిలించి, రోమాల్ని ఝళిపించి పరిశుద్ధమైనట్లుగా హృదయంలో ఉన్న బ్రహ్మను గూర్చిన జ్ఞానం ద్వారా ధర్మాధర్మరూపమైన పాపాలను విదిలించి పారేసి, రాహువు నోటినుండి విడివడ్డ చంద్రునిలాగా అన్ని అనర్థాలకు ఆశ్రయమైన ఈ శరీరాన్ని వదలి కృతార్థుడనై నిత్య బ్రహ్మలోకాన్ని చేరతాను. ఆ సత్య బ్రహ్మలోకాన్ని చేరతాను అని భావం.

## పదునాల్గవ ఖండం

**మం॥ ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదన్తరా తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా ప్రజా పతేః సభాం వేశ్మ ప్రపద్యే యశోహం భవామి బ్రాహ్మణానాం యశో రాజ్ఞాం యశో విశాం యశోఽహమను ప్రాపత్సి స హాహం యశసాం శ్వేతమదత్క మదత్కం శ్యైతం లిన్దు మాభిగాం లిన్దు మాభిగాం.** 1

ఆకాశమనేది ఆత్మ. ఆ ఆకాశమే (ఆత్మయే) నామరూపాలను కల్పిస్తుంది. ఎవనిలో ఈ నామరూపాలున్నాయో అతడే బ్రహ్మ, అతడే అమృతుడు, అతడే ఆత్మ. నేను ప్రజాపతి యొక్క సభాగృహాన్ని ప్రవేశిస్తాను. నేను బ్రాహ్మణుల యశస్సు, క్షత్రియుల యశస్సు, వైశ్యుల యశస్సు రూపంలో ఉండే ఆత్మను పొందాలనుకుంటున్నాను. నే ఆ యశస్సులన్నింటిని మించిన యశస్సును (మహత్తును) దంతాలు లేకపోయినా భక్షించేటటువంటి, తెల్లని వర్ణం కలిగి జారిపోతుండే ప్రదేశాన్ని పొందకుండా ఉందునుగాక! పునర్జన్మకై ఏ యోనియందు ప్రవేశింపకుందునుగాక! అని భావం. అక్కడికి పోవటం వల్ల (గర్భంలోనికి పోవటం వల్ల) తేజస్సు, బలం, వీర్యం, విజ్ఞానం, ధర్మం అన్నీ నశిస్తాయి. కాబట్టి ఆ స్థితి కలుగకుండుగాక! అని ప్రార్థన.

పదునైదవ ఖండం

**మం॥ తద్ధైతద్బ్రహ్మా ప్రజాపతయ ఉవాచ ప్రజాపతిర్మనవే మనుః ప్రజాభ్య ఆచార్యకులాద్వేదమధీత్య యథా విధానం గురోః కర్మాతిశేషేణాభి సమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయమధీయానో ధార్మికా న్విదధదాత్మని సర్వేంద్రియాణి సంప్రతిష్ఠాప్యాహింస న్సర్వభూతా న్యన్యత్ర తీర్థేభ్యః స ఖల్వేవం వర్తయన్యా వదాయుషం బ్రహ్మలోకమభి సంపద్యతే న చ పునరా వర్తతే న చ పునరావర్తతే.** 1

ఈ ఆత్మజ్ఞానాన్ని బ్రహ్మ ప్రజాపతికి బోధించాడు. ప్రజాపతి మనువుకు, మనువు ప్రజలకు బోధించాడు. శాస్త్రోక్తంగా గురుకులవాసం చేసి, వేదాధ్యయనం చేసి, గురుకులం నుండి సమావర్తనం పూర్తి అయి, పెండ్లాడి, గృహస్థు అయి, పవిత్రమైన చోట స్వాధ్యాయం చేస్తూ, పుత్రుల్ని, శిష్యుల్ని ధర్మపరాయణులుగా తీర్చిదిద్దుతూ, సమస్త ఇంద్రియాలను తన అంతఃకరణంలోనికి ఉపసంహరించుకొని (జితేంద్రియుడై) శాస్త్ర విరుద్ధమైన జీవహింస చేయకుండా, జీవితాంతం ఈ విధంగా బ్రతికే అధికారియైన పురుషుడు చివరకు బ్రహ్మలోకాన్ని పొందుతాడు. అచటినుండి మళ్ళీ తిరిగిరాడు. ఈ విధంగా అర్చిరాది మార్గం ద్వారా కార్యబ్రహ్మలోకానికి పోయిన ఉపాసకుడు బ్రహ్మలోకమున్నంతవరకు అచటి దివ్యభోగాలు అనుభవించి, ఆ లోకంతో పాటు అక్కడే ముక్తిని పొందుతాడు. అందుచేత అతనికి పునరావృత్తి (పునర్జన్మ) ఉండదు.

## ఉత్తర శాంతి పాఠము

ఓం. ఆప్యాయన్తు మమాంగాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్ర మథో బల మింద్రియాణిచ సర్వాణీ సర్వం బ్రహ్మౌప నిషదం మా-హం బ్రహ్మనిరా కుర్యాం మామాబ్రహ్మ నిరాకరోదనిరాకరణ మస్త్వ నిరాకరణం మే-స్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయిసన్తు తే మయిసన్తు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

- : ఓం తత్సత్ : -

# ఐతరేయోపనిషత్తు

## మొదటి అధ్యాయం

## శాంతి పాఠము

**మం॥ ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠిత మావీరావీర్మ ఏధి వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీర నేనాధీ తేనాహోరాత్రాన్ సందధామ్యృతం వదిష్యామి సత్యం వదిష్యామి తన్మామవతు తద్వక్తార మవతు అవతుమామ్ అవతువక్తారమ్ అవతువక్తారమ్॥**

నా మాటలు నా మనస్సును అనుసరించుగాక! అట్లాగే, నా మనస్సు నా మాటలపై ఆధారపడి యుండుగాక! అంటే, నా మనస్సులో నిశ్చయించుకొన్న దానినే నా మాటలు వ్యక్తం చేయుగాక! నా మాటలలో అన్నట్లే, నా మనస్సు ఆలోచించుగాక! ఈ రెంటికి సమన్వయం ఉండాలని భావం. సమన్వయం లేకపోతే అది సత్యం కాదు.

ఓ పరమాత్మా! నాకు ప్రత్యక్షం కమ్ము! ఓ వాక్, మనస్సులారా! నా కోసం వేదాన్ని తీసుకురండి! నేను విన్న విషయాలు నన్ను వీడిపోకుండు గాక! ఎల్లప్పుడు జ్ఞాపకం ఉండాలి. శాస్త్రాధ్యయనం ద్వారా రాత్రింబవళ్ళను ఏకం చేస్తాను – రాత్రింబవళ్ళనే భేదం లేకుండా నిరంతరం శాస్త్రాధ్యయనం చేస్తాను అని భావం. నేను వాక్కు ద్వారా ఋతాన్నే చెపుతాను – సత్యాన్నే చెపుతాను. మనస్సు ద్వారా కూడా సత్యాన్నే చెపుతాను. ఆ పరబ్రహ్మ నన్ను కాపాడు గాక! నా గురువును కాపాడు గాక! నన్ను నా గురువను కాపాడుగాక!

త్రివిధములైన తాపములు శాంతించు గాక!

(ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, అధిదైవిక తాపములు)

ఓం శాంతిః శాంతిః శాంతిః

### ప్రథమ ఖండం

**మం॥ ఓం॥ ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్. నాన్యత్ కించన మిషత్. స ఈక్షత లోకాన్ను సృజా ఇతి.** **1**

ఆత్మ ఈక్షణ పూర్వకంగా (ఆలోచన పూర్వకంగా) లోకాల్ని రచించినట్లు చెపుతున్నారు –

ఈ ప్రపంచ సృష్టికి పూర్వం, ఇప్పుడు మనకు కనిపిస్తూ ఉన్న నామ రూపాలతో కూడిన ఈ జగత్తు అంతా ఆత్మమాత్రంగానే ఉండేది. ఆత్మకు భిన్నమైనట్టి పదార్థమేదీ లేదు. ఆ ఆత్మయే

ప్రపంచాలను సృష్టించుదామని అనుకుంది.

**మం॥ స ఇమాల్లోకానసృజత అమ్భో మరీచీర్మరమాపోఽ దోఽ మ్భః పరేణ దివం ద్యౌః ప్రతిష్ఠాఽ న్తరిక్షం మరీ చయః పృథివీ మరో యా అధస్తాత్తా ఆపః. 2**

**సృష్టిక్రమం :** ఆ ఆత్మయే అంభస్సు, మరీచి, మర, ఆపః అనే పేర్లుగల లోకాలను సృజించింది. ద్యులోకానికి ఆవల ఉన్నది అంభస్సు. దానికి స్వర్గము ఆశ్రయం. ఆ ద్యులోకానికి క్రిందనున్న భువర్లోకం మరీచి. దానికి క్రిందదైన ఈ భూలోకం మరము – అంటే మరణము గుణంగా గలది. (ఈ లోకంలోని ప్రాణులు చస్తూ ఉంటాయి కాబట్టి ఇది మరలోకం). ఈ భూమికి క్రింద ఉన్నది ఆపోలోకం (జలము). అది క్రిందనున్న లోకాలచేత పొందబడుతోంది కాబట్టి ఆపోలోకం. ఆప్ అనే ధాతువుకు పొందబడటమనే అర్థం ఉంది.

ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మింపబడి ఉన్నా ప్రత్యేక గుణాల వల్ల ఈ పేర్లు వచ్చాయి.

**మం॥ స ఈక్షతేమే ను లోకా లోకాపాలాన్ను సృజా ఇది సోఽ ద్భ్య ఏవ పురుషం సముద్ధృత్యా మూర్ఛయత్. 3**

**లోకపాలుర సృష్టి :** పిమ్మట ఆత్మ ఈ విధంగా ఆలోచించింది. "లోకాలు సృష్టించటం అయినది – అయితే, ఈ లోకాలను రక్షించేవాళ్ళు లేకపోతే అవి నాశనమౌతాయి కాబట్టి, నేను ఈ లోకాలను రక్షించేందుకు లోకపాలురను సృష్టించాలి". ఈ విధంగా ఆలోచించి పంచభూతాలలోను ప్రధానమైనట్టి జలాన్ని తీసుకొని దానితోనే అవయవాలతో కూడిన ఒక మానవ ఆకారాన్ని సృష్టించింది. (అంటే విరాట్ సృష్టి జరిగిందన్న మాత.) ఆ మానవ ఆకారన్నే విరాట్ పురుషుడు అంటారు.

**మం॥ తమభ్యతపత్త స్యాభిత ప్తస్య ముఖం నిరభిద్యత యథాం డమ్. ముఖాద్వాగ్వాచోఽ గ్నిర్నాసికే నిరభిద్యేతాం నాసికాభ్యాం ప్రాణః ప్రాణద్వాయురక్షిణీ నిరభి ద్యేతా మక్షిభ్యాం చక్షుశ్చక్షుష ఆదిత్య. కర్ణౌ నిరభిద్యేతాం కర్ణాభ్యాం శ్రోత్రం శ్రోత్రాద్దిశ స్త్వజ్నిరభిద్యత త్వచో లోమాని లోమభ్య ఓషధివనస్పతయో హృదయం నిరభిద్యత హృదయాన్మనో మనసశ్చన్ద్రమా నాభిర్నిర భిద్యత నాభ్యా అపానోఽ పానాన్మృత్యుః శిశ్నం నిరభి ద్యత శిశ్నాద్రేతో రేతస ఆపః. 4**

ఇంద్రియాలు ఇంద్రియాధిష్ఠాతలైన దేవతల్ని సృష్టించటం చెపుతున్నారు.

పరమాత్మ, ఆ పురుషాకారంలో ఉన్న పిండాన్ని (విరాట్ పురుషుని) దృష్టిలో ఉంచుకొని, సంకల్పరూపమైన తపస్సు (ఆలోచన) చేశాడు. ఆ విధంగా సంకల్పాత్మకమైన తపస్సు వల్ల

(గ్రుడ్డు పగిలినట్లుగా) ఆ విరాట్పురుషాండం నుండి నోరు వ్యక్తమైంది. ఆ నోటి నుండి మాట, ఆ మాట నుండి (వాణికి అభిమాన దేవతయైన) అగ్ని ఉత్పన్నమైంది. పిమ్మట నాసికారంధ్రాలు ఏర్పడ్డాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అంటే ఘ్రాణశక్తి పుట్టింది. ఆ ఘ్రాణశక్తి నుండి వాయువు పుట్టింది. తరువాత ఆ విరాట్ పిండానికి నేత్ర గోళాలు ఏర్పడ్డాయి. ఆ నేత్ర గోళాలలో నుండి నేత్రేంద్రియాలు, ఆ నేత్రేంద్రియం నుండి ఆదిత్యుడు (సూర్యుడు) ఆవిర్భవించారు. 295

తరువాత ఆ పిండానికి రెండు చెవులు ఏర్పడ్డాయి. ఆ శ్రోత్రేంద్రియాల నుండి దిక్కులు ఏర్పడ్డాయి. పిమ్మట ఈ ఇంద్రియాలన్నింటికి అధిష్ఠానంగా ఉండే త్వక్ (చర్మం) ఏర్పడ్డది. ఆ త్వగింద్రియం నుండి స్పర్శకు కారణభూతమైన రోమాలు పుట్టినాయి. ఆ స్పర్శేంద్రియం నుండి ఓషధులు, వనస్పతులు పుట్టినాయి. తరువాత హృదయం ఏర్పడ్డది. ఆ హృదయం నుండి అంతరింద్రియమైన మనస్సు పుట్టింది. ఆ మనస్సు నుండి చంద్రుడు పుట్టాడు. తరువాత నాభి పుట్టింది ఆ నాభి నుండి అపానము, అపానం నుండి మృత్యువు పుట్టినాయి. తరువాత పురుష జననేంద్రియం (శిశ్నము), దాని నుండి శుక్రము (వీర్యము), ఆ శుక్రము నుండి దానికి అధిష్ఠానమైన జలము పుట్టినాయి. (జలంతో సృష్టి ఆరంభమై జలప్రళయంతో అంతమవటం కనిపిస్తోంది).

ఈ విధంగా విరాట్పురుషుని అవయవాల నుండి ఇంద్రియాలు, వాటి అభిమాన దేవతలు పుట్టారు.

రెండవ మంత్రంలో పరమాత్మ నీటితో మానవాకారాన్ని చేసినట్లు చెప్పబడ్డది. ఆ నీరు వీర్యానికి (శుక్రానికి) అధిష్ఠానం. మూడవ మంత్రంలో ఆ విరాట్ నుండి ఇంద్రియాలు, వాటి అభిమాన దేవతలు ఉద్భవించినట్లు చెప్పారు. చివరకు శుక్రాధిష్ఠానమైన జలమే పుట్టింది. మళ్ళీ ఆ జలం నుండే జీవోత్పత్తి జరిగి ప్రళయ కాలంలో సృష్టి అంతా జలంలోనే కలుస్తోంది.

## ద్వితీయ ఖండం

**మం॥ తా ఏతా దేవతాః సృష్టా అస్మిన్ మహత్యర్ణవే ప్రాప తన్ తమశనాయా పిపాసాభ్యామన్వవార్జత్ తా ఏన మబ్రువన్నాయతనం నః ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్నమదామేతి. 1**

ఈ విధంగా ఈశ్వరుని చేత లోకపాలురుగా సృష్టింపబడ్డ అగ్ని మొదలైన దేవతలు (ఇంద్రియాభిమానులైన దేవగణం) మహా సముద్రంలో పడ్డారు. (మహా సముద్రం అంటే దుఃఖ కారణాలైన అవిద్య, కామం, కర్మ మొదలైన వాటివల్ల కలిగే దుఃఖమనే జలంతోను, రోగాలు, ముసలితనం, చావు మొదలైన జలచరాలతోను కూడిన సంసార సాగరం). దానికి అంతం లేదు. విశ్రాంతి స్థానం లేదు. ఇంద్రియాను భూతులవల్ల కలిగే క్షణిక సుఖాలతో, పాప తరంగాలతో కూడినది.

పరమేశ్వరుడు ఆ విరాట్పిండానికి ఆకలి దప్పికలు కలిగేటట్లుగా చేశాడు. ఇంద్రియాభి మానులైన దేవతలందరు ఆ పరమేశ్వరుని ఈ విధంగా అడిగారు – మేము కూర్చుండి మాకు నిర్ణయింపబడ్డ భోజ్య వస్తువులను (అన్నాన్ని) భక్షించేందుకు వీలుగా మాకు తగిన స్థానాన్ని ప్రసాదించవలసింది అని.

విరాట్పురుషునికి ఆకలిదప్పికలు తప్పనప్పుడు, అతనివల్ల పుట్టిన ఈ దేవతలందరికీ ఆకలిదప్పికలు తప్పవు గదా! ఆకలి దప్పికలు తీరటానికి అన్నం కావాలి. అన్ని ఇంద్రియాల ఆకలి ఒకటి కాదు. కాబట్టి వాటి వాటి అన్నాలు, వాటిని అనుభవించే స్థానాలు వేరుగా ఉంటాయి.

**మం॥ తాభ్యో గామానయత్తా అబ్రువన్న వైనోఽయ మల మితి. తాభ్యోఽశ్వమానయత్తా అబ్రువన్న వై నోఽయమలమితి. 2**

అప్పుడా దేవతల కోసం ఈశ్వరుడు జలంలో నుండి ఆవు ఆకారంలో ఉండే ఒక పిండాన్ని తీసుకొని వచ్చి యిచ్చాడు. ఆ దేవతలు 'ఇది మాకు సరిపోదు' అన్నారు. అప్పుడు మళ్ళీ ఈశ్వరుడు వెనుకటిలాగానే నీళ్ళలో నుండి గుఱ్ఱం ఆకారంలో ఉండే పిండాన్ని తీసికొనివచ్చి దేవతలకు చూపించాడు. దానిని చూచి వారు 'ఇది మాకు సరిపోదు' అన్నారు. (సరిపోదు అంటే మేము భుజించేటందుకు తగిన స్థానంగా ఉపయోగపడదు అని భావం. అన్న భక్షణానికి నిమిత్త ఆశ్రయంగా చాలదు అన్నమాట.)

**మం॥ తాభ్యః పురుషమానయత్తా అబ్రువన్ సుకృతం బతేతి పురుషోవావ సుకృతమ్ తా అబ్రవీద్యథా యతనం ప్రవిశతేతి. 3**

అప్పుడు భగవంతుడు వారికోసం తన విరాట్ స్వరూపాన్ని పోలిన పురుష శరీరాన్ని తీసికొని వచ్చి యిచ్చాడు. ఆ రూపాన్ని చూడడంతోనే దేవతలు "ఈ శరీరం బాగుంది. నిజంగా పురుష (మానవ) శరీరమే సుందరమైన సృష్టి. అది ఈశ్వరుడు తానుగా సృష్టించుకున్న రూపం" అన్నారు.

అప్పుడు భగవంతుడు వారితో – 'మీరు మీ మీ ఆశ్రయ స్థానాల్లో ప్రవేశించండి' అన్నాడు. దేవతలు మానవుని సుకృతం అన్నారు. సుకృతం అంటే చక్కగా చేయబడినది, పుణ్యము, మంచిపని అని అర్థాలు. మానవుడు ఈనాటికీ పుణ్యకార్యాలు చేస్తూనే ఉన్నాడు. భగవంతుడు స్వయంగా మానవుని తన మాయ ద్వారా సృష్టించాడు. అందుచేతనే సుందరమైన సృష్టి అయినది.

**మం॥ అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశద్వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశదాదిత్య శ్చక్షుర్భూత్వాఽక్షిణీ ప్రావిశద్దిశః శ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్నో షధివనస్పతయో లోమాని**

**భూత్వా త్వచం ప్రావిశం శ్చంద్రమా మనో భూత్వా హృదయం ప్రావిశన్మృత్యు రపానో భూత్వా నాభిం ప్రావిశ దాపో రేతో భూత్వా శిశ్నం ప్రావిశన్.** **4**

వాగింద్రియాభిమానియైన అగ్ని వాగ్రూపాన్ని ధరించి నోటిలో ప్రవేశించాడు. వాయువు ప్రాణం రూపం ధరించి నాశికారంధ్రాలలో ప్రవేశించాడు. సూర్యుడు దృష్టిరూపం దాల్చి నేత్రాల్లో ప్రవేశించాడు. దిగ్దేవతలు శ్రోత్రేంద్రియ రూపంలో చెవులలో ప్రవేశించారు. ఓషధి వనస్పతులు రోమాలుగా అయి చర్మంలో ప్రవేశించాయి. చంద్రుడు మనస్సు రూపందాల్చి హృదయంలోను, మృత్యుదేవత అపానరూపం దాల్చి నాభిలోను ప్రవేశించినాయి. జలం వీర్యరూపం దాల్చి జననేంద్రియంలో ప్రవేశించింది.

**మం॥ తమశనాయాపిపాసే అబ్రూతామావాభ్యామభిప్రజానీ హీతి తే అబ్రవీదేతా స్వేవ వాం దేవతాస్వాభజామ్యే తాసు భాగిన్యౌ కరోమీతి తస్మాద్యస్యై కస్యై చ దేవతాయై హవిర్గృహ్యతే భాగిన్యావేవాస్యామ శనాయా పిపాసే భవతి.** **5**

పైన చెప్పిన దేవతలందరు తమ తమ స్థానాలకు చేరుకోగా ఇక ఆశ్రయం లేకుండా మిగిలిపోయినవి ఆకలిదప్పికలు. ఈ క్షుత్పిపాసలు ఈశ్వరునితో – "మాకు కూడా ఆశ్రయాల్ని కల్పించవలసింది" అని ప్రార్థించినాయి. అప్పుడు పరమేశ్వరుడు వాటితో – 'మీ యిద్దరిని ఈ దేవతలందరితో భాగస్వాములుగా చేస్తాను. అందరితోను భాగస్వాములుగా ఉండటంవల్ల ఏ దేవతకు హవిస్సు యిచ్చినా, ఆ హవిస్సులో ఆకలి దప్పికలకు కూడా భాగం ఉంటుంది. (సృష్టికి ప్రారంభంలో ఈశ్వరుని చేత నియమితమైన ఈ వ్యవస్థను ఈనాడు కూడా మనం చూస్తూనే ఉన్నాం. కంటికి ఆకలి దప్పికలంటే చూడాలనే కోరిక. చూడదలచిన ఆ దృశ్యం చూడడంతోనే దాని క్షుత్పిపాసలు తీరుతున్నాయి. అట్లాగే శ్రవణేంద్రియాలనికి ఏ సంగీతమో, ప్రియభాషణమో వినాలని కోరిక – ఆ ఆకలి దప్పిక ఆ శ్రవ్యవస్తువుగా ఆహుతిగా ఆ యింద్రియానికి తృప్తి కలిగిస్తోంది. ఈ విధంగా ప్రతి ఇంద్రియాధిష్ఠాన దేవతతోను, ఆకలి దప్పికలు భాగస్వామ్యం వహిస్తున్నాయి.

## తృతీయ ఖండం

**మం॥ స ఈక్షతేమే ను లోకాశ్చ లోకపాలాశ్చాన్నమేభ్యః సృజా ఇతి.** **1**

ఈశ్వరుడు అన్న సృష్టికి సంకల్పిస్తున్నాడు.

అప్పుడు ఈశ్వరుడు ఈ విధంగా ఆలోచించాడు – "ఇంద్రియాలను, ఇంద్రియాధిష్ఠాతలైన దేవతలను (లోకాలను, లోకపాలురను) సృష్టించాను. ఇప్పుడీ దేవతల కోసం అన్నాన్ని సృష్టించాలి" అని.

దేవతలను సృష్టించటం, వాటికి ఆకలి దప్పికలను సృష్టించటం జరిగింది. మరి ఆ ఆకలి దప్పికలు తీరాలంటే అన్నం అవసరం గదా! అన్నం లేనిదే ఈ ఇంద్రియాలు జీవించలేవు. కాబట్టి అన్నసృష్టి అవసరం. తమ అధీనంలోని భృత్యుల బాగోగులు చూడటం యజమాని విధి గదా! అందుచేతనే సర్వేశ్వరుడు ఈ ఇంద్రియాల కోసం అన్నసృష్టి చేయాలని భావించాడు.

**మం॥ సోఽ పోఽ భ్య తపత్తాభ్యోఽ భితప్తాభ్యో మూర్తిరజా యత యా వై సా మూర్తి రజాయతాన్నం వై తత్. 2**

అన్న సృష్టి చేయాలనే తలంపుతో – సంకల్పంతో భగవంతుడు వెనుక చెప్పిన జలాన్ని దృష్టిలో ఉంచుకొని తపస్సు చేశాడు – ఆలోచించాడు. ఆ విధంగా తపస్సు చేత అభితప్తమైన జలంనుండి చరాచరాలకు ఆధారాన్ని ఇవ్వగలిగినట్టి, ఘనీభవించినట్టి ఒక ఆకారాన్ని సృష్టించాడు. ఆ విధంగా ఉత్పన్నమైన రూపమే అన్నము!

**మం॥ తదేతత్సృష్టం పరాఙ్ త్యజిఘాంస త్తద్వాచాఽ జిఘృక్షత్ తన్నాశక్నోద్వాచా గ్రహీతుం సయద్ధైనద్వాచాఽ గ్రహైష్యదభివ్యాహృత్య హైవాన్నమత్రస్యత్. 3**

ఆ విధంగా ఇంద్రియాధిష్ఠాతలైన దేవతలకోసం సృష్టింపబడ్డ అన్నం పిల్లిని చూచి ఎలుక పారిపోయినట్లుగా ఈ దేవతలను చూచి (తన పాలిట మృత్యు దేవతలని భావించి – భోక్తలు కాబట్టి) పారిపోవటానికి పూనుకుంది. అప్పుడా ఆదిపురుషుడు దానిని వాక్కుతో పట్టుకోవాలని ప్రయత్నించాడు. కాని దానిని పట్టుకోలేకపోయాడు. ఆనాడు ఆ ఆది పురుషుడు వాక్కుతోనే అన్నాన్ని పట్టుకొనగలిగి ఉంటే, అతని నుండి జన్మించిన తరువాత పుట్టిన పురుషుడు కూడా 'అన్న'మనే మాటను ఉచ్చరించటంతోనే భుజించినంత తృప్తిని పొంది ఉండేవాడు.

**మం॥ తత్ప్రాణే నాజిఘృక్షత్ తన్నాశక్నోత్ప్రాణేన గ్రహీతుం స యద్ధైన ప్రాణేనాగ్రహైష్యదభిప్రాష్య హైవాన్నమ త్రప్స్యత్. 4**

అప్పుడా పురుషుడు అన్నాన్ని ప్రాణన క్రియతో గ్రహించాలని అనుకున్నాడు. కాని ప్రాణంతో దానిని గ్రహించలేకపోయాడు (ఘ్రాణేంద్రియంతో). ఆనాడతడు అన్నాన్ని ఘ్రాణేంద్రియంతో గ్రహించగలిగి ఉంటే ఇప్పుడు మానవుడు అన్నమనే భావనతో ప్రాణనక్రియ జరిపితే (ఊపిరి పీలిస్తే) తృప్తి పొందగలిగి ఉండేవాడు.

**మం॥ తచ్చక్షుషాఽ జిఘృక్షత్ తన్నాశక్నోచ్చక్షుషా గ్రహీ తుం స యద్ధైన చక్షుషాఽ గ్రహైష్యద్దృష్ట్వా హైవాన్న మత్రస్యత్. 5**

**తచ్ఛ్రోత్రేణాజిఘృక్షత్ తన్నాశక్నో చ్ఛ్రోత్రేణ గ్రహీతుం స యద్ధైనచ్ఛ్రో త్రేణాఽ గ్రహైష్య చ్ఛృత్వాహైవాన్నమత్రప్స్యత్. 6**

**తత్త్వచాఽజిఘృక్షత్ తన్నాశక్నోత్ త్వచా గ్రహీతుంస యద్ధైవత్త్వచాఽగ్రహైష్యత్ స్పృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్.** **7**

**తన్మన్సా జిఘృక్షత్ తన్నాశక్నోన్మనసా గ్రహీతుం స యద్ధైనన్మనసాఽగ్రహైష్యత్ ధ్యాత్వా హై వాన్న మత్రప్స్యత్.** **8**

**తచ్ఛి శ్నేనాజిఘృక్షత్ తన్నాశక్నోచ్ఛిశ్నేనగ్రహీతుం స యద్ధైనచ్ఛి శ్నేనాగ్రహైష్యత్ విసృజ్య హైవాన్న మత్రప్స్యత్.** **9**

**తదపానేనాజిఘృక్షత్ తదావయత్ సైపోఽన్నస గ్రహో యద్వాయురన్నా యుర్వా ఏషయద్వాయుః** **10**

అప్పుడాతడు నేత్రంతో అన్నాన్ని గ్రహించాలని యత్నించాడు కాని గ్రహించలేకపోయాడు. అతడప్పుడు నేత్రంతో గ్రహించగలిగి ఉంటే ఈనాడు నేత్రంతో అన్నాన్ని చూడడంతోనే తృప్తి పొంది ఉండేవాడు. తరువాత శ్రోత్రేంద్రియంతో అన్నగ్రహణం చేయాలనుకున్నాడు. కాని గ్రహించలేకపోయాడు. అప్పుడాతడు శ్రోత్రంతో అన్నాన్ని గ్రహించగలిగి ఉంటే ఇప్పుడు మానవుడు అన్నం పేరు విన్నంత మాత్రం చేతనే తృప్తి పొంది ఉండేవాడు.

పిమ్మట స్పర్శేంద్రియంతో (చర్మం) అన్నాన్ని పట్టుకోవాలనుకున్నాడు. కాని గ్రహించలేకపోయాడు. ఆనాడు అన్నాన్ని చర్మంతోనే గ్రహించగలిగి ఉంటే ఈనాడు మానవుడు అన్నాన్ని స్పృశించినంతనే తృప్తి పొంది ఉండేవాడు.

తరువాత ఆ పురుషుడు అన్నాన్ని జననేంద్రియంతో గ్రహించాలనుకున్నాడు. సాధ్యం కాలేదు. అట్లా గ్రహించగలిగి ఉంటే ఈనాడు మానవుడు విసర్జనతోనే తృప్తిపొంది ఉండేవాడు.

అదేవిధంగా అతడు అన్నాన్ని అపానంతో గ్రహించాలని అనుకున్నాడు. అపానంతో అన్నాన్ని గ్రహించగలిగాడు. ఇప్పుడు అన్నాన్ని గ్రహించేది అపానమనే వాయువే! అన్నం మీద ఆధారపడి జీవించేదని ప్రసిద్ధమైన ఆ వాయువు అపానమనే పేరుతో ఉండే వాయువే! నోటితో లోనికి పీల్చబడే వాయువు అపానము. ఆ అపానమే అన్నాన్ని గ్రహిస్తుంది. భోక్త ఆత్మకాదు – లోపలికి పీల్చబడే వాయురూపంలో ఉన్న అపానమే!

**మం॥ స ఈక్షత కథం న్విదం మదృతే స్యాదితి స ఈక్షత కతరేణ ప్రపద్యా ఇతి. స ఈక్షత యది వాచాఽభి వ్యాహృతం యది ప్రాణేనాభిప్రాణితం యది చక్షుషా దృష్టం యది శ్రోత్రేణ శ్రుతం యది త్వచా స్పృష్టం యది మనసా ధ్యాతం యద్యపానేనాభ్య పానితం యది శిశ్నేన విసృష్టమథకోఽ హమితి.** **11**

భగవంతుడీ విధంగా ఇంద్రియాలను వాటికి అధిష్ఠాతలైనట్టి ఆహారంమీద ఆధారపడి ఉన్నట్టి, దేవతలతో కూడిన ఈ పిండాన్ని సృష్టించి ఆలోచించాడు – 'నేను లేకుండా ఈ ఇంద్రియాలతో కూడిన పిండం వల్ల ఉపయోగమేమిటి? – పట్టణము ప్రజలు ఉన్నప్పుడు దానిని పాలించటానికి రాజు ఉండాలి కదా! లేకపోతే అల్లకల్లోలం! అట్లాగే నేను లేకపోతే ఈ శరీరం వ్యర్థమేగదా! అయితే నేను ఈ రెండు మార్గాల్లో దేనిద్వారా ప్రవేశించాలి?" అని.

అంతేకాదు, ఇంకా చాలా అనుకున్నాడు – "నేను లేకుండా వాగింద్రియం మాట్లాడటం చేస్తే, నేను లేకుండానే ఘ్రాణేంద్రియం ప్రాణనకర్మ సాగిస్తే, త్వగింద్రియం స్పర్శ వ్యాపారాన్ని సాగించగలిగితే, మనస్సు ఆలోచించగలిగితే, నా ప్రమేయం లేకుండానే అపానం ఆహారాన్ని స్వీకరించగలిగితే, అట్లాగే జననేంద్రియం విసర్జన వ్యాపారం నిర్వర్తిస్తే ఇక నా అస్తిత్వమేముంటుంది? నేను లేకుండానే అన్ని పనులు జరిగిపోతే, ఇక నావల్ల ప్రయోజనమేముంటుంది? రాజు లేకుండా పట్టణ పరిపాలన అసంభవమైనట్లే నేను లేకుండా ఈ శరీర వ్యాపారాలు జరగటం అసంభవం" అని.

రెండు మార్గాలలో దేని నుండి ప్రవేశించాలి? అని ఆలోచన. ఒక మార్గం పాదాల చివరి నుండి (అధోమార్గం, ప్రాణాది సేవకులు ప్రవేశించే మార్గం) రెండవది ఊర్ధ్వమార్గం (శిరస్సు పై భాగం నుండి ప్రవేశించటం రాజమార్గం).

**మం॥ స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాప ద్యత. సైషా విదృతిర్నామ ద్వాస్తదేతన్నాన్దనమ్. తస్య త్రయ ఆవసథాస్త్రయః స్వప్నా అయమావ సథో౾ యమావసథో౾ య మావసథ ఇతి. 12**

సృష్టికర్తయైన పరమేశ్వరుడు మస్తకాన్ని చీల్చి ఆ మార్గం గుండా ఈ ఇంద్రియ సమూహంలో (మానవాకార పిండంలోనికి) ప్రవేశించాడు. ఈ మార్గం (ద్వారం) విదృతి అనే పేరుతో ప్రసిద్ధమైంది. అది ఆనందప్రదమైనది. (ఈ ద్వారం గుండా నూనె మొదలైనవన్నీ ఇతర ముఖ, నేత్ర, శ్రోత్రాది ఇంద్రియాలను చేరతాయి అని ప్రతీతి ఉంది గదా! అందుకే కపాలం మీద తైలమర్దనం చేస్తారు. శిరః స్నానం కూడా అందుకే! శిరః స్నానం చేస్తే అన్ని ఇంద్రియాలు స్నానం చేసినట్లే!) ఈ ద్వారం గుండానే పరమాత్మను దర్శించటం కూడా సాధ్యమౌతుంది కాబట్టి – ఆనందాన్ని కలిగిస్తుంది కాబట్టి – నందనం అని కూడా దీనికి పేరుంది. ఆ పరమాత్మ నివసించే స్థానాలు మూడున్నాయి – మూడూ స్వప్నాలే!

**మం॥ ఒకటి నేత్రస్థానం–జాగ్రదవస్థ–ఈ ప్రపంచం. రెండవది కంఠస్థానం–స్వప్నావస్థ–స్వప్న ప్రపంచం. మూడవది హృదయస్థానం–సుషుప్తి,,–సుషుప్తి ప్రపంచం.**

**స జాతోభూతాన్యభివ్యైఖ్యత్ కిమిహాన్యం వావదిష. దితి. స ఏతమేవ పురుషం బ్రహ్మ తతమమపశ్యత్. ఇదమదర్శమితీ 3.** **13**

ఈ విధంగా జీవభావంతో ఈ శరీరంలో ప్రవేశించిన పరమేశ్వరుడు భూతాల్ని (పంచభూతాలు) తాదాత్మ్యభావంతో గ్రహించాడు (నేను చూస్తున్నాను, నేను వింటున్నాను, నేను సుఖంగా ఉన్నాను) అని ఈ విధంగా అంటున్నాడు. అంటే పరమేశ్వరుడు సాకారుడైనాడు. ఈ జీవియే గురువు యొక్క దయవల్ల జ్ఞానాన్ని పొంది 'ఇక్కడ నేను తప్ప మరెవరున్నారు? ఉన్నది నేనే! నేను ఈ పురుషుని దర్శించాను. ఆ పురుషుడే పూర్ణబ్రహ్మ స్వరూపుడు;' అని అనుకుంటున్నాడు. ఈ విధంగా జీవుని మోహం నివృత్తి అయి, నేను వేరు పరమాత్మ వేరు అనే భేదభావం నశించి అద్వైతసిద్ధి కలుగుతోంది.

ఇదం : దీనిని నేరుగా – ప్రత్యక్షంగా చూడటం వల్ల ఇదంద్రమైంది.

**మం॥ తస్మాదిదింద్రో నామేదన్ద్రో హ వై నామ. తమిదన్ద్రం సన్తమిన్ద్ర ఇత్యాచక్షతే పరోక్షేణ. పరోక్షప్రియా ఇవ హి దేవాః పరోక్ష ప్రియాఇవ హి దేవాః** **14**

అందుకే పరమేశ్వరునికి 'ఇదంద్ర'మనే పేరు వచ్చింది. లోకంలో ఈశ్వరుడు 'ఇదంద్ర' మనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. దేవతలు పరోక్ష ప్రియులు కాబట్టి, అంటే పరోక్షంగా ఉండే పేర్లు ఇష్టం కాబట్టి. బ్రహ్మవేత్తలు ఇదంద్రమనే దానినే 'ఇంద్ర' శబ్దంతో పిలుస్తారు.

సారాంశము : సత్యస్వరూపుడైన పరబ్రహ్మమే ఈ విశ్వం యొక్క సృష్టి స్థితి లయాలకు కారణమైనవాడు. సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి అయిన పరమాత్మ ఆకాశాదికంతో ప్రారంభించి వరుసగా ఈ ప్రపంచాన్ని తాను తప్ప ఇతర పదార్థ సాధన సహాయం లేకుండా సృష్టించాడు. పిమ్మట ఈ జీవరాసులన్నింటిలోను అవి తమను తాము గుర్తించటం కోసం ప్రవేశించాడు. ఆ విధంగా ప్రవేశించి సూటిగా తన్ను తాను గుర్తించాడు. 'అహం బ్రహ్మోస్మి' 'నేనే బ్రహ్మను' అని. కాబట్టి అన్ని జీవులలోను ఉన్నది ఆ పరబ్రహ్మమే! అన్యమేదీ లేదు. కాబట్టి అహం బ్రహ్మోస్మి – అనే జ్ఞానాన్ని ప్రతిజీవీ పొందాలి.

సృష్టికి పూర్వం ఆత్మ తప్ప అన్యమేదీ లేదని ముందు చెప్పి, చివరలో ఆకాశం లాగా అంతటా వ్యాప్తమైయున్న సర్వభూతాంతరాత్మ యైన బ్రహ్మాన్ని నేను దర్శించాను. నేనే బ్రహ్మను అని గుర్తించటంలో సృష్టి విషయకమైన పరమార్థం చెప్పబడ్డది. అంటే ఆత్మదర్శనమే ఈ జన్మకు పరమార్థము.

## రెండవ అధ్యాయం

## ప్రథమ ఖండం

**మం॥ ఓం పురుషేహ వా అయమాదితో గర్భో భవతి య దేతద్రేతః, తచచ దేతత్స ర్వేభ్యోఽ జ్గేభ్యస్తేజః సంభూత మాత్మన్యేవా–త్మానం బిభర్తి తద్యదా స్త్రియం సించత్యథై నజ్జనయతి తదస్య ప్రథమం జన్మ. 1**

పురుషునికి మూడు విధాలైన జన్మలు ఉన్నాయని చెబుతున్నారు. ఈ ప్రపంచంలో జీవులు రసాదిక్రమంలో శుక్రరూపంలో పురుష శరీరం లోపలే గర్భరూపాన్ని ధరిస్తాయి. ఈ వీర్యమనేది మానవుని అన్ని అవయవాల నుండి ఉత్పన్నమైన సారభూతమైన తేజస్సు. పురుషుడు ఆ విధమైన (తన) ఆత్మరూపాన్ని తన శరీరంలోనే పోషిస్తున్నాడన్నమాట. తరువాత పురుషుడు గర్భరూపంలో తనలో పోషింపబడుతున్న ఈ శుక్రాన్ని స్త్రీలో నిక్షేపిస్తున్నాడు – అంటే ఉత్పత్తి చేస్తున్నాడన్నమాట. ఈ విధంగా శుక్రరూపంలో తన స్థానం నుండి (రేతో నిక్షేప రూపంలో) వెడలి స్త్రీ శరీరంలో ప్రవేశించటం పురుషుని మొదటి జన్మ.

మానవుడు తన్ను తాను వీర్యరూపంలో భార్యయందు సమర్పిస్తున్నాడు (కుమారుడుగా). అందుకే 'ఆత్మావై పుత్ర నామాసి' అని శ్రుతి.

**మం॥ తత్ స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి యథా స్వమఙ్గం తథా. తస్మా దేనాం న హిన స్తి. సాఽ స్యైతమామాత్మాన మత్ర గతం భావయతి. 2**

ఈ వీర్యం కూడా స్త్రీకి పురుషునికి ఉన్న అవయవాల వంటివే అయిన (అంగస్తనాద్యవ యవాలు) అవయవాలు పొందుతుంది. అందుచేతనే స్త్రీకి ఈ గర్భమనేది బాధా జనకం కాదు – ఈ గర్భానికున్న అవయవాదులన్నీ తన అవయవాదులతో ఏకీభావం చెందటంవల్ల. ఈ విధంగా తన ఉదరంలో ప్రవేశించిన తన భర్తయొక్క ఆత్మను అనుకూల భోజనాదులు ద్వారా భార్య (గర్భిణీ స్త్రీ) పోషిస్తూ ఉంటుంది. ఇంతవరకు ఇదంతా పురుషుని మొదటి జన్మకు సంబంధించిన వృత్తాంతం.

**మం॥ సా భావయిత్రీ యిత వ్యా భవతి. తం స్త్రీ గర్భం బిభర్తి సోఽగ్ర ఏవ కుమారం జన్మనోఽ గ్రేఽధి భావయతి. స యత్కుమారం జన్మనోఽగ్రేఽధి భావయత్యాత్మానమేవ తద్భావయత్యేషాం లోకానాసన్తత్యా. ఏవం సన్తతా హీమే లోకా స్తదస్య ద్వితీయం జన్మ. 3**

భర్త యొక్క ఆత్మను (గర్భాన్ని) పోషిస్తూ ఉండే ఆ స్త్రీ భర్తచేత పోషింపబడుతూ ఉంటుంది. ప్రసవించే వరకు ఈ విధంగా గర్భాన్ని పోషిస్తూ ఉంటుంది. ప్రసవించిన తరువాత తండ్రి సద్యోజాతుడైన ఆ కుమారునికి జాతకర్మాది సంస్కారాలు చేస్తాడు. ఈ విధంగా పుత్రునికి సంస్కారాలు చేసేవాడు (పుత్రపౌత్రాదుల ద్వారా ఈ పరంపర సాగుతూ ఉంటుంది కాబట్టి) తనకు తానే సంస్కారాలు నిర్వర్తించుకున్న వాడౌతాడు. ఈ విధంగా పుత్రపౌత్రాది లోకవృద్ధి జరుగుతుంది. ఈ విధంగా స్త్రీ గర్భం నుండి జన్మించి సంస్కారాలు పొందటమనేది ఈ లోకంలో పురుషునికి రెండవ జన్మ. ఇక మూడవ జన్మ –

**మం॥ సోఽ స్యాయమాత్మా పుణ్యేభ్యః కర్మభ్యః ప్రతిధీయతే. అథాస్యాయమితర ఆత్మా కృతకృత్యో వయోగతః ప్రైతి. స ఇతః ప్రయన్నేవ పునర్జాయతే తదస్య తృతీయం జన్మ. 4**

తండ్రియొక్క ఆత్మ పుత్రరూపంలో పుట్టింది. శాస్త్రోక్తమైన పుణ్యకర్మ సంపాదన కోసం (సంస్కారాలన్నీ జరిగి) తండ్రికి ప్రతినిధిగా తయారైనాడు. తరువాత పెద్దవాడై (తండ్రిరూపమైన ఆత్మ పెరిగి పెద్దదై) అచటినుండి వెళ్ళిపోతున్నాడు. ఈ విధంగా ఇక్కడనుండి కర్మ ఫలాన్ని అనుభవించటానికి మరొక జన్మను పొందుతున్నాడు. జలగ ఒక ఆధారాన్ని పట్టుకోవటానికి మొదటి ఆధారాన్ని వదలినట్లుగా మరొక జన్మ కోసం ఈ జన్మ వదలుతున్నాడు. ఇది మూడవ జన్మ.

తదుక్త మృషిణా –

**మం॥ గర్భే ను సన్న న్వేషామవేద మహం దేవానాం జని మాని విశ్వా శతం మా పుర ఆయసీ రరక్షన్నధః శ్యేనో జవసా నిరదీయమితి. గర్భ ఏవైతచ్ఛయానో వామదేవ ఏవ మువాచ. 5**

ఈ విషయమే ఈ మంత్రంలో కూడా (వామదేవునిచేత) చెప్పబడ్డది –

'నేను (వామదేవుడు) తల్లియొక్క గర్భంలో ఉండగానే వాక్కు (అగ్ని) మొదలైన దేవతల జన్మరహస్యమంతా తెలుసుకున్నాను. సంసార బంధనాలనుండి విముక్తుడనవటానికి పూర్వం వేలకొలది ఇనుములాంటి శరీరాలు నన్ను పట్టి ఉంచినాయి. నేను తత్వజ్ఞాన ప్రభావంతో గ్రద్దలాగా ఆ వలను (బంధనాలను) ఛేదించుకొని బయటకు వచ్చాను.' వామదేవుడు గర్భంలో పడుకొని ఉండే ఈ విధంగా అన్నాడు.

**మం॥ స ఏవం విద్వానస్మాచ్ఛరీర భేదాదూర్ధ్వ ఉత్క్రమ్యా ముష్మిన్ స్వర్గేలోకే సర్వాన్ కామానాప్త్వా-మృతః సమభవత్ సమభవత్. 6**

ఆ వామదేవుడు వెనుక చెప్పబడిన ఆత్మను ఈ విధంగా బ్రహ్మమని తెలుసుకున్నవాడై, ఇక్కడే సమస్త కోరికలు తీరి, ఈ శరీరం నశించిన తరువాత పైకిపోయి, ఇంద్రియాతీతమైన ఆత్మలోకంలో సంపూర్ణ భోగాలను పొంది, అమరుడైనాడు. ఆత్మజ్ఞానంవల్ల పూర్ణకాముడై జీవన్ముక్తుడైనాడు.

# మూడవ అధ్యాయం

## ప్రథమ ఖండం

జ్ఞానం ద్వారా మోక్షం పొందాలని కాంక్షించే ప్రయత్నించే బ్రహ్మకాములు ఈనాడు కూడా ఉన్నారు. వేదాల్లో చెప్పిన విషయాలను, వామదేవుడు మొదలుగాగల గురువులు చెప్పిన విషయాలను వింటూ, ప్రాపంచిక విషయాలను తృణీకరిస్తూ ప్రశ్నించుకుంటూ ఉంటారు. ఏమని? –

**ఓం॥ కోఽయమాత్మేతి వయముపాస్మహే క తరః స ఆత్మా యేన వా పశ్యతి యేన వా శృణోతి యేన వా గన్ధా నాజిఘ్రతి యేన వా వాచం వ్యాకరోతి యేన వా స్వాదు చాస్వాదు చ విజానాతి. 1**

ఏ ఆత్మను మనం ఉపాసిస్తున్నామో, ఉపాసించాలని అనుకుంటున్నామో ఆ ఆత్మ ఏది? మనకు కనపడే ఈ రెంటిలో – అన్ని జ్ఞానాలకు కర్తృ కారణ రూపాల్లో ఉండే రెంటిలో – ఏది ఆత్మ? దేనివల్ల ప్రాణి (జీవి) చూస్తోందో, దేనివల్ల వింటోందో, దేనివల్ల వాసన చూస్తోందో, దేనివల్ల శబ్దాలను గుర్తించి విశ్లేషణ చేస్తోందో, దేనివల్ల రుచికరమైన వాటిని, కానివాటిని గుర్తిస్తోందో అటువంటి ఆ ఆత్మ ఏది? అది ఎటువంటిది?

ఈ శరీరంలో రెండు ఆత్మలుగా కనిపిస్తున్నాయి. ఒకటి సాధనము. (ఇంద్రియాలు) అనేక రూపాల్లో విభజింపబడి ఉంది. దాని ద్వారా మనిషి చూస్తున్నాడు. రెండవది ద్రష్ట. ఇంద్రియాల ద్వారా చూచిన దానిని గుర్తించి జ్ఞాపకం ఉంచుకొనేది ఆత్మ. దేనిద్వారా చూస్తున్నామో అది ఆత్మకాదు. ద్రష్టగా ఎవరు ఇంద్రియాల ద్వారా చూస్తున్నారో అదే ఆత్మ.

మధ్యలో కళ్ళు పోయిన మనిషి ఉన్నాడు. అతడు పూర్వం తాను చూచిన రంగుల్ని గుర్తు చేసుకోగలుగుతున్నాడు. అట్లాగే ఇప్పుడు మాట్లాడుతున్న వానిని లోగడ చూచి ఉన్నందున అతని మాటను బట్టి గుర్తిస్తున్నాడు. వేరు వేరు సందర్భాల్లోని ద్రష్ట ఒకడే అయితే తప్ప ఇట్లా గుర్తించటం అసాధ్యం. కాబట్టి, చూడటానికి సాధనాలైన ఇంద్రియాలు ఆత్మ కాదు. దానిని గుర్తించిన ద్రష్టయే ఆత్మ.

**మం॥ యదేత ద్ధృదయం మనశ్చైతత్. సంజ్ఞాన మాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా దృష్టిర్ ధృతి ర్మతి ర్మనీషా జూతిః స్మృతిః సంకల్పః క్రతురసుః కామో వశ ఇతి సర్వాప్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి. 2**

ప్రజలలో రేతోరూపమైనట్టి, సారభూతమైనట్టి హృదయమనేదే మనస్సు కూడాను. అదే చైతన్యం. అదే ప్రభుత. విజ్ఞానం, ప్రజ్ఞానం, మేధ, దృష్టి, ధృతి, మతి, మనీష, రోగాదుల వల్ల కలిగే దుఃఖరూపమైన మానసికబాధ, స్మృతి, సంకల్పం, క్రతువు, ప్రాణం, కామం, మనోనుకూలమైన స్పర్శాదుల కోసం కలిగే కామన, ఇవన్నీ ఆ ప్రజ్ఞానానికే పేర్లు.

**మం॥ ఏష బ్రహ్మైష ఇంద్ర ఏష ప్రజాపతిరేతే సర్వే దేవా ఇమాని చ పంచమహాభూతాని పృథివీ వాయురాకాశ ఆపో జ్యోతీంషీ త్యే తానీమాని చ క్షుద్రమిశ్రాణీవ బీజానీతరాణి చేత రాణి చాణ్డజాని చ జారుజాని చస్వేదజాని చోద్భిజ్జాని చాశ్వా గావః పురుషా హస్తినో యత్కించేదం ప్రాణి జంగమం చ పత్రతి చ యచ్చ స్థావరం సర్వం తత్ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం ప్రజ్ఞా నేత్రో లోకః ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ. 3**

ఈ ప్రజ్ఞాన రూపమైన ఆత్మయే బ్రహ్మ. హిరణ్యగర్భుడు (ఇంద్రుడు) ప్రజాపతి (విరాట్పురుషుడు – మొదటి సగుణుడు) ఇంద్రియాధిష్టాన దేవతలు, అగ్ని మొదలైనవన్నీ ఇందుండే పుట్టినాయి. ఈ ప్రజ్ఞాన రూపమైన ఆత్మయే అగ్న్యాది దేవతలు; పృథివి మొదలైన పంచభూతాలు, క్షుద్రజీవులు వాటి బీజం కూడా! అండజాలు! జారుజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, గుఱ్ఱాలు, ఆవులు, ఏనుగులు, మనుష్యులు, ఆకాశ చరాలైన పక్షులు, స్థావరాలైన వృక్షాలు ఇవన్నీ ప్రజ్ఞానేత్రమే! నిరుపాధికమైన ప్రజ్ఞానంలోనే ఉన్నాయి. లోకమంతా ప్రజ్ఞానేత్రమే! ప్రజ్ఞానమే ఈ సృష్టికి లయస్థానం. అందుచేత ప్రజ్ఞానమే బ్రహ్మ. (అండజాలు = గ్రుడ్డు నుండి పుట్టినవి. జారుజాలు = స్త్రీ జననేంద్రియం నుండి పుట్టినవి. స్వేదజాలు = బురద లేక చెమట నుండి పుట్టినవి. ఉద్భిజాలు = భూమినుండి పుట్టినవి.)

**మం॥ స ఏతేన ప్రజ్ఞానాఽ ఽ త్మనాఽ స్మాల్లోకా దుత్క్రమ్యా ముష్మిన్ స్వర్గేలోకే సర్వాన్ కామానాప్త్వాఽ మృతః సమభవత్. 4**

ఆ వామదేవుడు ఈ చేతనాత్మ స్వరూపంతోనే ఈ లోకం నుండి పైకిపోయి ఇంద్రియాతీతమైన, బ్రహ్మాత్మ రూపమైన స్వర్గలోకంలో కోరికలన్నీ తీరి అమరుడైనాడు – అమరుడైనాడు.

## ఉత్తరశాంతి పాఠం

వాఙ్మే మనసి........వక్తారం

ఓం శాంతిః శాంతిః శాంతిః

సమాప్తం

# ముండకోపనిషత్తు

ఈ ఉపనిషత్తు అథర్వశాఖకు సంబంధించినది. ఇందులో మొదట గురుపరంపర వర్ణింపబడ్డది. ఈ ఉపనిషత్తుపై శ్రద్ధా భక్తులు కలగటానికి ముందుగా ఈ ఆచార్య పరంపరా వర్ణనం బాగా ఉపకరిస్తుంది. అంగిరసుడు శిష్యుడైన శౌనకునికి చెప్పినట్లు ప్రారంభమౌతుంది. చివరలోకూడా మళ్ళీ ఈ గురుశిష్యులు ఉదహరింపబడ్డారు. ప్రధానమైన ఉపనిషత్తులలో ఇదీ ఒకటి. అద్వైత వేదాంతానికి సంబంధించిన కొన్ని మహావాక్యాలు దీనిలో కూడా కన్పిస్తాయి. "ద్వాసుపర్ణా సయుజా" (ముం. 3 ఖం. 1) అనే మంత్రం చాలా ప్రసిద్ధమై అనేక భాష్యాల్లో ఉదహరింపబడ్డది. ఈ ఉపనిషత్తులో సన్యాసయోగానికి ప్రాధాన్యమిచ్చినట్లు తోస్తుంది. "వేదాంత విజ్ఞాన" అనే ప్రసిద్ధమైన మంత్రం (ముం. 3 ఖం. 2 మం. 6) ఇందు లోనిదే!

ప్రథమ ముండకంలో ఆచార్య పరంపరను వర్ణించి, పరావిద్య, అపరావిద్యల భేదాన్ని వివరించి, సృష్టిక్రమాన్ని నిరూపించి, కర్మకాండలు వాటివల్ల వచ్చే ఫలితాన్ని చెప్పి, వాటిని నిరాకరించి మోక్షానికి జ్ఞానం తప్ప మార్గం లేదని, అందుకోసం గురువును ఆశ్రయించాలని చెప్పారు.

రెండవ ముండకంలో బ్రహ్మ స్వరూపాన్ని నిర్దేశించి, కర్మలు, కర్మసాధనాలూ కూడా బ్రహ్మనుండి ఉత్పన్నమైనవే అని చెప్పారు. ఉపనిషద్వేధను ఉపదేశించారు.

మూడవ ముండకంలో ఆ యోగసాధనకు (ఉపనిషద్వేధకు) సత్యము, నిష్కామత్వము, నిస్సంగత్వము మొదలైన సాధనాలు చెప్పి, విదేహముక్తిని ప్రతిపాదించారు. విషయ విపులీకరణలో ఒక విధమైన క్రమ వికాసం కనిపిస్తుంది. "సత్యమేవ జయతే నాఽనృతమ్" లాంటి విఖ్యాతమైన సూక్తులిందులో ఉన్నాయి.

సన్న్యాసయోగ ప్రాధాన్యం గలదైనందుననే ఇందలి భాగాలకు కూడా ముండకాలని పేరు పెట్టారు.

# ముండకోపనిషత్తు

## శాంతి పాఠం

**ఓం॥ భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః। స్థిరైరంగైస్తుష్టువాగ్ంస స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః॥ స్వస్తిన ఇంద్రోవృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః। స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధా తు॥**

ఓ దేవతలారా! మేము మా చెవులతో ఎల్లప్పుడు శుభమునే (మంచి మాటలనే) విందుము గాక! యజ్ఞయాగాది కర్మలు నిర్వహించటంలో నేర్పరులమైన మేము ఎల్లప్పుడు మంచి దృశ్యములనే చూచెదము గాక! (పుణ్యకర్మనే చూచెదము గాక!) మంచి ఆరోగ్యంతో, పూర్తిబలంతో మేము, దేవతలైన మిమ్ము స్తోత్రం చేస్తూ మాకు భగవంతునిచే ప్రసాదింపబడిన ఆయుర్దాయమును అనుభవింతుము గాక!

కీర్తివంతుడైన ఇంద్రుడు మమ్ము కాపాడుగాక! సర్వజ్ఞుడైన పూషుడు (పృథివీ దేవత) మాకు శుభము నిచ్చుగాక! పాపాలను పోగొట్టుటకు సమర్థుడైన గరుడుడు మాకు శుభకరుడగుగాక! దేవతలకు గురువైన బృహస్పతి మాకు శుభము కలుగజేయు గాక!

ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆధిదైవిక తాపములు శాంతించుగాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

# ప్రథమ ముండకం

## ప్రథమ ఖండం

ఓం॥ బ్రహ్మా దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తాః న బ్రహ్మవిద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ॥ 1

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽ థర్వా తాం పురోవాచాంగిరే బ్రహ్మవిద్యామ్। స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ భారద్వాజోంగిరసే పరావరామ్॥ 2

ఈ ఉపనిషత్తుకు గురు పరంపరను చెపుతున్నారు –

ఇంద్రాది దేవతలందరి కంటె ముందు పుట్టినవాడు, జ్ఞానము, వైరాగ్యము కారణంగా గొప్పవాడైన (దేవత లందరి కంటె) బ్రహ్మ తనంత తానుగా ఉద్భవించాడు. అతడే ఈ విశ్వాన్ని సృష్టించిన వాడు – ఈ భువనాలన్నింటిని పాలించేవాడు. అతడు అన్ని విద్యలకు ఆశ్రయ భూతమైన బ్రహ్మవిద్యను అథర్వునికి ఉపదేశించాడు.

బ్రహ్మదేవుడు అథర్వునికి ఉపదేశించిన ఆ బ్రహ్మవిద్యనే అథర్వుడు అంగి అనే ఋషికి, అంగి భరద్వాజుని వంశంలో పుట్టిన సత్యవహుడు అనే ఋషికి, ఆ భరద్వాజ పుత్రుడైన సత్యవహుడు శిష్య పరంపరగా వస్తున్న ఆ బ్రహ్మవిద్యను అంగిరసునికి చెప్పాడు.

మం॥ శౌనకో హ వై మహాశాలోఽ ంగిరసం విధివదుపసన్నః ప్రపచ్ఛ. కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతీతి. 3

తస్మై సహోవాచ. ద్వే విద్యే విదితవ్యే ఇతి హ స్మ యద్బ్రహ్మవిదో వదన్తి పరా చైవాపరా చ. 4

మం॥ తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽ థర్వ వేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛన్దో జ్యోతిష మితి. అథ పరా యయాతదక్షర మధిగమ్యతే. 5

శునకుని పుత్రుడు, మంచి గృహస్థుడు అయిన శౌనకుడు, భరద్వాజుని శిష్యుడైన అంగిరసుని వద్దకు వచ్చి అడిగాడు – "ఓ దేవా! ఏ వస్తువును తెలుసుకోవటం వల్ల తెలుసుకోవలసిన దానిని తెలుసుకున్నట్లు అవుతుంది? అంటే, దేనిని తెలుసుకోవటంవల్ల తెలుసుకోవలసిన దానిని తెలుసుకున్నట్లు అవుతుంది? అంటే, దేనిని తెలుసుకున్న తరువాత, ఇక తెలుసుకోవలసినది ఏదీ ఉండదో దానిని గురించి చెప్పండి" అని.

అప్పుడు అంగిరసుడు ఈ విధంగా సమాధానం చెపుతున్నాడు – మనం తెలుసుకోవలసిన విద్యలు రెండు ఉన్నాయని బ్రహ్మవేత్తలు అంటూ ఉంటారు. మొదటిది పరావిద్య. రెండవది

అపరావిద్య. పరమాత్మకు సంబంధించిన విద్యను పరావిద్య అని, ధర్మాధర్మములు వాటి సాధనాలు, వాటివల్ల కలిగే ఫలితాలు మొదలైన విషయాలకు సంబంధించినది అపరా విద్య అని అంటారు.

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వవేదం, శిక్షకల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము మొదలైనవన్నీ అపరా విద్య క్రిందకే వస్తాయి.

ఏ విద్య వలన అక్షరుడైన పరమాత్మకు సంబంధించిన జ్ఞానం కలుగుతుందో అది పరావిద్య.

**మం॥ యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణి పాదమ్। నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః. 6**

పరావిద్యను నిరూపిస్తున్నారు –

అదృశ్యమైనది జ్ఞానేంద్రియాలకు విషయం కానిది, అగ్రాహ్యమైనది – కర్మేంద్రియాలకు విషయం కానిది, గోత్రము, వర్ణము లేనిది (అంటే వరుసగా వచ్చే సంబంధం లేనిది, ఆకారము, రంగు లేనిది) కండ్లు చెవులు మొదలైన అవయవాలు లేనిది, చేతులు కాళ్ళు లేనిది, నిత్యమై అన్నిటియందు ఉన్నది, మిక్కిలి సూక్ష్మమైనది, అవ్యయమైనది, భూమి మొదలగు భూతము లన్నింటికి కారణమైనది. అటువంటి దానిని జ్ఞానియైనవాడు సర్వత్ర చూడగలుగుతాడు.

**మం॥ యథోర్ణ నాభిః సృజతే గృహ్ణతే చ యథాపృథివ్యామోషధయః సంభవన్తి। యథాసతః పురుషాత్కేశలోమాని తథాక్షరాత్ సంభవతీహ విశ్వమ్.**

సాలెపురుగు ఇతర సాధనాల సహాయం లేకుండా, తన శరీరం నుండే దారాలను తయారు చేసి, వాటిని మళ్ళీ తానే మ్రింగుతున్నట్లుగా, ఈ భూమిమీద ఔషధులు వగైరాలు పుడుతున్నట్లుగా సజీవుడైన పురుషుని యందు రోమాలు (వెంట్రుకలు) పుడుతున్నట్లుగా, ఆ అక్షర బ్రహ్మమందు, ఈ జగత్తు అంతా పుడుతోంది.

**మం॥ తపసా చీయతే బ్రహ్మతతోఽ న్నమభిజాయతే। అన్నాత్ప్రాణోమనః సత్యం లోకాః కర్మసు చామృతం. 8**

పుత్రోత్పత్తిని కాంక్షించే తండ్రిలాగా, ఆ అక్షర పరబ్రహ్మ జ్ఞానరూపమైన తపస్సు ద్వారా కొంత స్థూలభావాన్ని పొందుతాడు. తరువాత ఆ బ్రహ్మనుండే అన్ని ప్రాణులకు సామాన్య కారణమైన అన్నం పుడుతోంది. ఆ అన్నం నుండే హిరణ్య గర్భరూపమైన ప్రాణం సంకల్పాది నాలుగు వ్యాపారాలు గల మనస్సు (సంకల్పం, ఆలోచన, అనుమానం, నిర్ణయము ఇవన్నీ మనస్సు యొక్క వ్యాపారాలు), మనస్సునుండి పంచభూతాలు. వాటినుండి భూరాది లోకాలు, ఆ లోకాల్లో మానవులు మొదలైనవారి కోసం తగిన కర్మలు, ఆ కర్మనుండి అమృతమనే ఫలము పుడుతున్నాయి.

**మం॥ యః సర్వజ్ఞః సర్వ విద్యస్య జ్ఞానమయం తపః తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నం చ జాయతే. 9**

ఆ సర్వజ్ఞుడు (సామాన్య రూపంగా అన్నీ తెలిసినవాడు) సర్వవేత్త (విశేష రూపంగా అన్నీ ఎరిగినవాడు), జ్ఞాన మయమైన తపస్సు కలవాడు అయిన ఆ అక్షర పరబ్రహ్మ నుండే ఈ హిరణ్యగర్భ స్వరూపుడైన బ్రహ్మ, అతని నుండి నామరూపాలు గల (దేవదత్త, యజ్ఞదత్తాది నామములుగల) ఈ జీవులు, రంగులు, ధాన్యాదులు (అన్నము) అన్నీ పుడుతున్నాయి.

## ద్వితీయ ఖండం

**మం॥ తదేతత్ సత్యం మంత్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సన్తతాని। తాన్యాచరథ నియతం సత్యకామా ఏష వః పన్థాః సుకృతస్య లోకే. యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్య వాహనే! తదాऽజ్యభాగా వన్తరేణాऽహుతీః ప్రతిపాదయేత్. 2**

అగ్నిహోత్రాది కర్మ నిరూపణ చేస్తున్నారు –

వశిష్ఠుడు మొదలైన మేధావులు ఋషులు ఋగ్యజుస్సామ వేద మంత్రాలతో ఏ అగ్నిహోత్రాది కర్మలను దర్శించారో అదే సత్యం. ఆ కర్మలే హౌత్రము, అధ్వర్యుహౌత్రము, ఔద్గాతృ రూపంలో మూడుగా విభజింపబడ్డాయి. ఋగ్వేద మంత్రాలను హోత, యజుర్వేద మంత్రాలను అధ్వర్యుడు, సామవేద మంత్రాలను ఉద్గాత చదువుతారు. యదార్థమైన కర్మ ఫలాన్ని కోరి ఎల్లప్పుడు వాటిని ఆచరించు! ఈ లోకంలో అగ్నిహోత్రాది కర్మల ఫలాన్ని పొందాలంటే ఇదే మార్గం.

సమిధలు వేసి అగ్నిని బాగా ప్రజ్వలింప చేసినపుడు దాని నుండి జ్వాలలు పైకి వ్యాపిస్తాయి. అప్పుడా అగ్నిలో మధ్యభాగంలో అగ్నయే స్వాహా, సోమాయ స్వాహా మొదలైన మంత్రాలతో ఆహుతులు వేయాలి. (దర్శ పూర్ణమాస యజ్ఞంలో అగ్నికి కుడివైపున, సోమునికి ఎడమవైపున, మిగతా ఆహుతులు మధ్యలోను వేస్తారు. ఈ మధ్య భాగాన్ని ఆవాపస్థానం అంటారు. అగ్నిహోత్రం రెండు పూటలు, జీవితాంతం విధిగా చేయాలి. అమావాస్య నాడు చేసే యజ్ఞం దర్శము, పూర్ణిమనాడు చేసేది పూర్ణము).

**మం॥ యస్యాగ్నిహోత్ర మదర్శ మపౌర్ణమాస మచాతుర్మాస్య మనాగ్రణయ మతిథివర్జితంచ। ఆహుత మవైశ్వదేవ మవిధినా హుతమాస ప్తమాం స్తస్య లోకాన్ హినస్తి. 3**

విధి విహితమైన కర్మలు ఆచరించకపోవటం వల్ల కలిగే పరిణామాలు చెపుతున్నారు.

దర్శ పూర్ణమాసాదులతో కూడిన అగ్నిహోత్ర విధులు నిర్వర్తించకుండా, చాతుర్మాస్య, అగ్రయణాది విధులను నిర్వర్తించకుండా, అతిథి పూజాదికాలు నిర్వర్తించకుండా, చేయవలసిన

సమయాల్లో బలి, వైశ్వదేవాది కర్మలు చేయకుండా ఉన్నవాడు ఏడుతరాలను, ఏడు లోకాలను నాశనం చేసుకున్నవాడు అవుతాడు.

మూడు కాలాలలో (ఋతువులు) నాలుగేసి మాసాలుగా చేయబడేవి : 1) వైశ్వదేవం, 2) వరుణ ప్రఘాసం, 3) శాకమేధం. (అగ్రయణ మనే కర్మలు శిశిర వసంతాల్లో క్రొత్త ధాన్యంతో చేస్తారు.) (ఏడు తరాలు అంటే కొడుకు, మనుమడు, ముదిమనుమడు, తాను, తండ్రి, తాత, ముత్తాత. మొదటి ముగ్గురిని పోషించి చివరి ముగ్గురిని పిండ ప్రదానాలతో తృప్తి పరచాలి.) (ఏడు లోకాలు అంటే భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్య లోకాలు).

**మం॥ కాళీ కరాళీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా। స్ఫులింగినీ విశ్వరుచీ దేవీ లేలాయమానా ఇతి సప్తజిహ్వాః. 4**

అగ్నిహోత్రునికి మనం యిచ్చే ఆహుతులను మ్రింగటానికి ఏడు నాలుకలు ఉన్నాయి – అందుచేతనే సప్త జిహ్వుడు. కాళి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ, స్ఫులింగిని, విశ్వరుచిదేవి.

(కాళి = నల్లని, కరాళి = భయంకరమైన, మనోజవ = మనస్సు వంటి వేగం కలది, సులోహిత = మిక్కిలి ఎఱ్ఱనిది, సుధూమ్రవర్ణ = దట్టమైన పొగవంటి రంగు కలది, స్ఫులింగిని = రవ్వలు చిమ్మునది, విశ్వరుచి దేవి = అనేక కిరణాలు కలది.)

**మం॥ ఏ తేషు యశ్చరతే భ్రాజమా నేషు యథాకాలం చాహుతయో హ్యాదదాయన్। తం నయన్త్యేతాః సూర్యస్య రశ్మయో యత్ర దేవానాం పతి రేకోఽధివాసః 5**

**ఏహ్యేహీతి తమాహుతయః సువర్చసః। సూర్యస్య రశ్మిభిర్యజమానం వహన్తి। ప్రియాం వాచమభివదన్త్యోఽర్చయన్త్య। ఏష వః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః 6**

విధిపూర్వకంగా అగ్నిహోత్రాదులు చేసినందువల్ల వచ్చే ఫలం చెపుతున్నారు.

అగ్నిహోత్రాలు చేసే యజమానిని, ఈ దీప్తిమంతమైన అగ్నిశిఖలలో ఇచ్చిన ఆహుతులు సూర్యుని కిరణాలగుండా దేవతలకు ప్రభువైన ఇంద్రుడు ఉండే చోటుకు తీసుకొనిపోతాయి – అంటే స్వర్గానికి తీసికొనిపోతాయి. అగ్నిహోత్రాదులకు ఫలం స్వర్గప్రాప్తి అన్నమాట.

ఈ దీప్తిమంతమైన ఆహుతులు "రా! రా! నీ పుణ్యంవల్ల ఈ పవిత్రమైన ఈ బ్రహ్మలోకం (స్వర్గం) లభించింది" అని ప్రియమైన మాటలతో యజమానిని స్తుతిస్తూ, పూజిస్తూ స్వర్గలోకానికి తీసికొని పోతాయి. అంటే కర్మలకు ఫలం స్వర్గమే తప్ప మోక్షప్రాప్తి (జన్మరాహిత్యం) కాదు.

**మం॥ ప్లవా హ్యే తే అదృఢా యజ్ఞరూఆ అష్టాదిశోక్త మవరం యేషు కర్మ। ఏతచ్ఛ్రేయో యే-**
**భినన్దన్తి మూఢా జరామృత్యుం తే పునరేవాపి యన్తి। 7**

ఈ మంత్రంలో కేవల కర్మాచరణాన్ని నిందిస్తున్నారు.

జ్ఞాన రహితమైనవి అయినందున నికృష్ట కర్మలుగా భావింపబడిన పదునెనిమిది యజ్ఞ సాధనాలు అస్థిరమైనవని, నశ్వరమైనవని చెప్పబడ్డాయి. (పదహారుగురు ఋత్విక్కులు, యజమాని, భార్య మొత్తం 18 మంది) ఇవే (ఈ కర్మలే) మోక్ష సాధనాలని భావించి సంతోషించే అజ్ఞానులు మాటిమాటికీ మృత్యువును పొందుతూనే ఉంటారు. ఈ సాధనాలు అశాశ్వతములు, నాశనమయ్యేవి. వాటితో చేసే కర్మ శాశ్వత ఫలాన్ని యివ్వదు. కాబట్టి కర్మలవల్ల శాశ్వతమైన మోక్షప్రాప్తి కలుగదు.

**మం॥ అవిద్యాయా మన్తరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః। జఙ్ఘన్యమానాః**
**పరియన్తి మూఢా అంధేనైవ నీయమానా యథాఽన్ధాః। 8**

**అవిద్యాయాం బహుధా వర్తమానా వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః। యత్కర్మిణో న**
**ప్రవేదయన్తి రాగాత్ తేనాఽతురాః క్షీణలోకాశ్చ్యవన్తే। 9**

**ఇష్టాపూర్తం మన్యమానా వరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయ న్తే ప్రమూఢాః। నాకస్య పృష్ఠే తే**
**సుకృతేఽభూత్వే మం లోకం హీనతరం వా విశన్తి। 10**

**తపః శ్రద్ధే యే హ్యుపవసన్త్యరణ్యే శాన్తా విద్వాంసో భైక్ష్య చర్యాం చరంతః। సూర్యద్వారేణ**
**తే విరజాః ప్రయాన్తి యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా। 11**

అవిద్యలో పడి కొట్టుమిట్టాడే అవివేకులు తమను తామే గౌరవనీయులుగాను, పండితులుగాను అనుకొని, గ్రుడ్డివానిచేత తీసికొనిపోబడే మరొక గ్రుడ్డివానివలె రోగాది అనేక అనర్థాలకు లోనై పీడింపబడుతూ దారి తప్పి చరిస్తూ ఉంటారు. (అవిద్య గ్రుడ్డిది, మిధ్యాభిమాని గ్రుడ్డివాడు.)

అనేక విధాలుగా అజ్ఞానంతో పడి కొట్టుకునే అజ్ఞానులు "మనం కృతార్థులమైపోయినాము" అనుకొని గర్విస్తూ, కర్మఫలం మీద కోరికతో ఉన్న కర్మిష్ఠులు బుద్ధి వక్రించటం వల్ల తత్వాన్ని తెలుసుకోలేరు. ఆ కారణం చేత దుఃఖిస్తూ, మిగిలి ఉన్న కర్మఫల భోగం అయిపోగానే స్వర్గం నుండి చ్యుతులైపోతారు – మళ్ళీ అధోలోకాల్లో జన్మను పొందుతారు. అంటే తిర్యగాది జన్మలు పొందుతారు.

ఇష్టాపూర్త కర్మలనే పురుషార్థాలకు సర్వోత్తమ సాధనాలని భావించేవారు, పుత్ర పౌత్రాదులందు మోహం గల మూఢులు ఇతరమైన వాటిని శ్రేయస్సుకు సాధనాలుగా తలచరు. అందుచేత వారు స్వర్గంలో తమ కర్మల ఫలాన్ని అనుభవించి, కర్మశేషాన్ని (మిగిలిన కర్మఫలాన్ని) అనుభవించటానికై

ఈ లోకంలోగాని, ఇంతకంటె నికృష్టమైన లోకంలో గాని ప్రవేశిస్తారు. (ఇష్ట+పూర్తకర్మలు – యజ్ఞ యాగాదులు + వాపీ కూప తటాకాది దాన కర్మలు)

శాంత స్వభావులు, జ్ఞాన సంపన్నులు, వానప్రస్థులు, సన్న్యాసులు, అడవుల్లో ఉంటూ భిక్షుక వృత్తితో జీవిస్తూ, స్వీయ ధర్మాచరణ రూపమైన తపస్సు చేస్తూ, శ్రద్ధాయుక్తులై ఉండేవారు, పుణ్యపాపాది ద్వంద్వాలనుండి విముక్తులై ఉత్తరాయణ మార్గం ద్వారా అమృతుడు అవ్యయుడునైన హిరణ్యగర్భుడు ఉండే సత్యలోకానికి పోతారు. హిరణ్యగర్భుడు, ప్రజాపతి, ధర్ముడు (యముడు) వీరంతా సాకారులే! కాన పరబ్రహ్మ ప్రాప్తిలేదు అని భావం.

**మం॥ పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నా స్త్యకృతఃకృతేన। తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠమ్। 12**

కర్మలవల్ల లభించే ఈ లోకాలన్నింటిని వివేకంతో పరీక్షించి వాటి అస్థిరత్వాన్ని గ్రహించి, మోక్షాన్ని కాంక్షించే బ్రాహ్మణుడు వైరాగ్యాన్ని పొంది, ఈ ప్రపంచంలో అనిత్యమైన కర్మోపాసనమనే సాధనం ద్వారా నిత్యమైన మోక్షాన్ని పొందటం అసాధ్యం కాబట్టి – నిత్యమైనట్టి బ్రహ్మజ్ఞానాన్ని పొందటానికి చేతిలో సమిధలు పట్టుకొని శ్రోత్రియుడు, బ్రహ్మ నిష్ఠుడు అయిన గురువు వద్దకు వెడతాడు. (గురువు వద్దకు సమిత్పాణియై వెళ్ళటం సంప్రదాయం.)

**మం॥ తస్మై స విద్వానుపసన్నాయ సమ్యక్ ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ। యేవాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మ విద్యామ్. 13**

బ్రహ్మవేత్త అయిన ఆ గురువు, ప్రశాంతచిత్తుడై జితేంద్రియుడై వచ్చినట్టి శిష్యునికి పరవిద్యను సంపూర్ణంగా ఉపదేశిస్తాడు. దానివల్ల ఆ శిష్యునికి సత్య స్వరూపుడైనట్టి అక్షరపురుషుని గూర్చిన జ్ఞానం కలుగుతుంది. ఉత్తమ శిష్యునికి ఆ విధంగా ఉపదేశం చేసి – అవిద్య అనే సముద్రాన్ని దాటించటం ఆ గురువు యొక్క కర్తవ్యం.

# ద్వితీయ ముండకం

## ప్రథమ ఖండం

తదేతత్ సత్యం –

**మం॥ యథా సుదీప్తాత్పావకా ద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవన్తే సరూపాః। తథా–క్షరా ద్వివిధాః సోమ్య భావాః ప్రజాయన్తే తత్ర చైవాపి యన్తి – 1**

అగ్నిని, దానినుండే పుట్టే నిప్పురవ్వలను దృష్టాంతంగా బ్రహ్మనుండి ఈ జగత్తు పుట్టిన విధానాన్ని చెపుతున్నాడు.

పైన చెప్పబడిన అక్షర పరబ్రహ్మ విషయకమైన పరవిద్య సత్యమైనది. ఓ ప్రియదర్శనుడా! (శిష్యుని సంబోధించటం) బాగా ప్రజ్వలింప జేయబడిన అగ్నినుండి అదేవిధమైన ఆకారం, గుణాలు గల వేలకొలది నిప్పురవ్వలు వెలువడుతున్నాయి. అట్లాగే ఆ అక్షర బ్రహ్మనుండి అనేకమైన శరీరాలు అనేక రూపాలు వెలువడుతున్నాయి – మళ్ళీ అందులోనే లీనమై పోతున్నాయి.

**మం॥ దివ్యోహ్యమూర్తః పురుషః సభాహ్యాభ్యన్తరో హ్యజః। అప్రాణో హ్యమనాః శుభ్రోహ్యక్షరాత్పతరః పరః। 2**

**ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ। ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ। 3**

పరబ్రహ్మ స్వరూపాన్ని వర్ణించి, బ్రహ్మమే అన్నిటికి కారణమని చెప్పటం –

ఆ అక్షర పరబ్రహ్మ స్వయం ప్రకాశం కలవాడు కాబట్టి, నిజంగా దివ్యుడు, నిరాకారుడు, పురుషుడు (హృదయమనే పురంలో ఉండేవాడు) బాహ్యాభ్యంతరాల్లో ఉండేవాడు, పుట్టుకలేనివాడు, ప్రాణంలేనివాడు, మనస్సు లేనివాడు, పరిశుద్ధుడు, మాయకు అతీతుడు, శ్రేష్ఠుడు, అవ్యాకృత ప్రకృతి కంటె ఉత్కృష్టుడు.

ఈ అక్షర పరబ్రహ్మం నుండే ప్రాణం పుడుతోంది. మనస్సు, సమస్త ఇంద్రియాలు, ఆకాశం, వాయువు, అగ్ని, జలం, ఈ విశ్వాన్నంతటిని ధరించే భూమి పుడుతున్నాయి.

**మం॥ అగ్నిర్మూర్థా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః। వాయు, ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్తరాత్మా। 4**

తస్మాదగ్నిః సమిధో యస్య సూర్యః సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యాం। పుమాన్ రేతః సించతి యోషితాయాం వహ్వీః ప్రజాః

పురుషాత్సంప్రసూతాః। 5

అగ్ని, ఆ అక్షర పరబ్రహ్మకు శిరస్సు. చంద్ర సూర్యులు నేత్రాలు, దిక్కులు ఆ పరబ్రహ్మకు శ్రోత్రాలు (చెవులు). వేదాలు అతనికి వాణి (వాక్కు). వాయువు ప్రాణం. జగత్తు అంతా అతని హృదయం. అతని పాదాలనుండే ఈ జగత్తు (భూమి) పుట్టింది. అతడే సమస్త భూతాల్లోను ఉండే అంతరాత్మ.

ఆ పరబ్రహ్మ నుండే అగ్ని పుట్టింది. (ప్రజాపతి రూపంలో) ఆ అగ్నికి సూర్యుడు సమిధ – ఎందుచేతనంటే, సూర్యలోకం వల్లనే ద్యులోకమనే అగ్ని ప్రదీప్తమౌతోంది. చంద్రునివల్ల మేఘాలు, ఆ మేఘాలవల్ల భూమిమీద ఓషధులూ పుడుతున్నాయి. ఆ ఓషధులవల్ల (అన్నం) పుట్టిన వీర్యాన్ని పురుషుడు యోషిద్రూపంలో (స్త్రీరూపం) ఉండే అగ్నిలో ఉంచుతున్నాడు. ఈ విధంగా బ్రాహ్మణాది రూపాల్లో ప్రజలు ఆ పరమ పురుషుని నుండే పుడుతున్నారు.

ఈ మంత్రంలో పంచాగ్నులు చెప్పబడ్డాయి. 1) పరబ్రహ్మనుండి పుట్టిన అగ్ని 2) మేఘము 3) భూమి 4) పురుషుడు 5) స్త్రీ.

ఇవేకాక సాధనాలతోపాటు కర్మలు, వాటి ఫలితాలు కూడా ఆ పరబ్రహ్మము నుండే పుట్టినాయని చెపుతున్నారు.

**మం॥ తస్మాదృచః సామ యజూగ్ం షి దీక్షా యజ్ఞాశ్చ సర్వే క్రతవో దక్షిణాశ్చ। సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః సోమో యత్ర పవతే యత్ర సూర్యః। 6**

**తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః సాధ్యా మనుష్యా పశవో వయాంసి। ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ శ్రద్ధా సత్యం బ్రహ్మచర్యం విధిశ్చ। 7**

**సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్ సప్తార్చిషః సమిధః సప్త హోమాః। సప్త ఇమేలోకా యేషు చరన్తి ప్రాణా గుహాశయా నిహితాః సప్త సప్త। 8**

**అతః సముద్రా గిరయశ్చ సర్వేఽస్మాత్స్యందంతే సింధవః సర్వరూపాః। అతశ్చ సర్వా ఓషధయో రసశ్చ యేనైష భూతైస్తిష్ఠ తే హ్యన్తరాత్మా। 9**

**పురుష ఏ వేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్ ఏతద్యో వేద నిహితం గుహాయాం సోఽవిద్యాగ్రంథిం వికిరతీహ సోమ్య। 10**

ఆ పురుషుని నుండి నియమితమైన పాదాలు, అక్షరాలు కల ఋక్కులు (ఋగ్వేద మంత్రాలు) పుట్టినాయి. అట్లాగే హింకారము, ప్రస్తావము, ఉద్గీథ, ప్రతిహార నిధన అనే పాంచభక్తిక రూపమైనట్టి, గాన ప్రాధాన్యం గల సామమంత్రాలు పుట్టినాయి. పాద నియమము, అక్షర నియమము లేని

యజుస్సులు (యజుర్వేద మంత్రాలు) పుట్టినాయి. మౌంజీబంధనాది దీక్షలు, అగ్నిహోత్రాది యజ్ఞాలు, దక్షిణలు, సంవత్సరాలు (యజ్ఞాలకు కాలప్రమాణాలు) యజ్ఞం చేసే యజమానుడు, లోకాలు (ఆ యజ్ఞాలకు ఫలమైన లోకాలు) ఎంతవరకు చంద్రుడు పవిత్రం చేయగలుగుతాడో, సూర్యుడు వేడి నీయగలుగుతాడో (చంద్రలోకం, సూర్యలోకం) అవన్నీ పుట్టినాయి – దక్షిణాయన ఉత్తరాయణ మార్గాలు!

ఆ పురుషుని నుండే కర్మలకు అంగభూతమైన వసువులు మొదలుగాగల దేవతలు (అష్టవసువులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు) పుట్టారు. కర్మాధికారం గల మానవులు పుట్టారు. ఆ పురుషుని నుండే పశుపక్ష్యాదులు, ఉచ్ఛ్వాస నిశ్వాసాదులు, వ్రీహి యవాది ధాన్యాలు, పురుషార్థాలు సాధించేందుకు వీలైన తపస్సు, ఆస్తిక్య బుద్ధి రూపంలో ఉండే శ్రద్ధ, హితభాషణం, మితభాషణం, అష్టవిధ మైధునాలను త్యజించటం ద్వారా ఆచరించే బ్రహ్మచర్యం, విధి ఇవన్నీ ఆ పురుషుని నుండే పుట్టినాయి.

ఆ పురుషుని నుండే సప్త ప్రాణాలు (2 కండ్లు 2 చెవులు 2 ముక్కు రంధ్రాలు 1 నోరు) పుట్టినాయి. శరీరాల్లో సంచరిస్తూ వాటికి విషయాలైన ఏడు జ్వాలలు, ఇంద్రియ విషయాల రూపంలో ఉండే ఏడు సమిధలు, విషయ విజ్ఞాన స్వరూపమైన ఏడు ఆహుతులు. ఈ ఏడు ప్రాణాలు సంచరించే ఏడు స్థానాలు ఈ విధంగా ప్రతి దేహంలోను కనిపించే ఈ ఏడేసి పదార్థాలు ఆ పురుషుని నుండే పుట్టినాయని ఆత్మజ్ఞాని గ్రహించాలి.

ఈ పురుషుని నుండే ఉప్పు సముద్రం మొదలుగా గల ఏడు సముద్రాలు, హిమాలయాది సమస్త పర్వతాలు పుట్టినాయి. గంగ మొదలైన నదులు అతని నుండే ప్రవహిస్తున్నాయి. అతని నుండే వ్రీహి (ధాన్యం) యవలు (బార్లీ) మొదలైన ధాన్యాలు, షడ్రుచులు (రసాలు) పుడుతున్నాయి. ఆ రసాల వల్లనే ఈ అంతరాత్మ పంచభూతాలచేత చుట్టబడి ఉంది.

ఈ సమస్త ప్రపంచము, అగ్నిహోత్రాది సమస్త కర్మలు, జ్ఞాన రూపమైన తపస్సు, అన్నీ ఆ పురుషుని స్వరూపమే! ఈ అన్నింటియందు ఆ అమృతస్వరూపుడైన పరబ్రహ్మయే ఉన్నాడు! ఓ ప్రియదర్శనుడా! ఆ పరమాత్మ సమస్త ప్రాణుల హృదయాల్లో ఉన్నాడని తెలుసుకున్నవాడు, ఈ విధమైన విజ్ఞానంవల్ల, ఈ లోకంలోనే, బ్రతికి ఉండగానే అవిద్యా గ్రంథులను (అజ్ఞానపు ముడులను) తెంపివేసుకుని ముక్తుడౌతాడు.

## ద్వితీయ ఖండం

**మం॥ ఆవిః సన్నిహితం గుహాచరం నామ మహత్పద మత్రైతత్ సమర్పితం। ఏజత్ప్రాణ న్నిమిషచ్చ యదేతజ్జానథ సదసద్వరేణ్యం పరం విజ్ఞానాద్య ద్వరిష్టం ప్రజానామ్. 1**

స్వయం ప్రకాశం గల పరబ్రహ్మ అందరి హృదయాల్లోనూ ఉన్నాడు. ఆ పరబ్రహ్మ శ్రవణాదుల ద్వారా బుద్ధి అనే గుహలో లభించటంవల్ల గుహాచరుడనే పేరు వచ్చింది. అన్నిటికంటె గొప్పవాడైనందున మహత్ శబ్దవాచ్యుడు అయినాడు. ఈ పరబ్రహ్మలోనే ఆకాశంలో తిరుగుతూ ఉండే పక్ష్యాదులు, ప్రాణన వ్యాపారం సాగించే మనుష్యాదులు ఉన్మేష నిమేష క్రియ లాచరించే సమస్త జీవులు ఉన్నాయి. నీవు ఈ పరబ్రహ్మను సదసత్స్వరూపం కలదిగాను, స్థూల సూక్ష్మరూపం కలదిగాను, అందరిచేత ప్రార్థింప దగినదిగాను, శ్రేష్ఠమైన వాటన్నిటికంటె శ్రేష్ఠమైనదానినిగా తెలుసుకో!

**మం॥ యదర్చిమద్యణుభ్యోఽణుచ యస్మింల్లోకానిహితాలోకినశ్చ। తదేత దక్షరం బ్రహ్మ స ప్రాణస్తదు వాఙ్మనః। త దేతత్సత్యం తదమృతం తద్వేద్ధవ్యం సోమ్యవిద్ధి. 2**

సూర్యుడు మొదలుగాగల గ్రహాలన్నింటిని ప్రకాశింపచేసేటటువంటి, సూక్ష్మాతి సూక్ష్మమైనట్టి, సమస్త లోకాలు, అందలి జీవరాశితో కూడియున్నట్టి, అందరికి అన్నిటికి ఆశ్రయ స్థానమైనట్టిది ఆ అక్షర బ్రహ్మమే.

ఓ ప్రియదర్శనుడా! అదే ప్రాణం! అదే వాక్కు! అదే మనస్సు! అదే ఎల్లవేళల అన్ని సందర్భాలలోను ఒకే విధంగా ఉండే సత్యం! అదే అమృతం! అటువంటి ఆ బ్రహ్మాన్ని లక్ష్యంగా పెట్టుకొని సమాహిత బుద్ధితో ఆ లక్ష్యభేదనం చేయాలి!

**మం॥ ధనుర్గృహీ త్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపాసా నిశితం సంధీయత। ఆయమ్య తద్భావగ తేవ చేతసా లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి. 3**

ఓ ప్రియదర్శనుడా! ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడి ప్రసిద్ధమై యున్న ధనుస్సును (ఓంకారం) గ్రహించి, ఉపాసన ద్వారా పదును పెట్టబడిన మనస్సు అనే బాణాన్ని సంధించి, ఇంద్రియాలతో సమా అంతఃకరణాన్ని విషయాలనుండి మరల్చి, బ్రహ్మ భావానుగతమైన చిత్తంతో, నీ లక్ష్యమైనటువంటి ఆ అక్షర పరబ్రహ్మ వేధనం చెయ్యి! అంటే లక్ష్యాన్ని కొట్టు! దీనిని ఉపనిషద్వేధ అంటారు.

పైన చెప్పబడిన ధనుస్సు మొదలైన సాధనాలను గూర్చి వివరిస్తున్నారు.

**మం॥ ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్ తన్మయో భవేత్.** **4**

**యస్మిన్ ద్యౌః పృథివీ చాన్తరిక్ష మోతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః। తమేవైకం జానథ ఆత్మానమన్యావాచో విముంచ థామృత స్యైషసేతుః** **5**

ఓంకారం (ప్రణవము) ధనుస్సు. ఈ ప్రణవాన్ని గురించి, దాని మహిమను గురించి అన్ని ఉపనిషత్తులు చెపుతూనే ఉన్నాయి. కాబట్టి ఈ ధనుస్సు ఔపనిషధమైంది. ఉపనిషత్ప్రసిద్ధమైంది. ఇక సోపాధికమైన ఆత్మయే బాణం. అక్షర పరబ్రహ్మమే లక్ష్యం. ఎంతో జాగ్రత్తగా ఆ లక్ష్యాన్ని కొట్టాలి. లక్ష్యవేధనం చేసిన తరువాత బాణం లక్ష్యానికి గ్రుచ్చుకొని దానితో కలిసిపోతుంది. అంటే లక్ష్యంతో తన్మయమౌతుంది. అంటే సోపాధికమైన ఆత్మ అక్షర పరబ్రహ్మతో కలసి ఏకమైపోతుంది.

ఓ శిష్యులారా! ఏ అక్షర పురుషునిలో ద్యులోకము, పృథివి, అంతరిక్షము, ఇంద్రియాలతో సహా మనస్సు సమర్పింపబడి ఉన్నాయో, ఆ అద్వితీయమైన ఆత్మను గూర్చి తెలుసుకోండి! ఇతర విషయాలు వదలి పెట్టిండి. మోక్షప్రాప్తికి ఇదొక్కటే సాధనం.

**మం॥ అరా ఇవ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స యేషోఽన్తశ్చరతే బహుధా జాయమానః । ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తివః పరాయ తమసః పరస్తాత్.** **6**

రథచక్రం యొక్క నాభి (ఇరుసు)లో ఆకులన్నీ కలసి ఉన్నట్లుగా ఈ శరీరం అంతటా వ్యాపించి యున్న నాడులన్నీ ఏ హృదయంలో కలుస్తున్నాయో, ఆ హృదయంలో శ్రవణ దర్శనాదులవల్ల పుట్టిన అనేకమైన బుద్ధి ప్రవృత్తులు సంచరిస్తున్నాయి. ఆ బుద్ధి వ్యాపారాలన్నింటికి సాక్షీభూతుడుగా ఉన్న ఆత్మను ఓంకార రూపంలో ధ్యానం చెయ్యి! అజ్ఞానాన్ని ఈ విధంగా దాటటంవల్ల నీకు శుభం (మేలు) కలుగుతుంది. అంటే నీకు మోక్షప్రాప్తికి విఘ్నాలేవీ ఉండవు.

**మం॥ యం సర్వజ్ఞః సర్వ విద్యస్యైష మహిమా భువి దివ్యే బ్రహ్మపురే హ్యేష వ్యోమన్యాత్మా ప్రతిష్ఠితః। మనోమయః ప్రాణశరీర నేతా ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ తద్విజ్ఞానేన పరిపశ్యన్తి ధీరా ఆనందరూప మమృతం యద్విభాతి.** **7**

సర్వజ్ఞుడు, సర్వవేత్త అయిన ఆ అక్షర పరబ్రహ్మ యొక్క విభూతి, మహత్త్వము ఈ విశ్వమంతటా వ్యాపించి ఉంది. అటువంటి ఈ ఆత్మ దివ్యమైన బ్రహ్మపురం (తామర మొగ్గ ఆకారంలో ఉన్న హృదయం) లో ఉంది. అటువంటి మనోమయుడు, ప్రాణాలను, సూక్ష్మదేహాన్ని ఈ స్థూల శరీరం నుండి మరొక స్థూల శరీరంలోకి చేరుస్తూ ఉంటాడు. ఆ మనోమయుడు అన్నమయ శరీరంతో ఈ హృదయంలో ఉన్నాడు. ఈ విషయాన్ని తెలుసుకున్న పిమ్మటనే జ్ఞానులు

ఆత్మతత్వాన్ని చక్కగా సాక్షాత్కరించుకోగలుగుతారు – దుఃఖాలు, అనర్థాలు లేనట్టి, వీటన్నింటికి అతీతుడైన ఆనందస్వరూపుడు, అమృత స్వరూపుడు అయిన బ్రహ్మ యొక్క తత్త్వం సాక్షాత్కరిస్తుంది అని భావం.

**మం॥ భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్‌దృష్టే పరావరే। 8**

ఆ పరాపరతత్త్వం (కారణరూపంలో పరతత్వం – పరబ్రహ్మ. కార్యరూపంలో అపరతత్వం హిరణ్యగర్భుడు) యొక్క సాక్షాత్కారం అయిన పిమ్మట ఈ జీవియొక్క ఆత్మానాత్మ అధ్యాస రూపమైన హృదయ గ్రంథులు విడిపోతాయి – భేదభావాలు, కోరికలు, అనుమానాలు మొదలైన అజ్ఞాన గ్రంధులు (ముడులు) విడిపోతాయి అని భావం. తెలుసుకోవలసిన విషయానికి సంబంధించిన సందేహాలన్నీ నశిస్తాయి. ప్రారంభం కాని కర్మలన్నీ (అనారబ్ధ కర్మలు) నశిస్తాయి. ఆరబ్ధ కర్మలు ఈ జన్మలో అనుభవించటంవల్ల అవి నశిస్తాయి. కాబట్టి పూర్తిగా కర్మక్షయం అవుతుంది.

**మం॥ హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మ నిష్కలమ్। తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్యదాత్మవిదో విదుః॥ 9**

**న తత్ర సూర్యో భాతి న చంద్ర తారకం నేమా విద్యుతో భాన్తి కుతోఽ యమగ్నిః। తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి। 10**

**బ్రహ్మైవేద మమృతం పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణశ్చోత్తరేణ। అథశ్చోర్ధ్వం చ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్। 11**

బుద్ధి వృత్తితో గూడిన ప్రకాశవంతమైన హిరణ్మయ కోశంలో, (హృదయ మనే ఒరలో) భాగాలుగా విభజింపరాని ఆ పూర్ణపురుషుడు, రజోగుణం వల్ల కలిగిన అజ్ఞానాది కళంకాలు లేనివాడు, జ్యోతిస్సులకు జ్యోతిస్సు (సూర్య, చంద్ర నక్షత్రాదులకు కాంతి నిచ్చేవాడు) అయినవాడు ఉన్నాడు. ఆత్మజ్ఞానం పొందిన మహనీయులు ఆ పరమ పురుషుని తమ హృదయంలోనే సాక్షాత్కరింప చేసుకుంటారు.

ఆ ఆత్మ స్వరూపుడైన పరబ్రహ్మంలో అన్నిటిని ప్రకాశింపచేసే సూర్యుడు ప్రకాశించలేడు. అచట నక్షత్రాలు ప్రకాశింపవు. మెరపు ప్రకాశించదు. ఇక అగ్ని విషయం చెప్పేదేముంది? పైన చెప్పినట్లుగా పరబ్రహ్మ జ్యోతిషాంపతి. ఈ జ్యోతిస్సులన్నింటికి ప్రకాశాన్ని యిచ్చే ప్రభువు. కాబట్టి ఆ జ్యోతి స్వరూపుని ముందు ఈ గ్రహ చంద్ర తారకాదులు వెలవెల బోతాయి.

మన అందరికి ఎదుట, ముందు, పైన, క్రింద, అన్నివైపుల, అంతట వ్యాపించి ఉన్నది ఆ అమృత స్వరూపమైన పరబ్రహ్మమే! ఈ విశ్వం సమస్తమూ ఆ బ్రహ్మ స్వరూపమే! రజ్జువునందు

(త్రాటియందు) పాములాగా ఈ ప్రపంచం మనకు కనిపిస్తోంది. పరబ్రహ్మమే ఈ విశ్వమన్నప్పుడు ఉన్నది ఆ పరబ్రహ్మమే! ఈ కనిపించేది పాములాగా భ్రాంతి లేక మాయ అన్నమాట. రజ్జువు యదార్థం. పాము భ్రాంతి, ఆ భ్రాంతి అనేది అజ్ఞానం వల్ల కలిగింది. ఆ అజ్ఞానం తొలగటంతోనే భ్రాంతి పోయి సత్యం గోచరిస్తుంది.

## తృతీయ ముండకం

## ప్రథమ ఖండం

**మం॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయాసమానం వృక్షం పరిషస్వజాతే। త యోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్న న్నన్యో అభిచాకశీతి. 1**

ఎల్లప్పుడు ఒకదానివెంట ఒకటి ఉండేవి, ఒకే పేరుగలవి, ఒకే రూపంగలవి అయిన రెండు పక్షులు ఈ ప్రపంచమనే వృక్షాన్ని ఆశ్రయించి ఉన్నాయి. అందులో ఒకటి క్షేత్రజ్ఞ (జీవి) తన కర్మలవల్ల లభించిన స్వాదిష్టమైన సుఖ దుఃఖ రూపమైన ఫలాలను అనుభవిస్తోంది. రెండవది (నిత్య, బుద్ధ, శుద్ధ, ముక్త స్వభావం కల పరమాత్మ) కర్మఫల భోగమనేది లేకుండా (ఏమీ తినకుండా) చూస్తూ కూర్చుంది. శరీరాన్ని వృక్షంతో పోల్చారు. క్షేత్రజ్ఞ పరమాత్మలిద్దరు వేరని భ్రమపడరాదు. అద్వైతపరమైన అర్థమే గ్రహించాలి.

**మం॥ సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ నీశయా శోచతి ముహ్యమానః। జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య మహిమాన మితి వీతశోకః. 2**

యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్। త దా విద్వాన్పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి. 3

ఈశ్వరునితో బాటు ఒకే శరీరమనే వృక్షం మీద ఉంటున్నా, జీవుడు తనకు ఈశత్వం (ప్రభుత్వాధికారం) లేదనే భావంతో ఉండటంవల్ల మోహానికి వశుడై శోకాన్ని అనుభవిస్తూ ఉంటాడు. అంటే అజ్ఞానంవల్ల అనేక బాధలు అనుభవిస్తూ ఉంటాడు.

కాని అతడే యోగీశ్వరులచేత సేవింపబడే పరమాత్మను, అతనిచే నిర్మితమైన ఈ ప్రపంచాన్ని, అతని మహిమను గుర్తించినప్పుడు (మోహం నశించి జ్ఞాని అయినప్పుడు) శోకం నుండి విముక్తుడౌతాడు.

ఎప్పుడైతే అతడు (జీవుడు) చైతన్య స్వరూపుడు, స్వయం ప్రకాశం కలవాడు, బంగారం వంటి వర్ణం కలవాడు, బ్రహ్మ యొక్క పుట్టుకకు కూడా కారణమైనవాడు, జగన్నిర్మాత అయిన పరమాత్మను చూస్తాడో అప్పుడాతడు (జీవుడు) పాప పుణ్యాలను వదలి, విశుద్ధుడై, భేద భావాలు వీడి అద్వైత భావాన్ని పొందుతాడు.

**మం॥ ప్రాణో హ్యేష యః సర్వభూతైర్విభాతి విజానన్విద్వాన్భవ తే నాతివాదీ। ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావానేష బ్రహ్మవిదాం వరిష్ఠః. 4**

సమస్త భూతాల్లోను ఉంటూ భిన్న భిన్నంగా కనిపించే ప్రాణమే ఆ పరమాత్మ. వేరు వేరు జీవుల్లో వేరు వేరుగా కనిపిస్తున్నాడు. ఈ సత్యాన్ని తెలుసుకున్న తత్త్వజ్ఞాని అతివాదాల జోలికి పోడు – అతిగా మాట్లాడడు. అన్ని ప్రాణుల్లోనూ ఉన్నది ఆ అనంత ప్రాణమని తెలుసుకున్నప్పుడు ఇంకా మాట్లాడే దేముంటుంది! తనలో తాను, తనతో తాను మాట్లాడుకున్నట్లే ఈ విధంగా ఆత్మలోనే క్రీడిస్తూ, ఆత్మలోనే సంతోషిస్తూ, ఆత్మలోనే రమిస్తూ, ఆత్మ రమణమే క్రియగా కలవాడైన పురుషుడు బ్రహ్మజ్ఞానుల్లో శ్రేష్ఠుడుగా తలచబడతాడు. బ్రహ్మజ్ఞానియైన వాడే సర్వోత్తముడు.

**మం॥ సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానే బ్రహ్మచర్యేణ నిత్యమ్। అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః 5**

ఆత్మజ్ఞానం కలగటానికి సాధనాలు చెపుతున్నారు.

ఆత్మను తెలుసుకోవటం ఎలా? మిధ్యా భాషణాలను వదలి పెట్టటమే సత్యం. మనస్సును, ఇంద్రియాలను వశంలో పెట్టుకొని ఏకాగ్రచిత్తం కలిగి ఉండటమే తపస్సు. అటువంటి సత్యము, తపస్సు, బ్రహ్మచర్యము, సమ్యక్ జ్ఞానము కలిగి ఉండటం (అజ్ఞానం లేకుండటం) ఈ గుణాల ద్వారా ఆత్మను తెలుసుకోవటం సాధ్యం. పాపరహితులు, ప్రయత్నశీలురు, విరాగులు అయిన సన్న్యాసులు దర్శించే ఆ జ్యోతి స్వరూపుడైన ఆత్మ హృదయాకాశంలో ఉన్నాడు.

**మం॥ సత్యమేవ జయతే నానృతం సత్యేన పంథా వితతో దేవయానః। యేనా క్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్సత్యస్య పరమం విధానం. 6**

సత్యము యొక్క గొప్పదనాన్ని చెబుతున్నారు – సత్యవాది విజయాన్ని పొందుతాడు. అసత్యం చెప్పేవాడు విజయం పొందదు. సత్యభాషణం వల్ల దేవయాన మార్గం విస్తృతమౌతుంది. అంటే సత్యం మాట్లాడేవాడు దేవలోకానికి పోయే మార్గంలో ఉన్నతికి పోతాడు. ఆ దేవయాన మార్గంలో పయనించే పూర్ణకాములైన ఋషులు సత్యం ద్వారా పొందదగిన ఉత్కృష్టమైన సంపదను (లక్ష్యాన్ని) పొందుతారు – పరమపదాన్ని పొందుతారని భావం.

**మం॥ బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం సూక్ష్మాచ్చ తత్ సూక్ష్మతరం విభాతి। దూరాత్సుదూరే తదిహాన్తికే చ పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం। 7**

ఆ పరమపదం ఎటువంటిదో చెపుతున్నారు.

మనం చెప్పుకొనే ఆ పరబ్రహ్మ గొప్పవాడు, దివ్యుడు, అచింత్య రూపుడు (అతని రూపాన్ని గూర్చి ఆలోచించలేము) ఆకాశాది వస్తువుల కంటె సూక్ష్మరూపంతో ప్రకాశించేవాడు. అవివేకులకు

మిక్కిలి దూరంగాను, వివేకవంతులకు మిక్కిలి దగ్గరగాను, ఈ దేహంలోనే అందుబాటులో ఉంటాడు. చేతన ప్రాణులలో వాటి బుద్ధి అనే గుహలో దాగియుండి, పండితులైనవారికి మాత్రం కనిపిస్తూ ఉంటాడు.

**మం॥ న చక్షుషా గుహత్యే నాపి వాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణా వా। జ్ఞాన ప్రసాదేన విశుద్ధసత్త్వస్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః॥ 8**

**ఏషోఽ ణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ। ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానాం యస్మిన్విశుద్ధే విభవ త్యేష ఆత్మా॥ 9**

ఆత్మ సాక్షాత్కారానికి చిత్తశుద్ధి చాలా అవసరం అని చెపుతున్నారు.

రూపమనేది లేకపోవటం వల్ల ఈ ఆత్మ కండ్లకు కనిపించదు. అవాచ్యమైనందువల్ల మాటలలో వర్ణించి చెప్పలేము. అట్లాగే ఇతర ఇంద్రియాలతో గాని, తపస్సుతో గాని, వైదిక కర్మకాండలతో గాని దీనిని గ్రహించలేము. స్వచ్ఛమైన బుద్ధి కలిగి, విశుద్ధమైన అంతఃకరణం కలిగి, ధ్యానం ద్వారా ఆ అవయవ రహితమైన ఆత్మతత్వాన్ని సాక్షాత్కరించుకోగలం.

ఈ సూక్ష్మమైన ఆత్మ ఈ శరీరంలోనే ఉంది. చిత్తం ద్వారా దానిని తెలుసుకోవచ్చు. ఈ చిత్తంలోనే ఐదు విధాలైన ప్రాణాలు చేరి ఉన్నాయి. ఆ ప్రాణాలతో బాటు ఇంద్రియాలన్నీ ఆ చిత్తంలో వ్యాప్తమై ఉన్నాయి. కాబట్టి ఆ చిత్తం విశుద్ధమైనప్పుడు ఆత్మ తన విశేషరూపాన్ని ప్రకాశింపచేస్తుంది. అంటే, ఆత్మ సాక్షాత్కారానికి చిత్తశుద్ధి అవసరం అని భావం.

**మం॥ యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్। తం తం లోకం జయతే తాంశ్చ కామాం స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతి కామః॥ 10**

విశుద్ధమైన అంతఃకరణం గల ఆత్మజ్ఞాని, మనస్సు ద్వారా ఏయే లోకాల్ని భావిస్తాడో, ఏ ఏ భోగాల్ని కోరతాడో, ఆయా లోకాల్ని ఆయా భోగాల్ని పొందుతాడు. అందుచేత ఐశ్వర్యాన్ని కోరేవారు ఆత్మజ్ఞానుల్ని పూజించాలి.

## ద్వితీయ ఖండం

బ్రహ్మజ్ఞానిని పూజించినందువల్ల కలిగే ఫలితాన్ని చెపుతున్నారు –

**మం॥ స వేదైతత్పరమం బ్రహ్మ దామ యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రం। ఉపాసతే పురుషం యే హ్యకామాస్తే శుక్ర మేతదతి వర్తన్తి ధీరాః॥ 1**

అధిదైవత, అధి జ్యౌతిషాదులన్నింటికి ఆశ్రయమైనట్టి, స్వయం ప్రకాశమైనట్టి ఆ పరబ్రహ్మను తెలుసుకున్నవాడు కాబట్టి అటువంటి ఆత్మజ్ఞానిని నిష్కామ బుద్ధితో ఉపాసించేవారు ఈ మానవజన్మను

అతిక్రమించుతారు – అంటే మళ్ళీ జన్మించటం కోసం, శరీరధారణ కోసం ఏ యోనిని ఆశ్రయించనక్కరలేదు – ముక్తులౌతారు.

**మం॥ కామాన్యః కామయతే మన్యమానః స కామభిర్జా యతే తత్ర తత్ర। పర్యాప్తకామస్య కృతాత్మనస్తు ఇహైవ సర్వే ప్రవిలీయన్తి కామాః॥ 2**

నిష్కాముడైనవాడు ఏ విధంగా కృతకృత్యుడౌతాడో వివరింపబడుతోంది.

ఎవడు దృష్టాదృష్టమైన (కనిపించేవి, కనిపించనివి అయిన) మంచివి, చెడువి అయిన కోరికలను కోరుతూ ఉంటాడో, అట్టివాడు ఆయా కోరికలను పొందటానికి అందుకు తగినచోట జన్మిస్తూ ఉంటాడు. పరమార్థ తత్త్వ విజ్ఞానం కలిగి, పూర్ణకాముడై, కృతకృత్యుడైన వివేకవంతుని కోరికలు ఈ లోకంలోనే లీనమైపోతాయి. అంటే అతని కోరికలు మిగలవు కాబట్టి మళ్ళీ జన్మ ఉండదు.

**మం॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన। య మేవైష వృణు తే తేన లభ్య స్త స్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్॥ 3**

ఆత్మదర్శనానికి ముఖ్య సాధనాలను వర్ణిస్తున్నారు –

ఆత్మ సాక్షాత్కారం లేదా ఆత్మదర్శనం అనేది అత్యున్నతమైన లక్ష్యం. అటువంటి ఆత్మ, వేదాలు బాగా చదివినందువల్లగాని, వేదాలను చెప్పినందువల్లగాని, శాస్త్రాలు విన్నందువల్లగాని లభించేది కాదు. కాని, ఆత్మసాక్షాత్కారం కోరేవాడు తన జిజ్ఞాస (తెలుసుకోవాలనే తీవ్రమైన కాంక్ష) ద్వారానే దానిని పొందాలి. ఆ ఆత్మ, అటువంటి జిజ్ఞాసువుల యెదుట అవిద్య చేత కప్పబడిన తన నిజస్వరూపాన్ని వ్యక్తం చేస్తుంది – అవిద్య అనే ఆచ్ఛాదన పోతుంది.

**మం॥ నాయమాత్మా బలహీనేన లభ్యో న చ ప్రమాదా త్తపసో వాఽ ప్యలింగాత్। ఏతై రూపాయైర్యతతే యస్తు విద్వాం నస్త స్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ॥ 4**

ఆత్మ దర్శనానికి కొన్ని యితర సాధనాలు చెపుతున్నారు.

బలహీనుడికి ఆత్మ లభ్యం కాదు. బలహీనుడంటే ఆత్మనిష్ఠవల్ల పుట్టినశక్తి లేనివాడు – పుత్రేషణ, దారేషణ, ధనేషణ మొదలైన ఆసక్తులు కలవాడు – భ్రమలతో, భ్రాంతులతో కూడినవాడు. ఇట్టి బలహీనులకు ఆత్మ సాక్షాత్కారం కాదు. అంతేకాదు, జ్ఞానం కలుగకపోయినా లభ్యం కాదు. సన్న్యాసంతో కూడిన తపస్సు లేకపోయినా ఆత్మ లభ్యం కాదు. ఇవన్నీ సాధించినా యోగ్యుని యొక్క ఆత్మ బ్రహ్మధామంలో చక్కగా లీనమౌతుంది – బ్రహ్మతో ఏకత్వం సిద్ధిస్తుంది.

**మం॥ సంప్రాప్యైన మృషయో జ్ఞానతృప్తాః కృతాత్మనో వీతరాగాః ప్రశాంతాః। తే సర్వగం సర్వతః ప్రాప్యధీరా యుక్తాత్మానః సర్వమేవా విశన్తి। 5**

ఈ ఆత్మతత్వాన్ని చక్కగా తెలుసుకొన్న ఋషులు జ్ఞానంతో తృప్తి చెంది, కృతకృత్యులై కోరికలు బంధనాలు వదిలినవారై, ఇంద్రియాలను జయించి, సర్వవ్యాపకుడైన ఆ బ్రహ్మను సర్వత్ర దర్శించి, ప్రారబ్ధ కర్మక్షయం అయిపోగానే, మరణకాలంలో సమాహిత చిత్తులై, ఉపాధి రహితులై (కుండ బద్దలు కాగానే అందులోని ఆకాశం మహాకాశంలో కలసి పోయినట్లు) సర్వస్వరూపుడైన ఆ పరబ్రహ్మలో లీనమైపోతారు.

**మం॥ వేదా న్తవిజ్ఞాన సునిశ్చితార్థాః సన్న్యాసయోగాద్య తయః శుద్ధసత్వాః। తే బ్రహ్మలోకేషు పరాన్తకాలే పరామృతాః పరిముచ్యన్తి సర్వే। 6**

ఉపనిషత్తుల ద్వారా తెలుసుకోదగిన వస్తువును గూర్చిన జ్ఞానం ద్వారా మోక్షప్రాప్తి ఎట్లా కలుగుతుందో చెపుతున్నారు.

వేదాంత విచారణవల్ల కలిగిన విజ్ఞానం ద్వారా, తెలుసుకోదగిన పరమాత్మను చక్కగా నిశ్చయించుకొన్న బ్రహ్మనిష్ఠులైనట్టి సన్న్యాస యోగంతో కూడినవారు, విశుద్ధ సత్త్వులు (పరిశుద్ధమైన మనస్సు కలవారు) అయిన యతీశ్వరులు శరీరాన్ని వదిలిపెట్టేటప్పుడు, ఉత్కృష్టమైనట్టి, అమరణ ధర్మమైనట్టి (చావులేని) బ్రాహ్మభావాన్ని పొంది అన్నివిధాల ముక్తులౌతారు. ఇది సన్న్యాస యోగము.

**మం॥ గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా దేవాశ్చ సర్వే ప్రతిదేవ తాసు। కర్మాణి విజ్ఞానమయశ్చ ఆత్మాపరేఽ వ్యయే సర్వఏకీభవన్తి। 7**

విదేహముక్తి యొక్క స్వరూపాన్ని చెపుతున్నారు.

ఈ దేహానికి ప్రారంభంలో ఉన్న ప్రాణము మొదలైన పదిహేను కళలు (ప్రశ్నోపనిషత్తులోని చివరి ప్రశ్న చూడండి) తమకు కారణమైన వాటిలో కలసిపోతాయి. చక్షురాది ఇంద్రియాలు వాటికి దేవతలైన సూర్యుడు మొదలైనవారితో కలసిపోతాయి. అట్లాగే అరబ్ధ, అనారబ్ధ సంచిత కర్మలు, విజ్ఞానమయాత్మ ఇవన్నీ కూడా నాశరహితుడు, శాశ్వతుడు అయిన ఆ పరమాత్మలో కలసిపోతాయి. ఎట్లా? – కుండలోని నీటిలో ఉన్న సూర్యుని ప్రతిబింబం ఆకాశంలోని సూర్యునిలో కలసిపోయినట్లు.

**మం॥ యథా నద్యః స్యందమానాః సముద్రేఽ స్తం గచ్ఛన్తి నామరూపే విహాయ। తథా విద్వాన్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం। 8**

గంగాది నదులు నిరంతరం ప్రవహిస్తూ సముద్రంలో కలసిపోయిన పిమ్మట తమ నామరూపాలను కోల్పోయి, గుర్తింపు లేకుండా పోయినట్లు, తత్త్వజ్ఞాని యైనవాడు, ఆ దివ్య

పురుషుని, పరబ్రహ్మను పొంది తన నామ రూపాలనుండి విముక్తుడౌతున్నాడు.

**మం॥ స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి నాస్యాబ్రహ్మవిత్కు లే భవతి। తరతి శోకం తరతి పాప్మానం గుహాగ్రన్థిభ్యో విముక్తోమృతో భవతి। 9**

ఆ పరబ్రహ్మను తెలుసుకున్నవాడు తాను కూడా పరబ్రహ్మే అవుతాడు. అటువంటి బ్రహ్మవేత్త అయిన వాని వంశంలో బ్రహ్మవేత్త కాని వాడు పుట్టడు. అటువంటి జ్ఞాని లేదా సన్న్యాసి, ఇష్టవియోగ జనితమైన సంతాపాన్ని ఈ జన్మలోనే తరిస్తాడు. దాటుతాడు. ధర్మాధర్మమైన పాపాలను కూడా తరిస్తాడు. ఆత్మానాత్మల భ్రాంతి జన్యమైన హృదయ గ్రంథులు విడిపోయి అమరుడౌతాడు.

తదేత దృచాఽ భ్యుక్తమ్ –

**మం॥ క్రియావన్తః శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః స్వయం జుహ్వత ఏకర్షి శ్రద్ధయ న్తః। తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణమ్। 10**

ఈ విషయాన్ని (విధి) గురించి తరువాతి మంత్రంలో చెప్పబడుతోంది.

లోగడ చెప్పబడిన విధులను ఆచరించేవాడు శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు, శ్రద్ధతో కూడినవాడు ఏకర్షి అనే పేరుగల అగ్నిహోత్రంలో హోమాదికాలు నిర్వర్తించినవాడు, విద్యుక్తంగా శిరోవ్రతం చేసినవాడూ (అథర్వ వేదులలో ప్రసిద్ధంగా ఉన్నట్టి శిరస్సున అగ్నిని ధరించటమనే వ్రతం ఆచరించినవాడు) అటువంటి వారికే ఈ బ్రహ్మవిద్యను చెప్పాలి. ఇతరులకు చెప్పరాదు.

**మం॥ తదేత త్సత్యమృషిరఙ్గిరా పురోవాచ నైతదచీర్ణవ్రతోఽ ధీ యతే। నమః పరమ ఋషిభ్యో నమః పరమ ఋషిభ్యః। 11**

ఈ అక్షర పురుషుని గూర్చిన సత్యాన్ని పూర్వం అంగిరసుడనే ఋషి శ్రద్ధాభక్తులతో తనను ఆశ్రయించని శౌనకునికి చెప్పాడు. శిరోవ్రతాన్ని విద్యుక్తంగా అనుష్ఠించని వాడు ఈ విద్యను అధ్యయనం చేయలేడు. పరమ ఋషులకు నమస్కారము. పరమ ఋషులకు నమస్కారములు.

## ఉత్తర శాంతి పాఠము

ఓం భద్రం కర్ణేభిః........ యదాయుః

ఓం శాంతిః శాంతిః శాంతిః

: సమాప్తం :